# సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభకు పార్టీ కేంద్రకమిటీ

# నివేదిక

సమర్పించినది

**యల్. ఐ. బ్రెజ్నెవ్**

(సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ
కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి.)

# విషయసూచిక

పుట

పుట

# పీఠిక

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభకు సమర్పించిన నివేదికలు, ఆ మహాసభ చేసిన నిర్ణయాలు ఈ పుస్తకంలో ఉన్నాయి. ఆ మహాసభ మాస్కో క్రెమ్లిన్‌లోని మహాసభల భవనంలో, 1966 మార్చి 29–ఏప్రిల్ 8 తేదీలమధ్య జరిగింది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ మహాసభలు చారిత్రకంగానూ, జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ ఎంతో ప్రాధాన్యంగల ఘటనలు. చరిత్రలోని మొట్టమొదటి సోషలిస్టు విప్లవానికి నాయకత్వం వహించి, చారిత్రకంగా చాల స్వల్ప వ్యవధి అయిన అర్ధ శతాబ్దకాలంలో ప్రపంచంలోని ప్రప్రథమ సోషలిస్టు దేశాన్ని జయప్రదంగా నిర్మించి, ఇప్పుడు కమ్యూనిజం నిర్మాణానికి పునాదులు వేస్తూన్న మహత్తరమైన లెనినిస్టుపార్టీ మహాసభలివి. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ మహాసభల్లో ప్రతిఒక్కటి కూడా, అంతకుముందు గడచిన కాలంలోని విజయాలను బేరీజువేయడం మాత్రమేకాకుండ, భవిష్యత్తుకు ఒకమైలురాయిగా కూడా ఉంటుంది. ప్రతిఒక్క మహాసభా, శాంతి సౌభాగ్యం కోసమూ, యుద్ధానికి వ్యతిరేకంగానూ సాగే ఉద్యమంలో ఒకగొప్ప సమీకరణ వేదిక, ఆసియా, ఆఫ్రికా దక్షిణ అమెరికాల్లోని వర్ధమాన దేశాల ప్రజలతో సంఘీభావానికి అది మహత్తరమైన ప్రదర్శన కూడా.

ప్రథమ కార్యదర్శి యల్. ఐ. బ్రెజ్నేవ్ సమర్పించిన కేంద్రకమిటీ నివేదికనూ, 1966–70 సోవియట్ యూనియన్ ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళికను గురించి మహాసభ ఆదేశాలపై, సోవియట్ యూనియన్ మంత్రిమండలి అధ్యక్షులు

ఏ. యన్. కొసిగిన్ సమర్పించిన నివేదికనూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23వ మహాసభ విన్నది. ఉత్సాహపూరితమైన చర్చల అనంతరం మహాసభ ఈ నివేదికలను ఆమోదించింది.

ఆదేశాలపై చర్చలు, మహాసభలో పాల్గొన్న వేలాది ప్రతినిధులకు మాత్రమే పరిమితం కాలేదన్న విషయాన్ని ఇక్కడ పేర్కొనవలసి ఉంది. సోవియట్ యూనియన్ లోనూ. విదేశాల్లోనూ కూడా ప్రజలు సాధారణ చర్చలు జరపటం కోసం, మహాసభ జరగడానికి కొన్ని వారాలు ముందుగానే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఈ ముసాయిదా ఆదేశాలను ప్రచురించింది. దేశంలోనూ, ప్రతినిధుల్లోనూ, మొత్తం ప్రజల్లోనూ వ్యక్తమయిన అభిప్రాయాలను 23వ మహాసభ చర్చలు ప్రతిబింబించాయి.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ నివేదికపై ఒక సమగ్ర తీర్మానాన్ని, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో పాక్షికమైన మార్పులను గురించి ఒక తీర్మానాన్నీ, వియత్నామ్‌పై అమెరికా దురాక్రమణను గురించి ఒక ప్రకటనను మహాసభ ఆమోదించింది.

మహాసభలో పాల్గొన్న ప్రతినిధుల సంఖ్య 4,942. వీరిలో సలహా ఓటు హక్కుతో మాత్రమే మహాసభలో పాల్గొన్న వారు 323మంది.

195 మంది సభ్యులూ, 165 మంది కాండిడేట్ సభ్యులూ గల కొత్త కేంద్ర కమిటీనీ. 79 మంది సభ్యులుగల ఆడిటింగ్ కమిషన్నీ మహాసభ ఎన్నుకుంది. 11 మంది సభ్యులూ, 8 మంది కాండిడేట్ సభ్యులూగల పొలిట్‌బ్యూరోను కేంద్ర కమిటీ ఎన్నుకుంది. కేంద్ర కమిటీ కంట్రోల్ కమిటీనికూడా కేంద్ర కమిటీ ఎన్నుకుంది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శిగా యల్. ఐ. బ్రెజ్నెవ్ ఎన్నికయారు.

# ప్రారంభోపన్యాసము

—యల్. ఐ. బ్రెజ్నెవ్

ఉదయం పదిగంటలకు, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ అధ్యక్షవర్గ సభ్యులు మహాసభ మందిరంలోకి రాగానే బ్రహ్మాండమైన హర్ష ధ్వానాలు మిన్నుముట్టాయి.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి యల్. ఐ. బ్రెజ్నెవ్ ప్రారంభోపన్యాసాన్ని ప్రతినిధులూ, అతిథులూ అత్యంత శ్రద్ధాసక్తులతో విన్నారు.

"యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీల మహాసభల్లోనూ, ప్రాదేశిక, మండలపార్టీ సమావేశాల్లోనూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభకు 4,943 మంది ప్రతినిధులను ఎన్నుకున్నారు. వీరిలో 4,620 మందికి నిర్ణాయక ఓటుహక్కు, 323 మందికి సలహా ఓటుహక్కూ ఉంది. మహాసభకు 4942 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఒక ప్రతినిధి అనారోగ్యం వల్లరాలేదు," అని ఆయన తెలిపారు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ఆదేశానుసారం, బ్రెజ్నెవ్, 23 వ మహాసభ ప్రారంభమయినట్లు ప్రకటించారు.

కొన్ని నిమిషాలపాటు హర్షధ్వానాలు చెలరేగాయి.

కామ్రేడ్ బ్రెజ్నెవ్ ఇలా ప్రసంగించారు :

"సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 22వ మహాసభ జరిగి నాలుగు ఏళ్ళకు కొద్దిగా పైబడింది. పార్టీ జీవితంలోనూ, యావన్మంది సోవియట్ ప్రజల జీవితంలోనూ అదొక ముఖ్య దశ.

"మనదేశ శ్రామిక ప్రజలు అపారమైన ఆనందాతిశయంతో కమ్యూనిస్టు పార్టీ 23వ మహాసభకు స్వాగత మిస్తున్నారు. కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణంలో నూతన విజయాలు, అనేక జాతుల మాతృభూమి అయిన మనదేశంలోని వివిధ జాతులన్నిటిమధ్య మహత్తరమైన మైత్రి మరింత పటిష్ఠం కావడమూ, సోవియట్ ప్రజలందరిమధ్య సైద్ధాంతిక, రాజకీయ సమైక్యతా, మన లెనినిస్టుపార్టీ వెనుక వారి ఐకమత్యమూ మరింత పెంపొందడమూ ఈ సంతోషానికి కారణం.

"సోవియట్ యూనియన్‌యొక్క సూవత్తు సోషలిస్టు దేశాల కుటుంబం యొక్క ఆర్థిక, రాజకీయ శక్తి ఇనుమడించిన వాతావరణంలో, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల్లో జాతీయ విముక్తి ఉద్యమం బ్రహ్మాండంగా ఉప్పొంగు తూన్న, పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికవర్గ పోరాటం అంతకంతకూ అతిశయి స్తూన్న, దురాక్రమణ దారుల విధ్వంసక శక్తులకు విశాల ప్రజానీకం ప్రతిఘటన మరింత తీవ్రమవుతూన్న వాతావరణంలో మన మహాసభ జరుగుతూంది.

"పార్టీ సభ్యులందరూ, యావన్మంది సోవియట్ ప్రజలూ, విప్లవ పోరా టంలో పాల్గొంటూన్న మన విదేశీ సోదరులూ, ఈ మహాసభ కార్యక్రమాన్ని శ్రద్ధగా గమనిస్తుంటారు. మహత్తరమైన మన పార్టీని మరింత శక్తివంతం చేయడం విషయంలోనూ, మన మాతృభూమి సిరిసంపదలు పెంచడం విషయంలోనూ, శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజమ్‌లకోసం దేశదేశాల ప్రజలు సాగించే పోరాటం నూతన విజయాలను సాధించడం విషయంలోనూ తమపై గురు తర బాధ్యత ఉన్నదన్న భావం ప్రతినిధులను ఉత్తేజపరుస్తుంది.

కమ్యూనిజమ్ కోసం పోరాట ఆశయానికి సోవియట్ యూనియన్ 23వ మహాసభ సముచిత దోహదం చేకూర్చ గలదనీ, మన మహత్తర విప్లవ ఆశయం పట్ల అచంచల విధేయతనూ, మార్క్సిజమ్, లెనినిజానికీ, కార్మిక వర్గ అంతర్జాతీ యతకు విధేయతనూ ప్రదర్శించ గలదన్న విశ్వాసాని వ్యక్తం చేసుకోగోరు తున్నాను."

అన్ని ఖండాలకూ చెందిన 86 దేశాలనుండి కమ్యూనిస్టు, వర్కర్స్ నేష

నల్ డెమోక్రాటిక్, వామపక్ష సోషలిస్టు పార్టీల ప్రతినిధులు సోషలిస్టు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభకు వచ్చారని యల్. ఐ. బ్రెజ్నెవ్ తెలిపారు.

23 వ మహాసభ ప్రతినిధుల తరఫునా, సోవియట్ యూనియన్‌లోని కమ్యూనిస్టు లందరి తరఫునా, మన ప్రియతమ అతిధులకు, అనేకదేశాల ప్రజల స్వాతంత్ర్య, సౌఖ్యాలకై సాగే పోరాటంలో మన సహయోధులకు సోదర భావంతో అభివందనలు తెలుపుతున్నాము. మా మహాసభ కార్యక్రమంలో పాల్గొంటున్నందుకు ప్రియమైన కామ్రేడ్స్, మిత్రులారా, మీకివే మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనలు" అని ఆయనఅన్నారు.

# సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభకు పార్టీ కేంద్రకమిటీ నివేదిక

పార్టీ కేంద్రకమిటీ ప్రథమ కార్యదర్శి
ఎల్. ఐ. బ్రెజ్నెవ్ సమర్పించినది

కామ్రేడ్స్ ప్రతినిధులారా!

మన పార్టీ 22వ 23వ మహాసభల మధ్య గడచినకాలం, మనదేశంలోనూ, అంతర్జాతీయ రంగంలోనూ కూడా జరిగిన గొప్పగొప్ప ముఖ్య సంఘటనలతో నిండివుంది. ఈ అన్నిసంవత్సరాల్లోనూ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ, 20, 21, 22వ మహాసభలు నిర్దేశించిన పంథా ననుసరించి సోవియట్ ప్రజల్ని, కమ్యూనిస్టు నిర్మాణ మార్గాన అచంచలంగా ముందుకి నడపింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని నెరవేర్చడానికి, కమ్యూనిస్టు వ్యవస్థ యొక్క పాదార్థిక, సాంకేతిక పునాదులను నిర్మించడానికీ, ప్రజలకి మరింత ఉన్నతమైన జీవనస్థాయిని చేకూర్చేందుకూ, సామాజిక సంబంధాలను ఇంకా అభివృద్ధిపరచేందుకూ, ఉన్నతమైన కమ్యూనిస్టు చైతన్యం సరళిలో సోవియట్ ప్రజలను విజ్ఞాన సంపన్నులను చేయడానికే పార్టీ కార్యకలాపాలన్నీ అంకిత మయ్యాయి. సోవియట్ ప్రజలకు శాంతియుత పని పరిస్థితులను కల్పించేందుకే పార్టీ తన కృషి నంతటినీ అంకితం

చేసింది. ప్రపంచమంతటా శాంతిని పదిల పరచేందుకు పార్టీ క్రియాత్మకంగా పోరాడుతూంది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధి విషయం చెప్పాలంటే, ఇప్పుడు సమీక్షిస్తున్న ఈ దశలో పార్టీసభ్యత్వం మరింత సుసంఘటిత మయింది, సోవియట్ సమాజంలో దాని రాజకీయ, నిర్మాణపాత్ర పెరిగింది. పార్టీ జీవితం గురించి లెనిన్ నిర్దేశించిన సూత్రాలు పార్టీలో దృఢంగా పాదుకొన్నాయి. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ మునుపటికన్నా మరింత బలపడిందనీ, మరింత ఏక శిలా సదృశమయిందనీ, ప్రజలతో దాని సంబంధాలు మరింత ప్రగాఢమయ్యాయనీ, ఈనాడు ఈ 23 వ మహాసభలో విశ్వాసంతో చెప్పగలము. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల అజేయమైన సిద్ధాంతం ప్రాతిపదికపై ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సమైక్యతనూ, ఉమ్మడిశత్రువైన సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగే పోరాటంలో ప్రపంచంలోని యావన్మంది కమ్యూనిస్టుల ఐక్య కార్యాచరణనూ సాధించడంకోసం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, తక్కిన పార్టీలతో కలిసి క్రియాత్మకంగా కృషి చేసింది. ఆ కృషిని కొనసాగిస్తూనే ఉంది.

సోవియట్ యూనియన్ ఆంతరంగిక అభివృద్ధినిగురించి చెప్పాలంటే, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం కింద సోవియట్ ప్రజలు, తమ ఉత్సాహపూరిత పరిశ్రమతో సప్తవర్ష ప్రణాళికను పూర్తిచేసిన దశ యిది. ఆర్థిక, విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక అభివృద్ధి రంగాల్లో సాధించిన నూతన విజయాలు సోవియట్ యూనియన్‌ని ఆర్థికంగానూ, రాజకీయంగానూ, సైనికంగానూ మరింత శక్తివంతం చేశాయి. ప్రజల జీవన స్థాయి పెరిగింది. సామాజిక జీవితంలోని వివిధ రంగాల్లో సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠంచేయడమూ విస్తృత మొనర్చడమూ కొనసాగింది. సోషలిస్టు వ్యవస్థ రాజకీయ పునాదులు – కార్మికవర్గ, సమిష్టి వ్యవసాయక్షేత్ర కర్షకవర్గాలమైత్రి, అనేక జాతుల దేశమయిన సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతులమధ్య స్నేహము, శ్రామిక ప్రజలందరిమధ్య సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత, తమ అగ్రగదళమయిన కమ్యూనిస్టుపార్టీ వెనుక వారి ఏకత – మరింత బలపడ్డాయి.

పార్టీ 22 వ మహాసభ తరువాత గడచిన దశలోని అంతర్జాతీయ పరిస్థితిని గురించి చెప్పాలంటే, సోవియట్ యూనియన్‌యొక్క, యావత్తు ప్రపంచ

సోషలిస్టు వ్యవస్థయొక్క అంతర్జాతీయ పలుకుబడి అంతకంతకు పెరిగింది. స్వాతంత్ర్య, అభ్యుదయాలకోసమూ, వలస దానిసత్వానికి వ్యతిరేకంగానూ పోరాడుతూన్న దేశాలూ, ప్రజలూ నూతన విజయాలను సాధించారు. పెట్టుబడిదారీదేశాల్లోని కార్మికవర్గ పోరాటం మరింత తీవ్రమయింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికవర్గ ఉద్యమం మరికొంత అభివృద్ధి చెందింది.

మరొకవైపు, పెట్టుబడిదారీ వ్యవస్థలోని సార్వత్రిక సంక్షోభం నిరంతరంగా మరింత తీవ్రమయీ, ప్రగాఢమయీ అవుతూ వచ్చింది. సామ్రాజ్యవాదం, ముఖ్యంగా అమెరికాలోని సామ్రాజ్యవాద వర్గాలు అనేక సందర్భాల్లో దుస్సాహస యుద్ధాలతో సహా, దురహంకారంతో కూడిన చర్యలకు ఒడిగట్టాయి. దీని ఫలితంగా అంతర్జాతీయ పరిస్థితి విషమించింది.

సామ్రాజ్యవాదం మరింత దురుసుతనం కనబరుస్తున్నదంటే అర్థం, ప్రపంచంలోని బలాబలాల పరిస్థితి దానికిఅనుకూలంగా మారిందనికాదు.అందుకు భిన్నంగా, అంతకంతకు ఎక్కువగా ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థను ఈ నాడెదుర్కొంటున్న చిక్కులకూ, అంతర్గతవైరుధ్యాలకూ, ఈ దురుసుతనం ప్రతిబింబం. సామ్రాజ్యవాదం ఎటువంటి పద్ధతులను అనుసరించినప్పటికీ, ఎటువంటి సాధనాలను ఉపయోగించినప్పటికీ, చరిత్ర పరిణామక్రమాన్ని నిరోధించగల స్థితిలో అది లేదన్న విషయాన్ని గడచిన సంవత్సరాల ఘటనలు మరొకసారి ప్రస్ఫుటం చేశాయి. ఈ నాటి విప్లవ శక్తులు తమ జైత్రయాత్రను కొనసాగిస్తున్నాయి. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచ దేశాల ప్రజల పోరాటం ముమ్మరమయింది.

ప్రపంచ పరిస్థితిలోని చిక్కులన్నింటినీ పరిగణనలోకి తీసుకొని విదేశాంగ విధాన రంగంలో పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క పంథాను రూపొందించడంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజల ముఖ్య ప్రయోజనాలనూ, ప్రపంచ సోషలిస్టు శిబిరంలోని దేశాల్లో కమ్యూనిస్టు, సోషలిస్టు వ్యవస్థల నిర్మాణానికి అవసరమయిన శాంతియుత పరిస్థితులను నెలకొల్పాలి, మరొక ప్రపంచ యుద్ధాన్ని నివారించాలి అన్న అభిలాషనూ దృష్టిలో పెట్టుకొనే వ్యవహరించింది. విదేశాంగ విధానాన్ని రూపొందించడంలోనూ, అమలు జరపడంలోనూ, సోదర సోషలిస్టు దేశాలపట్ల, అన్ని దేశాల్లోని శ్రామిక ప్రజలపట్లా మనపార్టీకిగల అంతర్జాతీయతా విప్లవ కర్తవ్యాన్ని ప్రాతిపదికగా తీసుకొని వ్యవహరించింది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ పంథా సరియైనదనీ,

సోవియట్ ప్రజలు యావన్మంది దీనిని బలపరుస్తున్నారనీ, గడచిన సంవత్సరాల ఫలితాలు నిరూపిస్తున్నాయి. ఈ పంథాను అమలుపరచేందుకు కృషిచేయడమే మన ప్రధాన కర్తవ్యం. కమ్యూనిజమ్, కార్మికవర్గ అంతర్జాతీయత, సోషలిస్టు సంఘీభావాలనే ఆశయానికి కట్టుబడి ఉండడమే, మహత్తరమైన లెనినిస్టు పార్టీకి జీవిత సూత్రంగానూ, పోరాట సూత్రంగానూ ఎల్లప్పుడూ ఉంటూ వచ్చింది. ఇక ముందుకూడా ఉంటుంది.

# I

# అంతర్జాతీయంగా సోవియట్ యూనియన్ హోదా, విదేశాంగ విధానరంగంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలు

## *1. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, దాని ఐక్యతనూ, శక్తినీ పటిష్ఠం చేసేందుకు సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ పోరాటం*

కామ్రేడ్స్, విదేశాంగవిధాన రంగంలో మన పార్టీయొక్క, ప్రభుత్వం యొక్క బహుముఖ కార్యకలాపాల్లో, సోషలిస్టు దేశాల మిటుంబం సమైక్యతనూ శక్తినీ పటిష్ఠం చేసేందుకై కృషి చాల ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమిస్తూంది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అంతర్జాతీయ కార్మికవర్గం సాధించిన చరిత్రాత్మక విజయాలన్నిటిలోకి చాల గొప్పదిగానూ, నేటి మన కాలంలోని ప్రధాన విప్లవ శక్తిగానూ, శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజమ్‌ల కోసం పోరాడుతూన్న దేశాలన్ని ప్రజలందరికి అత్యంత విశ్వాసపాత్రమైన అండదండగానూ మనం పరిగణిస్తున్నాము. ఇప్పుడు సమీక్షిస్తూన్న దశలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ బలం గణనీయంగా పెరిగింది. దాని అంతర్జాతీయ ప్రతిష్ఠ, మానవజాతి భవిష్యత్తుపై దాని ప్రభావమూ ఇనుమడించాయి.

సోషలిస్టు దేశాలమధ్య రాజకీయ సహకార రంగంలో, మార్క్సిజం - లెనినిజమ్, సోషలిస్టు అంతర్జాతీయత, పరస్పర సహాయం ప్రాతిపదికపైన, సరిసమానత్వం, ఒకరి ఆంతరంగిక వ్యవహారాల్లో ఒకరు జోక్యం కలిగించుకోకుండా ఉండడం, పరస్పర గౌరవం అన్న సూత్రాలపైనీ, పార్టీల దేశాల స్వాతంత్ర్య సూత్రంపైనీ, ఆధారపడి ఈ దేశాల సోదరపార్టీల మధ్య సంబంధాలు, ఇప్పుడు సమీక్షిస్తున్న దశలో పెంపొందాయి. సోషలిస్టు కుటుంబంలోని దేశాల కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలతోనూ, సోషలిస్టు ప్రభుత్వాలతోనూ మన సంబంధాలు ఈ దశలో, నిస్సందేహంగా మరింత పటిష్ఠ మయ్యాయి, మరింత సన్నిహితమయీ, హృదయపూర్వకమయీ అయాయి. బల్గేరియా ప్రజా రిపబ్లిక్, హంగేరి ప్రజా రిపబ్లిక్, వియత్నాం ప్రజా స్వామిక రిపబ్లిక్, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్, కొరియా జనతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్, క్యూబా రిపబ్లిక్, మంగోలియా ప్రజా రిపబ్లిక్, పోలెండు ప్రజా రిపబ్లిక్, రుమేనియా సోషలిస్టు రిపబ్లిక్, చెకోస్లోవేకియా సోషలిస్టు రిపబ్లిక్, యుగోస్లావియా సోషలిస్టు ఫెడరేటివ్ రిపబ్లిక్‌లతో మనకు మంచి సోదర సంబంధాలున్నాయి.

సోవియట్ యూనియన్‌కూ సోషలిస్టు దేశాలకూ మధ్య సంబంధాలు పెంపొందడంలో స్నేహ, సహకార, పరస్పర సహాయం ఒడంబడికలు చాల గొప్ప పాత్రను నిర్వహించాయి. ఈ ఒడంబడికలు నిజంగా మైత్రి ప్రమాణికలు. అనేక సంవత్సరాల అనుభవసంపదా, సోదర దేశాల ప్రజల సంబంధాల పరిపక్వతా, వాస్తవికతా, మహోన్నతమైన వారి అంతర్జాతీయతా వాటిలో మూర్తీభవించాయి. మన ఉమ్మడి ఉజ్వల ఆశయానికి అవి అద్భుతంగా దోహదం చేస్తున్నాయి. ఇకముందు కూడా దోహదం చేస్తూనే ఉంటాయి.

సోదర దేశాల్లో సోషలిస్టు వ్యవస్థ అంతకంతకు మరింత బలపడడమూ నూతన సామాజిక సంబంధాలను నిర్దిష్టం చేయడమూ, ప్రజల జీవనస్థాయి పెరగడమూ, అంతర్జాతీయంగా సోషలిస్టు దేశాల ప్రతిష్ఠ ఇనుమడించడమూ ఎంతో సంతోషకరమైన విషయం.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ క్రమంగా పురోగమిస్తూంది. సోషలిస్టు నిర్మాణ మూలసూత్రాలు అన్ని దేశాలకూ సమానమే. అవి సుప్రసిద్ధమైనవి. ఆచరణలో నిగ్గుతేలినవి. అదే సమయంలో జటిలమై, వైవిధ్యంతో కూడిన జీవితంయొక్క వాస్తవికతలవల్ల ఉత్పన్నమయే సరికొత్త సమస్యలు సోషలిస్టు దేశాలకు వా

పరిణామ క్రమంలో, నిరంతరం ఎదురవుతున్నాయి. ఈ సమస్యలకు ముందుగానే తయారుచేసి వుంచిన పరిష్కారాలేవీ లేవు. అటువంటివి వుండజాలవుకూడా. అందువల్ల, ఇలా ఉత్పన్నమయే సమస్యలపట్ల, ఎన్నో పరీక్షల్లో నెగ్గి ఆచరణలో నిగ్గుదేలిన మార్క్సిజమ్ – లెనినిజమ్ ప్రాతిపదికపై ఆధారపడిన నిర్మాణాత్మకమైన వైఖరి, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధికి అవసరం. ఒకరి అనుభవాలనూ, అభిప్రాయాలనూ ఒకరికి తెలుపుకోవడంకూడా ఇందుకు అవసరం.

సోషలిస్టు దేశాల సోదర పార్టీల నాయకుల మధ్య వ్యవహారసరళిలో సంబంధాలూ, ఒక వ్యవస్థగా పరిణామం చెందాయి. కేంద్రకమిటీ అక్టోబరు (1964) విస్తృత సమావేశం తరువాత గడచిన ఈ ఒకటిన్నర సంవత్సరంలోనూ సోవియట్ రాజకీయ సమాలోచనలూ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గ సభ్యులూ, కార్యదర్శులూ, చాలమంది కేంద్రకమిటీ సభ్యులూ ఇంచుమించు సోషలిస్టు దేశాలన్నిటియొక్క కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల నాయకులను సంప్రతింపులకోసమూ సవివరమైన చర్చ కోసమూ అనేక సందర్భాల్లో కలుసుకోవడం జరిగింది. స్నేహ పూర్వకమైన ఆ సమావేశాలు, హృదయ పూర్వకమైన చర్చలూ అభిప్రాయాల, అనుభవాల ఆదానప్రదానాలూ, సయోధ్య, ప్రగాఢమైన పరస్పర గౌరవం, మహత్తరమైన సోషలిస్టు ఆశయాలకూ ఆదర్శాలకూ సమిష్టి విధేయతలతో కూడిన వాతావరణంలోనే ఎల్లప్పుడూజరుగుతుంటాయి.

ప్రతి ఒక్క దేశంయొక్క, యావత్తు సోషలిస్టు వ్యవస్థయొక్క కార్యకలాపాల సారాంశాన్ని తెల్చి, అందులో ప్రయోజనకరమైనదానిని సకాలంలో, మరింత సంపూర్ణంగా ఉపయోగించుకోవడమూ, మన దేశాల్లో కమ్యూనిస్టు, సోషలిస్టు వ్యవస్థల నిర్మాణవిధానాన్నీ, అంతర్జాతీయ వ్యవహారాల్లో అనుసరించేందుకు అన్నిటికన్నా సరియయిన పంథానూ మరింత జయప్రదంగా, సవివరంగా రూపొందించుకోవడమూ. ఇటువంటి సమావేశాలవల్ల సాధ్యమవుతుంది. ఇది చాల అవసరమైన, ఉపయోగకరమైన సంప్రదాయమని జీవితమూ, మన అనుభవమూ నిరూపిస్తున్నాయి. ఇది అన్నివిధాలా పెంపొందాలనేదే మన అభిలాష.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినంతవరకు, సోదర సోషలిస్టు దేశాలతో రాజకీయ సంబంధాలను పెంపొందించుకుని, పటిష్ఠం చేసేందుకు సర్వశక్తులా కృషిని ఇకముందు కూడా కొనసాగిస్తాము.

సోషలిస్టు దేశాలమధ్య ఆర్థిక సహకార రంగంలో మన సంబంధాలు

గడిచిన సంవత్సరాల్లో ఇంకా అభివృద్ధి చెంది, మరింత ఉన్నతస్థాయిని అందు కున్నాయి. రెండేసి దేశాల మధ్య అనేక దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు ఎంతగానో విస్తృతమయాయి. సోషలిస్టు దేశాల మధ్య వర్తక పరిణామం చాల పెరిగింది. ఒక్క పరస్పర ఆర్థిక సహాయక నీతికి చెందిన దేశాలతో వర్తక పరిమాణమే, మనం చర్చిస్తున్న ఈ దశలో 5,600 మిల్లియన్ల రూబుళ్ళనుండి 8,500 మిల్లియన్ల రూబుళ్ళకి పెరిగింది. పరస్పరం లాభదాయకమైన షరతులపై వస్తూత్పత్తిలో ప్రత్యేక కేంద్రీకరణ, సహకారాలకై కొన్ని చర్యలు అమలు జరిగాయి. మన దేశాల ప్రజల ప్రయోజనాల దృష్ట్యా విజ్ఞానశాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక రంగాల్లో సన్నిహిత సంబంధాలను నిరంతరం విస్తృతపరచి, బల పరచడం జరుగుతూ ఉంది. సభ్య దేశాల ఆర్థిక వ్యవస్థలను పెంపొందించడంలో పరస్పర ఆర్థిక సహాయక సమితిపాత్ర అంతకంతకు పెరుగుతూ ఉంది. వస్తూ త్పత్తిలో అధిక తర కేంద్రీకరణ, సహకారాంశూ, ఆర్థిక ప్రణాళికలను అధిక ఫలదాయకంగా సమన్వయ పరచడానికీ సంబంధించిన సమస్యలను పరిష్కరించేం దుకు ఆర్థిక శాస్త్రవేత్త లిప్పుడు కృషి చేస్తున్నారు. విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఈనాడు మహోద్భుతంగా సాగుతూన్న విప్లవ వేగంతో సమానంగా సోష లిస్టు దేశాల జాతీయ ఆర్థిక వ్యవస్థలు పురోగమించేందుకూ, పెట్టుబడిదారీ వ్యవ స్థతో పోటీలో ఇంకా ఎక్కువ విజయాలను సాధించేందుకు ఆ విధంగా తగు పరి స్థితులను కల్పించేందుకూ ఇదొక్కటే మార్గమని, అనేక సోదర పార్టీల్లాగానే మనమూ భావిస్తున్నాము.

బూర్జువా ప్రపంచంలోని దేశాల ఆర్థిక వ్యవస్థకన్న, సోషలిస్టు దేశాల ఆర్థిక వ్యవస్థ ఎక్కువ వేగంగా అభివృద్ధి చెందుతూంది. ఇందుకు ఉదాహరణగా, 1961-65 మధ్యకాలంలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పారిశ్రామిక వస్తూత్పత్తి 43 శాతం పెరగ్గా, పెట్టుబడిదారీ వ్యవస్థలో 34 శాతమే పెరిగిందన్న విషయాన్ని తెలిపితే చాలు. ఈ రెండిటికీ వ్యత్యాసం గణనీయమన్న విషయం మీరు గమనించ గలరు. అంతేకాకుండా, సోషలిస్టు దేశాల్లో లాగా పెట్టుబడిదారీ దేశాల్లో పారి శ్రామికాభివృద్ధి లెక్కలు ప్రజల జీవన స్థాయి పెరుగుదలకు సూచికలేమీకాదు. ప్రధానంగా గుత్త పెట్టుబడిదారీ సంస్థల లాభాల పెరుగుదలకూ, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ అంతకంతకు మరింత సైనికీకృతం అవుతున్నందుకూ నిదర్శనాలు మాత్రమే అవి.

ఆర్థిక అభివృద్ధి వేగంలో సోషలిస్టు దేశాలు తమ ఆధిక్యతను నిలబెట్టు

కుంటూ, ఇంకా పెంచుకుంటున్నాయి. సోషలిస్టు ఉత్పత్తి పద్ధతి వల్ల చేకూరే ప్రయోజనాలను నానాటికి ఎక్కువ సమర్థవంతంగా వినియోగించు కుంటున్నాయి. తద్వారా అవి తమ ప్రధాన, నిజంగా విప్లవాత్మకమైన కర్తవ్యాలలో ఒక దానిని నెరవేర్చుతున్నాయి.

సోదర సోషలిస్టు దేశాలతో ఆర్థిక సంబంధాలు మరింత విస్తృతమయి, బల పడేందుకు, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినంత వరకు, మన సర్వశక్తులతోనూ కృషిని కొనసాగించి తీరుతాము.

అమెరికా నాయకత్వంకింద సామ్రాజ్యవాద శక్తుల దురాక్రమణ చర్యలు పెచ్చుపెరుగుతూన్న దృష్ట్యా, సైనిక సహకారరంగంలో సోషలిస్టు దేశాలతో మన సంబంధాలను మరింత పటిష్ఠంచేసుకోవడమూ. వార్సా సంధి యంత్రాంగాన్ని మరింత బలపరచి, మెరుగుపరచడమూ జరిగింది. సోషలిస్టుదేశాల ప్రజలు సాధించుకున్న విజయాలకు వార్సా సంధి నమ్మకమైన రక్ష. వార్సా సంధిదేశాల సైన్యాలకు అత్యంత అధునాతనమైన ఆయుధాలున్నాయి. సేనల శిక్షణలోనూ, ఆకాశ, సముద్రరంగాల్లోనూ మిత్రదేశాల సేనలమధ్య, ఆయుధబలాలమధ్య సహకారపూర్వకమైన తర్ఫీదు పెంపొందింది. ఆధునిక ఆయుధాల పాటవాన్ని పరీక్షించడమూ, వార్సా సంధిదేశాల సాయుధబలాల సహయోగిత్వాన్ని పటిష్ఠం చేయడమూ జరిగింది. పరస్పరం అత్యంత సన్నిహిత సంబంధాలుగల వార్సా సంధిదేశాల కుటుంబం, అవసరంవస్తే సోషలిస్టు వ్యవస్థ రక్షణకొరకు, మనదేశాల స్వేచ్ఛాజీవిత సంరక్షణకొరకు ఒక్కటై నిలబడి, ఎటువంటి దురాక్రమణదారునైనా సరే చావుదెబ్బ తీస్తుంది.

సోదర సోషలిస్టుదేశాలమధ్య సైనిక సహకారాన్ని విస్తృతమొనర్చి, పటిష్ఠం చేసేందుకు, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీకి సంబంధించినంతవరకు సర్వ శక్తులతోనూ కృషి కొనసాగిస్తాము.

కామ్రేడ్స్, సహకార, సంఘీభావాలు సోషలిస్టు వ్యవస్థశక్తికి మూలకందాలు. ఈ సహకారాన్ని పెంపొందించి, మరింత ప్రగాఢం చేయడం ప్రతి దేశంయొక్క, మొత్తం ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క ముఖ్య ప్రయోజనాలకు అనుగుణం. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగే పోరాటంలో మన బలగాల సమైక్యతకిది దోహదం చేకూర్చుతుంది.

అమెరికా సామ్రాజ్యవాదం వియత్నాం ప్రజలపై తమ దురాక్రమణను

విస్తరింపజేస్తూ, సోషలిస్టుదేశమయిన వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్ పై దురహంకారంతో దాడి ప్రారంభించిన ప్రస్తుత పరిస్థితిలో ఇటువంటి సమైక్యత ప్రత్యేకంగా అవసరం. పోరాటం సాగిస్తున్న వియత్నామ్‌కు సహాయం చేసేందుకు సోషలిస్టు దేశాలన్నిటికృషిని ఏకం చెయ్యడానికి సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నికరమైన ప్రయత్నం చేస్తూంది. కామ్రేడ్స్, వియత్నాం ఘటనలను గురించీ, సోదర వియత్నాం ప్రజలకు మన సహాయంగురించీ తరువాత వివరిస్తాను.

ప్రజాస్వామిక ప్రాతిపదికపై కొరియాను సమైక్యం చేసేందుకు అమెరికా సామ్రాజ్యవాదాన్నెదుర్కొని పోరాడుతున్న సోదర కొరియా ప్రజలకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజలూ పూర్తిసహాయాన్ని అందజేస్తున్నారు. కొరియా ప్రజలు విజయాన్ని సాధించి తీరుతారని, కొరియా సమైక్యమై స్వతంత్ర మౌతుందని మనపార్టీ, యావన్మంది సోవియట్ ప్రజలూ విశ్వసిస్తున్నారు.

సోషలిస్టు విప్లవాన్ని సాధించిన తొలి అమెరికన్ దేశమయిన క్యూబా వీర ప్రజానీకం చాల గడ్డుపరిస్థితుల్లో తమ పోరాటాన్ని కొనసాగిస్తూ, సోషలిస్టు వ్యవస్థను నిర్మించుకుంటున్నారు. క్యూబా ఏకాకికాదు. మహాశక్తివంతమయిన సోషలిస్టు దేశాల కుటుంబంలో అది సభ్యురాలు. నవ సమాజాన్ని నిర్మించుకునేందుకు కృషిచేస్తున్న క్యూబా ప్రజలను మన ప్రజలు హృదయపూర్వకంగా బలపరుస్తున్నారు. సోదర క్యూబాకు సోవియట్ యూనియన్ సర్వతోముఖమైన సహాయాన్ని అందజేస్తూంది. ఇకముందు కూడా అందజేస్తుంది.

కామ్రేడ్స్, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పటిష్ఠతను గురించి ప్రస్తావించే సందర్భంలో రెండు సోషలిస్టు దేశాల పార్టీలయిన చైనా కమ్యూనిస్టు పార్టీ, ఆల్బేనియా పార్టీ ఆఫ్ లేబర్‌లతో మన సంబంధాలు, దురదృష్టవశాత్తు ఇంకా అసంతృప్తికరంగానే ఉన్నాయన్న విషయాన్ని మనం గమనించవలసి ఉంది.

మన పార్టీ, సోవియట్ ప్రజలూ, జనచైనాతోనూ, ఆ దేశపు కమ్యూనిస్టుపార్టీతోనూ మైత్రినే హృదయ పూర్వకంగా వాంఛిస్తున్నారు. ప్రజా ఆల్బేనియా పార్టీ ఆఫ్ లేబర్ తోనూ సంబంధాలను మెరుగు పరచు కోడానికి చేయగల దంతా చేయడానికి మనం సిద్ధంగా ఉన్నాము.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రతినిధి వర్గంతో 1964 నవంబరులో మాస్కోలో ఒక సమావేశం జరిగిన విషయం మీకు తెలుసు. ఆ తరువాత కొన్ని రోజులకు మన ప్రతినిధి వర్గమొకటి పెకింగ్‌లో చైనా కమ్యూనిస్టుపార్టీ నాయ

కత్వంతో సంభాషణలు జరిపింది. మాస్కోలోగాని, పెకింగ్‌లోగాని, అత్యున్నత స్థాయిలోకొత్తగా మరొక సమావేశంజరుపుదామని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ చైనా కామ్రేడ్స్‌కి సూచించింది. అటువంటి సమావేశం చాల విలువైనదిగా ఉంటుందనే మనము ఇప్పటికి నమ్ముతున్నాము. చైనాపార్టీ నాయకత్వంతో ఇప్పుడున్న విభేదాలను మార్క్సిస్టు – లెనినిస్టు సూత్రాల ప్రాతిపదికపై తొలగించుకునేందుకు మార్గాన్ని అన్వేషించడం కోసం వాటిని తిరిగి పరిశీలించేందుకు మనము ఏక్షణంలో నైనా సరే సిద్ధంగా ఉన్నాము.

మన పార్టీయా, మనదేశాల ప్రజయా చివరకు అన్ని చిక్కులనూ అధిగమించి, చెట్టపట్టాల్ పట్టుకొని ముందుకు సాగుతారనీ, మహత్తరమైన మన ఉమ్మడి విప్లవ ఆశయంకోసం కలిసికట్టుగా పోరాడుతారనీ దృఢంగా విశ్వసిస్తున్నాము.

భవిష్యత్తులో, విదేశాంగ విధాన రంగంలో, పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క కార్యకలాపాల్లో ఒకముఖ్యాంశంగా ఉండవలసిందిగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఈదిగువవాటిని సూచిస్తూ౦ంది: అన్ని సోషలిస్టుదేశాల కమ్యూనిస్టు పార్టీలతోనూ సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ బంధాలను మార్క్సిజమ్ – లెనినిజమ్ సూత్రాల ప్రాతిపదికపై పెంపొందించుకొని పటిష్ఠం చేసుకోవడం, సోవియట్ యూనియన్, దక్కిన సోషలిస్టు దేశాలమధ్య రాజకీయ, ఆర్థిక, తదితర బంధాలను పెంపొందించుకొని, పటిష్ఠం చేయడం; సోషలిస్టు శిబిరంయొక్క సమైక్యతకు అన్ని విధాల దోహదం చేకూర్చి, దాని శక్తినీ, పలుకుబడినీ బలపరచడం. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ మరింత శక్తివంతం అయ్యేందుకూ, విజయ పరంపరలను సాధించ గలిగేందుకూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తన సర్వశక్తులతోనూ కృషి చేస్తుంది.

## 2. పెట్టుబడిదారీవ్యవస్థ అంతర్గత వైరుధ్యాలు మరింత తీవ్రమవుతున్నాయి. కార్మికుల వర్గ పోరాటం మరింత విస్తృతమవుతూంది:

కామ్రేడ్స్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, పెట్టుబడిదారీ ప్రపంచంలోని పరిణామాలను ఒక కంట కనిపెడుతూనే తన విదేశాంగ విధానాన్ని

కొనసాగిస్తూఉంది. మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థ సార్వత్రిక సంక్షోభంలో చిక్కుకొని వుంది. దాని సహజసిద్ధమైన వైరుధ్యాలు మరింత తీవ్రమవుతున్నాయి. ఈ వైరుధ్యాలను అధిగమించి, సోషలిజాన్ని ప్రతిఘటించడంలో తమ స్థానాన్ని నిలబెట్టుకోవానికి చేసే ప్రయత్నంలో, బూర్జువా ప్రపంచ పెత్తందార్లు ఆర్థిక వ్యవస్థపై ప్రభుత్వ నియంత్రణమీదా, విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక రంగాల్లోని అభివృద్ధిమీదా, యుద్ధసామాగ్రి ఉత్పత్తిని పెంచడంమీదా కొండంత ఆశలు పెట్టుకొన్నారు. కాని, దీనివల్ల పెట్టుబడిదారీవ్యవస్థ ప్రధాన వ్యాధులేమీ నయంకాలేదు, కాజాలవుకూడా. రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలోకన్నా, రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రధాన పెట్టుబడిదారీ దేశాల్లోని ఆర్థికాభివృద్ధివేగం ఎక్కువగానేవుంది. అయినప్పటికీ, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ అస్థిరంగానే ఉన్నదనేది ప్రస్ఫుటం. ఉత్పత్తిలో కొంత పెరుగుదల కనబడిన దశల వెనువెంటనే మాంద్యం తరుముకొస్తూ వుంది. ఇలా పెరగడమూ, తరగడమూ అనేక పెట్టుబడిదారీ దేశాల్లో, ముఖ్యంగా అమెరికాలో జరిగాయి.

పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో సహజసిద్ధమై దాగివున్న విధ్వంసక శక్తులు ఇంకా పనిచేస్తూనే ఉన్నాయనీ, కొత్త సంక్షోభాలనుండి అది తప్పించుకోజాలదనీ, దీనితోపాటుగా, అంతకంతకు పెరుగుతూన్న ద్రవ్యోల్బణమూ, జాతీయఋణం బ్రహ్మాండంగా పెరిగిపోవడమూ, ప్రజల ఋణభారమూ, సుస్పష్టంచేస్తున్నాయి.

పెట్టుబడిదారీ దేశాల్లో ఆర్థిక, రాజకీయ అభివృద్ధిలో అసమానత్వసూత్రం నిరాఘాటంగాచెలామణి అవుతూంది :ఆ దేశాలమధ్య వైరుధ్యాలు మరింత తీవ్రతరమౌతున్నాయి. పశ్చిమ యూరప్ దేశాలూ,జపానూ ఆర్థిక అభివృద్ధి వేగంలో కొన్ని సంవత్సరాల పాటు అమెరికా కన్న మిన్నగా ఉండెవి. కాని, గతకొద్ది సంవత్సరాల్లో పరిస్థితి తారుమారయింది. అమెరికా ఆర్థికాభివృద్ధి వేగం పెరిగింది. పశ్చిమ యూరప్, జపాను దేశాలది బాగా తగ్గిపోయింది.

దీనిని అవకాశంగాతీసుకొని అమెరికా గుత్తపెట్టుబడిదారీ సంస్థలు ప్రపంచ మార్కెట్లలో కొత్తగా దాడి ప్రారంభించాయి. ఇటలీ, పశ్చిమ జర్మనీ, బ్రిటన్, మొదలయిన దేశాల్లోకి తిరిగి పెద్దమెత్తున అమెరికా పెట్టుబడులు వస్తున్నాయి. అయితే యుద్ధానంతరపు తొలిసంవత్సరాల్లో లాగా కాకుండా, అమెరికా గుత్తపెట్టుబడిదారు లిప్పుడు మునుపటికన్నా బలమయిన పోటీదారులతో వ్యవహరించవలసి వస్తూంది. వీరు అంతకంతకు మరింత తరచుగా డాలర్ ప్రాబల్యంపై ఎదురుదెబ్బ తీస్తున్నారు.

పశ్చిమ యూరప్‌లో ఈ పోటీ కూడా మరింత తీవ్రమయింది. ఉమ్మడి మార్కెట్, తదితర ప్రభుత్వ గుత్తాధికార సంఘాలు కూడా ఇందులో భాగస్వాములు. సభ్య దేశాల మధ్య వైరుధ్యాల కారణంగా సామ్రాజ్యవాద కూటములలో విచ్ఛిత్తి ప్రారంభమయింది. వీటి విధానాలను అమెరికా ఇప్పుడు మునుపటంత సర్వ సంపూర్ణంగా సారథ్యం వహించలేక పోతూఉంది. ఈ కూటములను నిర్మించుకోడానికి "సోవియట్ దురాక్రమణ ప్రమాదం" అన్న వచ్చి అసత్యం ఒకప్పుడు ఉపయోగపడింది. ప్రజలమాట అటుంచి, బాధ్యతగల రాజకీయ వేత్తలెవరూ కూడా ఈ అసత్యానికి విలువ ఇచ్చి చాల కాలమయింది. పైగా అమెరికా దురాక్రమణ నగ్న సత్యమయింది. అమెరికా ప్రభుత్వ విధానాలతో పశ్చిమ యూరపుని ఏకీభవించడంలో ఉన్న ప్రమాదాలను అమెరికా మిత్ర రాజ్యాలు అంతకంతకు ఎక్కువగా గుర్తిస్తున్నాయి.

ఈ విధంగా, పెట్టుబడి దారీ ప్రపంచంలో వైరుధ్యంతోనూ, స్పర్థలతోనూ కూడిన ఒక కొత్త రంగం రూపొందుతూంది.

బూర్జువా ప్రపంచంలోని నేటి పరిణామాలన్నిటిలోకీ అత్యంత వికృతమైనది ఆర్థిక వ్యవస్థ సైనికీకరణ. దీనిని ఉపేక్షించ కూడదు. శ్రమజీవి సృష్టించిన జాతీయ సంపదలను, ప్రజల జీవితాలను మెరుగు పరచేందుకు ఉపయోగించడానికి బదులుగా, మారణాయుధాల ఉత్పత్తి కోసమే అధికాధికంగా వినియోగిస్తున్నారు. ఆయుధాల నిలవలు ఇప్పటికప్పుడె పర్వతాల్లా పేరుకు పోయాయి. అయినా ఆయుధ పోటీ, ఇంతకు ముందు కని విని ఎరుగనంత ఉరవడిగా సాగుతూంది. బూర్జువా దేశాల జాతీయాదాయాల్లో చాల పెద్ద భాగాలను స్వాహా చేసేస్తూంది.

ఇందుకు ఉదాహరణగా, ఉత్తర అట్లాంటిక్ కూటమి ఏర్పడినది మొదలు కొని, దాని యుద్ధయంత్రాంగాన్ని పెంపొందించి, మెరుగులు దిద్దడంకోసం 1,000,000 మిల్లియన్ల డాలర్లు ఖర్చుచేశారన్న ఒక్క విషయాన్ని పేర్కొంటే సరిపోతుంది. యుద్ధానంతరం గడచిన 20 సంవత్సరాల్లోనూ అమెరికా సైనిక వ్యయం రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వపు 20 సంవత్సరాల్లోని ఖర్చును నాలుగు రెట్లు మించిపోయింది. అమెరికా కేంద్ర ప్రభుత్వ బడ్జెట్ ఖర్చుల్లో నాలుగింట మూడు వంతులకు పైగా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈనాడు సైనికావసరాల కింద జరుగుతూంది.

ముఖ్యమయిన సామ్రాజ్యవాద దేశాల్లో మారణాయుధాల ఉత్పత్తి పెరగడం

వల్ల, తక్కినదేశాలు కూడా తమ రక్షణలను బలపరచుకునేందుకు పెద్దపెద్దమొత్తా లను ఖర్చుచేయవలసి వస్తూంది. ఆర్థిక వ్యవస్థ సైనికీకరణ, సామ్రాజ్యవాదదేశాల, ముఖ్యంగా అమెరికా దురాక్రమణ విధానంతో గట్టిగా ముడిపడి ఉంది. స్వతంత్ర దేశాల్లో చాలావాటిని దొంగదీసుకోవడమూ, మానవజాతి సామాజిక ప్రగతికి అవ రోధాలు కల్పించడంకన్నా వాటికి కావలసినది మరేమీలేదు. దేశదేశాల ప్రజల కుత్తుక నులిమే దోపిడీ, సముద్ర బందిపోటు రత్వంతో కూడిన అసహ్యాకరమయిన శక్తిఅని అమెరికా సామ్రాజ్యవాదం గురించి లెనిన్ చేసిన వర్ణన ఎంత సరియై నదో చరిత్రగతి రుజువుగా ఋజువు చేస్తూంది.

పెట్టుబడిదారీ సమాజంలోని ప్రధాన వైరుధ్యమయిన కార్మిక, పెట్టుబడిదారీ వర్గాల వైరుధ్యం, మునుపటిలాగానే పెట్టుబడిదారీ ప్రపంచంలో పూర్తిగా పని చేస్తూంది. కార్మికవర్గంపైనే, శ్రామిక ప్రజానీకంలోని తక్కిన భాగాలపైనీ, మరెంత ఎక్కువ భారాన్ని మోపడానికి గుత్తపెట్టుబడిదారీ సంస్థలు ప్రయత్ని స్తున్నాయి. దోపిడీ తీవ్రత ఈనాడున్నంత ఎక్కువగా ఏనాడూ లేదు. విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో అభివృద్ధివల్లనూ, ఉత్పాదకశక్తుల పెరుగుదలవల్లనూ చేకూరే ఫలితాలన్నీ బహూకొద్దిమంది గుత్త పెట్టుబడిదారులకే భుక్తమవుతున్నాయి. అదే సమయంలో, పరిశ్రమ వాణిజ్యాలు ఎంతో వాగుస్న్నప్పుడుకూడా మిల్లియన్లకొలది ప్రజలు నిరుద్యోగులుగా అలమటిస్తున్నారు. అసంఖ్యాకంగా కర్షకులు సర్వనాశ నానికీ, దేవఖర్మకూ గురి అవుతున్నారు.

"ప్రజాపెట్టుబడిదారీ వ్యవస్థ"అనీ "సంక్షేమరాజ్యము"నీ బూర్జువా సిద్ధాంత వేత్తలు అల్లిన కట్టుకథల నన్నిటినీ వాస్తవిక విషయాలు చీల్చి చెండాడుతున్నాయి. 1960లో అమెరికా గుత్త పెట్టుబడిదారీ సంస్థలు మొత్తం 45,000 మిల్లియన్ డాలర్ల నికరలాభాలు, అంటే రెండవ యుద్ధకాలంలో సగటు సాంవత్సరిక లాభాలకు నాలుగు రెట్లు సంపాదించగా, ప్రభుత్వమే ఒప్పుకున్నట్లు 32 మిల్లియన్ల మంది అమెరికన్లు దారిద్ర్యం అనుభవిస్తున్నారు. ఇది ఏలాంటి సార్వజన సంక్షేమం?

శ్రామిక ప్రజల దోపిడీ పెరగడం, వర్గ పోరాటానికి మరింత ఊతం ఇస్తూంది. పెట్టుబడిదారీ వ్యవస్థలోని సామాజిక పోరాటాలు మరింత తీవ్ర మవు తున్నాయి. ఇటలీ, జపాన్, ఫ్రాన్సు, బెల్జియమ్, అమెరికా, బ్రిటన్ మొదలైన దేశాల కార్మికులు, తమ జీవనస్థాయిపై గుత్త పెట్టుబడిదారీ వర్గాలు సాగిస్తూన్న దాడిని ఎదుర్కొని, ఇటీవలి సంవత్సరాల్లో సమ్మె పోరాటాలతో గట్టిగా ఎదురు

దెబ్బ తీస్తున్నారు. అనేక సందర్భాల్లో వారు విజయాలు సాధించారు. ఇందుకు సమ్మె దారుల సంఖ్య గత పదేళ్ళలోనూ రెండింతలు పెరిగిందనీ, ఇప్పుడు ఏటా మొత్తం సుమారు 55–57 మిల్లియన్ల మంది సమ్మెల్లో పాల్గొంటున్నారన్న ఒక్క ఉదాహరణ చాలు.

కార్మికవర్గ సామాజిక – ఆర్థిక, రాజకీయ డిమాండుల పరిధి, పెట్టుబడిదారీ దేశాల్లోని వర్గ పోరాటాల సందర్భంలో విస్తృతమయింది. పారిశ్రామిక సంస్థల నిర్వహణలో ట్రేడ్ యూనియన్లకు భాగస్వామ్యం ఉండాలనీ, ప్రధానమైన ఆర్థిక రంగాలను జాతీయంచేయాలనీ ఇటలీ, ఫ్రాన్స్, తదితర దేశాల్లోని ఫ్యాక్టరీ కార్మికులూ, ఆఫీసు పనివారూ అంతకంతకు మరింత గట్టిగా అడుగుతున్నారు. ఫైనాన్స్ పెట్టుబడుల (పారిశ్రామిక పెట్టుబడి, బ్యాంకింగ్ పెట్టుబడుల విలీనీకరణవల్ల ఏర్పడే పెట్టుబడులు) సర్వం సహాధికారాన్ని వారు వ్యతిరేకిస్తున్నారు. జపానులో మిల్లియన్ల కొలది శ్రామిక ప్రజలు అధికవేతనాలను కోరడమే కాకుండా, అమెరికా యుద్ధ స్థావరాల తొలగింపునుకూడా డిమాండు చేస్తున్నారు. జపాను రేవుల్లోకి అమెరికా అణు జలాంతర్గాముల ప్రవేశాన్ని వ్యతిరేకించి పోరాడుతున్నారుకూడా.

యుద్ధానికీ, సామ్రాజ్య వాదుల వలస విధానానికీ వ్యతిరేకంగానూ, సామ్రాజ్యవాద దురాక్రమణకు గురిఅయిన దేశాల ప్రజలకు సహాయంగానూ, పెట్టుబడిదారీ దేశాల్లోని శ్రామికవర్గం, తమ అగ్ర దళాలయిన కమ్యూనిస్టు పార్టీల నాయకత్వం క్రింద క్రియాత్మకమైన పోరాటం సాగిస్తూంది. ఫ్రాన్సులో కార్మికవర్గమూ, మొత్తం వామపక్ష శక్తులన్నీ, ఇటీవల సాధించిన గొప్ప రాజకీయ విజయాలు, దేశ సామాజిక జీవితంపై నానాటికి అధికమవుతున్న వాటి ప్రభావాన్నీ, అంతకంతకు పెరుగుతూన్న ప్రజాసామాన్యం రాజకీయ చైతన్యాన్నీ సుస్పష్టం చేస్తున్నాయి. ఇటలీలో కార్మికవర్గం, ఒక విశాల అభివృద్ధి కాముక సంఘటనకు అగ్రగామిగా నిలబడి, ప్రజల ప్రజాస్వామిక విజయాలను హరించడానికి అభివృద్ధినిరోధక శక్తులుచేసే ప్రయత్నాలను వమ్ముచేస్తూంది. అమెరికాలో జాతివివక్షకు వ్యతిరేకంగా, 20 మిల్లియన్ల మంది అమెరికా నీగ్రోల పౌరహక్కులకోసం సాగుతూన్న పోరాటం, ప్రస్తుతం సమీక్షిస్తున్న దశలో మహా శక్తివంతంగా విజృంభించింది. అమెరికన్ జాతిలో పెద్దపెద్ద భాగాలు, వియత్నాంలో అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణను అంతకంతకు మరింత తీవ్రంగా ఖండిస్తున్నాయి.

గుత్తపెట్టుబడిదారీ వర్గాల పీడనను వ్యతిరేకించే ఇతర సామాజిక తరగ

తులు – రైతుల్లోనూ, బుద్ధిజీవుల్లోనూ అత్యధిక భాగం – కార్మిక వర్గం వెనుక మరింత సుసంఘటితంగా సమీకృతులవుతున్నారు. గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక సువిశాల సంఘటన ఒకటి రూపొందుతూంది. ఈ పరిణామక్రమం ప్రజల్లో మరింత గాఢమైన ఐక్యతను ప్రోత్సహిస్తూంది. విప్లవాత్మక సామాజిక పరివర్తన, సోషలిజమ్ అనే అంతిమలక్ష్యం కోసం వారు సాగించే పోరాటానికి మరింత ఉత్సాహాన్ని స్తుంది.

ఇది పెట్టుబడిదారీ వ్యవస్థకు అంతకంతకు మరింత గడ్డుగా తయారవుతున్న కాలం. దాని పతనం నానాటికి మరింత స్పష్టమవుతూంది. కాని, తమ ఆధిపత్యాన్ని పెట్టుబడిదారీ వర్గాలు ఇష్టపూర్వకంగా ఎన్నటికీ వదులుకోరు. పట్టువిడువని వర్గపోరాటాల ద్వారా మాత్రమే కార్మికవర్గమూ, తక్కిన శ్రామికప్రజలూ విజయాన్ని సాధించగలరు.

పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికోద్యమం చాల తీవ్రమయిన చిక్కులను ఎదుర్కొని వ్యవహరించవలసి ఉన్నదనీ, అది సాగించవలసిన పోరాటాలు కష్టమయినవనీ మనకు తెలుసు. అటువంటివి ఇంకా అనేక పోరాటాలు ముందున్నాయి.

సోవియట్ దేశంలోని కమ్యూనిస్టులూ, యావన్మంది ప్రజలు కూడా, బూర్జువా దేశాల్లోని శ్రామిక ప్రజానీకంపట్ల హృదయ పూర్వకమైన సంఘీభావాన్ని వ్యక్తం చేస్తున్నారు. సోవియట్ యూనియన్, తక్కిన సోషలిస్టు దేశాల శ్రామిక ప్రజల విజయాలు, తమ విముక్తికోసం, తమ బిడ్డల భవిష్యత్తు కోసం, నూతన సామాజిక వ్యవస్థ విజయం కోసం సాహసోపేతమైన పోరాటం సాగిస్తున్న మన వర్గ సోదరులకు అండగా ఉన్నవన్న విషయం సోవియట్ ప్రజలకే ఉత్తేజం కలిగిస్తూంది.

## 3. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకోసం సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కృషి చేస్తూంది :

కా॥ మేర్క్స్, ఒకశతాబ్దం క్రితం మార్క్స్, ఎంగెల్స్‌లు శాస్త్రీయ కమ్యూనిజమ్ పతాకాన్ని ఆవిష్కరించినప్పుడు, ప్రపంచంలో తొలిసారిగా వారు స్థాపించిన అంతర్జాతీయ కార్మికవర్గ సంస్థలో కొన్ని డజన్ల కన్నా ఎక్కువమంది సభ్యులు లేరు. ఎంతో గంభీరమైన అర్థసంపదగలిగి, గర్వకారణమైన "కమ్యూనిస్టు" అన్న మాటను ప్రపంచం విన్నది అప్పుడే. పరమసత్యాన్ని. మిల్లియన్ల కొలది శ్రామిక

ప్రజల జీవిత పరమావధిని ప్రతిబింబింప జేస్తుందికాబట్టి, ఈ పదం ఇక నెన్నటికీ అదృశ్యంకాని విధంగా వ్యాప్తిచెందింది.

అర్ధశతాబ్దం కిందట, పెట్టుబడిదారీ వ్యవస్థపై దాడికి వ్లాదిమిర్ లెనిన్ నాయకత్వంకింద మన పార్టీ ప్రజల్ని సమీకరించినప్పుడు ప్రపంచంలో 4,00,000 మంది కమ్యూనిస్టులున్నారు. ఈనాడు, అన్ని ఖండాల్లోనూ 88 కమ్యూనిస్టు పార్టీలు, మొత్తం సుమారు 50 మిల్లియన్ల సభ్యత్వం కలిగివున్నాయి.

కమ్యూనిస్టుదళాలూ, వాటిపలుకుబడీ, యిలానిర్నిరోధంగా పెరుగుతూ రావడానికి మూలం ఏమిటి? శ్రామిక ప్రజల ముఖ్య ప్రయోజనాలను, తక్కినవారికన్నా కమ్యూనిస్టులు ఎక్కువ సమగ్రంగా వ్యక్తం చేయడమే ఇందుకు కారణం. కార్మిక వర్గ ఆశయానికి స్వార్థ రహితంగా అంకితం కావడము, ప్రజలతో సజీవమూ, దుర్భేద్యమూ అయిన సంబంధాలూ, ప్రజల విప్లవానుభవాలనుండి నిరంతరం పాఠాలు నేర్చుకోగల నేర్పు, పోరాటంలో ప్రజలకు నాయకత్వం వహించి, వారిని నిర్భయంగా ముందుకు నడపగల సామర్థ్యము – ఇవన్నీకూడా కమ్యూనిస్టుల శక్తికి మూలాధారాలు.

మానవజాతియొక్క చారిత్రక భవిష్యత్తును విస్పష్టంగా చూడగలది, ప్రపంచంలోని రాజకీయ ఉద్యమాలన్నిటిలోకీ, సామాజిక పరిణామానికి సంబంధించిన శాస్త్రీయ సిద్ధాంతం సాధనంగా గల కమ్యూనిస్టు ఉద్యమం ఒక్కటే. 1957, 1960 సమావేశాల్లో సోదర పార్టీలు సమిష్టిగా రూపొందించిన కమ్యూనిస్టు ఉద్యమ సాధారణపంథా, శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయస్వాతంత్ర్యం, సోషలిజముల దిగ్విజయంపై దృష్టి కేంద్రీకరించిన పంథా. సమస్త మానవజాతి ప్రయోజనాల కది అనుగుణమైనది. గత కొద్ది సంవత్సరాల్లోనూ కమ్యూనిస్టుపార్టీల్లో అధికభాగం దానిని ప్రాతిపదికగా తీసుకొని, జాతీయ, అంతర్జాతీయప్రయోజనాలనూ, సమస్యలనూ నిర్వచిస్తూ కొత్త కార్యక్రమ పత్రాలను రూపొందించుకున్నాయి.

తక్కిన కమ్యూనిస్టు, వర్కర్స్‌పార్టీలతో ఐక్యతనూ, సోదర సంఘీభావాన్నీ దృఢపరచాలి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ పంథాను అమలు జరిపేందుకు వాటితో భుజం భుజం కలిపి కృషిచేయాలి అన్న దీక్షాపూరిత అభిలాష, ఇప్పుడు సమీక్షిస్తూన్న దశలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ అంతర్జాతీయ కార్యకలాపాలన్నిటిలోనూ నిండి నిబిడీకృతమై ఉంది.

1960 అనంతరం ప్రపంచంలో కమ్యూనిస్టుల సంఖ్య మరొక 14 మిల్లియన్లు

సోషలిజమ్ కోసమూ పోరాడిన చాలమంది యోధులను పోలీసులు చిత్రహింసల పాలుజేసి చంపారు. ఈ యోధులు అమరజీవులు. తరతరాలుగా వారు ప్రజల స్మృతిపథాల్లో నిలిచి ఉంటారు.

ఏ లాంటి చిత్ర హింసలూ, విషప్రచారాలూ కూడా కమ్యూనిస్టులను చలింప జేయజాలవు. మన ఉద్యమం అద్భుతమైన వీరులను, సిద్ధాంతానికి అంకితం కావ డంలోనూ, పౌరధర్మంలోను, వ్యక్తిగతంగాను ధైర్యసాహసాలను ప్రదర్శించటం లోను ఆదర్శప్రాయులయిన వారిని సృష్టిస్తున్నందుకు మనం గర్వపడు తున్నాము.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు ఉద్యమ విజయాలు ఎవరూ కాదనటానికి వీలు లేనివి. అయినప్పటికీ కమ్యూనిస్టులు మైమరచి పోకుండా నిదానంగానే పరిస్థితిని గమనిస్తున్నారు. సరియయిన నిర్ధారణలు చేసుకోవడం కోసం ఒక్క విజయాలను మాత్రమే కాకుండా, అపజయాలను కూడా లెక్కలోకి తీసుకోవాలని వాదిమిర్ లెనిన్ మనకు బోధించారు.

విప్లవపోరాటానికి నాయకత్వం వహించటం జటిలమయిన ఒక పెద్ద కళ. ఈనాడది బహుశా మునుపటికన్నా మరింత జటిలమైనదిగా ఉందేమో కూడా. సోదర పార్టీలు పోరాటం సాగిస్తున్న పరిస్థితులు దేశదేశానికీ వేరుగా ఉన్నాయి. కొత్త కొత్త సామాజిక తరగతులూ, జాతులకు జాతులూ, విప్లవపోరాటంలో చేరు తున్నాయి. వాటి సంప్రదాయాలూ, ఆర్థిక పరిస్థితులూ, పోరాట అనుభవాలూ వేరు. ఆయా కమ్యూనిస్టుపార్టీల కార్యకలాపాలపై దీనంతటియొక్క ప్రభావం ఉంటుంది.

వ్యూహమూ, ఎత్తుగడల విషయంలో పరీక్షల్లో నిగ్గుదేరి, నిజమైన లెని నిస్టు సూత్రాలకే కట్టుబడి, ఉన్న పరిస్థితిని లెక్కలోకి తీసుకునే పార్టీలే విజయం సాధించగలుగు తున్నాయన్న విషయాన్ని గతకొద్ది సంవత్సరాల విప్లవోద్యమ అనుభవం మరొకసారి ఋజువుచేస్తూంది. మార్క్సిస్టు – లెనినిస్టు పంథానుండి మిత వాదం వైపుగాని అతివాదం వైపుగాని పక్కకు మళ్లడం, సంకుచిత జాతీయ వాదమూ, అగ్రరాజ్య దురహంకారమూ, నాయకత్వ ఉబలాటమూకూడా తోడయి నప్పుడు రెండింతలు ప్రమాదకరంగా పరిణమిస్తుందనికూడా జీవితానుభవం నిరూపిస్తూంది. కమ్యూనిస్టులు దీనినుండి తగిన గుణపాఠాలను నేర్చుకొనక తప్పదు.

కామ్రేడ్స్, గత కొద్దిసంవత్సరాల్లోనూ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం తీవ్రమైన చిక్కుల్లో పడిందన్న విషయం మీరెరుగుదురు. ఈ విషయంలో సోవి యట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ వైఖరి ఈ మహాసభ ప్రతినిధులందరికీ సువిది

తమే. మనఉమ్మడి శత్రువులకు తప్ప మరెవ్వరికీ లాభదాయకంకాని విభేదాలు ఈ నాటికి కూడా తొలగకుండా ఉన్నందుకు చాల విచారిస్తున్నాము. ప్రతిఒక్క సోదర పార్టీ ప్రయోజనాలకూ, మొత్తం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ఉమ్మడి ప్రయోజనాలకూ ఇది భంగకరమనే మనం భావిస్తున్నాము. మన ఉద్యమ బలగాలను సుసంఘటితం చేసేందుకు పాటుపడడం కమ్యూనిస్టులందరియొక్క విధ్యుక్త ధర్మమని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నమ్ముతూంది. కమ్యూనిస్టు ఉద్యమంలోని దళాలన్నిటి సంఘీభావం ఎంత బలపడితే, సామ్రాజ్యవాద వ్యతిరేక అంతర్జాతీయ సంఘటనకూడా అంత ఎక్కువ బలంగా ఉంటుందనీ, ప్రపంచ విప్లవ పరిణామక్రమం అంత ఎక్కువ జయప్రదంగా కొనసాగుతుందనీ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ విశ్వసిస్తూంది.

కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను దృఢ పరిచేందుకు ప్రస్తుత పరిస్థితిలో మన పార్టీ తలపెడుతూన్న నిర్దిష్టమైన మార్గాలేమిటి?

1957, 1960 లో జరిగిన సోదర పార్టీల సమావేశాలు రూపొందించిన సాధారణ పంథా, కమ్యూనిస్టు బలగాలను సంఘటితం చేసేందుకు చక్కని ఉమ్మడి మార్క్సిస్టు కమ్యూనిస్టు ప్రాతిపదిక అని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ భావిస్తూంది. జీవితం దానికి చాల కఠినమైన పరీక్ష పెట్టింది. అందులో అది ఘనంగా నెగ్గింది. ఈ పంథాకు కట్టుబడి ఉండడం ఐక్యతకూ, విప్లవోద్యమం నూతన విజయాలను సాధించేందుకూ నమ్మకమైన హామీలని నొక్కి చెప్పేందుకు చాలినంత ఆధారం ఉంది.

పార్టీలమధ్య పరస్పర సంబంధాల విషయంలో పాటించేందుకు సమిష్టిగా నిర్దేశించిన సంపూర్ణ సరి సమానత్వం, స్వాతంత్ర్యం, ఒకరి విషయాల్లో ఒకరు జోక్యం కలిగించుకోకుండా ఉండడం, పరస్పర సహాయం, అంతర్జాతీయ సంఘీభావం అనే సూత్రాలను అనుసరించడం అధికతర ఐక్యతకు అవసరం. కమ్యూనిస్టుపార్టీలకు విప్లవ కార్యక్రమంలో అపారమైన అనుభవం ఉంది. తమకు ఎదురయ్యే సమస్యలకు సరియైన పరిష్కారాలను అవి కనిపెట్టగలిగినంత చక్కగా మరెవ్వరూ కనిపెట్టలేరు. కమ్యూనిస్టు ఉద్యమంలో అన్నిరకాల పెత్తందారీ ధోరణులకన్నిటికీ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ వ్యతిరేకం. నిజమయిన అంతర్జాతీయతా తత్వంతో కూడిన, న్యాయమైన సంబంధాలు అన్ని పార్టీలమధ్యా ఉండాలనే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కోరుతూంది. విభేదాలున్నప్పటికీ, సామ్రాజ్యవాద

పెరిగింది. ప్రజలతో వారి బంధాలు మరింత బలపడ్డాయి. నేటి మన కాలంలో అన్నిటికన్నా ఎక్కువ ప్రభావంగల రాజకీయ శక్తిగా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం మరొకసారి నిరూపించుకుంది.

సోషలిస్టు దేశాల కమ్యూనిస్టుపార్టీలు అపారమైన నిర్మాణ కార్యక్రమం సాగిస్తున్నాయి. ఆర్థిక పరిణామం, నూతన సామాజిక సంబంధాలు, ప్రజలకు కమ్యూనిస్టు చైతన్యం కలిగించటంవంటి క్లిష్టసమస్యలను అవి పరిష్కరించుకుంటున్నాయి. తమ సోషలిస్టు విజయాల పరిరక్షణకు తగు కట్టుదిట్టాలు చేసుకుంటున్నాయి. ఈ కార్యక్రమం చరిత్రాత్మక ప్రాధాన్యంకలది. సోషలిస్టువ్యవస్థ యొక్క అంతర్జాతీయస్థానాల నది బలపరుస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా సోషలిస్టు భావాలకు గల ఆకర్షణ శక్తిని ఇనుమడింప జేస్తుంది.

పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలు, గుత్తపెట్టుబడిదారీ వర్గాలకు వ్యతిరేకంగా ప్రజా సామాన్యం పోరాటాలకు నాయకత్వం వహిస్తున్నాయి. వర్గ పోరాటాల్లో రాజకీయ విప్లవ సైన్యాన్నొకదానిని నిర్మిస్తున్నాయి. ఈ దేశాల్లో చాల వాటిలో జాతీయ జీవితం అంతటిమీదా కమ్యూనిస్టు పార్టీలో ఈనాడు బలమైన ప్రభావాన్ని ప్రసరిస్తున్నాయి. కార్మిక వర్గంయొక్క, శ్రామిక రైతాంగంయొక్క అభివృద్ధి కాముక మేధావి వర్గంయొక్క అత్యుత్తమ పుత్రులు కమ్యూనిస్టులు. ప్రముఖ సాంఘిక, రాజకీయ నాయకులూ, శ్రామిక ప్రజల ఆశయం కోసంజరిగే పోరాటానికి జీవితాన్ని అంకితం చేసుకొనే చాలా మంది యోధులూ వారిలోంచి ఉద్భవిస్తున్నారు. పెట్టుబడిదారీ దేశాల్లో అనేక ట్రేడ్ యూనియన్లకూ, ప్రజా సంస్థలకూ కమ్యూనిస్టులు నాయకులుగా ఉన్నారు: పార్లమెంటు సభ్యులుగానూ, అనేక నగరాలకూ, గ్రామాలకూ మేయర్లుగానూ కమ్యూనిస్టులున్నారు; రాజకీయ వ్యాఖ్యాతలు, శాస్త్రవేత్తలు, రచయితలు, ఉపాధ్యాయులుగా కమ్యూనిస్టులున్నారు: బూర్జువా నియంతృత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం కొనసాగుతూన్న దేశాల్లో గెరిల్లా సైనిక దళాలకూ, విప్లవకారుల రహస్యదళాలకూ, కమ్యూనిస్టులు నాయకత్వం వహిస్తున్నారు. కమ్యూనిస్టు పార్టీల ప్రభావం పెరుగుతున్న దనేందుకూ, ప్రజలతో వాటికి గల దుర్భేద్యమైన సంబంధాలకూ ఇదంతా కూడా ఆచరణ పూర్వకమైన నిదర్శనం.

ఫ్రాన్స్, ఇటలీ, ఫిన్లాండు, బెల్జియమ్, బ్రిటన్, ఆస్ట్రియా, డెన్మార్క్, సైప్రస్, ఆస్ట్రేలియా, కెనడా, భారత, సింహళ, సిరియా, ఇరాక్, సూడాన్, దక్షిణా

్రికా, చిలీ, ఉరుగ్వే, అర్జెంటైనా, కొలంబియా, బ్రెజిల్, ఈక్వెడార్, మెక్సికో, గౌతమాలా, మొదలైన దేశాల్లో - కమూనిస్టుపార్టీలు ఉన్న చోటల్లా, ప్రజల్లో మరింత ఎక్కువ పలుకుబడి కోసమూ, కార్మికవర్గ, తదితర శ్రామిక ప్రజలందరి ప్రయోజనాల కోసమూ అవి అచంచల దీక్షతో పోరాటం సాగిస్తున్నాయి. ప్రజల సానుభూతిని కమ్యూనిస్టులు అంతకంతకు ఎక్కువగా చూర గొంటున్నారు. యూరప్‌లోనూ, దక్షిణ అమెరికాలోనూ కొన్నిదేశాల్లో కమ్యూనిస్టుపార్టీలు ప్రముఖ రాజకీయ శక్తులుగా అభివృద్ధి చెందాయి.

కార్మికవర్గ ఉద్యమ ఐక్యతకోసం అందరికన్నా ఎక్కువగా పోరాడేది కమ్యూనిస్టులు. గణనీయమైన చిక్కులు ఇంకా ఉన్నప్పటికీ, ఈ ఐక్యతకై పోరాటంలో ఇటీవల స్పష్టమైన పురోగమనాన్ని సాధించారు. సోషల్ డెమోక్రటిక్ పార్టీల మితవాద నాయకులే ఈ చిక్కులకు ముఖ్యకారకులు. కాని, కార్మికవర్గ ఉద్యమంయొక్క నిజమైన ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించేది ఈ నాయకులు కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రయోజనాలను కాపాడేందుకూ, కార్మికోద్యమంలోని చీలికను కొనసాగించడానికీ కృతనిశ్చయులై ఉన్న మితవాద సోషల్ డెమోక్రటిక్ నాయకుల విధానంలో ఉన్న ప్రమాదాలను కార్మికవర్గం నానాటికి ఎక్కువగా గ్రహిస్తూంది. కలిసికట్టుగా కృషిచేస్తే తప్ప, గుత్త పెట్టుబడిదారీ వర్గాలకువ్యతిరేకంగా సాగేపోరాటంలో స్పష్టమైన విజయాలు లభ్యంకావన్ననమ్మకం ప్రజాసామాన్యంలో వారి స్వానుభవాన్నిబట్టే నానాటికి మరింత బలపడుతూంది. కార్మికవర్గం ఐక్యతను కోరుతూంది. దాని నది సాధించితీరుతుం దనేదే మన దృఢవిశ్వాసం.

సామ్రాజ్యవాదంయొక్క వలస వ్యవస్థ కూలిపోవడంతోనూ, నూతన స్వతంత్ర దేశాల పెద్ద సమూహ మొకటి ప్రపంచ రంగంమీద ఆవిర్భవించడంతోనూ, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల్లోని కమ్యూనిస్టు ఉద్యమానికి కొత్తకర్తవ్యాలు ఎదురమాయి. జాతీయ విముక్తివిప్లవ జ్వాలల్లో ప్రాదుర్భవించిన ఈ ఉద్యమం, ఆ విప్లవాలను పూర్తిచేయడానికీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పటిష్ఠం చేసేందుకూ, సామాజిక ప్రగతి కోసమూ సాగుతూన్న పోరాటంలో మరింత బలం పుంజుకుంటూంది.

పెట్టుబడిదారీ ప్రపంచంలో "స్వేచ్ఛా" దేశాలని పేరు పెట్టుకున్న దేశాల్లో కమ్యూనిస్టులు పయనించేది ముళ్ళబాట. అక్కడ కమ్యూనిస్టుఉద్యమం ఒక్కొక్క

అడుగు ముందుకు వేయాలంటే, బాగా ఆరితేరిన, ద్రోహబుద్ధితోకూడిన, దయా దాక్షిణ్యాలులేని శత్రువుతో భీకర పోరాటం సాగించవలసివస్తూంది. 19 వ శతాబ్దపు చివరి రోజులనాటి తొలి రహస్య మార్క్సిస్టు అధ్యయన తరగతులతోనూ, 1905 నాటి కాట్రగడలతోనూ ప్రారంభించి, అక్టోబరు విప్లవ పోరాటాలగుండా, సోషలిజం దిగ్విజయం వరకు మనపార్టీ మహోజ్వల మార్గాన పయనించింది. శత్రువుయొక్క నిరంతర దాడి నెదుర్కొంటూ, ప్రజల ఆశయంకోసం పోరాడేందుకు కమ్యూనిస్టులకు ధైర్యసాహసాలూ, పట్టుదలా, వీరత్వమూ ఎంత అవసరమో, ఇటువంటివి మన పార్టీకి బాగా తెలుసు. స్పెయిన్, పోర్చుగల్, గ్రీసు, పశ్చిమ జర్మనీ, వెనిజులా, పెరూ, దక్షిణాఫ్రికా మొదలయిన కొన్ని దేశాల్లో ఇప్పటికి అనేక సంవత్సరాలుగా కమ్యూనిస్టుపార్టీలు రహస్యంగానే పనిచేయవలసివస్తూంది. అమెరికా కమ్యూనిస్టు పార్టీ అత్యంత క్లిష్ట పరిస్థితుల్లో వీరోచితంగా పోరాడుతూంది. బ్రహ్మాండమైన పోలీసు నిర్బంధ యంత్రాంగం దాడి నెదుర్కొని అది నిలబడుతూంది. బూర్జువా వర్గం జీతగాళ్ళుగా వున్న కమ్యూనిస్టు వ్యతిరేక సిద్ధాంతవేత్తలు నిరంతరం దానిని వెన్నంటి పీడిస్తున్నారు.

రాజకీయ — సిద్ధాంత పోరాటంలో కమ్యూనిస్టులను ఓడించలేక బూర్జువా అభివృద్ధి నిరోధకశక్తులు కమ్యూనిస్టుపార్టీలపై హింసాకాండనూ, కార్మిక వర్గానికి విశ్వాసపాత్రులైన పుత్రులపై దౌర్జన్యాలనూ ఒడిగట్టుతున్నాయి.

ఇండొనేషియాలోని కమ్యూనిస్టు వ్యతిరేక భీభత్సకాండను మన పార్టీ యావత్తూ, మనదేశ ప్రజలు యావన్మందీ ఖండిస్తున్నారు. ఆ దేశంలోని అభివృద్ధి నిరోధక శక్తులు, ఏలాంటి విచారణా లేకుండా వేలకొలది ప్రజల్ని దారుణంగా హతమార్చారు. కమ్యూనిస్టుపార్టీ సభ్యులుకావడం ఒక్కటే వారుచేసిన "నేరం". కమ్యూనిస్టుపార్టీని పీడించడమూ, నిషేధించడమూ, ఇండొనేషియాలోని విప్లవ శక్తుల ఐక్యతను భంగపరుస్తుంది, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన పునాదులను దెబ్బతీస్తుంది. మిత్రులయిన ఇండొనేషియా ప్రజల ప్రయోజనాలకు ఎంతో నష్టం కలిగిస్తుంది. ఇండొనేషియా జాతీయ స్వాతంత్ర్యంకోసమూ, శ్రామిక ప్రజల ప్రయోజనాలకోసమూ పోరాడిన వీరయోధులయిన కమ్యూనిస్టులపై సాగుతూన్న ఘాతుకమైన హత్యాకాండను తక్షణం ఆపివేయవలసిందిగా డిమాండు చేస్తున్నాము.

గతకొద్ది సంవత్సరాల్లోనూ చాలమంది ప్రముఖ కమ్యూనిస్టు నాయకులను ఉరికంబాలు పొట్టబెట్టుకున్నాయి. తమ తమ దేశాల ప్రజల సౌఖ్యం కోసమూ,

వ్యతిరేక పోరాట ప్రయోజనాలకోసము సామ్రాజ్యవాద దురాక్రమణ చర్యలను మరింత గట్టిగా తిప్పికొట్టడంకోసమూ, జాతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసమూ. అన్ని దేశాల కమ్యూనిస్టుల ఐక్య కార్యాచరణకొరకు కృషిచేయడం సాధ్యమనీ, అది అవసరంకూడా అనీ, తక్కిన మార్క్సిస్టు – లెనినిస్టుపార్టీల్లాగానే సోవియట్ కమ్యూనిస్టు పార్టీకూడా నమ్ముతూంది. వియత్నామ్‌పై అమెరికా దురాక్రమణను తుదముట్టించేందుకు పోరాటం, సామ్రాజ్యవాద కుట్రలకు వ్యతిరేకంగా ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లోని అభివృద్ధి కాముకశక్తులను బలపరచడం, కొన్ని దేశాల్లో సాగుతూన్న అభివృద్ధి నిరోధకశక్తుల భీభత్సకాండ బారి నుండి మన సోదర కమ్యూనిస్టులను కాపాడడం – ఇవీ, నేటి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి సంబంధించిన తక్కిన ముఖ్య సమస్యలూ, ప్రపంచ వ్యాప్తమయిన కమ్యూనిస్టుల మహాసైన్యం ఎంత సమైక్యంగావుంటే అంత జయప్రదంగా పరిష్కారమవుతాయి.

కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు ఇటీవల జరిపిన సమావేశాలూ, చర్చలూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమఐక్యతను దృఢపరిచేందుకు జరుగుతూన్న కృషిని మరికొంత ముందుకు తీసుకుపోయాయి. ఇటువంటి సమాలోచనలకు మనపార్టీ ఎంతో ప్రాధాన్యాన్ని ఇస్తూంది. గత 18 మాసాల్లోనే 60 సోదరపార్టీలకు చెందిన 210 లకుపైగా ప్రతినిధివర్గాలతో చర్చలు జరిపాము. బహుపక్ష, ద్విపక్ష సమావేశాలు ఇంకాఎక్కువగా జరగడము, ఒకరి అనుభవాలను ఒకరికినిరంతరం తెలుపుకోవడము, వర్తమాన సమస్యలపై సోదరభావంతో చర్చలు – సోదరపార్టీల మధ్య సంబంధాల్లో ఇది సరియయిన, ఉపయోగకరమైన సంప్రదాయం. కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను దృఢపరచేందుకు అది మంచి మార్గంకూడా.

కమ్యూనిస్టుల అంతర్జాతీయ ఐక్యతను సాధించేందుకూ, కొత్త సమస్యలపై సమిష్టి చర్చలు జరిపేందుకూ, కమ్యూనిస్టు పార్టీల అంతర్జాతీయ సమావేశాలు ఒక ముఖ్యమైన, ఆచరణలో ఉపయోగం రుజువైన పద్ధతి అని అనడంలో సోదర పార్టీలతో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఏకీభవిస్తూంది. పరిస్థితులు పరిపక్వమయినప్పుడు మరొక సమావేశం జరగాలనేదే మనకోరిక.

అంతర్జాతీయ కార్మికవర్గం యొక్క విప్లవాత్మక అగ్రదళంలో అంతర్జాతీయతాయుతమైన సమైక్యత ఉండాలన్న దానికి కమ్యూనిస్టు పార్టీల్లో అత్యధిక భాగం గట్టిగా సుముఖములన్న సత్యాన్ని వాస్తవ విషయాలు ధ్రువపరుస్తున్నాయి. విప్లవ

దశాలన్నిటి యొక్క మౌలిక ప్రయోజనాల వాస్తవిక సాయూహ్యత అన్నపునాది మీదనే కమ్యూనిస్టుల ఐకమత్యం ఆధారపడి, పెంపొందుతూంది. ఉమ్మడి శత్రువైన సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాటం సాగించేందుకు మన బలగాలను మరింత దృఢంగా సమైక్యంచేయండి అని కమ్యూనిస్టులందరికీ చేసిన విజ్ఞప్తిని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ఈనాడు ఈమహాసభలో పునరుద్ఘాటిస్తూంది.

కా మ్రేడ్స్,

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ తన అంతర్జాతీయ తాయుత విప్లవ కర్తవ్యానికి అచంచలంగా కట్టుబడిఉంది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ప్రతినిధులకూ, వారి ద్వారా, ప్రపంచ కమ్యూనిస్టులు యావన్మందికి, మన ఈ మహాసభ వేదిక నుండి ఇదే హామీ ఇస్తున్నాము:

మార్క్స్ - ఎంగెల్స్ - లెనిన్ మహాశయుల మహత్తర ఉపదేశాల ప్రాతిపదికపై, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం సమిష్టిగా రూపొందించిన పంథాకు అనుగుణంగా, సోదరపార్టీ లన్నిటిమధ్య మరింత బలమైన ఐక్యతను నెలకొల్పేందుకే సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ దృఢదీక్షతో కృషిచేస్తుంది.

రివిజనిజమ్, పిడివాదం, సంకుచిత జాతీయవాద ధోరణులకు వ్యతిరేకంగా, రాజీలేని పోరాటాన్ని మనం కొనసాగించి తీరుతాము. మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలను సృజనాత్మకంగా అభివృద్ధి పరచడాన్ని బలపరుస్తాము.

శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయస్వాతంత్ర్యాలనే మహత్తర లక్ష్యాల సాధన కోసం, సోషలిజం, కమ్యూనిజమ్‌లకోసం, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగే పోరాటంలో ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల ఐక్య కార్యాచరణ అనే పంథాను ఇక ముందుకూడా మన పార్టీ బలపరుస్తూనే ఉంటుంది.

## 4. జాతీయ విముక్తి ఉద్యమ విధానం, జాతీయ విముక్తి పోరాటానికి మన పార్టీ అండదండలు :

కామ్రేడ్స్, వలసపీడనకు వ్యతిరేకంగా దేశదేశాల ప్రజలు సాగించే పోరాటానికి అన్నివిధాలా తోడ్పడటము, సరిసమానత్వం, సార్వభౌమాధికారాలను ఖచ్చితంగా మన్నించడం, వాటి ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోకుండా

ఉండడం అనే ప్రాతిపదికపై నూతన స్వతంత్ర దేశాలతో సర్వతోముఖ సహకారాన్ని పెంపొందించడము అనే విధానాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ఈ అన్ని సంవత్సరాలూ నికరంగా అనుసరించింది.

జాతీయ విముక్తి ఉద్యమం గత కొద్ది సంవత్సరాల్లోనూ గణనీయమైన పురోగతిని సాధించింది. ఆల్జీరియా జనతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్, కీన్యా, ఉగాండా, టాంజానియా, జాంబియా మొదలయిన 17 స్వతంత్ర దేశాల ఆవిర్భావాన్ని ప్రపంచం తిలకించింది. ఆసియా, ఆఫ్రికా ఖండాలు ఇంచుమించు పూర్తిగా వలస దాసత్వాన్ని వదిలించుకున్నాయి. సామ్రాజ్యవాదాన్నెదుర్కొని ఆయా దేశాల ప్రజలు సాగించిన విముక్తి పోరాటంలో ఇది గొప్ప విజయం.

అయినప్పటికీ, సిగ్గుచేటయిన వలస వ్యవస్థను సాయుధ బల ప్రయోగంతో నిలబెట్టడానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తూన్న దేశాలు ఈనాడు కూడా ప్రపంచంలో కొన్ని ఉన్నాయి. అంగోలా, మొజాంబిక్, "పోర్చుగీసు" గినీ, దక్షిణ అరేబియాల్లో విదేశీ వలస పాలకులనూ, దురాక్రమణదారులనూ ప్రతిఘటించి దేశభక్తులు వీరోచిత పోరాటం సాగిస్తున్నారు. దక్షిణాఫ్రికా, రొడీషియా దేశాల్లో జాత్యహంకారుల పాలనకు ప్రజల ప్రతిఘటన నానాటికీ తీవ్రమవుతూంది. మన పార్టీ, సోవియట్ ప్రజలూ ఈ పోరాటాన్ని క్రియాత్మకంగా బలపరుస్తున్నారు. విదేశీ దురాక్రమణదారుల నెదుర్కొని తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాడుతూన్న దేశాల ప్రజలకు ఫలప్రదమూ, సర్వతోముఖమూ అయిన తోడ్పాటును అందజేస్తున్నారు. ఇకముందుకూడా అందజేస్తూనే ఉంటారు. వలస వ్యవస్థను మిగిలి ఉన్న కట్టకడపటి బురుజులుకూడా ధ్వంసమయిపోయి, విముక్త ప్రాంతాల్లో ప్రజలు జాతీయ స్వాతంత్ర్య పతాకాన్ని ఎగురవేసే రోజు ఎట్టే మూరానలేదన్నదే మన దృఢవిశ్వాసం. ఇది చరిత్ర ఇచ్చిన తీర్పు. దీనికి తిరుగులేదు.

దేశ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న ప్రజలు, వలస పరిపాలన దాయిణ అవశేషాల నిర్మూలనకై పాటుపడుతున్నారు. ఈ దేశాల్లోని సహజసంపద అపారం. కాని, తలసరి వస్తూత్పత్తి స్థాయిని చూచినట్లయితే, ఆర్థికంగా అభివృద్ధి పొందిన దేశాలకన్నా అవి ఇంకా 20—40 రెట్లు వెనుకబడి ఉన్నాయి. అయితే, స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న దేశాల ప్రజలు యుగయుగాల వెనుకబాటుతనాన్ని తుదముట్టించడానికి దృఢసంకల్పంతో ఉన్నారు.

విముక్తదేశాల్లో నవజీవనం, సామ్రాజ్యవాదంతో భీకర పోరాటంలో, ఆ

దేశాల్లోని అభివృద్ధికాముక, అభివృద్ధినిరోధక శక్తులమధ్య తీవ్రమయిన సంఘర్షణలో, వికసిస్తూంది. విముక్తదేశాల పరిణామ క్రమాన్ని పెట్టుబడిదారీ మార్గాన నడపాలని కొన్ని సామాజిక తరగతులవారు, సామ్రాజ్యవాదుల మద్దతుతో ప్రయత్నిస్తున్నారు. తక్కినవారు, ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాలను ప్రతిబింబిస్తూ, సామాజిక అభివృద్ధి, నిజమైన జాతీయ స్వాతంత్ర్యాలమార్గాన పరిణామ క్రమం సాగేలా చేయడానికి ప్రయత్నిస్తున్నారు.

నూతన స్వతంత్రదేశాల్లో దేశభక్తియుత, అభివృద్ధికాముక, ప్రజాస్వామికశక్తు లన్నిటి ఐక్యత యెంత బలంగావుంటే, సామాజిక అభివృద్ధి, జాతీయ స్వాతంత్ర్యాలకోసం సాగే పోరాటం అంత యెక్కువ జయప్రదమవుతుందని జీవితానుభవం స్పష్టంచేస్తూంది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగానూ, ప్రజల ప్రయోజనాలకోసమూ స్వార్థరహితంగా పోరాడే కమ్యూనిస్టులు ఈ పోరాటంలో ముఖ్యంగా పాల్గొంటున్నారు. ఎక్కడయితే దీనిని విస్మరించడం జరిగి, కమ్యూనిస్టులపై హింసాకాండ సాగే దశకు పరిస్థితులు దిగజారిపోతాయో, అక్కడ జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పటిష్ఠం చేయాలనే ఆశయం దెబ్బతింటుందనేది నిస్సందేహం.

నూతన స్వతంత్రదేశాల్లో అనేకం ఈనాటికీ సామ్రాజ్యవాదుల ఆర్థిక దోపిడీకి రాజకీయ నిర్బంధాలకూ గురి అవుతున్నాయన్న విషయాన్ని జ్ఞాపకం ఉంచుకోవాలి. తన పరాజయాలను సామ్రాజ్యవాదం ఈనాటికీ దిగమింగలేదు. దేశదేశాలను దోచుకొనే అవకాశాలను అటే పెట్టుకోవానికి అది సర్వశక్తులా ప్రయత్నిస్తుంది. కొత్త కొత్త జిత్తులమారి పద్ధతులను అవలంబిస్తుంది.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లోని అనేక దేశాల ఆర్థిక వ్యవస్థలపైనీ, సంపదలపైనీ పెట్టుబడిదారీ దేశాల గుత్త పెట్టుబడిదారీ వర్గాలకు ఇప్పటికీ గణనీయమైన అధికారం ఉంది. ఆ దేశాలను నిర్దాక్షిణ్యంగా దోచుకోవడాన్ని అవి కొనసాగిస్తూనే ఉన్నాయి. ఆ దేశాల్లో పెట్టిన పెట్టుబడులపై లాభాల క్రింద మాత్రమే ఏటా ఇంచుమించు 6,000 మిల్లియన్ల డాలర్లు చొప్పున అమెరికా, బ్రిటన్, తదితర సామ్రాజ్యవాద దేశాలు దోచుకుపోతున్నాయి.

వీలు చిక్కిన చోటల్లా నూతన స్వతంత్ర దేశాల్లోని అంతరంగిక వైరుధ్యాలను ఉపయోగించుకోడానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. వివిధ సామాజిక జాతీయ, తెగల గ్రూపుల మధ్య సంఘర్షణలను రెచ్చగొడుతున్నారు. వివిధ

రాజకీయ వేత్తలను ఒకరిపై కి ఒకరిని ఉసి కొల్పుతున్నారు. అందరికన్నా ఎక్కువ అభివృద్ధి నిరోధకులూ, అవినీతిపరులూ అయిన వర్గాలకు చెంది, విదేశీ పెట్టుబడి దారులతో సంబంధాలూ, సహకారాల ద్వారా లాభాలు ఆర్జిస్తున్నవారు అధికారం లోకి వచ్చేలా చూస్తున్నారు. అంతర్జాతీయ రంగంలో కూడా సామ్రాజ్యవాదంతో ప్రత్యక్ష భాగస్వాములుగా ఉండడానికి వెనుకాడనివారితో కూడిన ప్రజా వ్యతిరేక ప్రభుత్వాలను కొన్ని దేశాల్లో ఏర్పరచడంలో వారు కృతకృత్యులవు తున్నారు.

నూతన స్వతంత్ర దేశాల సార్వభౌమాధికారాలను సామ్రాజ్యవాదులు లెక్క చేయరు. ఇతర దేశాల ప్రజల ఆంతరంగిక వ్యవహారాల్లో సాయుధ బలంతో జోక్యం కలిగించుకోగల "హక్కు" తమకున్నదని వారు, మానవ ద్వేషపూరితులై అంటు న్నారు. దక్షిణ అమెరికా దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో సాయుధ జోక్యం గురించి అమెరికా ప్రతినిధులసభ (దిగువ శాసనసభ) ఇటీవల చేసిన తీర్మానం ఇందుకొక నిదర్శనం. ప్రపంచ మంతటా ఆగ్రహం కలిగించిన తీర్మానమది. డొమి నికన్ రిపబ్లిక్‌లో ఇటీవల జరిగిన అమెరికా సాయుధ జోక్యంలాంటి సామ్రాజ్య వాద దురాక్రమణ చర్యలను చట్ట సమ్మతం చేసేందుకు జరిగిన ప్రయత్నమేఅది.

ఇదంతాకూడా నయావలస విధానానికి నిదర్శనం. దానికి వ్యతిరేకంగా పోరాటం సాగించడం అభివృద్ధి కాముక మానవజాతి యావత్తూ తన ప్రధాన కర్త వ్యాలలో ఒకటిగా పరిగణిస్తుంది. స్వాతంత్ర్యంకోసం పోరాడిన ప్రజలు, తుది విజయాన్ని సాధించే వరకు ఈ పోరాటాన్ని కొనసాగిస్తారనేందుకూ, విముక్తి దాని నలను చేసేందుకు జరిగే ప్రయత్నాలన్నిటినీ ప్రతిఘటిస్తారనేందుకూ ఏలాంటి సం దేహమూ లేదు.

ఆసియా, ఆఫ్రికాల్లోని స్వతంత్రదేశాల్లో అత్యధికమైన వాటితో మనసంబం ధాలు గత కొద్దిసంవత్సరాల్లోనూ జయప్రదంగా అభివృద్ధి చెందాయని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఈ మహాసభకు తెలుపగలుగుతోంది. సోవియట్ యూనియన్‌కీ, ఈ దేశాలకూ మధ్య వర్తక, ఆర్థిక, సాంస్కృతిక సహకారం ఎంతో పెరిగింది. మన రూపకల్పన సిబ్బంది సహాయంతోనూ, సోవియట్ నిర్మాణ నిపుణుల ప్రత్యక్ష సహకారంతోను ఆసియా ఆఫ్రికా దేశాల్లో సుమారు 600 పారిశ్రామిక, వ్యావసాయిక, తదితర ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతోంది. తమ ఖనిజసంపదలను అన్వేషించుకోవడంలోనూ, వాటి విమజాతీయ ఆర్థికవ్యవస్థల కుపయోగపడేలాగా చేసుకోవడంలోనూ, నూతన స్వతంత్ర దేశాలకు తోడ్పడుతూ

సోవియట్ భూగర్భ పరిశోధక బృందాలు అనేక దేశాల్లో అడవుల్లోనూ, మండు టెడారుల్లోనూ, పనిచేస్తున్నారు.

సోవియట్ సహాయంతో ఈ దేశాల్లో 100 కు పైగా విద్యా, వైద్యసంస్థలూ, పరిశోధనా కేంద్రాలూ నిర్మాణమయ్యాయి, లేదా నిర్మాణంలో ఉన్నాయి. సోవియట్ ఉన్నత విద్యాసంస్థల్లోనూ, సాంకేతిక పాఠశాలల్లోనూ చదువుకుంటూన్న ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల విద్యార్థులసంఖ్య గత ఐదేళ్ళలోనూ ఇంచుమించు రెండింతలయింది. 28 ఆసియా, ఆఫ్రికా దేశాల్లో ఇప్పుడు పనిచేస్తున్న సోవియట్ ఉపాధ్యాయుల, వైద్యుల, సాంస్కృతిక రంగంలోని ఇతర ప్రవీణుల సంఖ్య నాలుగురెట్లు పెరిగింది. ఈ దేశాల్లో సోవియట్ పౌరులు స్వార్థరహితంగా, చిత్త శుద్ధితో, శక్తివంచన లేకుండా పనిచేస్తున్నారు. మనదేశానికీ ఈ దేశాలకూ మధ్య మైత్రిని పటిష్ఠంచేసేందుకు వారు ఎంతగానో తోడ్పడుతున్నారు. సోవియట్ప్రజల కార్మికవర్గ అంతర్జాతీయతా తత్వం దీనంతటిలోనూ ప్రదర్శితమవుతూంది.

నూతన స్వతంత్ర దేశాలకు అంతర్జాతీయ రంగంలోకూడా మనపార్టీ, ప్రభుత్వమూ సాధ్యమయిన సహాయమంతా అందజేస్తున్నాయి. ఈ దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో సామ్రాజ్య వాదుల జోక్యాన్ని సోవియట్ యూనియన్ క్రియాత్మకంగా వ్యతిరేకిస్తుంది. పరస్పర సంఘర్షణల్లో స్వతంత్ర దేశాల శక్తినంతటినీ హరించివేయాలనే లక్ష్యంతో వాటిమధ్య తగాదాలు రెచ్చగొట్టడానికి నయావలస వాదులుచేసే ప్రయత్నాలను అది ప్రతిఘటిస్తూంది. అనేక ముఖ్య అంతర్జాతీయ సమస్యల విషయంలో ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లోని స్వతంత్ర దేశాలతో మనం ఫలప్రదంగా సహకరిస్తున్నాము. శాంతి, అభ్యుదయాల కోసం ఈ సహకారాన్ని ఇకముందు కూడా పెంపొందిస్తాము.

కామ్రేడ్స్, నూతన స్వతంత్రదేశాలు కొన్ని అభివృద్ధికర సామాజిక పరిణామ మార్గాన్ని చేపట్టడం గత కొద్ది సంవత్సరాల ముఖ్య పరిణామాల్లో ఒకటి. "యుగయుగాల వెనుకబాటుతనాన్ని నిర్మూలించుకునేందుకూ, తమ జీవనస్థాయిని మెరుగుపరచుకొనేందుకూ ఉత్తమోత్తమ మార్గం పెట్టుబడిదారీ విధానేతర పరిణామ మార్గమే అని ప్రజాసామాన్యం గుర్తించ నారంభిస్తున్నారు దోపిడీ, దారిద్ర్యం, ఆకలిబాధలనుండి విముక్తిని తద్వారా మాత్రమే ప్రజలు సాధించుకోగలరు" అని, కమ్యూనిస్టు, వర్కర్స్పార్టీల 1960 మాస్కో సమావేశ ప్రకటన ఉద్ఘాటించింది. ఆ సమావేశం చేసిన నిర్ధారణను జీవితానుభవం ఈ విధంగా ధ్రువపరిచింది.

ఐక్య అరబ్బు రిపబ్లిక్, అల్జీరియా, మాలి, గినీ, కాంగో (బ్రజవిల్లి), బర్మా లాంటి దేశాల్లో ప్రధానమైన సామాజిక సంస్కరణలను అమలు జరిపారు. విదేశీ గుత్తపెట్టుబడిదారులను తరిమివేస్తున్నారు. ప్యూడల్ భూస్వాముల ఎస్టేట్లను స్వాధీనం చేసుకుంటున్నారు. పెట్టుబడిదారీ సంస్థలను జాతీయం చేస్తున్నారు. ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగాన్ని విస్తృతంచేస్తున్నారు. పారిశ్రామికీకరణను సాగిస్తున్నారు. ప్రజల ప్రయోజనాలకు దోహదకరమయిన విస్తృత సాంఘిక శాసనాలను అమలుజరిపారు. ఈ పరిణామక్రమాల రూపమూ, ఉధృతీ వేరు వేరు దేశాల్లో వేరువేరు విధంగా వుంటాయన్న విషయం వేరే చెప్పనక్కరలేదు. తమ లక్ష్యం సోషలిజమ్ అని ప్రకటించుకున్న దేశాల ప్రజల సృజనాత్మక విప్లవ కార్యక్రమం, సామాజిక ప్రగతి ఉద్యమరూపాల్లో తన సొంత లక్షణాలను ప్రవేశ పెడుతూంది.

సోషలిజం వైపు పయనం సాగిస్తూన్న నూతన స్వతంత్రదేశాలతో మనం సన్నిహిత, స్నేహసంబంధాలను ఏర్పరచుకున్నాము. తాము ఎంచుకున్న లక్ష్యం దిశగా ఈ దేశాలు ముందుకు పురోగమించేకొలదీ, వాటితో మన సంబంధాలు సహజంగానే మరింత బహుముఖమూ, ప్రగాఢమూ, సుస్థిరమూ అయినవిగా రూపొందుతాయి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి ఈ దేశాల్లోని విప్లవప్రజాస్వామిక పార్టీలకూ మధ్య సంబంధాలు అభివృద్ధి చెందుతున్నాయి.

సామాజిక ప్రగతిమార్గాన్ని చేపట్టిన నూతన స్వతంత్రదేశాలు అభివృద్ధి చెందడం సామ్రాజ్యవాదులకు మరీ కంటకంగా వుంది. వాటికి వ్యతిరేకంగా వారు నానా కుట్రలూ పన్నుతున్నారు. అభివృద్ధి నిరోధకశక్తులు ముఖ్యంగా ఆఫ్రికా ఖండంలో మరీ పెచ్చరిల్లుతున్నాయని ఇటీవలి పరిణామాలు స్పష్టం చేస్తున్నాయి. కొన్ని ఆఫ్రికా దేశాల్లో సామ్రాజ్యవాదుల కుట్రలను బయటపెట్టడమూ, వాటిని భగ్నం చేయడమూ జరిగింది. సామ్రాజ్యవాదుల కుట్రలూ, కుహకాలనూ, వారి లంచాలు తింటూన్న గులాముల పన్నాగాలనూ ఎదుర్కొని, విముక్తదేశాల ప్రజలు స్వాతంత్ర్య, అభ్యుదయాలకు శత్రువులయినవారిని దృఢ సంకల్పంతో తిప్పికొడు తున్నారు. ద్విగుణీకృత జాగరూకతను ప్రదర్శిస్తున్నారు. సరయిన కర్తవ్యం ఇదొక్కటే. స్వతంత్ర దేశాలకు వ్యతిరేకంగా అనుసరిస్తున్న కుట్రలూ, విచ్ఛిన్న కర చర్యల విధానాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజలు యావ న్మందీ ఆగ్రహావేశంతో ఖండిస్తున్నారు.

దక్షిణ అమెరికా దేశాల ప్రజల వీరోచిత విముక్తి పోరాటం గురించి ప్రత్యేకంగా ప్రస్తావించవలసివుంది.

దక్షిణ అమెరికా తనకొక సమ్మకమయిన బుడజని మొన్న మొన్నటివరకు అమెరికా అనుకుంటూ ఉంది. ఈనాడు ఆ ఖండంలోని ప్రతిఒక్క దేశంలోనూ అమెరికా సామ్రాజ్యవాదానికీ, దాని భాగస్వాములు, విదేశీ గుత్త పెట్టుబడిదారీ వర్గాలతో సంబంధాలు గలవారూ అయిన స్థానిక సైనిక, ఫ్యూడల్ ఛూస్వామ్య, బూర్జువా వర్గాలకూ వ్యతిరేకంగా ప్రజలు పోరాటం సాగిస్తున్నారు. ఈ పోరాటానికి కార్మిక వర్గమూ, కమ్యూనిస్టు పార్టీలూ నాయకత్వం వహిస్తున్నాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల ప్రజల ఐక్యత పటిష్టం కావడం ఈనాటి ముఖ్య విషయాల్లో ఒకటి. ఆసియా ఆఫ్రికా సంఘీభావ ఉద్యమం, అరబ్బు దేశాల ఐక్యతా ఉద్యమం, ఆఫ్రికా దేశాల ఐక్యతా ఉద్యమం, మూడు ఖండాల (ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా) ప్రజల సంఘీభావ ఉద్యమం – ఇవన్నీ కూడా ప్రపంచ దేశాల ప్రజల ముఖ్య ప్రయోజనాలకు అనుగుణమైనవి. మనం వాటిని క్రియాత్మకంగానూ, హృదయ పూర్వకంగానూ బలపరుస్తున్నాము.

కాన్రేడ్స్, వలస, నయావలసపీడనల నుండి అంతిమ విముక్తి కోసం దేశదేశాల ప్రజలుసాగిస్తున్న పోరాటానికి తనసర్వశక్తులా తోడ్పాటును కొనసాగించడం తన అంతర్జాతీయతాయుత కర్తవ్యంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ పరిగణిస్తూంది.

మనపార్టీ, సోవియట్ ప్రభుత్వమూ ఈ దిగువ వాటిని కొనసాగిస్తాయి :

జాతీయ విముక్తికోసం పోరాడుతూన్న దేశాల ప్రజలకు అత్యధిక తోడ్పాటును అందజేయడం. వలసదేశాలకూ, ప్రజలకూ వెంటనే స్వాతంత్ర్యాన్ని సాధించడం ;

జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న దేశాలతో సర్వతోముఖ సహకారాన్ని పెంపొందించుకోవడమూ, తమ ఆర్థికవ్యవస్థలను అభివృద్ధి పరచుకోవడంలోనూ, జాతీయ సిబ్బందిని తరిఫీదు చేసుకోవడంలోనూ, నయావలస విధానాన్ని ప్రతిఘటించడంలోనూ, వాటికి సహాయం చేయడం ;

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలతోనూ,

విప్లవ ప్రజాస్వామిక సంస్థలతోనూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి గల సోదర సంబంధాలను మరింత బలపరచడం.

జాతీయ విముక్తి ఉద్యమం విజయాలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, అంతర్జాతీయ కార్మికవర్గాల విజయాలతో విడదీయరాని విధంగా ముడిపడి ఉన్నాయి. మహత్తరమైన ఈ రెండు విప్లవశక్తుల మధ్య దృఢమైన, దుర్భేద్యమైన మైత్రి, జాతీయ, సామాజిక విముక్తి ఆశయంయొక్క అంతిమ విజయానికి హామీ.

## 5. సామ్రాజ్యవాద దురాక్రమణ విధానానికి వ్యతిరేకంగానూ, శాంతి, అంతర్జాతీయ భద్రతలకోసమూ సోవియట్ యూనియన్ పోరాటం :

కామ్రేడ్స్ ప్రతినిధులారా, విదేశాంగ వ్యవహారాల్లో సోవియట్ యూనియన్ శాంతి విధానాన్ని నికరంగా అనుసరిస్తూంది. సర్వదా ప్రజల ప్రయోజనాలకు దోహదకరంగా వ్యవహరించే మన ప్రభుత్వ స్వభావంలోంచి ఉద్భవించినదే ఈ విధానం. ఈ విధానానికి లెనిన్ పునాది వేశాడు. విదేశాంగ వ్యవహారాల్లో లెనినిస్టు దృక్పథానికీ మనం అచంచలంగా బద్ధులమై ఉన్నాము.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 22వ మహాసభానంతరం గడచిన సంవత్సరాల్లో, శాంతికాముక, దురాక్రమణధోరణి అనే రెండు పరస్పర వ్యతిరేక ధోరణులమధ్య అంతర్జాతీయ రంగంలో తీవ్రమైన సంఘర్షణ సాగింది. ఉద్రిక్తతను సడలించి, శాంతిని పటిష్ఠంచేసి, విభిన్న సామాజిక వ్యవస్థలు గల దేశాల మధ్య శాంతియుత సహజీవనాన్ని సాధించి, జాతీయ, సామాజికాభివృద్ధి మార్గాన ప్రతి ఒక్క దేశమూ స్వేచ్ఛగా పురోగమించగల పరిస్థితులను అంతర్జాతీయ రంగంలో ఏర్పరిచే విధానాన్ని తక్కిన సోషలిస్టు దేశాలతోపాటుగా సోవియట్ యూనియన్ అనుసరిస్తూంది.

ఇందుకు భిన్నంగా, సామ్రాజ్యవాదం యొక్క దురాక్రమణ స్వభావమూ, శాంతికీ, దేశ దేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ దానివల్ల కలిగే ప్రమాదమూ, ఈ సంవత్సరాల్లో మరింత వెల్లడయ్యాయి. ఇతర దేశాల, ప్రజల ఆంతరంగిక వ్యవహారాల్లో సామ్రాజ్య వాదులు సిగ్గువిడిచి జోక్యం కలిగించు కొన్నారు. చివరకు సాయుధ జోక్యానికికూడా ఒడిగట్టారు. తత్ఫలితంగా ప్రపంచ ఉద్రిక్తత మరింత

తీవ్రమయింది. సామ్రాజ్య వాదుల, ముఖ్యంగా అమెరికా దురాక్రమణ చర్యలవల్ల యుద్ధప్రమాదం పెరిగింది.

ఈ పరిస్థితుల్లో దురాక్రమణ శక్తులను గట్టిగా తిప్పికొట్టి, ప్రపంచ పరిస్థితి మరింత క్షీణించకుండా అరికట్టి, ప్రపంచయుద్ధ ప్రమాదాన్ని నివారించే విధానాన్ని పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ అవలంబించాయి. ఈ విషయంలో నానాటికి పెరుగుతూన్న సోవియట్ యూనియన్, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థల శక్తిపైనీ, ప్రపంచ మంతటాఉన్న శాంతికాముక శక్తుల అండదండలపైనీ మనం ఆధారపడ్డాము.

సామ్రాజ్యవాద దురాక్రమణకు గురిఅయిన ప్రజల పక్షాన్నే మనం ఎల్లప్పుడూ నిలబడ్డాము. ఈ ప్రజలకు రాజకీయ ఆర్థిక సహాయన్ని, అవసర మయినప్పుడు సైనిక సహాయాన్ని అందచేశాము. దురాక్రమణదారుల దురుద్దేశాలను బట్టబయలుచేశాము, స్వాతంత్ర్యము. శాంతి ఆశయాలను అభిమానించే ఐక్యిన దేశాల ప్రజలతో కలిసి సోవియట్ యూనియన్ సాగించిన గట్టి కృషిఫలితంగా, సామ్రాజ్యవాదులు తరచు తిరోగమించక తప్పింది కాదు.

పెరుగుతూన్న ప్రపంచ ఉద్రిక్తతనుగురించీ, ప్రపంచయుద్ధ ప్రమాదాన్ని గురించీ మాట్లాడేటప్పుడు, వియత్నామ్‌పై అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణ విషయమై ప్రత్యేకంగా ప్రస్తావించడం అవసరం. జెనీవా ఒప్పందాలను బాహాటంగా కాలదన్ని, వియత్నామ్ ప్రజాస్వామిక రిపబ్లిక్‌పై అమెరికా బందిపోటువాడి జరిపింది. దక్షిణ వియత్నామ్ ప్రజలపై భయంకరమైన యుద్ధం సాగిస్తూంది. స్వాతంత్ర్య నాగరికతల సంరక్షకులమని పేరు పెట్టుకొన్న ఈ సామ్రాజ్యవాద దేశం, వేలకొలది మైళ్ళ దూరంలోవున్న ఒక శాంతికాముక దేశంమీద, తన ప్రయోజనాలకు ఏనాడూ ఎలాంటి అపకారమూచేసి ఎరుగని దేశంమీద, మానవులకు ఇంతవరకు తెలిసివున్న విధ్వంసక ఆయుధాలనూ, మారణాస్త్రాలనూ ఇంచుమించు అన్నిటినీ ప్రయోగిస్తూంది. వీర వియత్నాం దేశభక్తులకు వ్యతిరేకంగా 2,00,000 లకు పైగా అమెరికా సైనికులను, విమానవాహక యుద్ధనౌకలను, భారీ బాంబర్ విమానాలను, విషవాయువులను, మంటబాంబులను ఉపయోగిస్తూంది. ఈ సైనిక చర్యలను మరింత విస్తరింపజేస్తామని బెదిరిస్తూ వాషింగ్టన్‌లో బాధ్యతా రహితమైన ప్రకటనలను చేస్తున్నారు. వియత్నాంవారికి ఆహారపదార్థాలు దొరక్కుండా చేయడం కోసం, రసాయనిక పదార్థాలను ప్రయోగించి మొక్కలనూ, పంటలనూ ధ్వంసం

చేసే "కార్యక్రమం" ఒకటి తయారయి వున్నదని ఇటీవలనే అమెరికా విదేశాంగ శాఖ అధికారరీత్యా ప్రకటించింది. ఇదీ, అమెరికా సామ్రాజ్యవాదంయొక్క నిజ స్వరూపం. వియత్నాంపై దురాక్రమణతో అమెరికా, తనను తాను అప్రతిష్ఠపాలు చేసుకుంది. ఈ అపకీర్తిని అది యెన్నటికీ చెరిపివేసుకోజాలదు.

తమ దేశాన్నీ, తమ జీవితాన్నీ గౌరవాన్నీ తమ భవిష్యత్తుపై తమకు గల అధికారాన్నీ కాపాడుకోవడం కోసం పవిత్రపోరాటం సాగిస్తున్న వియత్నామ్ ప్రజల మనోనిబ్బరాన్ని, దురాక్రమణ దాడులు ఎన్ని ఘాతుకాలకు ఒడిగట్టినా సరే దెబ్బ తీయలేవు. మొక్కవోని ధైర్యసాహసాలకూ, పట్టుదలకూ, విజయం సాధించి తీరాలన్న దృఢదీక్షకూ మహోజ్జ్వలమైన ఆదర్శంగా వియత్నామ్ ప్రజల వీరోచిత ధర్మయుద్ధం చరిత్ర కెక్కుతుంది.

వియత్నామ్‌ను బలపరుస్తూ ఒక బలమైన ఉద్యమం ప్రపంచమంతటా వ్యాపిస్తూంది. నైతికంగానూ, రాజకీయంగానూ అమెరికా దురాక్రమణదారులను ఒంటరి గాళ్ళనుచేసే పరిణామక్రమం అంతకంతకు మరింత తీవ్రంగా సాగుతూంది. సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టుదేశాల సహాయమూ, అన్నిదేశాల్లోని విశాల ప్రజాసామాన్యంయొక్క సానుభూతీ, అండదండలూ, వియత్నామ్ ప్రజలకున్నాయి. వియత్నామ్ యుద్ధంపట్ల అమెరికా ప్రజల్లోకూడా నిరసన పెరుగుతూంది. ఇదంతాకూడా ప్రపంచ కార్మికవర్గంయొక్క ఉత్తమ అంతర్జాతీయతాయుత సంప్రదాయాలను పెంపొందింపజేస్తూంది.

వియత్నామ్‌పై తన దురాక్రమణను అమెరికా ఆపివేయాలనీ, అక్కడ నుండి తన సేనల నన్నిటినీ ఉపసంహరించుకోవాలనీ సోవియట్ యూనియనూ, ప్రపంచంలోని శాంతికాముక ప్రజలందరూ డిమాండు చేస్తున్నారు. అమెరికా సైనిక వర్గాలు ఈ దురాక్రమణను పక్కనున్న ఆగ్నేయ ఆసియా దేశాలకు కూడా విస్తరింపజేయ జూస్తున్నారు. అమెరికా ఈ దురాక్రమణ కొనసాగడం ప్రపంచ శాంతికి అత్యంత ప్రమాదకరమయిన ఫలితాలను చేకూర్చగలదు.

వియత్నామ్ ప్రజలపై సాగిస్తూన్న సిగ్గుమాలిన ఈ యుద్ధాన్ని గనుక వారు విస్తరింప చేసినట్లయితే, వియత్నామ్‌కు, దాని సోషలిస్టు మిత్రులూ సోదరులూ అయిన సోవియట్, తదితర దేశాల సహాయం అంతకంతకు మరింత ఎక్కువ కావడాన్ని వారు ఎదుర్కొనవలసి ఉంటుందని మనం ఖండితంగా ప్రకటిస్తున్నాము. వియత్నామ్ ప్రజలు, తమ దేశానికి తామే అధినాథులై తీరుతారు. వియత్నామ్

ప్రజాస్వామిక రిపబ్లిక్ వెలిగించిన సోషలిజమనే జ్యోతిని ఎవ్వరూ, ఎన్నటికీ ఆర్పి వేయజాలరు.

వియత్నామ్‌పై అమెరికా దురాక్రమణ సందర్భంగానూ, అమెరికా సామ్రాజ్య వాదం యొక్క ఇతర దురాక్రమణ చర్యల మూలంగానూ, అమెరికాతో మన సంబంధాలు క్షీణించాయి. ఇందుకు బాధ్యత అమెరికా పాలకవర్గాలదే.

సోవియట్ యూనియన్‌కి సంబంధించి సంతవరకు, అది అన్ని దేశాలతోనూ శాంతి కలిగి జీవించేందుకు సిద్ధంగా ఉంది. కాని, ఇతరదేశాల ప్రజలపై సామ్రాజ్య వాదబందిపోటు తనాన్ని అది సహించదు. అమెరికాతో సంబంధాలను అభివృద్ధి పరచుకొనేందుకు సిద్ధంగా ఉన్నామని మనం పదే పదే స్పష్టం చేశాము. ఈ విషయంలో మన వైఖరి మారలేదు. అయితే, ఈ సంబంధాలు అభివృద్ధి పొందాలంటే అమెరికా తన దురాక్రమణ విధానాన్ని విసర్జించాలి. దురాక్రమణ, బల ప్రయోగం అనే విషపూరిత క్షేత్రంలో శాంతియుత సహజీవనం అనే మంచి పంటను పండించడం అసంభవం. ఇతర దేశాల ప్రజల ప్రయోజనాలను బలిపెట్టి అగ్రరాజ్యాలు తమ సంబంధాలను అభివృద్ధి చేసుకోవచ్చు అనే అర్థంలేని వైఖరిని మన పార్టీ మన ప్రభుత్వము ఖండితంగా నిరాకరిస్తున్నాయి. తమ సార్వభౌమాధికారాలకూ, స్వాతంత్ర్యానికీ, ప్రాదేశిక సమగ్రతకూ మన్నన ఉండాలనే హక్కు, పెద్ద, చిన్న అనే భేదంలేకుండా అన్నిదేశాలకూ సమానంగా ఉంది. ఈ హక్కును భంగపరిచే అధికారం ఎవ్వరికీలేదు.

కామ్రేడ్స్, యూరప్ భద్రతను కాపాడడం పట్ల సోవియట్ యూనియన్ ఎంతో శ్రద్ధాసక్తులు కలిగి ఉంది. ప్రపంచ ఉద్రిక్తతను మరింత తీవ్రంచేయడంలో అమెరికాకు ఈనాడు యూరప్‌లోని ముఖ్య సహకారి పశ్చిమజర్మనీ సామ్రాజ్య వాదం. పశ్చిమజర్మనీ నానాటికి ఎక్కువగా యుద్ధప్రమాదానికి ఒక కేంద్ర మవుతూంది. పగ సాధించాలనే ఉన్మాదం అక్కడ తీవ్రస్థాయిలో చెలరేగుతూంది. దానికి అప్పుడే ఒక పెద్ద సైన్యం ఉంది. మునుపటి నాజీసైన్యానికి చెందిన సైనికోద్యోగులు ఈ సైన్యానికి వెన్నెముక. మునుపటి నాజీలూ, చివరకు యుద్ధనేరస్థులు కూడా, అనేక ముఖ్య ప్రభుత్వోద్యోగాల్లో ఉన్నారు. ఆనాడు హిట్లరుని అధికారంలోకి తీసుకువచ్చిన గుత్త పెట్టుబడిదారీ సంస్థలే ఈ నాడు, అంతకంతకు మరింత ఎక్కువగా పశ్చిమజర్మనీ విధానాన్ని నిర్ణయిస్తున్నాయి.

అణుబాంబు తమ చేతుల్లోకి రావడమే తరువాయిగా, సరిహద్దులు తుడుచుకు

పోతాయనీ, యూరప్‌ను పునర్విభజించాలని, రెండవ ప్రపంచ యుద్ధంలోని ఓటమికి పగతీర్చుకోవాలన్న తమ కోరిక నెరవేరిపోతుందనీ రైన్లాండు రాజకీయవేత్తలు ఊహించుకుంటున్నారు.

అమెరికా పాలకవర్గాలకూ, పశ్చిమ జర్మనీకీ మధ్య రూపొందుతూన్న ద్విపక్ష సైనిక ఒప్పందం శాంతికి ముప్పుతెచ్చిపెట్టే అత్యంత ప్రమాదకరమయిన విషయాల్లో ఒకటి. ఇప్పుడూ, ఇకముందూ కూడా ఈ విషయాన్ని ఏ మాత్రమూ సడలని శ్రద్ధతో గమనిస్తూనే వుంటాము.

అమెరికా, పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాదాలు చాల చిత్రమైన భాగస్వాములు. ఆ రెండూకూడా, ఒకదాని నొకటి తన పన్నాగాలకు సాధనంగా ఉపయోగించుకోవాలని చూస్తున్నాయి. ఆ రెండూకూడా, దేని ఆలోచనల ప్రకారం అది యూరప్‌లో ఉద్రిక్తతను తీవ్రంచేయ జూస్తున్నాయి. తమ పగ సాధించుకునే పథకాలను ఈ విధంగా నెరవేర్చుకోవచ్చునన్నది పశ్చిమ జర్మనీ సైనికవాదుల ఆశ. ఇది ఈడేరగల ఆశేమీ కాదనేది నిస్సందేహం. అమెరికాకు సంబంధించినంతవరకు, యుద్ధం ముగిసి 20 సంవత్సరాలు గడచిపోయిన తరువాతకూడా యూరప్‌లో తన సేనలనూ, యుద్ధస్థావరాలనూ ఉంచుకోడానికీ, పశ్చిమ యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలపైనీ, విధానాలపైనీ ప్రత్యక్షంగా తన ప్రభావాన్ని ప్రసరించగల సాధనాలను ఆ విధంగాకలిగి ఉండడానికీ వీలు కలిగించే సాకుకోసం అది చూస్తూంది.

యూరప్‌లో అమెరికా సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు పశ్చిమ జర్మనీ విధేయతతో సేవచేస్తూనే ఉంటుందనీ, అవసరంవస్తే యుద్ధకూపంలోకి పశ్చిమ జర్మనీవారినే ముందుగా పడదోయవచ్చుననీ అమెరికా పాలకుల నమ్మకం. ఈలోగా, తన ప్రతీకార పథకాల్లో అమెరికానూ, ఉత్తర అట్లాంటిక్ కూటమి భాగస్వాములనూ మరింత ఎక్కువగా ఇరికించాలని పశ్చిమ జర్మనీ ప్రభుత్వం చూస్తూంది. తద్వారా రెండవ ప్రపంచ యుద్ధ ఫలితాల్లో తనకు అనుకూలమైన మార్పును సాధించుకోవాలన్నది దాని ఉద్దేశం. సోవియట్ యూనియన్‌కీ, తక్కిన సోషలిస్టు దేశాలకూ, శాంతికీ, యూరప్ భద్రతకూ, యావత్తు ప్రపంచం భద్రతకూ వ్యతిరేకంగానే ఈ పథకాల నన్నిటినీ ఉద్దేశించారన్న విషయాన్ని గ్రహించడం కష్టమేమీ కాదు.

పశ్చిమ జర్మనీ ప్రతీకారవాదుల దురుద్దేశాలవల్ల ఏర్పడుతూన్న ప్రమాదాన్ని యూరప్ దేశాల ప్రజలు బాగా గుర్తిస్తున్నారు. ఒక అర్థశతాబ్దం కాలంలో

అనేక యూరప్ దేశాలు రెండుసార్లు జర్మన్ దురాక్రమణకు గురిఅయ్యాయి. జర్మన్ సైనికవాదుల బందిపోటు పద్ధతులు మనలాగానే ఎనిమిది సోషలిస్టు దేశాల ప్రజలకు బాగా తెలుసు. జర్మన్ ఆక్రమణ బాధలను పశ్చిమ యూరప్‌లోని అధిక సంఖ్యాక దేశాల ప్రజలు అనుభవించారు. అందుచేత మరొక యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా పోరాటం సాగించడం, యూరప్ దేశాలన్నిటి యొక్క ప్రజలకు కూనాడు అతిప్రధాన విషయ మయింది. పశ్చిమ జర్మనీ ప్రభుత్వపు కజ్జాకోరు విధానాలను ఆదేశంలోనే నానాటికి ఎక్కువమంది ప్రజలు ఖండిస్తున్నారు.

పశ్చిమ జర్మనీ ప్రభుత్వం దురాక్రమణపూరిత ప్రతీకార విధానాన్ని కొన సాగించడానికే నిశ్చయించుకుందన్న విషయాన్ని, ఇటీవల క్రిస్టియన్ డెమో క్రాటిక్ యూనియన్ మహాసభలో పశ్చిమ జర్మనీ ప్రధాని చేసిన ప్రసంగం తేట తెల్లం చేస్తూంది. ముఖ్యమయిన అంతర్జాతీయసమస్యలపై పశ్చిమజర్మనీ ప్రభుత్వం సోవియట్ మొదలయిన కొన్ని దేశాల ప్రభుత్వాలకు చేసిన ప్రతిపాదనలుకూడా యీ విషయాన్ని స్పష్టపరుస్తున్నాయి.

యూరప్‌లోని నేటి బలాబలాల పరిస్థితి రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాబోయే ముందు ఉన్నట్లు ఎంతమాత్రమూ లేదు. యూరప్‌దేశాల ప్రస్తుత సరి హద్దులను మార్చడం ఎవరితరమూ కాదు. తమ అమెరికా మిత్రుల భుజాలెక్కినా కూడా పశ్చిమజర్మనీ సామ్రాజ్యవాదులు ఎత్తు ఏమీ ఎదిగిపోరు. అక్కడ నుండి కిందకు కూలినప్పుడు గాయపడతారు – అంతే. ఒక మహాబలోపేతమైన, అజేయ మైన శక్తి ఈనాడు దురాక్రమణదారులను ఎదుర్కొని నిలిచి ఉంది. వారు యుద్ధాన్నే గనుక తెచ్చిపెట్టినట్లయితే అది వారికి సర్వనాశనాన్ని తప్ప మరేమి చేకూర్చదు.

వార్సా సంధి దేశాలు ఈ విషయమై 1965 జనవరిలో ఏకగ్రీవంగా గట్టి హెచ్చరిక చేశాయి. అణ్వాయుధాలను పశ్చిమ జర్మనీ సైనికతత్త్వవాదుల అందు బాటులోకి తేవడానికి వ్యతిరేకంగా సాగుతూన్న పోరాటంలో సోవియటు యూని యనూ, మన మిత్రదేశాలూ తీసుకున్న ఒక ముఖ్యమైన చర్య ఈ హెచ్చరిక.

పశ్చిమ జర్మనీ సైనికతత్త్వవాదులు అణ్వాయుధాలను సమకూర్చుకోడానికి మన మెన్నటికీ సమ్మతించము: దాని నెన్నటికీ సహించము. ఎంత వ్యతిరేకించి నప్పటికీ కూడా ఒకవేళ అదేగనుక జరిగినట్లయితే, అందుకు తగిన చర్యలను తీసుకుంటాము. అందుకు బాధ్యత అంతా పశ్చిమ జర్మనీ పాలకవర్గాలవే, వారిని

ప్రోత్సహిస్తున్న వారిదే అవుతుంది. జర్మనీ తన యిరుగు పొరుగు దేశాలకు తిరిగి యెన్నటికీ ప్రమాదం కలిగించకుండా నివారించడానికీ, ప్రపంచమంతటా శాంతిని పదిలపరిచేందుకూ అవసరమయినదంతా చేయాలని, నాజీ దురాక్రమణ దారుల ఓటమి తరువాత, హిట్లరు వ్యతిరేక సమ్మేళనంలోని భాగస్వాములయిన సోవియటు యూనియన్, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు పోట్స్‌డామ్ ఒడంబడికలో చేసిన పవిత్రమైన వాగ్దానాన్ని విస్మరించేగల హక్కు ఎవరికీ లేదు. ఈ వాగ్దానాన్ని సోవియటు యూనియన్ సర్వదా పాటిస్తుంది.

మనమిత్ర దేశమూ, మనతో సైనికఒప్పందం గలదేశమూ, జర్మన్ శ్రామిక ప్రజల తొలి సోషలిస్టు రాజ్యమూ అయిన జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్, యూరప్ నడిగడ్డ మీద శాంతిని అప్రమత్తతో కాపాడుతూంది. ఈ వాస్తవ విషయానికి మన మెంతో విలువ ఇస్తున్నాము. పోట్స్‌డామ్ ఒడంబడికలోని శాంతికాముక, ప్రజా స్వామిక సూత్రాలనది ఆచరణలో పెట్టింది. శాంతి విధానాన్ని నికరంగా అనుస రిస్తూంది. యూరప్‌లో భద్రతను పటిష్ఠం చేయాలని కోరుతూంది.

క్రామేడ్స్, యూరప్‌లో సోషలిస్టు దేశాల కుటుంబం స్థానాలిప్పుడు మొత్తం మీద బలంగానూ, నమ్మకోదగినవిగానూ ఉన్నాయి. ప్రపంచ మంతటా సోషలి జాన్ని పటిష్ఠం చేసేందుకూ, అన్ని దేశాల ప్రజల భద్రతను సాధించేందుకు దోహద కరమైన ఒకముఖ్య విషయమిది.

యూరప్‌లో అమెరికా, పశ్చిమ జర్మనీ సామ్రాజ్యవాదుల కజ్జాకోరు, ప్రతీకారవాద విధానానికి ప్రతిచర్యగా, యూరప్ భద్రతనూ పటిష్ఠం చేయాలి. యూరప్ దేశాలన్నిటిమధ్యా శాంతియుతము, పరస్పరం లాభదాయకము అయిన సహకార సంబంధాలేర్పడాలి అని సోవియట్ యూనియన్ నికరంగా ప్రతిపాది స్తూంది.

దురాక్రమణదారుని అరికట్టడమూ, మరొక ప్రపంచ యుద్ధాన్ని నివారించ డమూ సాధ్యమని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం చేసిన నిర్ధారణ ఇప్పటికీ చెల్లుతుందనేదే మన దృఢ విశ్వాసం. అయితే, ఈ అవకాశాన్ని యధార్థమూ, విస్తృతమూచేయాలంటే, ఈ పోరాటంలో ప్రజాసామాన్యం పాల్గొనాలి. శాంతిశక్తు లన్నీ శక్తివంతంగా, నానాటికి మరింత ఉధృతంగా కార్యాచరణకు పూనుకోవాలి. శాంతి ఉద్యమమూ, కార్మిక, మహిళా, యువజనసంఘాలూ, తదితర ప్రజాతంత్ర సంస్థలూ తమ కార్యకలాపాలను ద్విగుణీకృతం చేయాలి.

శాంతి సంరక్షణలో సోషలిస్టు దేశాలు ప్రత్యేక పాత్రను నిర్వహిస్తాయి. ఈ విషయం మనకు బాగా తెలుసు. ఆ కారణం చేతనే మనదేశంయొక్క రక్షణపాట వాన్ని పెంపొందించడం పట్ల తక్కిన సోషలిస్టు దేశాలతో మన సైనిక ఒప్పం దాన్ని పటిష్టం చేయడంపట్ల సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ అంతులేని శ్రద్ధాసక్తులను చూపుతూంది.శాంతి శత్రువులకు తంత్రాల విషయమై సోవియట్ ప్రజలు నిరంతరం అప్రమత్తులై ఉండేలా చూడటం తన కర్తవ్యంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ పరిగణిస్తూంది. శాంతిని భంగపరిచేందుకే గనుక శత్రువు ప్రయ త్నిస్తే, ఏమరు పాటుగా మనపై పడేందుకు వారికి ఎన్నటికీ అవకాశం లేకుండా చేయడానికీ, వెనువెంటనే వారికి కఠినమైన ప్రతీకారం జరగడం తథ్య మైన ట్లేందుకూ అవసరమైన చర్యలన్నీ తీసుకొంటూంది.

కామ్రేడ్స్, సామ్రాజ్యవాదుల దురాక్రమణ విధానాన్ని బట్టబయలు చేస్తూన్న సమయంలోనే మనం, విభిన్న సామాజిక వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవన విధానాన్ని నికరంగానూ, అచంచలంగానూ అనుసరిస్తున్నాము. అంటే అర్థం, విభిన్న సామాజిక వ్యవస్థల మధ్య శాంతియుత సహజీవనాన్ని సోషలిస్టు, పెట్టుబడిదారీ వ్యవస్థలమధ్య వర్గ పోరాటరూపాల్లో ఒకటిగా పరిగణిస్తూనే పెట్టు బడిదారీ దేశాలతో మామూలు శాంతియుత సంబంధాలను పెట్టుకోవాలనీ, దేశాల మధ్యఉన్న సమస్యలను యుద్ధంద్వారా కాకుండా సంప్రతింపులద్వారా పరిష్కరించు కోవాలనీ, సోవియట్ యూనియన్ నికరంగా కోరుతూందన్న మాట. ఏ దేశం యొక్క అంతరంగిక వ్యవహారాల్లోనూ జోక్యం కలిగించుకోకూడదనీ, వాటి సార్వ భౌమాధికారాలనూ, ప్రాదేశిక సమగ్రతనూ గౌరవించాలనేదే సోవియట్ యూని యన్ దృఢ వైఖరి.

పెట్టుబడిదారీ దేశాల్లోగాని, వలసదేశాల్లోగాని సాగే వర్గపోరాటాల, జాతీయ విముక్తి పోరాటాల అంతర్గత పరిణామ క్రమాలకు సంబంధించిన విషయాల్లో మాత్రం శాంతియుత సహజీవనం అసంభవమని వేరే చెప్పనక్కరలేదు. పీడకులకు పీడితులకూ, వలసపాలకులకు, వారి పీడనకు గురి అయిన వారికి మధ్యగల సంబం ధాలకు శాంతియుత సహజీవనం వర్తించదు.

పెట్టుబడిదారీ దేశాలతో సోవియటు యూనియనుకుగల సంబంధాల విష యంలో, ఈ సంబంధాలు శాంతియుతంగా ఉండాలని మాత్రమేకాకుండా, ఆర్థిక, విజ్ఞానశాస్త్ర, సాంస్కృతిక రంగాల్లో అత్యంత విస్తృతమైన, ఉభయపక్షాలకూ

లాభదాయకమైన పరస్పర సంబంధాలుకూడా వీటిలో భాగంగా ఉండాలనికూడా మనం కోరుతున్నాము.

ఇప్పుడు సమీక్షిస్తూన్న దశలో మన శాంతికాముక విధానం గణనీయమైన విజయం సాధించిందని ఈ మహాసభలో మనం సంతృప్తితో చెప్పుకోవచ్చు. అత్యధిక దేశాలతో సోవియటు యూనియనుకు చక్కని సంబంధాలున్నాయి.

ఇరుగుపొరుగు దేశాలతో సంబంధాలకు సోవియట్ యూనియన్ ఎల్లప్పుడూ అత్యంత ప్రాధాన్యం ఇస్తుంది. మన ఇరుగుపొరుగు సత్సంబంధాల విధానం ఉపయోగకరమయిన ఫలితాలను చేకూర్చిందని తెలపడానికి సంతోషిస్తున్నాము. ఫిన్లాండు, ఆఫ్ఘనిస్థాన్ దేశాలతో మన సంబంధాలు విశ్వాసము, స్నేహము, పరస్పర సహకారాలతో కూడుకొని ఉన్నాయి. స్కాండినేవియా దేశాలతో సంబంధాలు మరింత అభివృద్ధి చెందడానికి ఆటంకాలు లేవని అనడానికి అవకాశం లేక పోయినప్పటికీ, ఆ దేశాలతో మామూలు సంబంధాలు రూపొందుతున్నాయి. టర్కీ, ఇరాన్ దేశాలలో సోవియట్ యూనియన్ సంబంధాలు ఇటీవలి సంవత్సరాల్లో కొంత మెరుగుకావడం పట్ల సోవియట్ ప్రజలు హర్షం తెలుపుతున్నారు.

భారత, పాకిస్తాన్ లాంటి ప్రధాన ఆసియా దేశాలతో సంబంధాలను అభివృద్ధి చేసుకోవడం పట్ల సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ ఎంతో శ్రద్ధ కనబరిచాయి, ఇక ముందు కూడా కనబరుస్తాయి. ఆ దేశాలను ఇందుముందు మన పొరుగు దేశాలుగానే పరిగణించవచ్చు. భారత దేశంతోనూ, భారత మహా ప్రజలతోనూ సంప్రదాయ సిద్ధమై, కాలంయొక్క పరీక్షలకు తట్టుకొని నిలబడిన మన మైత్రి, ఇప్పుడు సమీక్షిస్తున్న ఈ దశలో మరింత పటిష్టమయింది. పాకిస్తానుతో మన సంబంధాలు కొంత అభివృద్ధి చెందాయి.

సోవియటు ప్రభుత్వ ప్రతిపాదనను అనుసరించి, భారత, పాకిస్తాన్ నాయకుల మధ్య, తాష్కెంటు సమావేశం జరగడమూ అందులో సోవియటు ప్రధాని పాల్గొనడమూ, ప్రపంచ వ్యాప్త ప్రాధాన్యంగల సంఘటన. ఈ సమావేశం జరగడం, అది సాధించిన ఫలితాలు, ప్రపంచ ప్రజాభిప్రాయం ఆ ఫలితాలను నిర్మాణాత్మకంగా అంచనా వేయడం – ఇవన్నీ కూడా, సోవియటు యూనియన్ శాంతికాముక విదేశాంగ విధానం పట్ల దేశదేశాల ప్రజలకు గల గొప్ప విశ్వాసాన్ని వేనోళ్ళ చాటుతున్నాయి.

ఇండోనీషియాతో స్నేహపూర్వక సంబంధాలను పెంపొందించుకోవాలనే

సోవియట్ యూనియన్ ఎల్లప్పుడూ అభిలషించింది. ప్రపంచదేశాల ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి ఇండోనేషియా విప్లవం గణనీయమైన దోహదం చేకూర్చింది. స్వాతంత్ర్యాభ్యుదయాలకోసం సుదీర్ఘంగా సాగిన తీవ్ర పోరాటంలో సాధించుకున్న విజయాలు పదిలంగావుండి, మరింత పెంపొందేలా చూచుకొనేందుకు, సాహసవంతులయిన ఇండోనేషియా ప్రజలకు సర్వ హక్కులూ వున్నాయి.

మనపట్ల స్నేహభావం కల కాంబోడియా, తన స్వాతంత్ర్యాన్ని, తాటస్థ్యాన్ని, ప్రాదేశిక సమగ్రతనూ కాపాడుకొని, పటిష్ఠం చేసుకొనేందుకు సాగిస్తూన్న న్యాయమైన పోరాటాన్ని సోవియటు యూనియన్ బలపరుస్తూంది.

ఫ్రాన్సుతో మన సంబంధాలు గణనీయంగా అభివృద్ధిచెందాయి. ఇదొక సత్పరిణామం. కొన్ని ప్రధాన అంతర్జాతీయ సమస్యల విషయంలో ఉభయ దేశాల ప్రయోజనాలూ ఒకటే కావడమూ, ఉభయ దేశాలమధ్య దీర్ఘకాల స్నేహ సంప్రదాయమూ ఇందుకు కారణం. సోవియట్ - ఫ్రెంచి సంబంధాలను మరింత పెంపొందించడం, యూరప్ భద్రతను పటిష్ఠం చేసేందుకు తోడ్పడే ఒక ముఖ్యమైన పరిణామం కాగలదు.

ఇటీవలి సంవత్సరాల్లో, ఇటలీలాంటి ఒక ప్రధానమైన యూరప్‌దేశంతో మన సంబంధాలు, ముఖ్యంగా ఆర్థికరంగంలో మెరుగుకావడం ప్రారంభించాయి. ఈ సంబంధాలను అభివృద్ధిపరచుకునేందుకు మనం సిద్ధంగానే వున్నాము.

సోవియట్ – బ్రిటిష్ సంబంధాలు క్రమానుగతం కావడం, ఎంతో ఉపయోగకరంగా ఉండేదనడం నిస్సందేహం. బ్రిటిష్ విదేశాంగ విధానం ఇందుకు ఎంతవరకు అవకాశం ఇస్తుందో భవిష్యత్తు నిరూపిస్తుంది

జపానుతో మన సంబంధాలు ఇటీవల కొంత పురోగమించాయన్న విషయాన్ని మనం గమనించ గలము. ఆ దేశంతో, పరస్పరం లాభదాయకమైన ఆర్థిక సంబంధాలను మనం పెంపొందించు కుంటున్నాము. కాని, సోవియట్ సరిహద్దుల సరసనే జపాను భూభాగం మీద అమెరికా సేనలూ, యుద్ధస్థావరాలూ ఉన్నవన్న వాస్తవాన్ని మనం దృష్టిలోకి తీసుకోకుండా ఉండలేము. జపాను, అమెరికా ప్రభుత్వ కీలుబొమ్మ అయిన దక్షిణకొరియా ప్రభుత్వమూ ఇటీవల ఒక సైనిక ఒప్పందముపై సంతకాలు చేశాయి. దీనిని మనం తీవ్రంగా ఖండిస్తున్నాము. జపానుతో మన సంబంధాలు అభివృద్ధికావడానికి ఇవన్నీకూడా నిస్సందేహంగా ఆటంకాలుగా ఉన్నాయి.

ఇతరదేశాల భూభాగాల మీదున్న విదేశీ సైనిక స్థావరాలను తొలగించడమూ, ఆ భూభాగాలనుండి విదేశీసైన్యాలను ఉపసంహరించడమూ, ఇంతకు ముందూ, ఇప్పుడూ కూడా ఒక ముఖ్యమైన అంతర్జాతీయ సమస్యగానే ఉన్నాయి. సామ్రాజ్య వాదదేశాలు, ముఖ్యంగా అమెరికా, ప్రపంచమంతటా అసంఖ్యాకంగా సైనిక స్థావరాలను నెలకొల్పాయి. ఇతర దేశాల భూభాగాలమీద తమ సాయుధ సైనిక దళాలను నిలిపాయి. శాంతికి విరుద్ధమైన ప్రయోజనాలకు దోహదంచేకూర్చుకోడానికీ, శాంతికాముక దేశాలపై ఒత్తిడి తీసుకు వచ్చేందుకు సాధనాలుగానూ, తరుచుగా వాటి అంతరంగిక వ్యవహారాలలో ప్రత్యక్ష సాయుధ జోక్యం కోసమూ ఈ స్థావరాలనూ, సాయుధబలాలనూ ఉపయోగిస్తున్నాయి. దేశ దేశాల శాంతి భద్రతలకు ప్రమాదకరంగా ఉన్న ఈ పరిస్థితిని అంతమొందించి, విదేశాల్లోని సైనిక స్థావరాలను తొలగించి, అక్కడి విదేశీ ఆయుధ బలాలను ఉపసంహరించ వలసిన సమయం వచ్చిందని సోవియట్ యూనియన్ భావిస్తూంది. ప్రపంచశాంతి భద్రతలను పటిష్టం చేయటం కోసం దీనిని సాధించడం లక్ష్యంగాగల విధానాన్ని మనం ఇక ముందు కూడా అనుసరించి తీరుతాము.

సామ్రాజ్యవాదులు ప్రారంభించిన ఆయుధపోటీని మందగింపజేసి, పూర్తిగా ఆగిపోయేలా చేయటంకోసమూ, ఈ విషయమై ఆచరణయుక్తమైన చర్యలు – సంపూర్ణ సార్వత్రిక నిరాయుధీకరణవైపు ముందంజవేయగల చర్యలను గురించి ఒడంబడికను సాధించేందుకూ, సోవియట్ యూనియన్ నిరంతరమైన పోరాటాన్ని సాగిస్తూంది. ఇది ఒక్క సోవియట్ ప్రజల ముఖ్యప్రయోజనాలకు మాత్రమే కాకుండా, అన్ని దేశాల విశాల ప్రజాసామాన్యంయొక్క ముఖ్యప్రయోజనాలకు కూడా దోహదకరమైన పోరాటం. ఈ సమస్యల విషయంలో సోవియట్ విధానాన్ని అనేకదేశాలు అవగాహన చేసుకున్నాయి. బలపరుస్తున్నాయి.

ప్రస్తుతం సమీక్షిస్తున్న ఈ దశలో సోవియట్ యూనియన్ ఐక్యరాజ్య సమితి కార్యకలాపాల్లో చొరవతో పాల్గొన్నది. అనేక నూతన స్వతంత్రదేశాలను ఐక్యరాజ్యసమితి సభ్యులుగా చేర్చుకోవడంతో, ఆ సంస్థలోని పరిస్థితి చాల మారిపోయింది. ఈ మార్పు సామ్రాజ్యవాదులకు అనుకూలమైనది ఎంతమాత్రమూ కాదు. దురాక్రమణను వ్యతిరేకించే దేశాల ఐక్యతకు తోడ్పడేందుకూ విశ్వశాంతి కోసమూ, ప్రపంచ దేశాల ప్రజల స్వాతంత్ర్యంకోసమూ సాగుతూన్న పోరాటంలో ఐక్యరాజ్య సమితి నిర్వహించే పాత్రను ఆ విధంగా ఇనుమడింపజేసేందుకూ,

ఆ సంస్థలో సోవియటు యూనియన్ అచంచలంగా కృషిచేస్తూంది. సోవియటు యూనియన్ చొరవ ఫలితంగా, ఇటీవలి ఐక్యరాజ్య సమితి సర్వసభ్య మహాసభ, దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో విదేశీ జోక్యాన్నీ, అణ్వాయుధాల వ్యాప్తినీ వ్యతిరేకిస్తూ ముఖ్యమైన తీర్మానాలు చేసింది. దురాక్రమణకు వ్యతిరేకంగానూ, అన్నిదేశాల ప్రజల శాంతిభద్రతలకోసమూ, క్రియాత్మకంగా సాగే రాజకీయ పోరాటానికి రంగస్థలంగా ఐక్యరాజ్యసమితిని మనం ఇకముందుకూడా పరిగణిస్తూనే ఉంటాము.

అంతర్జాతీయ పరిస్థితిని మెరుగు పరచేందుకు, శాంతి పటిష్ఠతకు, దేశాలమధ్య శాంతియుత సహజీవనాన్ని పెంపొందించేందుకు సాగుతూన్న పోరాటంలోని ప్రస్తుత దశలో ఈ దిగువ కర్తవ్యాల నిర్వహణ అతి ముఖ్యమని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ పరిగణిస్తూంది.

వియత్నాంపై అమెరికా దురాక్రమణను అంతమొందించడము. దక్షిణ వియత్నామునుంచి అమెరికా మొదలయినదేశాల సేనల ఉపసంహారం, తమ ఆంతరంగిక వ్యవహారాలను తామే నిర్ణయించుకోగల అవకాశాన్ని వియత్నాము ప్రజలకు కలిగించడము; వియత్నాం సమస్యా పరిష్కారానికి ప్రాతిపదికగా వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్ ప్రభుత్వమూ, దక్షిణ వియత్నాం జాతీయ విముక్తిసంఘటనా చేసిన ప్రతిపాదనలకు అంగీకరించేలా చేయడము;

ఇతర దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకో కూడదన్న సూత్రం ఖచ్చితంగా అమలు జరిగేలా చూడడము;

అణ్వాయుధాలు వ్యాపించకుండా చేసేందుకు అంతర్జాతీయ ఒప్పందంపై సంతకాలు; పశ్చిమ జర్మనీ అణ్వాయుధాలను సమకూర్చుకునే సమస్యకాని, ఏరూపంలోనూ అణ్వాయుధాలు దానికి అందుబాటులోకి రాగల సమస్యగాని అసలు లేకుండా చేయటము; ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో అణ్వస్త్ర రహిత మండలాలను ఏర్పాటు చేయాలన్న దేశదేశాల ప్రజావాంఛను అమలు పరచడము; తామైముందుగా అణ్వాయుధాలను ఉపయోగించబోమని అణ్వస్త్ర దేశాలనుండి పవిత్రమైన వాగ్దానాన్ని సాధించడము; భూగర్భ అణ్వాయుధ పరీక్షలనుకూడా నిషేధించే ఒడంబడికపై సంతకాలు - అణుయుద్ధ నివారణకై ఉద్దేశించిన ఈ చర్యలను అమలు

జరపడం, అణ్వాయుధాల సంపూర్ణ నిషేధమూ, విధ్వంసనలపై మరికొంత పురోగమనానికి మార్గం ఏర్పరచ గలదు.

యూరప్ భద్రతను గురించి చర్చలను ప్రారంభించడము. యూరప్‌లో సైనిక ఉద్రిక్తతను సడలించేందుకూ, ఆయుధ బలాలను తగ్గించేందుకూ, యూరప్ దేశాలన్నిటి మధ్య శాంతియుత, పరస్పరం లాభదాయకమైన సంబంధాలను పెంపొందించేందుకూ సోషలిస్టు దేశాలూ, మరికొన్ని ఇతర దేశాలూ చేసిన ప్రతిపాదనలపై చర్చ జరిగేలా చేయడము; ఇందుకై సముచితమైన అంతర్జాతీయ సమావేశాన్ని జరిపించడము: యూరప్‌లో రెండవ ప్రపంచ యుద్ధ అవశేషాలను పూర్తిగా నిర్మూలించడం కోసం, ఉభయ జర్మనీలతో సహా యూరప్‌దేశాల ప్రస్తుత సరిహద్దులను గుర్తించడం ద్వారా, జర్మనీ సమస్యకు శాంతియుత పరిష్కారం అన్నది యూరప్ భద్రతకు సంబంధించిన అతిముఖ్య సమస్యలలో ఒకటి. దీని పరిష్కార మార్గాల అన్వేషణను కొనసాగించడము.

ఇవీ మన ప్రతిపాదనలు. వీటిలో చాల వాటిని యిదివరకే చేశాము. ఇవి సర్వసమగ్రమని మన మేమీ అనుకోవడంలేదు. అంతర్జాతీయ పరిస్థితిని మెరుగుపరచడమూ, శాంతిని పటిష్ఠంచేయడమూ లక్ష్యం గాగల ఇతర ప్రతిపాదనలన్నిటినీ కూడా అత్యంత శ్రద్ధగా పరిశీలించేందుకు సిద్ధంగా వున్నాము.

కామ్రేడ్స్ ప్రతినిధులారా! అంతర్జాతీయ రంగంలో మనదేశం స్థానం సుస్థిరంగావున్నదని ఉద్ఘాటించేందుకు మనకు పూర్తి ఆధారాలున్నాయి. కమ్యూనిస్టుపార్టీ, సోవియటు యూనియన్ ప్రభుత్వమూ అనుసరిస్తూన్న శాంతికాముక విదేశాంగ విధానం, కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణ ప్రయోజనాలనూ, ప్రపంచ శాంతిభద్రతలను పరిరక్షించి, పటిష్ఠం చేయాలనే ఆశయానికీ విశ్వసనీయంగా ఉపకరిస్తూంది. పరీక్షలో నెగ్గుదేరిన ఈ పంథానే సోవియటు కమ్యూనిస్టుపార్టీ ఇకముందుకూడా అనుసరిస్తుంది.

నవసమాజ నిర్మాణంలో మనదేశం ఎంత వేగంగా ముందుకుపోతే, మన అంతర్జాతీయ కర్తవ్యాలు అంత జయప్రదంగా నెరవేరుతాయి. కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణ పతాకాన్ని ప్రపంచంలో ఎగురవేసిన మొట్టమొదటి దేశం, చరిత్ర అభీష్టానుసారం సోవియట్ల దేశమే అయింది. సోవియటు ప్రజలు, తమ లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంకింద ఈ విజయ పతాకను సమోన్నతంగా, సగౌరవంగా నిలిపి వుంచుతారు.

## II

# కమ్యూనిస్టు వ్యవస్థకు పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించేందుకై పార్టీ కృషి

కామ్రేడ్స్, మీ అనుమతితో, నేనిప్పుడు దేశ ఆంతరంగిక పరిస్థితిని గురించి మీకు స్థూలంగా తెలుపుకొంటాను. ఆర్థికాభివృద్ధి రంగంలో మన పార్టీ విధానమూ, కార్యకలాపాలను గురించి మహాసభకు నివేదించుకుంటాను.

కమ్యూనిస్టు వ్యవస్థకు పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించాలని మన కార్యక్రమంలో నిర్దేశించిన ప్రధాన లక్ష్యాన్ని నెరవేర్చడమే, కేంద్రకమిటీలో ఆర్థిక వ్యవహారాలకు బాధ్యత వహించే నాయకత్వ సంకల్పం.

ఈ కర్తవ్య నిర్వహణలో ఒక ముఖ్యఘట్టమయిన సప్తవర్షప్రణాళిక పూర్తి అయిన సమయంలో ఈ మహాసభ జరుగుతూంది. అందుచేత విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగల్లో సాధించిన విజయాల సహాయంతో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ మరింత పెంపొందింది, పటిష్ఠమయిన ఈ దశలోని అతి ముఖ్యమయిన ఫలితాలను గురించి క్లుప్తంగా నివేదించేందుకు అనుమతించండి.

మొత్తం జాతీయ వస్తూత్పత్తిలో సరకుల నిలవలకూ వాడకానికీ వినియోగించబడినది గత ఏడేళ్లలోనూ 53 శాతం పెరిగింది. పారిశ్రామిక వస్తూత్పత్తి 84 శాతం పెరిగింది. ఆర్థిక వ్యవస్థయొక్క ఆస్తులు 92 శాతం పెరిగాయి. పారిశ్రామిక సంస్థలు. నిర్ణీత లక్ష్యాలను మించి 46,000 మిల్లియన్ల రూబుళ్ల. మేరకు అదనంగా ఉత్పత్తి సాధించాయి. నూనె. ఖనిజవాయువు, ఇనుము, ఇనుముకలపనిలోహాలు, రసాయనిక ముడిపదార్థాలు, తదితర ఖనిజాల నిక్షేపాలను కొత్తవాటిని కనిపెట్టడమూ పారిశ్రామికంగా వాటిని వినియోగంలోకి తీసుకురావడమూ జరిగింది. ఇంధన, విద్యుచ్ఛక్తి పరిశ్రమలు ఇనుము, ఉక్కు పరిశ్రమలు విస్తరించాయి. భారీపరిశ్రమల్లోని ముఖ్యశాఖలు ఈ అన్ని సంవత్సరాల్లోనూ క్రమంగా పెంపొందాయి. ఆహారపదార్థా , గృహోపకరణాల, సాంస్కృతిక పరికరాల ఉత్పత్తికూడా గణనీయంగా పెరిగింది.

గడచిన దశలో, దేశాభివృద్ధి రంగంలో సాధించిన ఫలితాలకు సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ, సోవియటు ప్రజలు యావన్మందీ సంతృప్తి

చెందడం పూర్తిగా సకారణమే. ఈ సంవత్సరాల్లో మన దేశం తన ఆర్థిక, రక్షణ పాటవాన్ని పెంచుకుంది. ఉపమానముగా చెప్పాలంటే, దాని పొడవూ, బలమూ పెరిగాయి. ఛాతీ విశాలమయింది.

సప్తవర్ష ప్రణాళికను ప్రారంభించినప్పుడు మనకు గల ఆర్థిక, రక్షణ పటుత్వాలను సమకూర్చు కోడానికి 40 సంవత్సరాలపాటు, యుద్ధకాలాన్ని మినహాయిస్తే 32 సంవత్సరాలపాటు, సోవియటు ప్రజలు శ్రమించ వలసి వచ్చింది. పార్టీ నాయకత్వంకింద మన శ్రామిక ప్రజానీకం ఈ ఏడేళ్ళలోనూ ఉత్పాదక మూలసంపదలను ఇంచుమించు రెండింతలు పెంచారు. ముప్పైరెండు సంవత్సరాలూ, ఏడేళ్ళు - మన ఆర్థికాభివృద్ధి వేగం ఎంతగా పెరిగిందో ఇది నిరూపిస్తుంది.

కామ్రేడ్స్, దేశభక్తియుత మహాయుద్ధంలో సోవియటు సాధించిన విజయం యొక్క 20 వ వార్షికోత్సవాన్ని మన దేశం, ఈ ఏడేళ్ళలోని కడపటి ఏడాదిలో జరుపుకుంది. ఈ సందర్భంలో ఈ దిగువ విషయాలను జ్ఞాపకం చేయడం మంచిది. యుద్ధం ప్రారంభం కాబోయే ముందు 1940 లో మనం 18.3 మిల్లియన్ టన్నుల ఉక్కు, 13.1 మిల్లియన్ టన్నుల ఉక్కు సమకూర్చి, 31.1 మిల్లియన్ టన్నుల నూనె, 5.7 మిల్లియన్ టన్నుల సిమెంటు, 1,45,400 మోటారు వాహనాలు, 31,600 ట్రాక్టర్లు, 48,300 మిల్లియన్ కిలోవాటు గంటల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేశాము. మహాక్రూరుడైన శత్రువును ఎదుర్కొనేందుకు మన ప్రజలు సన్నద్ధమయినప్పుడు వారివద్ద ఉన్నదంతా ఇంతే.

యుద్ధంలో మనకు భయంకరమైన నష్టాలు కలిగాయి. ఇరవై మిల్లియన్లకు పైగా సోవియటు ప్రజలు చనిపోయారు. పశ్చిమ సరిహద్దు మొదలుకుని ఓల్గానది వరకు గల సువిశాలమైన భూభాగంలో సమస్తమూ - వేలకొలది పట్టణాలూ, పల్లెలూ, వేలకొలది ఫ్యాక్టరీలు, కర్మాగారాలూ, గనులూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ, పాఠశాలలు, నివాస భవనాలు - శిధిలమయి పోయాయి. ఈ విధంగా ధ్వంసమయిపోయిన వాటినన్నిటినీ పునరుద్ధరించేందుకు అనేక దశాబ్దాలు పడుతుందని పించింది.

కాని, పార్టీ నాయకత్వం కింద సోవియటు ప్రజలు శ్రామిక వీరత్వం ప్రదర్శించి మహాద్భుతాలనే సాధించారు. విజయసాధన యొక్క 20 వ వార్షికోత్సవ సంవత్సరమూ, సప్తవర్ష ప్రణాళికలోని కడపటి సంవత్సరమూ అయిన 1965 లో మన పారిశ్రామిక రంగం 1940 లో కన్నా 5 రెట్లుఉక్కు, ఇంచుమించు 5.5రెట్లు

ఉక్కు సరకులు, సుమారు 8 రెట్లు నూనె, ఇంచుమించు 13 రెట్లు సిమెంటు, 4.2 రెట్లు మోటారు వాహనాలు, 11 రెట్లకు పైగా ట్రాక్టర్లు, 10.5 రెట్లు విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేస్తూంది.

దీనిపై వ్యాఖ్యానం అవసరమా? మన ప్రజలు సాధించిన విజయాలు నిజంగా మహాద్భుతాలు!

మన దేశంయొక్క ఉత్పాదకశక్తుల అభివృద్ధితోపాటుగా, సోషలిస్టు పౌర సంబంధాలు కూడా మెరుగయ్యాయి. మన సామాజిక వ్యవస్థ బలమూ, సుస్థిరతా మరింత పెరిగాయి. సోషలిస్టు ఆస్తియొక్క రెండు రూపాలూ - యావన్మంది ప్రజల ఆస్తి, వ్యవసాయ క్షేత్రాల, సహకారసంస్థల ఆస్తి - మరింత బలపడ్డాయి. దేశ సామాజిక సంపదా శ్రామికప్రజల ఆదాయాలూ పెరిగాయి. వేతనాల వ్యవస్థ లోని లోపాలను సవరించేందుకూ, జాతీయ ఆర్థిక వ్యవస్థకు చెందిన అన్ని శాఖ ల్లోనూ శ్రమకు ప్రతిఫలాన్ని పెంచేందుకూ ముఖ్యమయిన చర్యలు అమలు జరి గాయి. ప్రరిశమల నిర్వహణలో ప్రజాస్వామిక సూత్రాలను విస్తృతం చేయడం జరిగింది.

ఈ దశలో కార్మికుల సంఖ్య 14 మిల్లియన్లూ, ప్రవీణుల, ఆఫీసు పనివారల సంఖ్య 7 మిల్లియన్లూ పెరిగాయి. కార్మికుల సంఖ్య పెరగడం, మనదేశంలోని పారి శ్రామికాభివృద్ధి వేగాన్ని ప్రతిబింబిస్తుంది. మన సమాజంలోని అత్యంత అభివృద్ధి కాముకమూ, నిర్మాణ బద్ధమూ అయిన వర్గం కార్మికవర్గం. దాని పాత్ర మరింత పెరుగుతున్నదనేందుమా, ఆ కారణంచేత సోషలిస్టు వ్యవస్థ సుస్థిరతకు కూడా అది నిదర్శనం. ఫ్యాక్టరీ, ఆఫీసు, వృత్తిపనివారూ, వారి కుటుంబాలూ కలిసి ఈనాడు సోవియట్ యూనియన్ జనభాలో 75.4 శాతం ఉన్నారు. తక్కిన 24.6 శాతం వ్యవసాయక్షేత్రం రైతాంగం. కార్మికవర్గానికీ, సమిష్టివ్యవసాయక్షేత్ర కర్షక వర్గానికి మధ్య ఉన్న సోదరమైత్రి, యావన్మంది సోవియటు ప్రజల సమైక్యతను తధ్య మొనర్చుతూంది.

పార్టీయొక్క నిర్మాణ, చైతన్య ప్రబోధకపాత్రా, మహత్తరమైన శ్రామిక విజయాల సాధనకు ప్రజలను ఉత్తేజపరచగల దాని సామర్థ్యమూ, సప్తవర్ష ప్రణాళికను అమలుజరపడంలో మరొసారి ప్రదర్శితమయ్యాయి.

కామ్రేడ్స్, సోవియటు కమ్యూనిస్టుపార్టీ 21వ మహాసభ అనంతరం మాస్కో, లెనిన్‌గ్రాడ్ పౌరులూ, యూరల్, సైబీరియా, ఉక్రైన్, బైలో రష్యా

లోని శ్రామిక ప్రజానీకమూ, అన్ని యూనియన్ రిపబ్లిక్కుల్లోని కార్మికులూ సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులూ, మేధావులూ పార్టీ పిలుపు నందుకొని, బ్రహ్మాండమైన ఒక కొత్త ఆర్థిక విజృంభణను సాధించేందుకు పోటీలు ఏర్పాటు చేసుకున్నారన్న విషయం మీకు జ్ఞాపకం వుంటుంది.

కార్మికులూ, ఇంజనీయర్లూ, సాంకేతిక నిపుణులూ, పారిశ్రామిక రవాణా సంస్థల్లోని ఆఫీసు పనివారూ, తమ దీక్షాపూరిత శ్రమద్వారా మన దేశ ఆర్థికశక్తిని మరింత పెంపొందించారు. దేశాన్ని పారిశ్రామికంగా మరింత ఉన్నత స్థాయికి చేర్చారు.

సమష్టి వ్యవసాయక్షేత్ర రైతులూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్ర కార్మికులూ వ్యవసాయ శాస్త్ర నిపుణులూ, పశుపోషణ నిపుణులూ, కష్టపడి పనిచేశారు. వారు చిక్కులను అధిగమించారు. ప్రజలకు ఆహారము, పరిశ్రమలకు ముడి సరకుల సప్లయిలను ఖాయమొనర్చేందుకై దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి ఎను వంతు దోహదం చేకూర్చారు.

భవన నిర్మాణ కార్మికులు వేలకొలది ఫ్యాక్టరీలనూ, కర్మాగారాలనూ, లక్షలకొలది నివాసభవనాలనూ, పాఠశాలలను, ఆసుపత్రులను నిర్మించారు.

విజ్ఞానశాస్త్రవేత్తలు, ఇంజనీయర్లు, సాంస్కృతిక రంగంలోని పనివారు, సోవియటు మేధావులు యావన్మందికూడా, తమ నిర్మాణాత్మక శ్రమద్వారా, సోవియటు ప్రజల సృజనాత్మక కృషిలో క్రియాపూర్వకంగా పాల్గొంటున్నారు.

ఉత్పత్తి రంగంలోని ప్రోగాము కార్మికులకూ, కొత్త కొత్త పద్ధతులను కనిపెట్టిన వారికీ, కార్మికవర్గం యావన్మందికీ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర కర్షక వర్గానికీ, మన మేధావులకూ యావన్మంది సోవియటు ప్రజలకూ, వారు సాధించిన అద్భుత "శ్రామిక విజయాలకై" ఈ మహాసభ తరఫున హృదయ పూర్వక అభి నందనలను అందజేసేందుకు నాకు అనుమతి ఇవ్వవలసిందిగా కోరుతున్నాను!

సోవియటు యూనియన్ ఆర్థిక వ్యవస్థ ఇటీవలి సంవత్సరాల్లో ఎంతో పురో గమించింది. దాని అభివృద్ధి క్రమంలో సాధించిన నిర్వివాదమైన విషయాలు కొన్ని ఉన్నాయి. ఇది వాలామంచి సంగతే, కాని, లోపాలను గమనించకుండా ఉండవద్దూ, వాటిని సహించి ఊరుకోవటమూ మన పార్టీ సంప్రదాయం కాదు.

సప్తవర్ష ప్రణాళికలోని కొన్నిముఖ్య లక్ష్యాలను, కొన్ని కారణాలచేత మనం సాధించలేక పోయాము. ఆ కారణాలను గురించి తమరివాటి ముచ్చటించు

కుందాము. ప్రధానంగా వ్యవసాయ రంగం విషయంలో అలా జరిగింది. ఆ రంగంలో ఉత్పత్తి 14 శాతం మాత్రమే పెరిగింది. వ్యవసాయకోత్పత్తిలో ఈ మందకొడితనం, మన పురోగమనాన్ని కుంటుపరచ నారంభించింది. ఆహార, లఘు పరిశ్రమల అభివృద్ధి వేగంపై దుష్ప్రభావాన్ని ప్రసరించింది. ప్రజల జీవన స్థాయిని పెంచేందుకు నిర్ణయించుకున్న చర్యలు పూర్తిగా అమలు జరగకుండా ఆటంకం కలిగించింది.

భారీపారిశ్రామిక రంగంలోని కొన్ని శాఖల్లో కొన్ని హెచ్చుతగ్గులు బయట పడ్డాయి. కొన్ని రసాయనిక సరకులు, బొగ్గు, యంత్రాలు, యంత్రపరికరాలు, కొన్ని వాడకం సరకులు — వీటి విషయంలో సప్తవర్ష ప్రణాళిక లక్ష్యాలు పూర్తిగా నెరవేరలేదు. పారిశ్రామిక రంగంలోని కొన్ని శాఖల్లో కొత్తగా నిర్మించిన సంస్థల్లో. నిర్ణీత సమయానికి ఉత్పత్తిని ప్రారంభించినది అన్నీ కాదు. ఇలా నిర్మించిన సంస్థల్లో అనేకం, ప్రణాళికలో నిర్ణయించిన ఉత్పాదక శక్తిని సాధించలేదు. దీని ఫలితంగా, జాతీయాదాయం పెరుగుదలవేగం, సప్తవర్షప్రణాళికలో తలపెట్టిన దానికన్నా తక్కువయింది.

కామ్రేడ్స్, ప్రస్తుతం సమీక్షిస్తున్న దశ, సప్తవర్ష ప్రణాళికను అమలు జరపడంలోనూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం నిర్దేశించిన కర్తవ్యాల నిర్వహణలోనూ ఒకముఖ్యమైన ఘట్టం. ఆ కారణంచేత, పార్టీ 22 వ, 23 వ మహాసభల మధ్య కాలంలో ఆర్థికాభివృద్ధి రంగంలో పార్టీ కార్యక్రమం గురించీ, మన ఆర్థిక వ్యవస్థ మరింత అభివృద్ధి చెందేందుకు గల అవకాశాలను గురించీ, ఎక్కువ వివరంగా నివేదించేందుకు అనుమతించండి. 1960 వ సంవత్సరం వరకు సంబంధించిన లెక్కలు క్రితం మహాసభకు సమర్పించిన నివేదికలో ఉన్నాయి కాబట్టి, 1961–65 దశకు సంబంధించిన ముఖ్య సూచీలను పరిశీలించుదాము. గత అయిదేళ్ళ ఫలితాలను, రాబోయే అయిదేళ్ళ విషయంలో ఇచ్చిన ఆదేశాలతో మరింత స్పష్టంగా పోల్చిచూచేందుకు ఇది తోడ్పడుతుంది.

## పారిశ్రామిక నిర్మాణ రంగాలు.

ఇప్పుడు సమీక్షిస్తున్న దశలో సోషలిస్టు పారిశ్రామిక రంగం ఘనవిజయాలను సాధించింది. గత అయిదేళ్ళలోనూ జరిగిన పారిశ్రామిక ఉత్పత్తి పెరుగుదలకు సంబంధించిన ప్రధానమైన అంకెలను పరిశీలిస్తే ఇది స్పష్టమవుతుంది.

# పారిశ్రామిక ఉత్పత్తి పెరుగుదల

| | 1960 | 1965 | 1960 లెక్కను 1965 శాతం |
|---|---|---|---|
| మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి (వేల మిల్లియన్ల రూబుళ్ళలో) | 155 | 234 | 151 |
| విద్యుచ్ఛక్తి (వేల మిల్లియన్ల కిలోవాట్ గంటల్లో) | 292 | 507 | 173 |
| నూనె (మిల్లియన్ల టన్నుల్లో) | 148 | 243 | 164 |
| ఇంధన వాయువు (వేల మిల్లియన్ల క్యూబిక్ మీటర్లలో) | 47 | 129 | 274 |
| బొగ్గు (మిల్లియన్ల టన్నుల్లో) | 510 | 578 | 113 |
| ఉక్కు (మిల్లియన్ల టన్నుల్లో) | 65 | 91 | 139 |
| ఉక్కు సరకులు (మిల్లియన్ల టన్నుల్లో) | 51 | 71 | 139 |
| ఇంజనియరింగ్, లోహపు సరకుల పరిశ్రమల ఉత్పత్తి (వేల మిల్లియన్ల రూబుళ్ళలో) | 34 | 61 | 179 |
| అన్నిరకాల వస్త్రాలు (వేల మిల్లియన్ల మీటర్లలో) | 8.2 | 9.1 | 111 |
| తోలుతో చేసిన పాదరక్షలు (మిల్లియన్ల జతల్లో) | 419 | 486 | 116 |
| పంచదార (మిల్లియన్ల టన్నుల్లో) | 6.4 | 11 | 173 |
| శుభ్రపరచి, బంగీచేసిన మాంసం (మిల్లియన్ల టన్నుల్లో) | 4.4 | 5.2 | 118 |
| వెన్న (వేల టన్నుల్లో) | 737 | 1,073 | 146 |
| వనస్పతి (వేల టన్నుల్లో) | 1,586 | 2,770 | 175 |
| చేపలు, తిమింగిలాలు, సముద్ర జంతువులు, సముద్రములోని పదార్థాలతోచేసిన ఆహారపదార్థాలు (మిల్లియన్ల టన్నుల్లో) | 8.5 | 5.8 | 163 |

ప్రస్తుతం సమీక్షిస్తున్న దశలో పారిశ్రామిక ఉత్పత్తి పరిమాణంలో గణనీయమైన పెరుగుదలను సాధించడం జరిగిందనీ, ప్రత్యేకంగా ప్రధాన శాఖల్లో యిది జరిగిందనీ పై అంకెలనుబట్టి విశదమవుతుంది. సామాజిక వస్తూత్పత్తి గత అయిదేళ్ళలోనూ 35 శాతం పెరిగింది. మొత్తం పారిశ్రామిక వస్తూత్పత్తి 50 శాతం పెరిగింది. గత అయిదేళ్ళలోనూ పారిశ్రామిక ఉత్పత్తి 79,000 మిలియన్ల రూబుళ్ళ మేరకు పెరిగింది. యుద్ధానికి పూర్వపు పంచవర్ష ప్రణాళికలన్నింటిలో జరిగిన పెరుగుదలకు ఇది మూడురెట్లుకన్నా అధికం.

ప్రపంచ పారిశ్రామిక వస్తూత్పత్తిలో సోవియట్ యూనియన్ వంతు క్రమంగా పెరుగుతూంది. 1965 లో ప్రపంచ పారిశ్రామిక ఉత్పత్తిలో అయిదో వంతు సోవియట్ యూనియన్‌ది. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాబోయే ముందు ఇందులో సోవియట్‌వంతు పదోవంతు కన్నా తక్కువ. సోవియట్ యూనియన్ జనాభా ప్రపంచ జనాభాలో 7 శాతం మాత్రమే అన్న విషయాన్ని కూడా తెలియజేయవలసి వుంది. అత్యధిక అభివృద్ధి సాధించిన పెట్టుబడిదారీ దేశాల్లోని తలసరి వస్తూత్పత్తిని మించిపోవాలని పార్టీ నిర్దేశించిన కర్తవ్యాన్ని నెరవేర్చడం క్రమంగా సాగుతూంది. సోవియట్ యూనియన్, అమెరికా దేశాల పారిశ్రామిక ఉత్పత్తులమధ్య స్థాయీభేదం తగ్గిపోతూంది.

మన సోషలిస్టు వ్యవస్థలో ప్రగాఢమైన గుణాత్మక మార్పులూ, బ్రహ్మాండమైన పరిమాణాత్మక మార్పులూ జరిగాయి. విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక రంగాల్లో సాధించిన ప్రగతి, ఉత్పత్తి రంగంలో అనేక సరికొత్త శాఖలను సృష్టించింది. దేశ ఆర్థిక వ్యవస్థలోని కొన్ని శాఖలకు కొత్తయంత్ర సామగ్రిని సమకూర్చడం జరిగింది. రకరకాల యంత్రాలకూ, యంత్ర సామగ్రికి ఇతర పరికరాలకూ చాల వాటికి రూపకల్పనచేశారు. వాటి ఉత్పత్తికూడా సాగుతూంది. వీటిలో అనేకం అసాధారణమైనవి. ప్రపంచంలో అటువంటివి అవే మొదటివి. సాంకేతికాభివృద్ధి వల్లనూ, ఉత్పత్తిని యాంత్రిక కృతమూ, స్వయంచాలకమూ చేయడం వల్లనూ, పారిశ్రామిక రంగంలో శ్రామిక ఉత్పాదక శక్తి. గత అయిదేళ్ళలో 25 శాతం పెరగడం సాధ్యమయింది.

రవాణా సౌకర్యాల సాంకేతిక పునర్నిర్మాణం విస్తృతస్థాయిలో కొనసాగుతూంది. నిరుడు రైళ్ళల్లో జరిగిన మొత్తం సరకు రవాణాలో 85 శాతం ఎలక్ట్రిక్, డీసిల్ రైళ్ల ద్వారా జరిగింది. ఎక్కువ బరువును మోసుకొని చాల వేగంగా పయ

నించగల విమానాలూ, భారీ మోటారు వాహనాలూ, నౌకలూ, నానాటికి మరింత పెద్ద సంఖ్యలో లభ్యమవుతున్నాయి. సుదూర ప్రాంతాలకు నూనె, ఇంధన వాయువు గొట్టాల నిర్మాణం పెద్ద ఎత్తున సాగుతూంది. వాటి మొత్తం పొడవు ఇప్పుడు 70,100 కిలోమీటర్లకు పైబడి ఉంది. చాల గొప్ప నిర్మాణ కార్యక్రమ మొకటి పూర్తి అయింది. 1961 - 65 మధ్య కాలంలో ఆర్థిక వ్యవస్థలో పెట్టిన పెట్టుబడి 2,11,000 మిలియన్ల రూబుళ్లు. అంతకుముందు గడచిన పదేళ్లలోనూ పెట్టిన మొత్తం పెట్టుబడికి ఇది ఇంచు మించుగా సమానం.

ఇంత బ్రహ్మాండమైన స్థాయిలో నిర్మాణ కార్యక్రమాన్ని మన దేశం ఇదివరకెన్నడూ ఎరుగదు. సోవియటు యూనియన్ నాలుగు మూలల నుండి వచ్చిన కామ్రేడ్సు ఇక్కడవున్నారు. "మాస్కో మొదలుకొని మారుమూల సరిహద్దులవరకు" అని ఒక పాటలో అన్నట్లు, సర్వే సర్వత్రా ఫ్యాక్టరీలను, విద్యుత్ కేంద్రాలనూ, నివాస భవనాలను, పట్టణాలకు పట్టణాలను, రైలు మార్గాలను నూనె గొట్టాలను నిర్మించడంలో నిమగ్నులై ఉన్నారన్న విషయాన్ని మీరు ధ్రువపరచగలరు. ఒక్క మాటలో చెప్పాలంటే, దేశంలోని అనంతమైన భూభాగంలో ఎంతదూరం పయనించినా, ఎటు చూచినా నిర్మాణం సాగుతూన్న ప్రాంతాలే ప్రత్యక్ష మవుతాయి. ఇది ఈ నాడు మన దేశానికి మచ్చు తునకలాంటి దృశ్యం.

యూనియన్ రిపబ్లిక్కుల్లో ప్రతి ఒక్కదాన్ని ఆర్థిక వ్యవస్థా, మొత్తం సోవియటు యూనియన్ ఆర్థిక వ్యవస్థలో భాగంగా, జయప్రదంగా అభివృద్ధి పొందుతూనే ఉంది. రష్యన్ ఫెడరేషన్, యుక్రెన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్, బైలో రష్యన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్‌లు తమ తమ ఉత్పత్తి ప్రణాళికలను పూర్తిచేశాయి. అయిదేళ్లలో వాటి పారిశ్రామిక వస్తూత్పత్తి, వరుసక్రమంలో 45, 53, 64 శాతం పెరిగింది. జార్జియా, అజర్‌బైజాన్, ఆర్మీనియా, మాల్డేవియా రిపబ్లిక్కుల్లో ఉత్పత్తి పెరుగుతూ వచ్చింది. ఈ అయిదేళ్లలోనూ తుర్క్‌మీనియాలో 34 శాతమూ, ఉజ్బెకిస్తాన్‌లో 50 శాతమూ, తజికిస్తాన్‌లో 54 శాతమూ, కజక్‌స్తాన్‌లో 63 శాతమూ, కిర్ఘిజియాలో 67 శాతమూ, ఉత్పత్తి పెరిగింది. లిథువేనియా, లాత్వియా, ఇస్తోనేయాల్లో పారిశ్రామిక ఉత్పత్తి మొత్తం దేశంలోని సగటు పెరుగుదల వేగంకన్నా ఎక్కువ వేగంగా పెరిగింది. ఈ రిపబ్లిక్కుల్లో సోవియటు ప్రభుత్వ వ్యవస్థ పునఃస్థాపన 25 వ వార్షికోత్సవాన్ని ఇటీవలనే యావత్తు దేశమూ, జరుపుకుంది.

కాంగ్రెస్, దేశం మొత్తంమీదా, ప్రత్యేకంగా ప్రతిఒక్క రిపబ్లిక్‌లోనూ కూడా మన పారిశ్రామిక రంగం గత ఐదేళ్లలోనూ మరింత అభివృద్ధి చెందింది. నాణ్యతను పెంచుకుంది. యూనియన్ రిపబ్లిక్కుల మధ్య ఆర్థిక సంబంధాలూ, పరస్పర సహాయమూ ఇంకా ఎక్కువగా విస్తృత మైనాయి.

సోషలిస్టు నిర్మాణం సందర్భంలో సాధించుకొని దృఢపరచుకున్న యూనియన్ రిపబ్లిక్కుల రాజకీయ సరిసమానత్వము సోవియట్ యూనియన్ జాతులన్నిటి మైత్రి, వాటి ఆర్థికాభివృద్ధిని కూడా సరిసమానం చేయడంతో మరింత బలపడ్డాయి. ఇది చాలముఖ్యమయిన విషయం. కాంగ్రెస్, జాతులకు సంబంధించిన లెనిన్ విధానం యొక్క మహత్తరశక్తి ఇందులో స్పష్టంగా ప్రదర్శితమవుతూంది. ఆర్థిక, తదితర వెనుకబాటు తనాన్ని త్వరగా అధిగమించి, అభివృద్ధి చెందిన, బాగా పారిశ్రామిక వంతమయిన జాతులుగా రూపొందేందుకు అన్ని జాతుల ప్రజలకూ నమ్మకమయిన మార్గాలను ఏర్పరచ గలది సోషలిజమ్ ఒక్కటే అని, ఆ విధానం యావత్తు ప్రపంచానికీ నిరూపించింది. మన బహుళ జాతుల మహాదేశంలోని అన్ని జాతుల సమైక్యత మరింత దృఢ మయేందుకు ఇది నమ్మకమయిన పునాది.

ఆర్థికాభివృద్ధిని పరిశీలించేటప్పుడు, మనం చేసిన పనిలోని మంచితోపాటు, లోపాలను గురించికూడా ప్రస్తావించడం అవసరం. కొన్నిశాఖల్లో ఉత్పత్తి పెరుగుదల వేగమూ, శ్రామిక ఉత్పాదక శక్తి పెరుగుదల వేగమూ తగ్గడం, స్థిరాస్తులనూ పెట్టుబడులనూ ఉపయోగించుకోవడంలో సామర్థ్యం తగ్గడం వంటి లోపాలు ఇటీవలి సంవత్సరాల్లో ప్రదర్శితమనాయి. సవిమర్శక దృష్టి లేనిది సరియయిన మదింపు అసంభవం. అది లేనప్పుడు మన అభివృద్ధి తగ్గుతుంది.

1964 అక్టోబరు విస్తృత సమావేశానంతరం ఆర్థిక వ్యవస్థలో వున్న పరిస్థితులను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ పరిశీలించింది. ఈ లోపాలకు కారణాలను బయటపెట్టింది. వాటిని తొలగించుకొనేందుకు మార్గాలను సూచించింది.

మేనేజిమెంటులోనూ, ప్రణాళికలను రూపొందించడంలోనూ లోపాలు, ఆర్థిక వ్యవస్థను లాభసాటిగా నడిపే పద్ధతులను తక్కువ అంచనావేయడం, భౌతిక, నైతిక ప్రోత్సాహకాలను తక్కువగా ఉపయోగించడం – ఇవన్నీకూడా ఆయా శాఖల్లో ఉత్పత్తి పెరుగుదల వేగం మందగించడానికి తోడ్పడ్డాయి. మేనేజి

మెంటు, ప్రణాళికారచన, ఆర్థిక ప్రోత్సాహకాల వినియోగం విషయాల్లో మొన్న మొన్నటివరకు అనుసరించిన రూపాలు, పద్ధతులు, దేశంలో ఉత్పాదక శక్తుల నూతన ఉన్నతస్థాయికి అనుగుణమైనవి కావు. వీటి పెరుగుదలను అవి నిరోధించ నారంభించాయి కూడా.

1963, 1965 సంవత్సరాల్లో పంటలు దెబ్బతినడం ఆర్థిక వ్యవస్థపై ప్రత్యేకంగా శ్రామిక ప్రజల జీవనస్థాయి పెరుగుదలపై, ప్రతికూలప్రభావం కలిగించింది. అంతర్జాతీయ పరిస్థితి అంతకంతకు మరింత జటిలం కావడాన్ని కూడా నిర్లక్ష్యం చేయడానికి వీల్లేదు. అమెరికా సామ్రాజ్యవాదుల దురాక్రమణ చర్యల ఫలితంగా, మన దేశ రక్షణలను మరింత బలపరచడంకోసం అదనంగా, కొంత పెద్ద మొత్తంనే ధనం కేటాయించడం తప్పనిసరి అయింది.

సప్తవర్ష ప్రణాళికను సవివరంగా రూపొందించడంలో స్వీయాత్మక దృక్పథం ఫలితంగా కొన్ని తప్పు అంచనాలు జరిగాయి. కొన్ని లక్ష్యాలను మరీ పెద్దవిగా రూపొందించడమూ జరిగింది. ఈ విషయాన్ని ఒప్పుకొనక తప్పదు. పారిశ్రామిక రంగంలోని కొన్ని శాఖల్లో ఉత్పత్తి పెరుగుదల విషయమై చేసిన నిర్ణయాలు, అన్ని సందర్భాల్లోనూ వాస్తవ అవకాశాలకు అనుగుణంగా ఉన్న వేమీ కాదు.

ప్రాంతీయ ప్రాతిపదికపై ఏర్పాటు చేసిన పరిశ్రమల మేనేజిమెంటు వ్యవస్థ, పారిశ్రామిక రంగం శాఖల నాయకత్వాన్ని అసంఖ్యాకమున్న ఆర్థిక మండలాల్లో చెల్లాచెదరు చేసింది. సాంకేతిక విషయాల్లో ఒకే విధంగా అమలు జరగ వలసిన విధానాన్ని భంగ పరచడం జరిగింది. పరిశోధక సంస్థలకూ, ఉత్పత్తికీ సంబంధం లేకుండాపోయింది. కొత్తకొత్త యంత్రాలను రూపొందించడమూ, పనిలో పెట్టడమూ దీనివల్ల కుంటువడింది.

విడివిడిగా, పాక్షికంగా తప్పులు సరిదిద్దుకోవడం, కమ్యూనిస్టు నిర్మాణ ప్రయోజనాలకూ, ఇప్పుడేర్పడిన చిక్కులను అధిగమించేందుకు చాలదు. దేశంలో సృష్టించిన బ్రహ్మాండమైన ఉత్పాదక శక్తులు ఇంకా ఎక్కువ ఫలప్రదంగా వినియోగం కావడాన్ని తథ్యమొనర్చగల చర్యలతో కూడిన ఒక వ్యవస్థను రూపొందించడమూ, ప్రజల జీవనస్థాయిని త్వరగా పెంచడమూ, మన వ్యవస్థవల్ల చేకూరే మేలును పూర్తిగా వెల్లడి చేయడమూ ఇందుకు అవసరం.

అక్టోబరు విస్తృతసమావేశానంతరం, మన సమాజంలోని ఆర్థిక సంబం

ధాలను మెరుగు పరచడం, ఆర్థిక మేనేజిమెంటు, ప్రణాళిక రూపకల్పన, ఉత్పత్తి ప్రోత్సాహకాలకు సంబంధించిన వ్యవస్థను నిర్దుష్టం చేయడం అనేమూల సమస్యల పై పార్టీ కేంద్ర కమిటీ తన దృష్టి కేంద్రీకరించింది. 1965 మార్చి సెప్టెంబరు మాసాల్లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశాల్లో ఆర్థిక వ్యవహారాల మేనేజిమెంటుపట్ల ఒక కొత్తదృక్పథాన్ని రూపొందించడమూ, పరిణామక్రమంలో మనం ఉన్న ప్రస్తుత దశలో పార్టీ అనుసరించవలసిన ఆర్థిక విధానసూత్రాలను నిర్వచించడమూ జరిగింది. జాతీయ ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో పొదుపు పద్ధతులకూ, ప్రోత్సాహకాలకూ మరింత ఎక్కువ పాత్రను ఇవ్వడము. ఫ్యాక్టరీలకూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకూ ఎక్కువ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, చొరవనూ ఇస్తూ ప్రభుత్వ ప్రణాళికలను సమగ్రంగా మెరుగు పరచడము. తాము చేసేపనికి ఫ్యాక్టరీ సిబ్బందిని మరింత జవాబు దారిగా చేయడము, ఆ పని ఫలితాలపట్ల వారికి భౌతికంగా ఎక్కువ ఆసక్తిని కలిగించడము. – ఇవీ ఈ సూత్రాలు.

ఈ ఆర్థిక విధానాన్ని అనుసరించడం సాంకేతిక ప్రగతి వేగాన్ని మరింత పెంచేందుకూ సామాజిక ఉత్పత్తిలో ఎక్కువ సామర్థ్యానికీ, ఉత్పాదక శక్తుల పెరుగుదలకూ అవసరమయిన పరిస్థితులు ఏర్పడేందుకు దోహదం చేస్తూవుంటుంది.

పారిశ్రామిక రంగం శాఖల నాయకత్వాన్ని మెరుగుపరచడం కోసమూ, శాస్త్రీయ, సాంకేతిక ప్రగతిని వేగం చేసేందుకూ కేంద్రంలోనూ, యూనియన్ రిపబ్లిక్కుల్లోనూ మంత్రిత్వశాఖల్లోను ఏర్పాటు చేసిన విషయం మీకు జ్ఞాపకం ఉంటుంది. ఆయా శాఖల్లోని పరిస్థితులనూ, ఉత్పత్తిలో ఉన్నతమైన సాంకేతిక స్థాయిని సాధించేందుకూ, పారిశ్రామిక సరకుల విషయంలో దేశ అవసరాలను తీర్చేందుకూ; ఆర్థిక సంస్కరణలను అమలు జరిపేందుకూ వాటిని జవాబు దారీ చేయడం జరిగింది.

యూనియన్ రిపబ్లిక్కుల, ఫ్యాక్టరీల, వివిధ సంస్థల హక్కులు గణనీయంగా పెరగడంతోనూ, నాయకత్వంలో పొదుపు పద్ధతులను పటిష్టం చేయడంతోనూ, పరిశ్రమల శాఖల్లో ఏర్పడిన ఈ కేంద్రీకృత మేనేజిమెంటు చక్కగా మేళవిస్తుంది. పరిశ్రమల మేనేజిమెంటుకి సంబంధించిన కొత్త వ్యవస్థవల్ల కలిగే లాభం ఇది. సంకుచితమైన డిపార్టుమెంటు దృక్పథం మునుపటి మంత్రిత్వశాఖలో

తరుచుగా కనిపించినలోపం. ఈ లోపాన్ని పునరుద్ధరించవద్దని ఇప్పటి మంత్రిత్వ శాఖల్లో పనిచేస్తున్న వారిని హెచ్చరిస్తున్నాము.

ప్రణాళిక, ఆర్థిక ప్రోత్సాహకాలకు సంబంధించిన కొత్త వ్యవస్థను పూర్తిగా అమలుజరపడం విషయంలో జరుగవలసినది యింకా ఎంతో ఉంది. రాబోయే కొద్ది సంవత్సరాల్లో నెరవేర్చవలసిన అతి ముఖ్యమైన కర్తవ్యాల్లో ఇదొకటి.

కామ్రేడ్స్ మన అధికారుల, ఇంజనీయర్ల, సాంకేతిక నిపుణుల చొరవ, సూక్ష్మబుద్ధి, వెసులుబాటుతనం మీదా, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన చిక్కుల సమస్యల పరిష్కారంపట్ల సాహసోపేతమైన వైఖరిమీదా, ప్రణాళికలను పూర్తి చేసేందుకూ, ఉత్పత్తిలో అత్యధిక సాఫల్యతను సాధించేందుకూ ఫ్యాక్టరీ సిబ్బందులను సమీకరించగల సామర్థ్యంపైనే, మన ఆశయ విజయం ఇప్పుడు చాలవరకు ఆధారపడి వుంది.

సోషలిస్టు నిర్మాణంలో ఎంతో అనుభవమూ, రాజకీయ పరిపక్వతా కలిగి ఆర్థిక వ్యవస్థలో పనిచేస్తూన్న పార్టీ సంస్థలూ, కార్యకర్తలూ, ఫ్యాక్టరీల డైరెక్టర్లూ, కర్మాగారాల, డిపార్టుమెంటుల మేనేజర్లు - వీరందరూ కూడా శాస్త్రవేత్తలు, ఇంజనీయర్లు, సాంకేతిక నిపుణులతో సన్నిహిత సంబంధాలు కలిగి, పార్టీ నిర్దేశించిన కర్తవ్యాలను పూర్తిగా నెరవేర్చ గలుగుతారనేందుకు మనకు సందేహంలేదు.

మార్చి, సెప్టెంబరు విస్తృత సమావేశాల నిర్ణయాలపై విదేశాల్లో ఎక్కువగా వ్యాఖ్యానాలు జరిగాయి. మన మిత్రులు వాటిని సరిగానే అంచనా వేశారు. మన శత్రువులు, మామూలుగానే వాటికి వక్రభాష్యాలు కల్పించ ప్రయత్నిస్తున్నారు. సోవియట్ ఆర్థిక వ్యవస్థలో "సంక్షోభం" అంటూ అభివృద్ధి నిరోధక బూర్జువా పత్రికలు ఇటీవల బోరెత్తేటంత ఊహాగానం సాగించాయి. ఆర్థిక రంగంలో ఇటీవల మనం తీసుకున్న చర్యలు సోషలిజమ్ నుంచి తిరోగమించడమే అని కూడా కొందరు కలలు కన్నారు.

దీనిని గురించి ఏమనాలి?

ఇవి ఆద్యంతమూ హాస్యాస్పదమైన వ్యాఖ్యానాలు. ఉత్పత్తి సాధనాలపై ప్రజల యాజమాన్యమే మనకు దృఢమైన పునాదిగా ఎల్లప్పుడూ ఉంటూ వచ్చిందని, ఇకముందుకూడా ఉంటుందని, ఎవరికైనా స్పష్టంగా కనిపించే విషయమే. మన

ఆర్థిక వ్యవస్థలో ప్రణాళికా సూత్రాన్ని కొనసాగించడమేకాదు, దానినింకా మెరుగు పరుస్తున్నాము కూడా.

ఆర్థిక వ్యవస్థలో కేంద్రీకృత ప్రణాళికా నాయకత్వాన్ని పటిష్ఠం చేయడాన్ని ఇప్పుడు, ఆయా సంస్థల చొరవనూ, స్వతంత్ర కార్యాచరణనూ మరింత పెంపొందించడంతో జోడించడం జరిగింది. అంటే అర్థం, ఆర్థిక వ్యవస్థ మేనేజిమెంటులో సోషలిస్టు సూత్రాలను అమలుపరచడం మరింత నిపుణంగానూ, సమర్థవంతంగానూ జరుగుతున్నదన్నమాట. సోషలిస్టు సామాజిక వ్యవస్థ, పరిమాణాన్ని నాణ్యాన్ని బట్టి శ్రమకు ప్రతిఫలం అనే సూత్రాన్ని అనుసరించేది కనుక, ఆర్థిక, పాదార్థిక ప్రోత్సాహకాలు పనిచేయడమూ, దేశ ఆర్థిక జీవన నిర్వహణలో మిగిలియున్న కొలది ప్రజలను భాగస్వాములను చేయడమూ, ఇందులో తప్పకుండా ఉండాలి. ఒక సోషలిస్టు సంస్థ ఉత్పత్తిచేసే సరకులు, ఆ సంస్థ సిబ్బంది యావత్తూ కలిసి జరిపిన కృషిఫలితం. కాబట్టి వ్యక్తిగత శ్రమనుబట్టి ప్రతిఒక్క కార్మికునికీ భౌతిక ప్రోత్సాహకాలను ఇవ్వడంతోబాటు, ఫ్యాక్టరీ పనియొక్క తుది ఫలితాలపట్ల యావత్తు సిబ్బందికీ భౌతిక ఆసక్తి కలిగించడం పూర్తిగా సక్రమమైనదే. వ్యక్తిగత ప్రయోజనాలనూ, పౌర ప్రయోజనాలనూ మరింత పరిపూర్తిగా సమ్మిళితం చేయడం దీనివల్ల సాధ్యమవుతుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ మార్చి, సెప్టెంబరు విస్తృతసమావేశాల నిర్ణయాలను, సోవియట్ ప్రజలు యావన్మంది ఏకగ్రీవంగా బలపరిచారు. మన దేశ ఆర్థిక రంగ నాయకత్వాన్ని మెరుగు పరచేందుకు ఈ విస్తృత సమావేశాలు రూపొందించినచర్యలను ఈ 23వ మహాసభ ప్రతినిధులు కూడా ఆమోదిస్తారని ఆశిస్తున్నాము. కామ్రేడ్స్, కొత్తపంచవర్ష ప్రణాళికను గురించిన ఆదేశాలను కూడా మన మహాసభ పరిశీలించి, ఆమోదించవలసివుంది. దానినిగురించి కామ్రేడ్ ఏ. యన్. కొసిగిన్ నివేదికను సమర్పిస్తారు. కాబట్టి, ఆ ప్రణాళిక ప్రధానాంశాలను గురించి మాత్రమే ప్రస్తావించేందుకు నాకు అనుమతిని ఇవ్వవలసిందిగా కోరుతున్నాను. కొత్తపంచవర్ష ప్రణాళికకు ప్రాతిపదికగా ఉపయోగించడం అవసరమని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ పరిగణించిన మౌలిక భావాలనూ, రాజకీయ ప్రతిపాదనలనూ ప్రతిబింబించే అంశాలివి.

కమ్యూనిజానికి పాదార్థిక. సాంకేతిక ప్రాతిపదికను నిర్మించేందుకు సోవియట్ ప్రజలు సాగిస్తున్న కృషిలో 1966 – '70 పంచవర్ష ప్రణాళిక

మరొక ముఖ్యమైన ఘట్టమని, ప్రప్రథమంగా పేర్కొనడం అవసరం. కొత్త పంచవర్ష ప్రణాళిక ప్రధాన కర్తవ్యాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ నిర్వచించింది పారిశ్రామికరంగంలో ఇంకా చాల ఎక్కువ అభివృద్ధినీ, వ్యవసాయరంగంలో అధికమూ, సుస్థిరమూ అయిన అభివృద్ధి వేగాన్నీ ఖాయమొనర్చేందుకూ, తత్ఫలితంగా ప్రజల జీవనస్థాయిలో గణనీయమైన పెరుగుదలనూ, సోవియట్ ప్రజలందరి భౌతిక, సాంస్కృతిక అవసరాలను మరింత పరిపూర్తిగా తీర్చడాన్ని సాధించేందుకూ విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లోని విజయాలనూ, సామాజిక ఉత్పత్తి యావత్తూ పారిశ్రామికరంగం అభివృద్ధికావడాన్నీ, అది మరింత ఎక్కువ ఫలప్రదం కావడాన్నీ, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదలనూ అత్యధికంగా వినియోగించుకోవా లనేదే ఈ కర్తవ్యం.

పట్టణాలకూ, పల్లెసీమలకూ మధ్యనూ, మానసిక, శారీరక శ్రమల మధ్య ఉన్న ప్రధానమైన వ్యత్యాసాలను నిర్మూలించడంలాంటి సమస్యల పరిష్కారానికి, వచ్చే అయిదేళ్లలోనూ మరికొన్ని చర్యలను తీసుకోవడం జరుగుతుంది. ప్రధానమైన ఆర్థిక, సామాజిక కర్తవ్యాలు నెరవేరితే కార్మిక, కర్షకవర్గాల మైత్రికి గల రాజకీయ, భౌతికప్రాతిపదిక మరింత బలపడుతుంది. మన దేశంలోని వివిధ జాతుల ప్రజల మధ్య సోదరమైత్రిని మరింత పెంపొందించవలసి ఉంది.

పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను పెంపొందించడానికీ, ప్రజల జీవనస్థాయి పెరుగుదలకూ మధ్య, ఆర్థిక వ్యవస్థ వనరుల పరిమాణం పెరగడానికీ, ఆ వ్యవస్థలో ప్రగాఢమూ, గుణాత్మకమూ అయిన మార్పులు ఇంకా ఎక్కువగా జరగడానికీ మధ్య, ఉత్పాదకశక్తుల పెరుగుదలకూ, సామాజిక, ఆర్థిక సంబంధాల అభివృద్ధికీ మధ్య సహజసిద్ధంగా ఉన్న అవినాభావ సంబంధాన్ని పంచవర్ష ప్రణాళిక ఈ విధంగా ప్రతిబింబిస్తూంది.

సోదర సోషలిస్టు దేశాలతోనూ, వర్ధమాన దేశాలతోనూ మన ఆర్థిక సంబంధాలను మరింత బలపరచుకోవలసిన అవసరాన్ని కూడా కొత్త పంచవర్ష ప్రణాళిక ప్రధాన లక్ష్యాలు దృష్టిలోకి తీసుకొంటున్నాయి.

ఆర్థికాభివృద్ధిలో మరింత ఎక్కువ వేగాన్నీ, యావన్మంది ప్రజల భౌతిక, సాంస్కృతిక అవసరాలను మరింతపూర్తిగా తీర్చడాన్నీ, సాధించేందుకు మన

సర్వశక్తులను ఇంకా బాగా ఉపయోగించాలన్న ఆశయాన్ని ముసాయిదా ఆదేశాలు, మొత్తంమీద వ్యక్తం చేస్తున్నాయి.

వచ్చే అయిదేళ్లలోనూ సామాజిక ఉత్పత్తి, జాతీయాదాయాల పెరుగుదల వేగం ఎక్కువగా ఉండేందుకు అవకాశం కలిగించడం జరిగింది. వస్తూత్పత్తి శాఖలన్నిటిలోనూ మొత్తం ఉత్పత్తి, అంటే మొత్తం సామాజికోత్పత్తి సగటున సంవత్సరానికి 7 శాతంకన్నా ఎక్కువగా పెరుగుతుంది. గత అయిదేళ్లలోనూ ఈ పెరుగుదల 6 శాతంకన్నా కొద్దిగా ఎక్కువ. ఈ అయిదేళ్లకాలంలోనూ, పారిశ్రామిక ఉత్పత్తిలో మొత్తం పెరుగుదల సగటున సంవత్సరానికి 22 – 23 వేల మిల్లియన్ల రూబుళ్లు ఉంటుందన్న విషయాన్ని ఈ సందర్భంలో చెప్పవలసి ఉంది. గత అయిదేళ్లకాలంలో ఇది 15,800 మిల్లియన్ల రూబుళ్లు. వచ్చే అయిదేళ్లకాలంలోనూ పారిశ్రామిక ఉత్పత్తి పరిమాణాన్ని సుమారు 50 శాతమూ, వ్యావసాయకోత్పత్తిని 25 శాతమూ పెంచాలన్నది ప్రణాళిక ఉద్దేశం.

జాతీయార్థిక వ్యవస్థలో పెట్టుబడులు సుమారు 3,10,000 మిల్లియన్ల రూబుళ్ల వరకు ఉంటాయి. అంటే గడచిన అయిదేళ్ళలోకన్నా 50 శాతం ఎక్కువన్నమాట. జాతీయార్థిక వ్యవస్థ శాఖ లన్నిటియొక్క, యూనియన్ రిపబ్లిక్కు లన్నిటియొక్క అభివృద్ధిని ఇది ఖాయమొనర్చుతుంది. కీలక పరిశ్రమల పెరుగుదల వేగాన్ని మరింత పెంచుతుంది. వివిధ శాఖల మధ్యా, ఆయా శాఖల్లో అంతర్గతంగానూ ఉన్న హెచ్చు తగ్గులను నిర్మూలిస్తుంది. మన ఆర్థిక వ్యవస్థ సమన్వయపూర్వక అభివృద్ధికి ఈ హెచ్చు తగ్గులు ఇటీవలి సంవత్సరాల్లో ఆటంకం కలిగించాయి.

వ్యవసాయరంగం అభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. వస్తూత్పత్తి రంగంలోని ప్రధానమైన ఈ శాఖలో ఉత్పత్తిని బాగా పెంచాలి. తద్వారా వ్యవసాయసరుకుల విషయంలో దేశం అవసరాలను మరింత పరిపూర్తిగా నెరవేర్చాలన్న కర్తవ్య నిర్ణయం జరుగుతూంది. యాంత్రికీకరణ, విద్యుదీకరణల ద్వారానూ, రసాయనిక ఎరువులను విరివిగా ఉపయోగించడంద్వారానూ వ్యవసాయ రంగంలో శ్రామిక ఉత్పాదకశక్తిని పెంచాలనీ. వ్యవసాయ రంగంలోని సాంకేతిక సౌకర్యాలనూ. ఉత్పత్తి వ్యవస్థీకరణనూ పారిశ్రామిక రంగంలో ఉన్నస్థాయికి నికరంగా, క్రమక్రమంగా అభివృద్ధి పరచాలనీ. ప్రణాళిక తలపెట్టింది.

ఉత్పత్తిసాధనాల ('ఎ' గ్రూపు) ఉత్పత్తి పెరుగుదల వేగానికీ, వాడకం సరకుల ('బి' గ్రూపు) ఉత్పత్తి పెరుగుదల వేగానికీ మధ్య గల

అంతరం చాలవరకు తగ్గిపోవడం అనేది వచ్చే అయిదేళ్ళకాలంలో ఒక ముఖ్య విషయంగా వుంటుంది.

అత్యంత ప్రధానమైన ఆర్థిక, రాజకీయ కర్తవ్యాలలో ఇదొకటి. దీనిని నెరవేర్చటం మిల్లియన్లకొలది ప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా వుంటుంది. ప్రజల శ్రేయస్సునే అన్నిటికన్నా ముఖ్యమైనదిగా పరిగణించే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కొత్త పంచవర్ష ప్రణాళికలో దీనిపట్ల అత్యధిక శ్రద్ధ వహిస్తూంది.

భారీ పరిశ్రమల్లో అధిక అభివృద్ధివేగాన్ని సాధించడంకోసం, మనం మన అవసరాలను బుద్ధిపూర్వకంగా పరిమితం చేసుకున్న రోజులున్నాయి. ఇప్పుడు మనకు మహాశక్తివంతమయిన ఉత్పాదక శక్తులున్నాయి. ప్రజల భౌతిక, సాంస్కృతిక తదితర అవసరాలను ప్రత్యక్షంగా తీర్చే సామాజిక ఉత్పత్తి శాఖలను మును పటికన్న చాల వేగంగా అభివృద్ధి పరిచేందుకు ఇవి మనకు అవకాశం కలిగిస్తున్నాయి. ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి పెరుగుదల వేగానికీ, వాడకం సరకుల ఉత్పత్తి పెరుగుదల వేగానికీ మధ్య, వ్యవసాయ, పారిశ్రామిక రంగాల అభివృద్ధి వేగం మధ్యవున్న అంతరాలను తగ్గించేందుకు పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన చర్యల్లో పార్టీయొక్క ఈ పంథా వ్యక్తమవుతూంది.

అందువల్ల గత అయిదేళ్ళలో ఎ గ్రూపులో ఉత్పత్తిపెరుగుదల 58 శాతమూ బి గ్రూపులో 36 శాతము కాగా, వచ్చే అయిదేళ్ళలో ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి పెరుగుదల 49–52 శాతమూ, వాడకం సరకుల ఉత్పత్తి పెరుగుదల 43–46 శాతమూ ఉండాలని తలపెట్టాము.

ఈ అంకెలు నిశదం చేస్తున్నట్లు, ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి పెరుగుదల మరింత వేగంగా జరగడం ఖాయమౌనప్పటికీ, భారీ పారిశ్రామిక రంగం అభివృద్ధికి ప్రాధాన్యం ఇచ్చే విధానాన్ని పార్టీ కొనసాగిస్తుంది. అదే సమయంలో, భారీ పారిశ్రామిక రంగాన్ని అభివృద్ధి పరచడంలో సాధించిన విజయాల ఫలితంగా కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో, వాడకంసరుకుల పరిశ్రమల్లో మునుపటికన్న చాల ఎక్కువగా పెట్టుబడులు పెట్టగల అవకాశం మనకుంది. దేశంయొక్క పారిశ్రామిక శక్తిని ఇంకా ఎక్కువగా పెంచడానికీ, అదే సమయంలో ప్రజల భౌతిక సుఖ సంపదలను మరింత పెంపొందజేసేందుకు అవసరమయిన ముఖ్య సామాజిక, ఆర్థిక చర్యలను అమలుజరుపడానికీ ఇది వీలుకలిగిస్తుంది.

విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో ప్రగతిని మరింతవేగం చేయడమూ, సామాజికఉత్పత్తిని మరింత ఎక్కువ ఫలవంతం చేయడమూ, అన్నది అతిముఖ్యమయిన ఆర్థిక, రాజకీయ కర్తవ్యం. వచ్చే అయిదేళ్లల్లో దీనిపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించడం ఉంటుంది.

విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలనే ప్రధానమైన, కీలకరంగాలపై పరిశోధక రూపకల్పన సంస్థలనూ, పావార్థిక, ద్రవ్య సంపదలనూ కేంద్రీకరించడం అవసరం. ఉత్పత్తిని మరింత పెంచడంతో పరిశోధన సన్నిహిత సంబంధం కలిగి వుండాలి. విజ్ఞానశాస్త్ర, రూపకల్పన సంస్థలు ఏ యే విషయాలపై ప్రత్యేకంగా కేంద్రీకరించాలో ఖచ్చితంగా కేటాయించాలి. స్పష్టంగా నిర్వచించని బాధ్యతలూ, ఒకే పనిని రెండుమూడు సంస్థలు చేయడమూ అనేది లేకుండా చూడాలి. శ్రామిక ఉత్పాదక శక్తిలోనూ, ఉత్పత్తి లాభాల్లోనూ పెరుగుదల వేగాన్ని అధికం చేనూ లన్నది ఇప్పటి కర్తవ్యం. పారిశ్రామిక రంగంలోని పార్టీసంస్థలూ, శాస్త్రవేత్తలూ ప్రవీణులూ, కార్మికులందరూకూడా తమ సర్వశక్తులను ఈ కర్తవ్య నిర్వాహణకు అంకితం చేస్తారు.

కొత్త యంత్రాలనూ, ఆధునిక సాంకేతిక రీతులనూ రూపొందించి పనిలో ప్రవేశపెట్టడం, సమగ్రమైన యాంత్రీకరణ, స్వయంచాలకత్వాలను విస్తృతంగా అమలుజరపడం, ఆయా సరకుల ఉత్పత్తిలో ప్రత్యేక ప్రావీణ్యం చూపుతూ కేంద్రీకరించడాన్ని ఎక్కువ చేయడం, వివిధ సంస్థల ఉత్పత్తి కార్యక్రమాలమధ్య పరస్పర సమన్వయాన్ని అభివృద్ధిపరచడం ద్వారా వస్తూత్పత్తి సాంకేతికస్థాయిని పెంపొందించడమే, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదలకు మూలకారణం కావాలి.

ఉత్పాదక శక్తిని పెంచడానికీ, పనిని తేలిక చేయడానికీ సమగ్రమైన యాంత్రీకరణ, స్వయంచాలకత్వాలు అతిముఖ్యమైన సాధనాలు. ఈ విషయంలో మనదేశంలో చాల గొప్పకృషి జరుగుతూ ఉంది. కాని ఉత్పత్తి కార్యక్రమంలో ప్రధాన, అనుబంధ విభాగాల యాంత్రీకరణల స్థాయిలో ఉన్న వ్యత్యాసం ఇంక ఎక్కువగానే ఉంది. పారిశ్రామిక సంస్థల్లో ఆధునికయంత్రాలను ఎక్కువగా అమర్చినప్పటికీ, శారీరక శ్రమపంతు తగ్గుదల మందకొడిగానే సాగుతూ ఉంది. శ్రామిక ఉత్పాదకశక్తి, ఉత్పత్తిమీద లాభాలూ మరింత పెరగడానికి ఇదొక అటంకంగా తయారవుతూంది. ఉత్పత్తి కార్యక్రమంలో అన్ని విభాగాల సమగ్ర యాంత్రీకరణనూ, శారీరక శ్రమపంతులో నికరమైన తగ్గుదలనూ, మనుష్యశక్తి

మరింత ఎక్కువ ఫలప్రదంగా వినియోగం కావడాన్ని సాధించగల మార్గాన్ని పరిశ్రమల్లోని ఆర్థిక, పార్టీ సంస్థలన్నీ పట్టుదలతో అనుసరించాలి.

ఉత్పత్తినీ, శ్రమశక్తినీ శాస్త్రీయ పద్ధతుల్లో వ్యవస్థీకరించడం ఈనాడు ప్రత్యేకంగా ప్రధానం. ఆర్థిక వ్యవస్థ శాఖలన్నిటిలోనూ, ఉత్పత్తి రంగాలన్నిటిలోనూ కొత్త యంత్రాలను అమర్చడం, సహజంగానే ముఖ్యం. ఆయంత్రాలను పూర్తిగా ఉపయోగించుకునే సామర్థ్యంగల నిపుణులైన సిబ్బంది ఉండడం కూడా అంత ప్రధానమయిన విషయమే. సోషలిస్టు నిర్మాణం దశలో ఈ సమస్యలను పార్టీ జయప్రదంగా పరిష్కరించింది. ఉత్పత్తిసాంకేతిక స్థాయిలోనూ, కార్మికులకు, నిపుణులకు తరిఫీదు ఇవ్వడం విషయంలోనూ సోవియట్ పారిశ్రామిక రంగం ప్రపంచంలో అగ్రస్థానానికి చేరుకుంది.

కాని, ఉత్పత్తి కార్యక్రమం సాఫీగా సాగడంలో యంత్రాలనూ, మనుషులనూ చక్కగా మేళవింపజేసే విధంగా ఉత్పత్తిని వ్యవస్థీకరించడం విషయంలో, దురదృష్టవశాత్తు మన పారిశ్రామిక సంస్థలు అనేకం ఇంకా చాల వెనుకబడి ఉన్నాయి. అందుచేత, ఆధునిక శాస్త్రీయ, సాంకేతిక ప్రగతికి అనుగుణంగా అన్ని పరిశ్రమల్లోనూ శాస్త్రీయంగా వ్యవస్థీకృతమైన ఉత్పత్తినీ, శ్రమశక్తినీ ప్రవేశపెట్టడం అనేది అతి ప్రధానమైన ఆర్థిక కర్తవ్యాల్లో ఒకటిగా నిర్దేశితమయింది.

సరుకుల నాణ్యంలో సమగ్రమైన అభివృద్ధిని సాధించడం అత్యవసర కర్తవ్యాల్లో ఒకటిగా పార్టీ పరిగణిస్తూంది. సాంకేతిక ప్రగతి వేగాన్ని పెంచడంలో, సరుకుల నాణ్యాన్ని యంత్రాల మన్నికనూ పెంచడంపట్ల, పనిలో ఆ యంత్రాలు ఇంకా ఎక్కువ నమ్మకమైనవిగా ఉండేలా చేయడం పట్లా, తప్పని సరిగా ప్రత్యేక శ్రద్ధ వహించాలి. సరకులు ఎంతఎక్కువ నాణ్యమయినవయితే, సామాజిక శ్రమశక్తి యావత్తూ అంతఎక్కువ సమర్థవంతమవుతుంది. దాని ఉత్పాదక శక్తి అంత పెరుగుతుంది. మరికొన్ని ఇతర కారణాలవల్లకూడా ఈ కర్తవ్యం ముఖ్యమయినది. ఈనాడు మనం పెద్దఎత్తున ప్రపంచ మార్కెట్టులో ప్రవేశించాము. ప్రధాన పెట్టుబడిదారీ దేశాలతో పోటీ పడుతున్నాము. అటువంటి ఈ సమయంలో సోవియట్ యంత్రాలూ, లేథ్‌లూ, యంత్ర పరికరాలూ, ఒక్క మాటలో చెప్పాలంటే ఉత్పత్తి యావత్తూ కూడా నాణ్యములో విదేశీ సరకులకు ఏమాత్రమూ తీసిపోకూడదు సరికదా, వాటికన్నా మిన్నగా ఉండడం ఎంతో ముఖ్యం.

సాంకేతిక దోషరాహిత్యంలో మన పారిశ్రామిక రంగం ఇప్పటి కప్పుడే

ఉన్నతస్థాయి నందుకుంది. సాంకేతిక, ఆర్థిక విషయాలకు సంబంధించిన వివరాల్లో నానాటికి పెరుగుతూన్న జాతీయ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రపంచ మార్కెట్టుయొక్క అవసరాలకు పూర్తిగా అనుగుణంగా ఉండే యంత్రాలనూ, పరికరాలనూ, సాధనాలనూ మనం తప్పకుండా ఉత్పత్తిచేయగల స్థాయి ఇది.

పారిశ్రామిక ఉత్పత్తి యంత్రాంగాన్ని అభివృద్ధి పరచడం, అవరోధాలను నిర్మూలించడం పట్ల పంచవర్ష ప్రణాళిక చాల శ్రద్ధ కనబరుస్తూ ఉంది. విద్యుచ్ఛక్తి ఇంజనీయరింగ్ యంత్రనిర్మాణం, రసాయనిక, ఎలక్ట్రానిక్స్ పరిశ్రమల పెంపుదలకు అది అన్నిటికన్న ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇస్తూంది.

దేశంలో, ముఖ్యంగా యూరప్‌లోని భాగంలో, ఇంధనాల కొరతను తీర్చడం అనేది ఒక అత్యవసర కర్తవ్యం. నూనె, ఇంధనవాయువు పరిశ్రమలను మరెంత వేగంగా అభివృద్ధి పరచేందుకూ అవకాశం కలిగించడం జరిగింది. అదే సమయంలో, గత సంవత్సరాల్లోలాగ బొగ్గు పరిశ్రమను అశ్రద్ధ చేయడం ఎంత మాత్రమూ కూడదు. దేశానికి ఇంధనాలనుసప్లయి చేయడంలో ఈ పరిశ్రమ ప్రముఖ పాత్రను నిర్వహిస్తూనే ఉంది.

ఇనుము, ఉక్కు పరిశ్రమాభివృద్ధి విషయంలో పరిస్థితులను చక్కబరచడానికి మౌలికమైన చర్యలను ఎలపెట్టడం జరుగుతూంది. మిశ్రమ పదార్థాల రంగంలోకి వచ్చిన ఈ రోజుల్లో లోహాలకు గిరాకీ బాగా తగ్గిపోతుందన్న దృక్పథం పొరపాటు అని జీవితానుభవం నిరూపించింది. ఇనుము, ఉక్కు పరిశ్రమాభివృద్ధిపై ఈ దృక్పథం దుష్ప్రభావాన్ని ప్రసరించింది.

మోటారు వాహనాలు, ట్రాక్టర్లు, వ్యవసాయ యంత్రాల ఉత్పత్తిని గురించి నేను ప్రత్యేకంగా ప్రస్తావించ దలచుకున్నాను. మోటారువాహనాల ట్రాక్టర్ల కొరత మన ఆర్థికవ్యవస్థలోని ఒక బలహీనతగా తయారవుతూంది. ప్రయాణీకుల కార్లు ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నాయి. ఆర్థిక వ్యవస్థ అవసరాలను మరింత పూర్తిగా తీర్చడంకోసం, కొత్తపంచవర్ష ప్రణాళిక మోటారు వాహనాల ఉత్పత్తిని పెద్దగా పెంచదలచింది. ఇందుకోసం ఇప్పుడున్న ఫ్యాక్టరీల పునర్నిర్మాణమూ, కొత్త ఫ్యాక్టరీల నిర్మాణమూ జరుగుతుంది. పెద్దపెద్ద లారీలూ, ప్రత్యేక అవసరాలకు ఉపయోగించే లారీలూ, ట్రాక్టర్లూ - ముఖ్యంగా నాగలి ట్రాక్టర్లూ, మునుపటి కన్నా ఎక్కువగా ఉత్పత్తి అవుతాయి. వ్యవసాయ యంత్రాలన్నిటి నాణ్యాన్ని పెంచడంకూడా జరుగుతుంది. నైసర్గిక పరిస్థితుల్లో వైవిధ్యమూ, జనసాంద్రతలో

హెచ్చుతగ్గుబాటున్న మన సువిశాల దేశంలో ఉత్పాదక శక్తుల సక్రమ పంపిణీ సమస్యకు, ఆర్థికంగానూ, రాజకీయంగానూ అత్యంత ప్రాధాన్యం ఉంది. దేశంలోని తూర్పు ప్రాంతాల సహజ సంపదలను మరింత పెంపొంద జేయాల న్నది ప్రణాళిక ఉద్దేశం. సైబీరియా, సోవియట్ దూరప్రాచ్య ప్రాంతాల ఆర్థిక వ్యవస్థను మరింత వేగంగా అభివృద్ధి పరచడం కోసం, వచ్చే అయిదేళ్లలోనూ కొన్ని సామాజిక, ఆర్థిక చర్యలను అమలు జరప వలసిఉంది. ప్రస్తుతం అక్కడ ఉన్న పనివారిని అక్కడే ఉండేలా చేయడానికీ, కొత్త వాళ్లను ఆకర్షించడానికీ ఈ చర్యలు ముఖ్యంగా తోడ్పడుతాయి. పార్టీకీ, ప్రభుత్వానికీ సంబంధించిన ఒక ముఖ్య విషయ మిది.

పారిశ్రామిక, వ్యవసాయిక ఉత్పత్తిని పెంచడంలో పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను సాధించడమూ, ముఖ్య సామాజిక సమస్యల పరిష్కారమూ కూడా, యంత్ర నిర్మాణ కార్యక్రమం జయప్రదంగా నెరవేరడంపై చాల వరకు ఆధారపడి ఉంది. ఈ పెరుగుదలలో గణనీయమైన భాగం, వచ్చే అయిదేళ్లలోనూ కొత్తగా పని ప్రారంభించవలసిన ఉత్పాదక శక్తుల ద్వారానే జరుగుతుంది.

వందల కొలది ఫాక్టరీలనూ, గనులనూ, విద్యుత్ కేంద్రాలనూ, కొత్తపట్ట ణాలనూ, పేటలనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలనూ, సమిష్టి వ్యవసాయక్షేత్ర భవనాలనూ, నీటి పారుదల ప్రాజెక్టులనూ, విద్యుత్ ప్రసారక తంత్రులనూ, మిల్లి యన్ల కొలది నివాస భవనాలనూ, వేల కొలది పాఠశాలలూ, శిశువిద్యా కేంద్రాలూ, శిశుపోషణాలయాలూ, ఆసుపత్రులనూ మనం నిర్మించవలసి ఉంది.

బ్రహ్మాండమైన పరిమాణంలో కొనసాగవలసిన ఈ పారిశ్రామిక, గృహ వసతి, సాంస్కృతి సౌకర్యాల నిర్మాణ కార్యక్రమం నెరవేరాలంటే భవన నిర్మాణ పరిశ్రమ ఉత్పాదకశక్తి మరింత పెరగడముతో, నిర్మాణ సంస్థలకు గల సాంకేతిక సౌకర్యాలు విస్తృతం కావడమూ అవసరం.

భవన నిర్మాణ పరిశ్రమ పరిణామంలో పారిశ్రామికీకరణే ఇంతవరకు ముఖ్య పంథాగా ఉంది, ఇకముందుకూడా ఉంటుంది. నిర్మాణవేగాన్ని నానా పెంచ డమూ, ఖర్చులను తగ్గించడమూ, అధికతర పారిశ్రామికీకరణద్వారానే సాధ్యం.

పోతభాగాలూ, సామగ్రి, తదితర ఉపయోగకరమైన వస్తువులూ మొదలయి నవి ఈరంగంలో ఇకముందుకూడా ముఖ్య పాత్రను నిర్వహిస్తూనే ఉంటాయి.

"పారిశ్రామికంకాని" సామగ్రి అంటూ ఇటుక, పెంకు, రాయి, కలప – వీటిని విసర్జించి, వాటిస్థానంలో, ఆర్థికంగా సమర్థనీయంకాని సందర్భాలల్లోకూడా రీఇన్ఫోర్డ్సు కాంక్రీటును ఉపయోగిస్తూ ఇటీవల ప్రారంభించిన పద్ధతితప్పు. ఈ సామగ్రిని, ముఖ్యంగా పల్లె ప్రాంతాల్లో తక్కువ అంచనా వేయకూడదు.

భవనాల నిర్మాణాన్ని త్వరితం చేయడమూ, వాటి నాణ్యాన్ని పెంచడమూ పెట్టుబడులను మరింత ఫలప్రదంచేయడమూ అనే సమస్య ప్రత్యేక ప్రాధాన్యం వహిస్తుంది. పెట్టుబడులనూ, పాదార్థిక, సాంకేతిక వసరులనూ అనేక ప్రాజెక్టుల్లో చెల్లాచెదరుగా విరజిమ్మే నష్టదాయకమైన పద్ధతికి ఖచ్చితంగా స్వస్తిచెప్పాలి. దీని వల్ల నిర్మాణం ఆలస్య మవుతుంది. పెట్టుబడులు బిగుసుకు పోతాయి. ఉత్పాదక శక్తులను పనిలో పెట్టడంలో మందకొడితనం దేశానికి భారీనష్టాలు కలిగిస్తుంది.

భవన నిర్మాణాన్ని త్వరితం చేయడం కోసమూ, వాటి నాణ్యాన్ని పెంచడం కోసమూ, ఖర్చులను తగ్గించడం కోసమూ, భవన నిర్మాణ పరిశ్రమలో ప్రణాళికా రచనను నిష్టం చేసేందుకూ, మరింత ఎక్కువగా దానికి ఆర్థిక ప్రోత్సాహకాలను కల్పించేందుకూ, తగినచర్యలను తీసుకోవడం అవసరమని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, ప్రభుత్వమూ, భావిస్తున్నాయి. నిర్మాణ సంస్థల కార్యక్రమానికి ప్రణాళిక వేసుకొనడంలోనూ, ఆ కార్యక్రమాన్ని మదింపు వేయడంలోనూ, ఉత్పాదక శక్తులను ఎంత త్వరగా, ఎంత బాగా పనిలో పెట్టారన్నదే ముఖ్యమైన గీటురాయిగా ఉండాలి. ఆయా ప్రాజెక్టుల నిర్మాణాన్ని సకాలంలో పూర్తిచేసి పనిలో పెట్టినందుకు నిర్మాణసంస్థల్లోని కార్మికులకు వ్యక్తిగతంగానూ, వారి సమిష్టి సంస్థలకూ మరింత ఎక్కువగా భౌతిక ప్రోత్సాహం కలిగించాలి.

యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీలూ, ప్రాంతీయ, మండల పట్టణ, జిల్లా పార్టీ కమిటీలూ భవన నిర్మాణానికి సంబంధించిన సమస్యల పట్ల నిరంతరం శ్రద్ధ వహించాలి. ప్రభుత్వ పెట్టుబడులు మరింత ఎక్కువ ఫలప్రదంగా వినియోగం కావడాన్నీ, ఉత్పాదకశక్తులు సకాలంలో పని ప్రారంభించడాన్నీ, నిర్మాణం నాణ్యంలో అభివృద్ధిని అవి సాధించాలి. మన దేశంలోని కార్మిక వర్గంలో పెద్ద భాగంగాఉన్న నిర్మాణ కార్మికుల పని పరిస్థితుల పట్ల, జీవన పరిస్థితులపట్ల అవి శ్రద్ధవహించాలి.

పంచవర్ష ప్రణాళికను గురించిన ఆదేశాలు, అన్ని రకాల రవాణా సౌకర్యాల అభివృద్ధికి ప్రాధాన్యాన్ని ఇస్తున్నాయి. ఆర్థికవ్యవస్థలో వస్తు సంపద

వ్యాపారం నిరంతరాయంగా కొనసాగడానికి ఆ వ్యవస్థ చెందిన ఈ విభాగంకు ఖాయమొనర్చాలి. కొత్తగా కనిపెట్టిన సహజ సంపదలవద్దకూ, ఇంకా అభివృద్ధి కాకుండా ఉన్న ప్రాంతాలకూ ప్రయాణ సౌకర్యాలు కలిగించాలి. రవాణా శాఖకు గల సాంకేతిక సదుపాయాలనూ, వివిధ రవాణా సౌకర్యాల మధ్యా పరస్పరం సంబంధాలను అభివృద్ధి పరచడం విషయంలో పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు, సామాజిక ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచేందుకు తోడ్పడే ఒక ప్రాధాన్యాంశంగా రూపొందాలి.

కామ్రేడ్స్, పారిశ్రామిక, రవాణా, భవననిర్మాణ రంగాల అభివృద్ధి విషయంలో కొత్త పంచవర్ష ప్రణాళిక ప్రధానమైన కర్తవ్యాలను నిర్దేశించింది. సోవియట్ ప్రజల ముఖ్య ప్రయోజనాలనూ, ఉదాత్తమైన భౌతిక, సాంస్కృతిక అవసరాలనూ అది ప్రతిబింబిస్తుంది. ఈ పంచవర్ష ప్రణాళికను సోవియటు ప్రజలు ఆమోదిస్తున్నారు. దీనిని ప్రజల ప్రణాళిక అని పేర్కొంటున్నారు. ఈ విషయం పార్టీకి ఎంతో సంతోషం కలిగిస్తుంది. కొత్త ప్రణాళికను దేశవ్యాపితంగా ప్రజలు బలపరచడం తన విధానం సరియైనదన్న ధ్రువీకరణగా పార్టీ పరిగణిస్తుంది.

మన సోషలిస్టు దేశ పారిశ్రామిక శక్తిని పెంపొందజేసేందుకు ఈ మహాసభ ఆమోదించవలసి వున్న కొత్త కార్యక్రమం విజయవంతంగా నెరవేరుతుందని విశ్వసిస్తున్నాము.

## వ్యవసాయ రంగం

కామ్రేడ్స్ ప్రస్తుతం సమీక్షిస్తున్న దశలో పార్టీ కేంద్ర కమిటీ, స్థానిక పార్టీ ప్రభుత్వ సంస్థలన్నీ కూడా, మన ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రధాన శాఖ అయిన వ్యవసాయ రంగం పట్ల ఎంతో శ్రద్ధ వహించాయి. చిక్కులు కలిగినప్పటికీ కూడా మన సమిష్టి వ్యవసాయ క్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల, పెరుగుదల అభివృద్ధి క్రమంగా కొనసాగుతూనే ఉన్నాయి. వాటి ఆర్థిక వ్యవస్థ నానాటికీ మరింత బలపడుతూ ఉంది. వాటికి గల పాదార్థిక, సాంకేతిక సౌకర్యాలు మరింత విస్తరిస్తున్నాయి. వ్యవసాయదారుల జీవనస్థాయీ, సాంస్కృతిక, సాంకేతిక పరిజ్ఞానస్థాయి పెరుగుతున్నాయి.

ముఖ్యమయిన వ్యవసాయ సరుకుల ఉత్పత్తిని (అన్ని తరహాల వ్యవసాయ క్షేత్రాలల్లోనూ) ఈ దిగువ అంకెలు తెలియ జేస్తున్నాయి.

| సగటు సాంవత్సరిక ఉత్పత్తి | 1956—60 | | 1961—65 | |
|---|---|---|---|---|
| | | అంతకుముందు అయిదేళ్ళ కంటే పెరుగుదల (శాతాలలో) | సగటు సాంవత్సరిక ఉత్పత్తి | అంతకుముందు అయిదేళ్ళ కంటే పెరుగుదల (శాతాలలో) |
| ధాన్యం (మిల్లియన్ల టన్నుల్లో) | 121.5 | 6.5 | 130.2 | 5.2 |
| పరిశ్రమలు ఉపయోగించే తీపిదుంప (మిలియన్ల టన్నుల్లో) | 45.6 | 13.7 | 59.0 | 5.2 |
| ముడిపత్తి (మిలియన్ల టన్నుల్లో) | 4.4 | 2.3 | 5.0 | 2.7 |
| పొద్దుతిరుగుడు పువ్వు గింజలు (మిల్లియన్ల టన్నుల్లో) | 3.7 | 8.4 | 5.1 | 6.7 |
| కాయగూరలు (మిల్లియన్ల టన్నుల్లో) | 15.1 | 6.1 | 16.7 | 2.2 |
| బంగాళాదుంపలు (మిల్లియన్ల టన్నుల్లో) | 88.3 | 4.9 | 81.5 | తగ్గు 1.6 |
| మాంసం - కళేబరాలు (మిల్లియన్ల టన్నుల్లో) | 7.9 | 6.8 | 9.3 | 3.4 |
| పాలు (మిల్లియన్ల టన్నుల్లో) | 57.2 | 8.6 | 64.7 | 2.5 |
| గుడ్లు (వేల మిల్లియన్లలో) | 23.6 | 8.3 | 28.7 | 4.1 |
| ఉన్ని (వేల టన్నుల్లో) | 31.7 | 7.0 | 36.1 | 2.7 |

మన దేశంలో ప్రధానమైన వ్యవసాయ సరకుల ఉత్పత్తి పెరుగుతూనే ఉన్నదన్న విషయాన్ని ఈ పట్టిక సూచిస్తూ ఉంది. కాని, గత అయిదేళ్లలోని పెరుగుదల వేగం, అంతకు ముందు అయిదేళ్లలోని వేగం కన్నా చాల తక్కువగా ఉంది. ఫలితంగా, ఇదివరకే తెలియజేసినట్లు, వ్యవసాయరంగంలో సప్తవర్ష ప్రణాళిక లక్ష్యాలు నెరవేరలేదు. వ్యవసాయ రంగంలోని ఈ పరిస్థితి, కేంద్రకమిటీ దృష్టిని ఆకర్షించక తప్పలేదు.

1965 మార్చి విస్తృత సమావేశంలో ఈ సమస్యను పరిశీలించిన సంగతి, ఉత్పత్తి ఆర్థిక సూత్రాల అవసరాలను భంగపరచడమూ, భౌతిక ప్రోత్సాహ



5

కాలనూ, పౌర, వ్యక్తిగత ప్రయోజనాల సక్రమ మేళవింపునూ అశ్రద్ధ చేయడమే వ్యవసాయ రంగంలో అభివృద్ధి మందకొడిగా ఉన్నందుకు కారణమని కేంద్రకమిటీ నిర్ధారణ చేసిన విషయమూ ఈ మహాసభ ప్రతినిధులకు తెలుసు. మరికొన్ని కారణాలుకూడా ఉన్నాయి.

వ్యవసాయ సరకుల సేకరణ వ్యవస్థలోని తీవ్రమైన లోపాలు, వ్యవసాయ రంగంలో ప్రణాళికాబద్ధమైన మేనేజిమెంటుకి అవరోధం కలిగించాయి. అనేక వ్యవసాయ సరకుల కొనుగోలు ధరలు, అసలు ఖర్చులు కూడా గిట్టేవిగా లేక పోవడంవల్ల సమిష్టి, ప్రభుత్వ, వ్యవసాయక్షేత్రాలకు ఉత్పత్తిని పెంచాలనే ఉత్సాహమే కలిగించలేకపోయాయి. వ్యవసాయ రంగానికి నిధులూ, పాదార్థిక, సాంకేతిక వనరులూ చాలీ చాలని విధంగా కేటాయించారు.

వ్యవసాయ సంస్థల్లో అసమర్థనీయమైన పునర్వ్యవస్థీకరణా, ఒకేమూసలో పోసిన సిఫార్సులను పైనుంచి రుద్దడమూ, విజ్ఞానశాస్త్రాన్నీ, దీర్ఘకాల ఆచరణ అనుభవాన్నీ తక్కువ అంచనా వేయడమూ కూడా ఉత్పత్తి పెరుగుదలకు ఆటంకం కలిగించాయి.

వ్యవసాయ రంగంలో ప్రణాళికను మెరుగు పరచేందుకూ, ఉత్పత్తిని పెంచడం కోసం ఇంకా ఎక్కువ ప్రోత్సాహాలను కల్పించేందుకూ, మార్చి విస్తృత సమావేశానంతరం కేంద్రకమిటీ, ప్రభుత్వమూ వరుసగా కొన్ని ముఖ్య చర్యలను తలపెట్టాయి. వ్యవసాయ సరకుల కొనుగోలు విషయంలో మూలమట్టంగా కొత్తదయిన వ్యవస్థనొకదానిని ఏర్పరచారు. వాస్తవిక దృష్టితో కూడిన, స్థిరమైన కొనుగోలు ప్రణాళికలను, అయిదేళ్ళకు, వర్తించేవాటిని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకూ ప్రతిపాదించారు. వ్యవసాయ సరుకులు, పాలు, వెన్న, మాంసం మొదలయిన పశు సంబంధమైన సరుకుల అనేకమయిన వాటి కొనుగోలు ధరలను పెంచారు. ప్రణాళిక లక్ష్యాలను మించి ప్రభుత్వానికి అమ్మే ముఖ్య ధాన్యపు పంటలకు అంతకన్న ఎక్కువ ధరలను ప్రవేశ పెట్టారు. అదే సమయంలో, అనేకరకాల యంత్రాల పరికరాల ఇతర అమ్మకం ధరలను తగ్గించారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకూ సప్లయి చేసే విద్యుచ్ఛక్తి టారిఫులనుకూడా తగ్గించారు. పరిశ్రమల్లో తయారయే వస్తువుల, ఆహారపదార్థాల ధరలను పట్టణాల్లోని వాటితో సమానంగా ఉండేలాగా పల్లె ప్రాంతాల్లో తగ్గించారు.

ఈచర్యలు సత్ఫలితాలను చేకూర్చాయి. నిరుడు పలుప్రాంతాలు, ముఖ్యంగా మార్కెట్టుకు సప్లయిచేయగల ధాన్యం పండించే ప్రాంతాలు, తీవ్రమయిన అనావృష్టికి గురిఅయాయి. అయినప్పటికీ, ఆ నాటి ధరల ప్రకారం మొత్తం 55,300 మిల్లియన్ల రూబుల్ల విలువచేసే వ్యవసాయ సరకుల ఉత్పత్తిఅయాయి. అది అంతకుముందు గడచిన ఏ సంవత్సరంలోని ఉత్పత్తి విలువకన్నాకూడా అధికం. 1965 లో సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ కూడా, ధాన్యం మినహా ఎక్కువభాగం సరకులన్నీ బాగానే పండాయి.

కొత్రోమ్స్, పత్తి, తేపి మండల రైతులూ, పశుపోషకులూ నిరుడు మంచి ఫలితాలను సాధించారని ప్రత్యేకంగా చెప్పవలసి వుంది. వారి కృషి ఫలితాలను చూచి గర్వపడగల హక్కు వారికి పూర్తిగా వుంది. పశుగణాభివృద్ధిలో కూడా గణనీయమైన అభివృద్ధిని సాధించారు. ఈ దిగువ పట్టిక ఈ విషయాన్ని విశదీకరిస్తుంది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ, ఇతర ప్రభుత్వ సంస్థల్లోనూ ఉన్న పశు సంపదా, దాని ఉత్పాదక శక్తి

| | 1961 | 1962 | 1963 | 1964 | 1965 |
|---|---|---|---|---|---|
| సంవత్సరాంతానికి ఉన్న పశువులు (మిల్లియన్లలో) | 58.2 | 62.5 | 61.3 | 62.1 | 65.5 |
| అందులో ఆవులు | 20.1 | 21.8 | 22.3 | 22.6 | 23.5 |
| పందులు (మిల్లియన్లలో) | 49.4 | 53.9 | 27.7 | 38.3 | 41.3 |
| మేకలు, గొర్రెలు (మిల్లియన్లలో) | 109.1 | 110.9 | 108.4 | 100.2 | 103.1 |
| కోళ్ళు, బాతులు మొదలైనవి (మిల్లియన్లలో) | 152.0 | 154.5 | 97.7 | 127.8 | 140.2 |
| ఆవు ఒక్కింటికి సగటున పాల ఉత్పత్తి (కిలోల్లో) | 1.851 | 1,765 | 1,599 | 1,700 | 2.006 |

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ, 1963 లో వచ్చిన చిక్కులను అధిగమించాయని, పందులు, కోళ్లు, బాతులు వగైరా సంఖ్య 1962 నాటికన్నా ఇంకా తక్కువగానే ఉన్నప్పటికీ, ఆవులతో సహా గొడ్లసంఖ్యలోనూ,

పందులు, కోళ్లు, బాతులు మొదలయిన వాటిసంఖ్యలోనూ పెరుగుదలను సాధించాయనీ ఈ పట్టిక తెలుపుతూంది. సగటున ఆవు ఒక్కంటికీ పాల ఉత్పత్తి నిరుడు 306 కిలోలు పెరిగింది. 1965 లో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ, తమ ఉత్పత్తిని గణనీయంగా పెంచి, పశుసంబంధ మయిన సరుకులన్నిటి కొనుగోలు విషయంలో ప్రభుత్వ ప్రణాళికను నెరవేర్చాయి.

వ్యవసాయ రంగంలో చాల ముఖ్యమయినదే అయినప్పటికీ, ఇంకా వెనుక బడి వున్న ఈ శాఖ పట్ల మనం మరింత ఎక్కువ శ్రద్ధ వహించాలి. పశుగణాన్ని పెంచడం ద్వారానూ, ముఖ్యంగా దాని ఉత్పాదకశక్తిని పెంపొందజేయడం ద్వారానూ, పోషణిస్తు రంగంలోని పశుపోషణను అభివృద్ధిపరచడం కొత్త పంచ వర్ష ప్రణాళికలోని కర్తవ్యం. ఈ వైఖరిని అవలంబించడంవల్ల, పశుసంబంధమైన సరుకుల ఉత్పత్తిని తక్షణ భవిష్యత్తులో గణనీయంగా పెంచడమూ వాటిపై లాభాలను ఎక్కువచేయడమూ సాధ్యమవుతుంది. మొత్తం ధాన్యం ఉత్పత్తిలో ఇంకా ఎక్కువ అభివృద్ధి, పచ్చిక మైదానాలను మరింత ఫలప్రదంగా ఉపయోగించుకోవడమూ, పొలం పనుల యాంత్రీకరణ స్థాయిని పెంచడమూ, మేలురకం పశువులను అభివృద్ధిచేయడమూ ఈ కర్తవ్య నిర్వహణలో మనకు తోడ్పడతాయి.

పశువుల మేతను పదింతలను విస్తృతం చేయాలన్న లక్ష్యంతో, మిశ్రమ ఆహారాల పరిశ్రమనూ, మేతలో ఉపయోగించే ప్రోటీన్లను, మైక్రో పదార్థాలను, రోగ క్రిమి సంహారకాలనూ ఉత్పత్తి చేసే పరిశ్రమలనూ విస్తరింప జేసేందుకు పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ యూనియన్ మంత్రి మండలీ తగిన చర్యలు తీసుకున్నాయి. మైక్రో బయోలాజికల్ పరిశ్రమ అనే కొత్త పారిశ్రామిక శాఖను నిర్మించి, అభివృద్ధి పరచడం అవసరమని తేలింది.

కాంగ్రెస్, మార్చి విస్తృత సమావేశ నిర్ణయాలు, వ్యవసాయాభివృద్ధికి ఉపయోగకరమైనవని అనేందుకు మనకు పూర్తి ఆధారాలున్నాయి. గ్రామసీమలో అనుసరించేందుకు పార్టీ రూపొందించిన ఆర్థిక విధానం సరియైనదని ప్రజలు, స్వానుభవంమీద గ్రహించారు. దానిని క్రియాత్మకంగా బలపరుస్తున్నారు. అన్నిటి కన్నా అదే ప్రధానం.

సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల ఉత్పత్తిలో ఉధృతిని సాధించడం మనపార్టీయొక్క ప్రజలయొక్క అతిప్రధానమైన కర్తవ్యాల్లోఒకటి. గ్రామ సీమలోని ఉత్పాదిక శక్తులు మరింత పెంపొందేందుకూ, పారిశ్రామికరంగం

అభివృద్ధికీ, వ్యవసాయ రంగం అభివృద్ధికీ మధ్యఉన్న హెచ్చుతగ్గులను నిర్మూలించేందుకూ అనుకూలమయిన పరిస్థితులను నెలకొల్పాలన్నఉద్దేశంతో, వ్యవసాయ రంగంలో కొన్ని చర్యలను అమలు పరచడం అవసరమని కేంద్రకమిటీ భావిస్తూంది. ఈ కర్తవ్య నిర్వహణకు ముందుగా అవసరమయిన వాటిని, పంచవర్ష ప్రణాళికను గురించిన ముసాయిదా ఆదేశాలు స్థూలంగా వివరిస్తున్నాయి. వ్యవసాయ రంగంలో పెట్టుబడులు ఇంచుమించు రెట్టింపు పెరుగుతాయి. గడచిన అయిదేళ్లలో కన్నా వచ్చే అయిదేళ్లలో వ్యవసాయ రంగానికి 7,00,000 ట్రాక్టర్లనూ, 6,80.000 లారీలనూ. 4,000 మిల్లియన్ రూబుళ్ల విలువచేసే ఇతర వ్యవసాయ యంత్రాలనూ ఎక్కువగా సమకూర్చుతారు. వ్యవసాయ రంగంలో విద్యుచ్ఛక్తి వాడకం సుమారు 200 శాతం పెరగబోతూంది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలకూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకూ రసాయనిక ఎరువులను ఇంకా ఎక్కువగా సప్లయి చేయబోతున్నారు. 1970లో వాటికి 1965 లోకన్నా రెండింతలు రసాయనిక ఎరువులను అందజేస్తారు.

ధాన్యం ఉత్పత్తిని పెంచడం అనేది, అత్యంత ప్రధానమైన కర్తవ్యంగానే వుంది. గతంలో, ప్రధానంగా పంటభూములను విస్తరింపజేయడం ద్వారానే ఈ సమస్యను పరిష్కరించుకొంటూ వచ్చారు. సాగుకు లాయకయిన భూమిని, మరింత ఎక్కువ ఫలప్రదంగా ఉపయోగించుకోవడం ద్వారా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ, ధాన్యం పండించే భూమిని విస్తరింపజేయడం కొంతవరకు కొనసాగిస్తూనే వుంటాయి. కాని, హెక్టారు ఒక్కంటికి పంట దిగుబడిని గరిష్ఠ పరిమాణానికి పెంచడమే ఇప్పుడు ప్రధాన కర్తవ్యం. వ్యవసాయరంగం మొత్తంమీదా, ప్రత్యేకంగా ధాన్యం ఉత్పత్తిలోనూ, అభివృద్ధి వేగాన్ని పెంచడానికి నిర్ణయాత్మకమైన విషయం ఇదే. పశు, ఉన్ని విషయంలో దేశం అవసరాలను త్వరగానూ, పూర్తిగానూ తీర్చగలిగేందుకు, వాటిని పండించే భూములను పెద్దగా విస్తరింపజేయడాన్ని ప్రణాళికలో ఎలపెట్టారు. బంగాళాదుంపలాంటి ముఖ్య పంటల, ఇతర కాయగూరలు, పత్తి, ఎల్లగిసె, తీపి దుంప పొద్దుతిరుగుడు పువ్వు, తేయాకు, పళ్లు, ద్రాక్షపంటల ఉత్పత్తిని మరింత పెంచేందుకు చాలా అవకాశాలను కలిగియున్నారు.

అన్ని మండలాల్లో భూసారాన్ని, వ్యవసాయంలో సామర్థ్యాన్ని పెంచేందుకు కృషి వచ్చే కొద్దిసంవత్సరాల్లో దేశవ్యాపిత స్థాయిలో జరుగ వలసి ఉంది.

విభిన్న భూసార, శీతోష్ణ పరిస్థితులు కల ప్రాంతాల్లో మనం వ్యవసాయం సాగించవలసి ఉంది. కొన్ని ప్రాంతాల్లో పంటలు తరుచుగా దారుణమైన అనావృష్టికి గురి అవుతున్నాయి. మరికొన్ని ప్రాంతాల్లో తేమ ఎక్కువై పాడవుతున్నాయి. నైసర్గిక పరిస్థితులు అనుకూలంగా లేని మండలాల్లో నిలకడగా అధిక పంటలు పండేలా చేసేందుకు, ఒక విస్తృతమైన భూసార అభివృద్ధి కార్యక్రమాన్ని అమలు జరపడం అవసరమని పార్టీ కేంద్రకమిటీ, ప్రభుత్వమూ భావిస్తున్నాయి. ముఖ్యంగా సోవియట్ యూనియన్ యూరప్ ప్రాంతంలోని మధ్య మండలాలు, బైలోరష్యా, బాల్టిక్ ప్రాంతం, రష్యన్ ఫెడరేషన్, ఉక్రైన్‌ల దక్షిణ ప్రాంతాలు, కజక్‌స్థాన్, మధ్య ఆసియా రిపబ్లిక్కులు మరికొన్ని ఇతర ప్రాంతాలలో ఇది అవసరం. ఇక ముందు జరగబోయే పార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశాల్లో ఒక దానిని ఈ సమస్యకే వినియోగించడం అవసరమేమో కూడా.

మానవ సమాజ సంపదలకు ఒక అపారమైన నిధి భూమి. వ్యవసాయక ఉత్పత్తికి అది పునాదికూడా. ఈ సంపదను భద్రపరచుకోవడం, ఫలప్రదంగా దానిని వినియోగించుకోవడమూ, భూసారాన్ని పెంచడమూ, గాలికీ, నీటికీ భూసారం కొట్టుకు పోకుండా నివారించడమూ, అవసరమయినచోట్ల అడవులను పెంచడమూ — వీటినన్నిటినీకూడా ముఖ్యమయిన ప్రభుత్వ సమస్యలుగా పరిగణించాలి.

మరొక సమస్యను కూడా దృష్టికి తేవడం అవసరమని కేంద్ర కమిటీ భావిస్తూంది. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో యంత్రాలను ఉపయోగించే సమస్య అది. ట్రాక్టర్లు, లారీలు, హార్వెస్టర్ కంబైన్లు ఇతర యంత్రాలు నానాటికి ఎక్కువగా గ్రామ సీమకు అందుతున్నాయి. అక్కడ మానవ శ్రమ పరిశ్రమల్లోని పని లక్షణాలను సంతరించుకుంటూంది. అయినా, యంత్రాల, ట్రాక్టర్ల వినియోగాన్ని తెలిపే అనేక ముఖ్య సూచీ సంఖ్యల్లో ఇటీవలి సంవత్సరాల్లో తగ్గుదల కనబడుతూంది. యంత్రాలను నడిపేవారు తమ పనులు వదలివెళ్ళిపోవడం జరుగుతూంది. దీని వల్ల పనివారి విషయంలో అస్థిరత ఏర్పడుతూంది దీనంతటివల్ల చిక్కులు కలుగుతున్నాయి. వ్యవసాయ యంత్రాల మరమ్మతులకు గల సమువాయాలను గరిష్టస్థాయికి విస్తృతంచేయాలి. "సెల్ఖోజ్ టెక్నికా" సంస్థలకూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రలకూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రలకూ ఆధునిక యంత్రసామగ్రిని సమకూర్చాలి. యంత్రాలను నడిపే వారికి ఇప్పటికన్నా మరింత మంచి తరిఫీదునూ,

ఇంకా ఎక్కువ భౌతిక ప్రోత్సాహకాలనూ ఇవ్వాలి. వ్యవసాయ రంగానికి యంత్రాల సప్లయిని నిరంతరం అధికం చేయడమూ, ఈ యంత్రాల మరమ్మతు, సర్వీసింగ్ సమస్యను మూలపట్టంగా పరిష్కరించడమూ. రకరకాల అర్హతలుగల యంత్ర చోదకుల తరిఫీదును మరింత మెరుగు పరచడమూ, లేకపోతే, ప్రస్తుత పరిస్థితుల్లో వ్యవసాయోత్పత్తిని పెంచాలన్న కర్తవ్యాన్ని జయప్రదంగా నెరవేర్చడం సాధ్యం కాదు.

వ్యవసాయ రంగంలోని ఉత్పాదక శక్తులను పెంచాలంటే, గ్రామసీమలోని సామాజిక సంబంధాలను మరింత అభివృద్ధి పరచడం అవసరం. సహజ ఆర్థిక వ్యవస్థ యొక్క సమిష్టి,వ్యవసాయక్షేత్ర ప్రభుత్వవ్యవసాయక్షేత్ర రూపాలు, రెండింటి శక్తిని అనేక సంవత్సరాల జీవితానుభవం అనుమానాలకు తావు లేకుండా ధ్రువ పరచింది. అయినా, అనేక సమిష్టి వ్యవసాయక్షేత్రాలను ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలుగా పునర్వ్యవస్థీకరించడానికి, ఇటీవలి సంవత్సరాల్లో, సమర్థనీయం కాని ప్రయత్నాలు జరిగాయి. మార్చి విస్తృత సమావేశం ఈ పరిస్థితిని చక్కబరిచింది.

సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు మూడవ అఖిలయూనియన్ మహాసభను జరిపేందుకు నిర్ణయం జరిగిన విషయం మీకు తెలుసు. వ్యావసాయక ఆర్థిక కొత్త నిబంధనలను గురించి ఆ మహాసభ చర్చిస్తుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పరిణామ క్రమంలో ఆ మహాసభ ఒక ప్రధానమయిన రాజకీయ సంఘటన కాగలదు. సమిష్టి వ్యవసాయక్షేత్ర వ్యవస్థను మరింత పటిష్టం చేసేందుకు అది తోడ్పడుతుంది.

సమిష్టి వ్యవసాయక్షేత్రా లిప్పుడు ఆర్థికంగా బలమయిన, అత్యధికంగా యాంత్రికీకృతమయిన ఆర్థిక వ్యవస్థలుగా పరిణతిచెందాయి. పరస్పరంగానూ, ప్రభుత్వసంస్థలతోనూ వాటికి గల సంబంధాలు చాల విస్తృతమయినాయి. సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల రాజకీయ, సాంస్కృతికస్థాయి అపారంగా పెరిగింది. జిల్లాల్లోనూ, మండలాల్లోనూ, ప్రాంతీయంగానూ, రిపబ్లిక్కుల్లోనూ, కేంద్రంలోనూ, ఎన్నికలద్వారా ఏర్పడె సమిష్టి వ్యవసాయక్షేత్ర సహకార సంస్థలను నెలకొల్పడం ఉపయోగకరంగా ఉంటుందేమో సలహా ఇవ్వవలసిందిగా మిమ్మల్ని కోరుచున్నాము.

వ్యవసాయ ఉత్పత్తిని మరింత పెంచడంకొరకూ సహజ సంపదలను, పాదార్థిక, సాంకేతిక, శ్రమశక్తి వనరులను అత్యంత ఫలప్రదంగా వినియోగించు

కుంటూ సమిష్టి వ్యవసాయక్షేత్రాలమధ్య ఉత్పత్తి, ఆర్థిక సంబంధాలను పెద్దగా విస్తృతం చేయడంకొరకూ, సరకులశుద్ధి, విక్రయాలకు సంబంధించిన వ్యవస్థను అభివృద్ధిపరచడంకొరకూ, సహకార ఆర్థిక వ్యవస్థవల్ల చేకూరే ప్రయోజనాలను మరింత పరిపూర్తిగా వినియోగించుకోడానికి, ఇటువంటి ప్రజాస్వామిక రూపంలో ఉండే మేనేజిమెంటు అవకాశం కలిగిస్తుంది

గత అనుభవాన్ని దృష్టిలోకి తీసుకొనే ఈ సూచనచేస్తున్నాము. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పరిణామ క్రమంలోని తొలిసంవత్సరాల్లో వాటి నిర్వహణకు, స్థానికంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల యూనియన్లతోనూ. ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్ర కేంద్రసంస్థతోనూ కూడిన ఒక వ్యవస్థ ఉండేదన్న విషయం మీకందరకూ తెలిసినదే వ్యవసాయదారులు వీటిని అధికార సంస్థలుగా పరిగణించేవారు.

ఇది లెనిన్ సహకార ప్రణాళికలోని భావాలను మరింత మూర్తీభవింప జేయడమూ, వాటిని మరింత అభివృద్ధి పరచడమే అవుతుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్ర వ్యవస్థ ఇంకా ఎక్కువ ప్రజాస్వామిక మయ్యేందుకు ఇది అవకాశం కలిగిస్తుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతు ప్రజానీకం ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక కార్యకలాపాల్లో ఎక్కువగా పాల్గొనేలా చేస్తుంది.

అదే సమయంలో, గ్రామసీమలోని ప్రభుత్వ సంస్థలుగా ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల పాత్రను తప్పకుండా ఇనుమడింపజేయాలి.

భారీ ఎత్తున సాగే సోషలిస్టు వ్యవసాయానికి ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో ప్రతి ఒక్కటీనూ, అన్ని విధాలా ఆదర్శప్రాయం కావాలి.

ఈ విధంగా, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలూ, రెండింటి యొక్క ఐశ్వర్యాభివృద్ధులకు సర్వశక్తులా దోహదం కూర్చడమే ప్రస్తుత దశలో మన కర్తవ్యం.

కామ్రేడ్స్, వ్యవసాయోత్పత్తిలో పెరుగుదలను సాధించడం అనేది తేలికైన విషయమేమీ కాదని పార్టీకి బాగా తెలుసు. వ్యవసాయాభివృద్ధికి ప్రాథమిక సాంకేతిక పనులను చాల ఎక్కువగా కేటాయించడం జరుగుతూ ఉన్నది కాబట్టి, ఇప్పుడు అంతా దానంతట అదే జరిగి పోతుందని అనుకోవడం పొరపాటు అవుతుంది. ప్రతి హెక్టారు భూమిని, పెట్టుబడి పెట్టిన ప్రతి ఒక్క రూబులు, ప్రతిఒక్క యంత్రమూ, ప్రతి ఒక్కటన్నూ ఎక్కువ పూర్తిగానూ, సమర్థవంతంగానూ, పొదు

పుగానూ, వినియోగమయేలా చూడడం పార్టీ, ప్రభుత్వ, వ్యవసాయ సంస్థలయొక్క వ్యవసాయరంగంలో పనిచేసే వారందరియొక్క కర్తవ్యం.

వ్యవసాయ ప్రణాళికలు పూర్తిగా నెరవేరడమనేది గ్రామ సీమల్లో పని చేసేవారు సృజనాత్మకమైన చొరవ, శక్తి సామర్థ్యాల మీదా, శ్రమశక్తిని చక్కగా వ్యవస్థీకరించడం మీదా, సమష్టి వ్యవసాయ క్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అధిపతులూ, వ్యవసాయ శాస్త్రజ్ఞులూ, పశుపోషణ నిపుణులూ, యంత్ర చోదకులూ, ఆర్థిక శాస్త్ర వేత్తలూ చేసేపని నైపుణ్యం మీద ఆధార పడి ఉంటుంది.

వ్యవసాయరంగాన్ని మరింత అభివృద్ధిపరచడంలో విజ్ఞాన శాస్త్రమును, ఉత్పత్తి విషయాల్లో అది సాధించిన విజయాలను ఉపయోగించుకోవడమూ, అత్యంత ప్రధాన పాత్రను నిర్వహిస్తాయి. ఆధునిక వ్యవసాయ, జీవ, ఆర్థికశాస్త్రాల సమస్యలను పరిష్కరించేందుకు శాస్త్రవేత్తలూ, ప్రవీణులూ సర్వశక్తులా కృషి చేస్తారనేందుకూ, వ్యవసాయాభివృద్ధికి సముచితమైన తోడ్పాటును అందజేస్తారనేందుకూ ఎట్టి సందేహమూ లేదు.

అన్ని ఉత్పత్తిరంగాలకూ నిపుణులైన సిబ్బందిని సమకూర్చడంద్వారానూ క్రియాత్మకమైన సహాయాన్ని ఇంకా ఎక్కువగా అందజేయడం ద్వారానూ, వాటిని మరింత పటిష్ఠంచేయడంపట్ల మండల, ప్రాంతీయ, జిల్లా పార్టీ కమిటీలు నిరంతరం శ్రద్ధవహించాలి. ప్రజల్లో నిర్మాణ, విజ్ఞానసంబంధమైన కార్యకలాపాలను మరింత ఉన్నతస్థాయికి పెంచాలి. సమష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని పార్టీ సంస్థల పనిని మరింత మెరుగుపరచాలి. వాటి కార్యకలాపాలను ఇంకా ఎక్కువచేయాలి.

ఆయా రిపబ్లిక్కులూ, ప్రాంతాలూ, మండలాలూ, జిల్లాల్లో ఉన్న పార్టీ స్థానిక ప్రభుత్వ, వ్యవసాయ, ట్రేడ్ యూనియన్, యువకమ్యూనిస్టు సంస్థలన్నీ, సమష్టి వ్యవసాయక్షేత్ర రైతులూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో పనిచేసే వారందరూ, సమష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకు కావలసిన వాటిని సప్లయి చేసే పరిశ్రమల్లోని కార్మికులూ, శాస్త్రవేత్తలూ, నిపుణులూ — వీరందరూ సోవియట్ ప్రజలకు సహజమైన శక్తి సామర్థ్యాలతోనూ, పట్టుదలతోనూ, వ్యవసాయభివృద్ధిని సాధించాలని పార్టీ నిర్దేశించిన మహత్తర కర్తవ్య నిర్వహణకు ఉత్సాహంతో పూనుకుంటారనీ, ఆ కర్తవ్యాన్ని గౌరవ ప్రదంగా నెరవేరుస్తారనే ప్రగాఢ విశ్వాసాన్ని ఈ మహాసభ తరఫున వ్యక్తం చేసేందుకు అనుమతించ వలసిందిగా కోరుతున్నాను.

కా[మేడ్స్ [పతినిధులారా, కొత్త పంచవర్ష [పణాళిక సోదర సోషలిస్టు దేశాల [పజల, పార్టీల ఆమోదాన్ని అండదండలనూ పొందిందన్న విషయం మనకు సంతృప్తిని ఇస్తుంది. ఇది మన శక్తినీ, ఉత్సాహాన్నీ, ఆత్మ విశ్వాసాన్నీ ఇనుమడింప జేస్తుంది. పెట్టుబడిగారీ దేశాల్లోని కమ్యూనిస్టులూ, మన మిత్రులందరూ కూడా కొత్త పంచవర్ష [పణాళికను ఆమోదిస్తున్నారు. కమ్యూనిజమనే గమ్యస్థానానికి చేర్చేమార్గాన మరొక విజయ సంరంభమైన ముందడుగుగా వారు దీనిని పరిగణిస్తున్నారు. మన [పణాళికలు వాస్తవిక దృష్టితో కూడినవన్న విషయాన్ని సోవియట్ దేశానికి హాని తలపెట్టేవారూ, ఎటువంటి భావరికమూలేని శ[తువులూకూడా ఒప్పుకొనక తప్పడంలేదు.

ఈ మహాసభ రూపొందించిన రాజకీయ పంథానూ, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధికై నిర్దేశించిన ఆచరణపూర్వక కార్య[కమాన్నీ అమలుజరపడం, సోవియట్ యూనియన్ ఆర్థిక, రక్షణ శక్తినీ, [పతిష్ఠనూ, పలుకుబడినీ మరింత పెంపొందజేస్తుంది. సా[మాజ్యవాదానికి అది మరొక గట్టి దెబ్బతీస్తుంది. కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టుదేశమూ, సోవియట్ [పజలూ సాధించిన [పపంచ [పాధాన్యం గల రాజకీయ, ఆర్థిక విజయంగా అది గణతికెక్కుతుంది.

పంచవర్ష[పణాళికను పూర్తిచేసేందుకు మనందరి కృషిని ఏకోన్ముఖంచేయడమే ఈనాడు ముఖ్యంగా కావలసినది. ఆయా సంస్థల సిబ్బంది పని విషయంలోనూ, జిల్లాలు, పట్టణాలు, మండలాలు, [పాంతాలు, రిపబ్లిక్కుల్లో ఆర్థికాభివృద్ధి విషయంలోనూ, [పస్తుత పరిస్థితుల్లో పార్టీసంస్థలపై ఇంకా ఎక్కువ బాధ్యతఉంది. పార్టీ రూపొందించిన [పణాళికలను నెరవేర్చే నిజమైన నిర్వాహకులుగా అవి ముందుకు రావాలి. [పజల్లో సృజనాత్మక చొరవనూ, పోటీపడే ఉద్యమాన్నీ అవి పెంపొందించాలి. కమ్యూనిస్టు కార్యాచరణ ఉద్యమానికి అవి అన్నివిధాలా [పోత్సాహ మివ్వాలి.

సాంకేతిక, ఆర్థిక రంగాలనూ వస్తూత్పత్తి నిర్వహణ రంగానికి సంబంధించిన ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంతో నిష్ణాతులు కావలన్న అతిముఖ్యమైన కర్తవ్యాన్ని పార్టీ అధికారులనూ, ఆర్థిక రంగంలోని అధికారులనూ పార్టీ నిర్దేశించిది. పారి[శామిక, వ్యవసాయ, నిర్మాణ, రవాణా రంగాల్లోని అధికారులందరూ కూడా నూతన పరిస్థితుల్లో ఉత్పత్తిని నిర్వహించే కళను పట్టుదలతో తప్పని సరిగా అభ్యసించాలి. [శమశక్తి వ్యవస్థీకరణకు సంబంధించిన సమస్యలను వారు సమర్థతతో

పరిష్కరించాలి. ఉత్పత్తి మేనేజిమెంటు సిబ్బందికు ఇచ్చే తరిఫీదునూ, ఇదివరకే శిక్షణ పొందిన వారికి తిరిగి ఇచ్చే తరిఫీదునూ, సమగ్రంగా మెరుగు పరచాలి.

ఆర్థిక రంగంలోని కొత్త మేనేజిమెంటు వ్యవస్థ శక్తి సామర్థ్యాలను అత్యధికంగా వినియోగించుకోవడం సాధ్యపడేందుకు వీలుగా, ఆ వ్యవస్థ నికరంగా అమలు జరగడానికి పార్టీ సంస్థలు సర్వశక్తులా దోహదం చూపాలి.

పై విషయాల సారాంశంగా తేలే అతి ప్రధానమైన అంశాలేమిటి?

మొదటిది: ఈ అన్ని సంవత్సరాల్లోనూ సోవియట్ ఆర్థిక వ్యవస్థ చాల వేగంగా అభివృద్ధి పొందుతూ వచ్చింది. దాని నిర్మాణంలో ముఖ్యమైన గుణాత్మక మార్పులు జరిగాయి. కొత్త పంచవర్ష ప్రణాళికను గురించిన ముసాయిదా ఆదేశాల్లో నిర్దేశించిన తక్షణ, సంక్లిష్ట కర్తవ్యాల నిర్వహణకు ముందుగా అవసరమయిన పరిస్థితులు దీనివల్ల ఏర్పడ్డాయి.

రెండవది: ఆర్థికవ్యవహారాల మేనేజిమెంటుకు సంబంధించిన అతి జటిలమయిన సమస్యలను సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సృజనాత్మకంగానూ, ధైర్యంగానూ పరిష్కరిస్తుందనీ, కాలపరీక్షకు నిలవలేని వాటి నన్నిటినీ, మన పురోగమనానికి ఆటంకం కలిగించే వాటినన్నిటిని విసర్జిస్తుందనీ, ప్రస్తుతం సమీక్షిస్తూన్న దశ నిరూపించింది. ఇటీవల జరిగిన విస్తృత సమావేశాలు మౌలిక ఆర్థిక సమస్యల పరిష్కారానికి సరియయిన మార్గాన్ని రూపొందించాయనీ, మన అభివృద్ధి వేగం మరింత పెరిగేందుకు యిది దారితీస్తుందనీ కేంద్ర కమిటీ భావిస్తూంది.

మూడవది: ప్రధాన పెట్టుబడిదారీ దేశాలతో ఆర్థిక పోటీలో సోవియట్ యూనియన్ తన స్థానాలను బలపరుచుకొంటూనే వచ్చింది. అధికమైన, ముఖ్యంగా అపారమైన వేగంతో వస్తూత్పత్తి క్రమంగా పెరగడం అనేది మన దేశంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ పరిణామ సూత్రమన్న విషయాన్ని గత కొద్ది సంవత్సరాల అనుభవం ధృవపరిచింది. ఇటువంటి అభివృద్ధిని సాధించడం పెట్టుబడిదారీ దేశాల తరంకాదు. పెట్టుబడిదారీ వ్యవస్థపై సోషలిస్టు వ్యవస్థకు గల ఒక నిర్వివాదమైన ఆధిక్యత ఇది.

కామ్రేడ్స్, పార్టీ 23 వ మహాసభ పట్ల సముచితమైన గౌరవసూచకంగా, దేశమంతటా సోషలిస్టు పోటీ ప్రారంభమయింది. శ్రామికుల విజయాలను గురించి దేశం నలు మూలల నుండీ మహాసభకు అసంఖ్యాకంగా నివేదిక లందుతున్నాయి.

కొత్త పంచవర్ష ప్రణాళిక తొలి సంవత్సరంలోని మొదటి మూడు మాసాలకు నిర్దేశించిన లక్ష్యాలను పారిశ్రామిక కార్మికులు ఈ మహాసభ ప్రారంభమయిన రోజునే పూర్తిచేశారు. లోహాలూ, విద్యుచ్ఛక్తి బొగ్గు, రసాయనిక ఎరువులు, సిమెంటు, రబ్బరు, మోటారుటైర్లు, యంత్రాలూ, యంత్రపరికరాలు, దుస్తులు, అల్లికదుస్తులు, చర్మంతో చేసిన పాదరక్షలు, కొన్నిరకాల ఆహార పదార్థాలు – ఇవన్నీ ప్రణాళిక లక్ష్యాలను మించి దేశానికి లభ్యమవుతాయి.

మాంసం, పాలు, వెన్న, గుడ్లు, తదితర పశు సంబంధమైన సరకులను ప్రభుత్వానికి అమ్మడం విషయంలో వ్యవసాయ రంగం పనివారు మార్చి 20 వ తేదీనాటికే సాధించిన ఫలితాలు, మొదటి మూడుమాసాల ప్రణాళిక లక్ష్యాలను మించి ఉన్నాయి. ట్రాక్టర్లు, తదితర వ్యవసాయ యంత్రాల మరమ్మతులు మొత్తం మీద పూర్తి అయాయి. దక్షిణాది మండలాల్లో వసంతకాలపు పంటకు విత్తనాలు నాటడం సాగుతూంది. ఈ విత్తునాటు సందర్భంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతులు, యంత్రాలను నడిపేవారూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల పనివారూ చాల ఉన్నతమైన నిర్మాణస్థాయిని ప్రదర్శిస్తున్నారు.

సోవియట్ ప్రభుత్వ వ్యవస్థ ఉదయించినప్పుడు వీరకార్మిక వర్గం ఎగుర వేసిన సోషలిస్టు పోటీపతాకం, మనదేశ ఆర్థికాభివృద్ధికై రూపొందించిన కొత్త పంచవర్ష ప్రణాళికను నెరవేర్చేందుకు పార్టీ, ప్రజా కృషిసాగించే కాలం పొడుగునా సమున్నతంగా ఎగురుతూ ఉండుగాక!

అపారమైన శక్తి సామర్థ్యాలూ, ఉత్సాహమూ తొణికిసలాడుతూన్న సోవియట్ ప్రజలు, కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణం అనే మహత్తర ఆశయం పేరిట, మహాద్భుతమైన శ్రామిక విజయాలను ఇంక ఎక్కువగా సాధించగలరని పార్టీ ప్రగాఢంగా విశ్వసిస్తూంది.

# III

## ప్రజల జీవనస్థాయి పెరుగుదల, విజ్ఞాన శాస్త్రము, సంస్కృతుల అభివృద్ధి

కామ్రేడ్స్, ఆర్థిక వ్యవస్థా, ఉత్పాదక శక్తులూ మరింత వేగంగా అభివృద్ధి పొందేలా చేయడం ద్వారా, కార్మికుల, రైతుల, మేధావుల, తదితర శ్రామికప్రజలందరి జీవనస్థాయి క్రమంగా పెరిగేందుకు అత్యంత అనుకూలమయిన పరిస్థితులను సోషలిస్టు వ్యవస్థ ఏర్పరిచింది. సోషలిస్టు వ్యవస్థలో ఆధిక్యత ప్రజా యాజమాన్యానిదే. మనిషి, మనిషిని దోచుకోవడం ఇందులో లేదు. ఉత్పత్తి సాధనాలకు సంబంధించినంతవరకు సమాజ సభ్యులందరూ సరిసమానులే - ఈ అన్ని కారణాలవల్ల, చేసిన పనియొక్క పరిమాణమూ, నాణ్యాన్నిబట్టి భౌతిక ప్రయోజనాల పంపిణీ అన్న న్యాయమైన సూత్రాన్ని అనుసరించడం ఈ వ్యవస్థ ఒక్కదానిలోనే సాధ్యం.

నానాటికి పెరుగుతూన్న సామాజిక సంపదకు అనుగుణంగా శ్రామికప్రజల్లో ప్రతి ఒక్కరి సిరిసంపదలు కూడా పెరుగుతున్నాయి. ప్రపంచంలోని అత్యధిక జాతీయాదాయాలలో సోవియట్ యూనియన్‌ది ఒకటి. అది నిరంతరంగా పెరుగుతూనే వుంది. దానితో పాటుగా శ్రామిక ప్రజల ఆదాయాలు కూడా పెరుగుతూనే ఉన్నాయి. జాతీయాదాయం గత అయిదేళ్ళలోనూ 33 శాతం పెరిగింది. నిరుడు అది 190,000 మిల్లియన్ల రూబుళ్ళను మించిపోయింది. ఇందులో రమారమి ముప్పాతిక భాగం 141,000 మిల్లియన్ల రూబుళ్ళను - సోవియట్ ప్రజల అవసరాలను తీర్చడానికి వినియోగిస్తాయి.

ఆర్థికాభివృద్ధి రంగంలో సాధించిన విజయాలను, ప్రజల జీవన పరిస్థితులను మరింత మెరుగు పరచేందుకై పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ పూర్తిగా ఉపయోగిస్తున్నాయి. ప్రస్తుతం సమీక్షిస్తూన్న దశలో ఫ్యాక్టరీ, ఆఫీసు పనివారి సగటు వేతనం 19 శాతం పెరిగింది. విద్య, ఆరోగ్యం, సాంస్కృతిక, వర్తక రంగాల్లో పనిచేసే వారూ, గృహవసతి సామాజిక సౌకర్యాల రంగంలో పనిచేసే వారితోసహా, ప్రజల

సౌకర్యాలకీ ప్రత్యక్షంగా సంబంధించిన శాఖల్లో పనిచేస్తున్న వారందరి వేతనాలనూ పెంచారు.

ఉన్ని, పట్టు, లినెన్ వస్త్రాలు, కొన్ని దుస్తులు, పిల్లల రెడీమేడ్ దుస్తులు, గడియారాలూ, చేతివాచీలు, కిళ్లు, కెమెరాలు, మందులు, మరికొన్ని వాడకంపై సరుకులు — వీటన్నిటి ధరలను అదే సమయంలో తగ్గించారు.

మన దేశంలో ప్రజల జీవస్థాయిని పెంచడంలో పౌరవినియోగ నిధులు చాల ముఖ్య పాత్రను నిర్వహిస్తాయి. ద్రవ్యరూపంలో సహాయమూ ఇతర చెల్లింపుల కింద 1965లో పౌరవినియోగ నిధులనుండి ప్రజలకు ముట్టినది 41,500 మిల్లియన్ల రూబుళ్లు. 1960లో ఈ మొత్తం 27,300 మిల్లియన్ల రూబుళ్లు. పింఛనలను పెంచటం, దేశభక్తియుత మహాయుద్ధంలో వికలాంగులయిన వారికీ, ఆ యుద్ధంలో చనిపోయిన సైనికుల సైనికాధికారుల కుటుంబాలకు అదనపు సహాయాన్ని అందజేయడం కింద ఈ నిధులను ఖర్చు చేశాయి. సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకు కూడా పింఛనులను అమలు పరచడం ఒక ముఖ్యమయిన సామాజిక చర్య. ఉచితంగా విద్యను బోధించే సాధారణ, వృత్తి, సెకండరీ, ఉన్నత విద్యాసంస్థల్లోనూ, పాఠశాలల్లోనూ, తరగతుల్లోనూ 70 మిల్లియన్ల మందికి పైగా పాల్గొంటున్నారు ఆసుపత్రుల, పాలిక్లినిక్‌ల, ఆరోగ్యకేంద్రాల, విశ్రాంతిసదనాల సంఖ్య ఏటేటా పెరుగుతూ ఉంది. 4 మిల్లియన్ల మందికి పైగా వైద్యులూ, ఇతర ఆరోగ్య సంరక్షక సిబ్బందీ, ప్రజల ఆరోగ్యాన్ని కాపాడుతున్నాయి. పాఠశాలకు పూర్వపు బోధనా సంస్థల్లోని బాలబాలికల సంఖ్య ఇంచుమించు రెట్టింపు పెరిగింది. ఇప్పుడు వారు సుమారు 8 మిల్లియన్ల మంది ఉన్నారు.

ముఖ్యమైన ఈ సామాజిక చర్యలను గురించి మనం సగర్వంగా చెప్పుకుంటాము. ఎందువల్లనంటే, ప్రతి ఒక్క పనీ ప్రజల ప్రయోజనాలకోసమే జరిగే సోషలిస్టు దేశంలో మాత్రమే ఇవి సాధ్యం.

గృహ నిర్మాణ స్థాయి పెరిగేలా చేయడానికి పార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ సర్వదా శ్రద్ధవహిస్తూ వచ్చాయి. నగరాల్లోనూ, కార్మిక వాడల్లోనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ మొత్తం 393 మిల్లియన్ల చదరపు మీటర్ల నివాస స్థలం గల భవనాలనూ, గ్రామాల్లో రెండు మిల్లియన్లకు పైగా ఇళ్లనూ గత అయిదేళ్ళలో నిర్మించారు. నగరాభివృద్ధి కార్యక్రమం ఎంతగానో పురోగమించింది.

గృహ నిర్మాణం చాల ఎక్కువగానే సాగిస్తున్నాము. అయినప్పటికీ గృహ వసతి సమస్య ఇంకా చాల తీవ్రంగానే ఉంది. ఈ సమస్యకు పార్టీ అత్యధిక ప్రాధాన్యాన్ని ఇస్తూంది. గృహ నిర్మాణానికి ఇంకా ఎక్కువ నిధులను కేటాయించడమూ, నిర్మాణ సౌకర్యాలను అధికంచేయడమూ, గృహ వసతి నాణ్యాన్ని పెంచడమూ అవసరమని పార్టీ భావిస్తూంది. ప్రభుత్వ పెట్టుబడులతో గృహ నిర్మాణాన్ని సాగించడంతో పాటు, గృహ నిర్మాణ సహకార సంస్థలను కూడా విరివిగా ప్రోత్సహించాలి. పట్టణాల్లోనూ, కార్మిక వాడల్లోనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ మొత్తం 480 మిల్లియన్ల చదరపు మీటర్ల నివాసస్థలంగల భవనాలను వచ్చే అయిదేళ్లల్లోనూ నిర్మించడానికి నిర్ణయం జరిగింది. అంటే అర్థం. గతఅయిదేళ్లల్లోకన్న వచ్చే అయిదేళ్లల్లో ప్రభుత్వ ధనంతోనూ, గృహ నిర్మాణ సహకార సంస్థల నిధులతోనూ 100 మిల్లియన్ల చదరపు మీటర్ల నివాస వసతి ఎక్కువగా నిర్మాణమవుతుందన్న మాట. అంతే కాకుండా గ్రామ ప్రజలూ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలూ, నిర్మించే ఇళ్ళు రెండు, లేక 2.5 మిల్లియన్ల వరకు ఉంటాయి. గృహ నిర్మాణంకిందా, సాంస్కృతిక నిర్మాణాలకిందా గత అయిదేళ్ళల్లో ఖర్చు పెట్టినది 35, 000 మిల్లియన్ల రూబుళ్ళకాగా, ఇప్పుడు 45, 000 మిల్లియన్లు ఖర్చు పెడతారు.

గృహ నిర్మాణ ప్రణాళికలు పూర్తి అయ్యేలాగా పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక, ట్రేడ్ యూనియన్ సంస్థలు చూడాలి. ఇళ్ళ సంరక్షణ, మరమ్మతులు మొదలయిన వాటి విషయమై అవి మరింత ఎక్కువ శ్రద్ధవహించాలి. గృహవసతి పంపిణీ సమర్థవంతంగానూ, లోప రహితంగానూ ఉండేలా అవి చూడాలి. జరుగుతూన్న పని ప్రజలకి పూర్తిగా తెలిసేలాగా కూడా అవి చూడాలి.

గ్రామసీమలోని నిర్మాణం వెనుక బడి ఉండడాన్ని మనం ఇక ఎంతమాత్రమూ సహించడానికి వీలులేదని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ భావిస్తూంది. గ్రామసీమలో ఇళ్లనిర్మాణం విషయంలోనూ, గ్రామాలు సరియయిన పథకం ప్రకారం ఉండడము వాటి అభివృద్ధుల విషయంలోనూ అనేక సంవత్సరాలుగా శ్రద్ధతక్కువగా ఉండడం విచారకరం. గ్రామాల్లో ఇళ్ల నిర్మాణాన్ని సాంస్కృతిక, తదితర సౌకర్యాల నిర్మాణాన్ని పెంచితీరాలి. ఈ విషయంలో కార్యాచరణకు ఉపక్రమించేలాగా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను పురిగొల్పి తీరాలి.

కాంగ్రెస్, ప్రజలకు ఆహార పదార్థాల, వాడకం సరుకుల సప్లయిని పెంచేం

దుకూ, సోవియట్ చిల్లర వ్యాపారాన్ని విస్తృతం చేసేందుకూ గత కొద్ది సంవత్సరాల్లోనూ పార్టీ కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ కొన్ని కొత్త చర్యలను రూపొందించాయి. 1965 లో చిల్లర వర్తకం మొత్తం 1,04,600 మిల్లియన్ల రూబుళ్ళ మేరకు జరిగింది. ఇది 1960 లో జరిగినదానికన్నా 34 శాతం ఎక్కువ.

ఈ రంగంలో మనం చాల ఎక్కువ అభివృద్ధిని సాధించామన్న విషయం మహాసభ ప్రతినిధులకు తెలుసు. రొట్టె, పిండితో చేసిన ఆహార పదార్థాలు, మేకరోని (గోధుమ పిండితో చేసిన ఒక తినుబండారము). సేమియానూ, పాలు, పాడి పదార్థాలు, గుడ్లు, వెన్న, వనస్పతి, పంచదార, చాకొలెట్లు మొదలయినవాటి సప్లయిలకు ఎటువంటి అంతరాయాలూ లేవు. నిజాని వీటి అమ్మకం గతంలో ఏ సంవత్సరంలో లేనంత ఎక్కువగా వుంది.

ఇంత జరుగుతున్నప్పటికీ కూడా, కొన్ని సరుకుల ఉత్పత్తి చాలినంతగా లేదు. అక్కడక్కడ కొన్నిసందిగ్ధతలు పరిమితంగా ఉన్నాయి. పాలు పుష్కలంగా సప్లయి అవుతున్నప్పటికీ పెరుగుతో చేసిన పదార్థాలూ, జున్నూ చాలినంతగా ఉత్పత్తి కావడంలేదు. ఆహార శాస్త్రాన్ననుసరించి తయారు చేసిన సరుకుల సప్లయి చాల స్వల్పంగా ఉంది. పెద్దగోధుమ, బియ్యం విషయంలో అవసరాలు పూర్తిగా తీరడంలేదు. కొత్త పంచవర్ష ప్రణాళికలో కేంద్రకమిటీ వ్యవసాయ రంగానికి చాల పెద్ద లక్ష్యాలను నిర్దేశించింది. ఇవి నెరవేరడంతో, ఆహార పదార్థాల విషయంలో నానాటికి పెరుగుతున్న అవసరాలను తీర్చడం మరింత సాధ్యమవుతుంది.

ప్రజల ఆదాయాలు పెరగడం వల్ల, గత కొద్ది సంవత్సరాల్లోనూ వాడకం సరుకుల గిరాకీ బాగా పెరిగింది. అయినా పరిశ్రమలు 1965 లో 9,000 మిల్లియన్ మీటర్ల వస్త్రాలనూ, 486 మిల్లియన్ జతల పాదరక్షలనూ ఉత్పత్తి చేశాయి. గృహ పరికరాల అమ్మకం ఎక్కువయింది. 3,300,000 టెలివిజన్ సెట్లు. 4,800,000 రేడియోలు, ఇంచుమించు 1,600,000 రెఫ్రిజిరేటర్లు. 3,000,000 లకుపైగా బట్టలు ఉతికే యంత్రాలు మొదలయినవి నిజాని అమ్మకమయ్యాయి. ఇది పర్వాలేదనే అనుకోవచ్చు కామ్రేడ్స్.

అయినప్పటికీ, వాడకంసరుకులనుఉత్పత్తిచేస్తున్నలఘు, తదితరపరిశ్రమలను గురించి శ్రామిక ప్రజలుచేసే ఫిర్యాదులకు గట్టి ఆధారా లున్నాయి. అవసరమయిన కొన్నివాడకం సరుకులు ఇంతవరకు మార్కెట్టుకు చాలినంతగా సప్లయి కావడం లేదు. పిల్లలకు ఆకర్షణీయమైన దుస్తులనూ, కావాలనుకున్న దిరీసూ, సూటూ లేదా

ఓవర్ కోటులూ, మనసుకు నచ్చిన కాలిజోళ్లనూ కొనుక్కో గలగడం ఎల్లప్పుడూ సాధ్యంకావడంలేదు. సరుకులకు ఉన్న గిరాకిని, కొనుగోలు దారుల అభిరుచులనూ దృష్టిలో ఉంచుకుంటున్నది వాడకం సరకుల ఫ్యాక్టరీలన్నీకాదు. దుస్తుల, వస్త్రాల జోళ్లఫ్యాక్టరీలు తయారుచేస్తూన్న సరకులలో అనేకం నాసిరకంగా ఉన్నాయి.

కామ్రేడ్స్, ఈ పరిస్థితిని చక్కబరచడానికి మనం కష్టపడి పని చేయవలసి ఉంది. నానాటికి పెరుగుతూన్న వాడకంసామగ్రుల అవసరాలు వచ్చే అయిదేళ్లల్లోనూ మరింత పూర్తిగా తీరేలా చూడడం అవసరం. అలా చేయడంలో, సరకుల నాణ్యాన్నీ, ఆకారాన్ని మెరుగు పరచడం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపవలసి ఉంది.

వాడకం సరకులను ఉత్పత్తి చేసే లఘు, ఆహార, రసాయనిక, తదితర పరిశ్రమలకు చెందిన ఫ్యాక్టరీల నిర్మాణాన్ని బాగా పెంచడానికి నిర్ణయం జరిగింది. 1966–70 లో ఇందుకోసం సుమారు 15,000 మిల్లియన్ల రూబుళ్ళను కేటాయిస్తాము. ఇది, గత అయిదేళ్లల్లోనూ ఖర్చు చేసినదానికన్నా ఇంచుమించు రెండింతలు ఎక్కువ. లఘు, ఆహార పరిశ్రమలకూ, చిల్లర వర్తక రంగానికీ, సామాజిక సౌకర్యాలకూ కొత్తరకం యంత్రపరికరాలను అమర్చడం యొక్క ప్రభావం, వాడకం సరకుల ఉత్పత్తి పెరుగుదల పైన, ఆ సరకుల నాణ్యాన్ని మెరుగు పరచడంపైన చాల ఎక్కువగా ఉంటుంది.

వాడకం సరకుల ఉత్పత్తిని, ప్రభుత్వ స్థాయిలలోని ప్రధాన కర్తవ్యంగా పార్టీ సంస్థలు ప్రభుత్వ సంస్థలూ, మంత్రిత్వశాఖలూ, వివిధ సంఘాలూ, ఫ్యాక్టరీలూ పరిగణించాలి. లఘు, ఆహార పరిశ్రమలకు చెందిన ఫ్యాక్టరీల్లో మాత్రమే కాకుండా తక్కిన పరిశ్రమలు అన్నింటిలోనూకూడా వాడకం సరుకుల ఉత్పత్తిని పెంచేందుకూ ప్రస్తుతమున్న అవకాశాలను, ఇప్పటికన్నా మరింత పూర్తిగా వినియోగించుకోవాలి. గ్రామాల్లో లభ్యమయే మనుష్య సంపదనూ, ముడి సరుకులనూ మరింత ఎక్కువ ఫలదాయకంగా ఉపయోగించుకున్నట్లయితే అదనంగా ఇంకా చాలా ఎక్కువ సరుకులను తయారు చేసుకోవచ్చు. పెట్టుబడులు ఏమంత పెద్దగా అవసరం లేకుండానే ఇది సాధ్యమవుతుంది. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లో అన్ని ఖర్చులకు పోను మిగులుదేలే పంటలనూ, అడవిపళ్లనూ, స్థానికంగా లభ్యమయ్యే ప్రకృతి సిద్ధమయిన పదార్థాలనూ శుద్ధిచేసే ఆహారపదార్థాలుగా తయారుచేసే వివిధ అనుబంధ కర్మాగారాలు మొదలయిన వాటి అభివృద్ధికి మనం ఇంకా ఎక్కువ అవకాశం కలిగించాలి.

విక్రయశాలలు, పారిశ్రామిక శీతలకేంద్రాయా. గిడ్డంగులు, తాత్కాలికంగా సరకులు ఉంచుకునేందుకు వసతి మొదలయిన అనుబంధ వర్తక సౌకర్యాలను మరింత ఎక్కువగా నిర్మించేందుకు నిర్ణయం జరిగింది. పట్టణాల్లోనూ, గ్రామల్లోనూ వర్తక రంగంలో పనిచేసేవారూ, వాడకందారుల సహకార సంఘాల్లో పనిచేసేవారు చిల్లర అమ్మకాలను అభివృద్ధి చేయడంలో నిర్ణయాత్మక పాత్రను నిర్వహిస్తారు. ఎందువల్లనంటే, ప్రజలకు అత్యంత సౌకర్యముగా ఉండే కొత్త కొత్త వర్తక రూపాలను అభివృద్ధి చేసి, మెరుగు పరచ వలసిన పని వారిది.

గ్రామసీమలోకూడా ప్రజలకుగల సాంఘిక సౌకర్యాలను సమగ్రంగా అభివృద్ధి పరచడం చాలఅవసరం. భోజన శాలలనూ, లాండ్రీలనూ, క్షౌర శాలలనూ. శిరోజాలంకరణ శాలలనూ, డ్రై వాషింగ్ సంస్థలనూ, కుట్టు, దుస్తుల మరమ్మతు సంస్థలనూ ఇంకా ఎక్కువగా ఏర్పాటు చేయడమూ, భావనాశక్తి, చొరవాగల సిబ్బందిని పౌర సౌకర్యాల రంగానికి సమకూర్చడమూ అవసరం.

ఈ చర్యలన్నీ కనుక అమలు జరిగితే, ఆహార పదార్థాల, పారిశ్రామిక సరకుల సప్లయిని మనం అభివృద్ధి పరచగలుగుతాము, చిల్లర అమ్మకాలను పెంచ గలుగుతాము.

కామ్రేడ్స్. సోవియట్ ప్రజల భౌతిక సుఖసంపదలను పెంచాలన్న విషయానికి మన పార్టీ అత్యంత ప్రాధాన్యాన్ని ఇస్తుంది. ఆర్థికాభివృద్ధిని సమకూర్చగల ఆర్థిక సాధనాల నన్నిటినీ వినియోగించడానికి కృషిసాగిస్తుంది. వస్తూత్పత్తినీ, శ్రామిక ఉత్పాదక శక్తినీ, జాతీయాదాయాన్ని పెంచడంద్వారా, వచ్చే అయి దేళ్ళల్లో సోవియట్ ప్రజల జీవన స్థాయిలో మరికొంత అభివృద్ధిని సాధించుతాము. జనాభాలో మనిషి ఒక్కొంటికీ వాస్తవాదాయాలు అయిదేళ్ళల్లో సుమారు 30 శాతం పెరుగుతాయి.

ఫ్యాక్టరీ, ఆఫీసు పనివాళ్ల వేతనాలు పెరగడమూ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు చేసే పనికి ప్రతిఫలం అధికం కావడమూ, ఆదాయాల పెరుగుదలకు ప్రధాన సాధనాలుగా ఉండాలన్నది సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ అభిప్రాయం. వేతనాల సమస్య ఒక ప్రధానమైన రాజకీయ, ఆర్థిక సమస్య. దీని పరిష్కారం, మిల్లియన్ల కొలది ప్రజల ప్రధాన ప్రయోజనాలకు సంబంధించిన విషయం. ఈ అయిదేళ్లల్లోనూ జాతీయ ఆర్థిక రంగంలోని కనీస వేతనాన్ని నెలకు 60 రూబుళ్లకు పెంచాలని తలపెట్టాము. ఈ కొత్త కనీస వేతన నిర్ణయం వల్లనూ,

ఫ్యాక్టరీ, ఆఫీసు పనివారిలో మధ్యతరహా వేతనాలు పొందే వారి రోజువేతనాలు నెలజీతాల్లో జరిగిన పెరుగుదల కింద సంవత్సరానికి 12,500 మిల్లియన్ల రూబుళ్లు ఖర్చవుతుంది. ఇది చాల పెద్దమొత్తమే.

సుదూర ఉత్తరాది ప్రాంతాల్లోనూ, దూరప్రాచ్యంలోనూ, సైబీరియాలోనూ పనిచేస్తూన్న వారి వేతనాల పెరుగుదలనూ, ద్రవ్యరూప సౌకర్యాలనూ పెంచడం జరుగుతుంది. ఆ ప్రాంతాల్లో ఇళ్లు, పాఠశాలలూ, ఆసుపత్రులూ, పాఠశాలలకు పూర్వపు బోధనా సంస్థలూ మొదలయిన సాంస్కృతిక, సామాజిక సౌకర్యాల నిర్మాణం కింద చాల ఎక్కువ పెట్టుబడి పెట్టాలని కూడా నిర్ణయం జరిగింది. చాల ప్రధానమయిన ఈ ఆర్థిక మండలాలను అభివృద్ధి పరిచేందుకు ఇవి ఎంతైనా తోడ్పడగలవు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో పారితోషికాలను గురించి ఒక్కమాట. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రాబడుల పంపిణీ విషయంలో ఇప్పుడే అనుసరిస్తూన్న పద్ధతి, వ్యవసాయదారుల శ్రమకు చెల్లించే ప్రతిఫలంలో తరుచు హెచ్చు తగ్గులను కలిగిస్తూంది. చేసినపని క్రింద స్థిరమైన రాబడికి అనేక సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో హామీ లేదు. సమిష్టి వ్యవసాయ దారుల శ్రమకు ఖచ్చితమైన నెలసరి ఆదాయాన్ని రాబోయే సంవత్సరాల్లో అమలు జరుపుతాము. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని పనివారికి అదేమోస్తరు పనులకూ, పనివేగానికీ చెల్లించే వేతనాల స్థాయిని ఆ ఆదాయాలు అందుకునేలా చేయడానికి తగు ఏర్పాట్లు జరుగుతున్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ఉత్పత్తిని అభివృద్ధి చేయడంలోనూ, సమిష్టి వ్యవసాయ దారుల జీవన స్థాయిని పెంచడంలోనూ ఇదొక ప్రధానమైన కొత్తదశ అవుతుంది.

వేతనాలను పెంచడమూ, సవరించడమే కాకుండా, వస్తూత్పత్తి, శ్రామిక ఉత్పాదక శక్తీ, పెరిగేకొద్దీ ఆయా సరకుల చిల్లర ధరలను తగ్గించాలని కూడా కొత్త పంచవర్ష ప్రణాళికలో ఉద్దేశించాము. ప్రజల జీవనస్థాయిని పెంచేందుకు ఇదికూడా దోహదం చేకూర్చుతుంది.

కామ్రేడ్స్, వారానికి అయిదు రోజులు మాత్రమే పని. రెండురోజులు సెలవు పద్ధతిని, ప్రయోగాత్మకంగా అమలు జరపడానికి ఇవనోవో, పెర్మ్, దిన్ప్రోపెత్రోవ్స్క్ మొదలయిన కొన్ని ప్రాంతల్లోని కొన్ని పారిశ్రామిక సంస్థలకు ఇటీవల అనుమతి ఇచ్చాము. సరియయిన నిర్మాణ, సాంకేతిక చర్యలు

తీసుకున్న సందర్భాల్లో ఈ సంస్థల్లో ఉత్పత్తి ప్రస్ఫుటంగా పెరిగిందని అనుభవం నిరూపించింది.

ఈ అనుభవాన్ని బట్టి శ్రామిక ప్రజలు చేసిన అనేక సూచనలను పాటించి, వారానికి 41 గంటలు పనివిధానాన్ని అమలులో ఉంచుతూనే వారానికి అయిదు రోజులు మాత్రమే పని, రెండు రోజులు సెలవు పద్ధతిని పూర్తిగా అమలులోకి తేవడం సాధ్యమని కేంద్ర కమిటీ భావిస్తూంది. ఫ్యాక్టరీ, ఆఫీసు పనివారు ఈ కొత్త పద్ధతికి పరివర్తన చెందడం, ప్రజలకూ, మన దేశానికీ లాభదాయకంగా ఉండేలాగా, క్రమక్రమంగా జరగాలి. ఈ పరివర్తన ఆయా సంస్థల సంసిద్ధతపై ఆధారపడి జరగాలి.

వారానికి అయిదు రోజులు పని విధానాన్ని అమలు జరపడం పని పరిస్థితుల మరింత మెరుగయేందుకూ, ఫ్యాక్టరీ పనివారూ, ఆఫీసు పనివారూ తమ విశ్రాంతి సమయాన్ని ఎక్కువ ఫలప్రదంగా ఉపయోగించుకోడానికీ అదనపు అవకాశాన్ని కలిగిస్తుంది. అందుచేత మన సమాజంపైన దాని ప్రభావం చాల ఎక్కువగా ఉంటుంది. విశ్రాంతి వినోదాలకూ, పిల్లల పెంపకానికీ, పనిని అధ్యయనాన్ని జోడించేందుకూ, సాంస్కృతిక, సాంకేతికస్థాయిని పెంచుకోడానికీ పనివారికి మరింత ఎక్కువ తీరిక దొరుకుతుంది.

కామ్రేడ్స్, తమ జీవితంలో అధిక భాగాన్ని శ్రమకు అంకితంచేసి, ఇప్పుడు రిటైరయిన వారి శ్రేయస్సుపట్ల శ్రద్ధ వహించడం అనేది సోషలిస్టు ప్రభుత్వం తప్పని సరిగా నిర్వహించవలసిన బాధ్యత. పెట్టుబడిదారీ దేశాల్లోలాగా కాకుండా, సోవియట్ యూనియన్‌లో పింఛనలను పూర్తిగా ప్రభుత్వ, పౌర వినియోగ నిధుల నుండే చెల్లిస్తారు. పింఛనుల కింద ప్రస్తుతం మనం ఏటా 11,000 మిల్లియన్ల రూబుళ్లను ఖర్చు పెడుతున్నాము. జాతీయాదాయంలో ఇది గణనీయమైన భాగం.

వచ్చే అయిదేళ్ళల్లోనూ పింఛనులపథకాన్ని మరింత అభివృద్ధి పరచదలచుకున్నాము. ముఖ్యంగా ఈ దిగువ చర్యలను తలపెట్టాము.

ఫ్యాక్టరీల్లోనూ, ఆఫీసుల్లోనూ పనిచేసేవారికి కనీస వార్ధక్య పింఛన్ని పెంచడము;

సమష్టి వ్యవసాయదారుల్లో పింఛను పుచ్చుకోదగిన వయసు స్త్రీలకు 55 సంవత్సరాలు, పురుషులకు 60 సంవత్సరాలని నిర్ణయించి తద్వారా ఫ్యాక్టరీ ఆఫీసు

పనివారి పింఛనుల చట్టంలో నిర్వచించిన వార్ధక్య పింఛనుల విధానాన్ని వారికి కూడా వర్తింపజేయడము,

సమిష్టి వ్యవసాయదారులకు కనీస వార్ధక్యపింఛన్ని పెంచడము, ఫ్యాక్టరీ, ఆఫీసు పనివారి విషయంలో పింఛను నిర్ణయించేందుకు అనుసరిస్తూన్న పద్ధతిని వారికి కూడా వర్తింపజేయడము.

ఫ్యాక్టరీ కార్మికుల విషయంలోనూ, తక్కిన గ్రామీణ ప్రజలు యావన్మంది విషయంలోనూ, వికలాంగులకు ద్రవ్యరూప సౌకర్యాల పథకాన్ని అభివృద్ధి పరచడము.

ఫ్యాక్టరీ ఆఫీసు పనివారిపై ఆదాయపన్నును తగ్గించడమూ, రద్దుచేయడమూ ఇకముందుకూడా కొనసాగుతుంది.

గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ నివసించే ప్రజల జీవన స్థాయిల సారూప్యతను మరింత పెంచేందుకూ, అదే సమయంలో సోవియట్ యూనియన్ దేశమంతటా సాధారణ జీవన స్థాయిని పెంచేందుకూ, చాల ముఖ్యమయిన కొత్తచర్యలను తలపెట్టడం, నూతన పంచవర్ష ప్రణాళికలోని ఒక ప్రధానాంశం. అలాచేయడం ద్వారా పట్టణానికీ, గ్రామానికీ మధ్య, మానసిక శ్రమకు శారీరక శ్రమకూ మధ్య ఉన్న ప్రధానమైన వ్యత్యాసాలు అంతరించిపోయే సమయాన్ని త్వరితం చేయడంలో మనం మంచి కృషిని జరిపిన వారమవుతాము. కార్మిక, కర్షక వర్గాల దుర్భేద్యమైన మైత్రీ, సోవియట్ ప్రజల ఏకశిలాసదృశమైన సమైక్యతకూ మరింత బలం చేకూర్చడమే ఈచర్యలన్నిటి యొక్క ప్రధానమైన రాజకీయ ప్రభావం. మనపార్టీ, సోవియట్ ప్రభుత్వమూ సాధించిన అద్భుతమైన ఒక కొత్తవిజయంగా అవి రూపొందుతాయి.

కామ్రేడ్స్, ఇదివరకు ఏనాడూ కనీవినీ ఎరుగనంతటి వడిగా శాస్త్రీయ అభివృద్ధి జరగడం, నేటి మన కాలంలోని అతి ముఖ్యమైన విశేషం. భౌతిక, సాంస్కృతిక జీవితంలోని అన్నివిషయాలపైనీ విజ్ఞాన శాస్త్రం నానాటికి మరింత ఎక్కువగా ఘన ప్రభావాన్ని ప్రసరిస్తూంది. చాల విస్తృతమైన శాస్త్ర పరిశోధనా, ఆ పరిశోధన ఫలితాలను త్వరత్వరగా వస్తూ ఉత్పత్తి రంగంలో ప్రవేశపెట్టడమూ లేనిదే, ఈనాడు ఉత్పాదక శక్తుల పెంపుదలలోనూ, సాంకేతిక ప్రగతిలోనూ ఎక్కువ వేగాన్ని సాధించలేము. విజ్ఞాన శాస్త్రం ప్రత్యక్షంగా ఒక ఉత్పాదక శక్తిగా రూపొందడం మానవ శ్రమను మూలమట్టంగా మార్చివేస్తూంది. సోషలిస్టు పరిస్థితుల్లో విజ్ఞాన

శాస్త్రం మానవశ్రమ స్వభావానికి కొత్త రూపాన్నివ్వడమే కాకుండా, మానవుని భౌతిక, సాంస్కృతిక జీవిత స్వరూపాన్ని కూడా మార్చి వేస్తూంది.

అసంఖ్యాకులైన ప్రసిద్ధ శాస్త్ర వేత్తలను కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజలూ తరిఫీదు చేశారు. వీరు కమ్యూనిస్టు ఆశయానికి అంకితులు. నేటి అత్యంత జటిలమైన శాస్త్ర సమస్యలను పరిష్కరించ గల సమర్థులు. దేశంలోని 4,650 పరిశోధక సంస్థల్లోనూ, ఉన్నత విద్యా సంస్థలకు చెందిన శాస్త్ర విభాగాల్లోనూ ఈ నాడు 6,60,000 ల మందికిపైగా విజ్ఞాన శాస్త్ర రంగానికి చెందిన సిబ్బంది పనిచేస్తున్నారు. ప్రపంచ విజ్ఞానశాస్త్రరంగలోని మొత్తం సిబ్బందిలో వీరు నాలుగోవంతు.

సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్ర అకాడమీని చూచుకొని మనం గర్వ పడుతున్నాము. పార్టీ, ప్రజలూ దానిని అత్యంత శ్రద్ధతోనూ, జాగ్రత్తగానూ చూచుకొంటున్నారు. మన దేశానికీ, ప్రపంచ నాగరికతకూ అది స్వార్థరహితం గానూ, విధేయతతోనూ సేవచేస్తూంది. మన దేశానికి కీర్తితెచ్చిన సోవియట్ విజ్ఞానశాస్త్ర మహత్తర విజయాలు, సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్ర అకాడమీ కృషితో ప్రత్యక్షంగా ముడిపడివున్నాయి.

విజ్ఞానశాస్త్ర అకాడమీ, యూనియన్ రిపబ్లిక్కుల్లోని విజ్ఞానశాస్త్ర సంస్థలూ, ప్రస్తుతం సమీక్షిస్తూన్న కాలంలో మరింత విస్తృతమవుతూనే వచ్చాయి. ఇంకా ఎక్కువగా బలపడుతూనే వచ్చాయి. ప్రతిభావంతులైన శాస్త్రవేత్తలూ, పరిశోధకులూ చాలమంది వాటిలో అభివృద్ధి చెందారు. జాతీయ ఆర్థిక సమస్యలను పరిష్కరించడంలోనూ, సాంస్కృతిక అభివృద్ధిరంగంలోనూ, ఆసూజాతుల రిపబ్లిక్కుల్లో పరిశోధక సిబ్బందికి తరఫీదు నివ్వడంలోనూ వీరు క్రియాత్మకంగా పాల్గొంటున్నారు. సోవియట్ యూనియన్ విజ్ఞానశాస్త్ర అకాడమీయొక్క సైబీరియా శాఖను ఏర్పరచడం విజ్ఞానశాస్త్రరంగం అభివృద్ధిక్రమంలో ఒక ముఖ్యమైన ముందడుగు.

సోవియట్ శాస్త్రవేత్తలు వస్తూత్పత్తి రంగంలో చాల సమర్థవంతమైన కొత్త పద్ధతులను ప్రవేశపెట్టేందుకు తోడ్పడ్డారు. శక్తివంతమైన అణుశక్తి పరిశ్రమనూ, అణుశక్తి ఇంజినీయరింగ్ పరిశ్రమనూ నిర్మించారు. బ్రహ్మాండమైన ఖనిజ సంపదలను వినియోగంలోకి తెస్తున్నారు. వివిధ పంటలకు మేలురకపు విత్తనాలను తయారు చేస్తున్నారు. గణిత, పదార్థవిజ్ఞాన, రసాయనిక, జీవ, వైద్య,

భూగర్భ శాస్త్రాల్లోనూ, విజ్ఞానానికి సంబంధించిన తక్కిన శాఖల్లోనూ, గొప్ప పురోగమనాన్ని సాధించడం జరిగింది.

విశ్వాన్నీ, రోదసినీ పరిశోధించడంలో సోవియట్ విజ్ఞానశాస్త్రం సాధించిన ఘనవిజయాలను సమస్త ప్రపంచమూ గుర్తించింది. రోదసీ పరిశోధనకు సంబంధించిన అనేక రంగాల్లో సోవియట్ యూనియన్ ప్రథమస్థానం అలంకరిస్తూంది. ప్రపంచంలో తొలిసారిగా కృత్రిమ ఉపగ్రహ ప్రయోగము, తొలిసారిగా మానవుని రోదసీయాత్ర, రోదసిలో తొలిబృందయాత్ర, మహిళచే తొలిసారిగా రోదసీ యాత్ర, చివరిదయినా దేనికీ తీసిపోని ఘనవిజయం – రోదసిలో తొలిసారిగా మానవుడే నడయాడడమూ – ఇవి ఇందుకు ఉదాహరణలు.

స్వయంచాలక రోదసీ పరిశోధనా కేంద్రం "లూనా–9" చంద్రో పరితలంపై మెల్లగా దిగడం రోదసీ పరిశోధనలోనూ, గ్రహాంతరయాన పరిణామంలోనూ ఒక ముఖ్యమయిన ముందంజ. చంద్రునిపైనున్న ప్రకృతి దృశ్యాల్ని ఫోటోలుతీసి ఈ సోవియట్ పరిశోధనా కేంద్రం భూమిమీదికి ప్రసారం చేసింది. అటువంటి ఫోటోలు ప్రపంచంలో అవే మొదటివి. వీటికి గల శాస్త్రీయ ప్రాధాన్యం అపారం.

"వీనస్ – 2" "వీనస్ – 3" స్వయంచాలక కేంద్రాలు శుక్రగ్రహయానంలో అపారమైన శాస్త్రీయ సమాచారాన్ని అందజేశాయి. సోవియట్ దేశ చిహ్నం ముద్రితమైన పతకాన్ని శుక్రగ్రహం మీదికీ చేరవేశాయి. వీటి శుక్రగ్రహయానం సోవియట్ విజ్ఞాన శాస్త్రం సాధించిన సరికొత్త విజయం.

సోవియట్ విజ్ఞాన శాస్త్రానికి ఈ దిగ్విజయాలను సమకూర్చినందుకు సోవియట్ శాస్త్రవేత్తలకూ, రూపకల్పన నిపుణులకూ, ఇంజినీయర్లకూ, సాంకేతిక నిపుణులకూ, కార్మికులకూ, మహోన్నతమైన మన రోదసీ యాత్రికులకూ. ఈ మహాసభ వేదికనుంచి, మరొకసారి హృదయ పూర్వక అభినందనలను అందజేసేందుకు అనుమతించ వలసిందిగా కోరుతున్నాను.

మన విజ్ఞాన శాస్త్రరంగం గొప్ప ప్రతిష్ఠను ఆర్జించింది. నిర్వివాదమైన ఘన విజయాలను సాధించింది. అయినప్పటికీ, దాని అభివృద్ధిని కుంటుపరుస్తూన్న లోపాలను గురించికూడా ప్రస్తావించడం అవసరం. పూర్తి అయిన పరిశోధనా ఫలితాలను వస్తూత్పత్తి రంగంలో ప్రవేశపెట్టడంలో మందకొడితనం ఈ లోపాలన్నిటిలోకీ చాల తీవ్రమయినది. సిద్ధాంత సంబంధమైన పరిశోధనకూ, అది సాంకేతిక, రూపకల్పన పరిణామం చెందడానికీ మధ్య సమర్ధనీయం కాని కాల

యాపన జరుగుతూఉంది. కొత్తగా కనిపెట్టినదానిని వస్తూత్పత్తి రంగంలో ప్రవేశ పెట్టడానికీ తరుచు సంవత్సరాలు పడుతూఉంది. ఆర్థిక వ్యవస్థకూ, విజ్ఞాన శాస్త్రానికీ కూడా ఇది నష్టం. ఎలక్ట్రానిక్ కంప్యూటర్ సాంకేతిక పద్ధతులను స్వల్పంగా మాత్రమే వినియోగించుకోవడం ఇందు కొక నిదర్శనం. ఆధునిక కంప్యూటర్, నియంత్రణ సాంకేతిక పద్ధతులు వస్తూత్పత్తి రీతుల్లో మాత్రమే కాకుండా ఆర్థిక వ్యవస్థ, ప్రణాళికలు, జమా ఖర్చుల మదింపు, రూపకల్పన, డ్రాఫ్టింగుల్లోనూ, చివరకు శాస్త్ర పరిశోధనలోనూ కూడా ఒక పెద్ద విప్లవానికే దారితీస్తాయి.

పరిశ్రమల మేనేజిమెంటులో మనం అమలు జరిపిన పునర్వ్యవస్థీకరణా, ఆర్థిక వ్యవహారాల మంత్రిత్వశాఖలను ఏర్పాటు చేయడమూ, విజ్ఞానశాస్త్ర విజయా లను వస్తూత్పత్తిరంగంలో త్వరత్వరగా ప్రవేశపెట్టేందుకు అనుకూల పరిస్థితులను ఏర్పరిచాయి. కాని. అనుకూల పరిస్థితులు ఉన్నంత మాత్రంచేత విజయంచేకూరు తుందనే హామీ ఇప్పటికి ఏమీలేదు అందుచేత, మంత్రిత్వశాఖలూ, పార్టీసంస్థలూ, ప్రభుత్వ సంస్థలూ విజ్ఞానశాస్త్ర రంగంమీదా, అది సాధించిన విజయాలను ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టడంమీదా తమ దృష్టిని మరింత ఎక్కువగా కేంద్రీకరించాలి. అకాడమీకి సంబంధించిన పరిశోధన సంస్థలు, ప్రత్యేక పరిశోధక సంస్థలు, రూప కల్పన, డ్రాఫ్టింగ్ సంస్థలు, ఫ్యాక్టరీలుచేసే పనులు మరింత చక్కగా సమన్వయీ కృతం కావాలి. విజ్ఞానశాస్త్ర విజయాలను ఆచరణలో ప్రవేశపెట్టేందుకు పట్టే వ్యవధిని కనిష్టస్థాయికి తగ్గించేందుకు అంతాకలిసి కృషిచేయడానికి వాటికి అవకాశం కలిగించాలి. అదే సమయంలో, శాస్త్రవేత్తలూ, విజ్ఞానశాస్త్ర అకాడమీ, విజ్ఞానశాస్త్ర సాంకేతికశాస్త్రకమిటీ కూడా, శాస్త్రపరిశోధనా ఫలితాలు త్వరత్వరగా వస్తూత్పత్తి రంగంలో ఆచరణలోకి వచ్చేలాగా చూడాలి.

కొత్త భావాలనూ, కొత్త పద్ధతులనూ, కొత్త సాంకేతిక రీతులనూ విజ్ఞాన శాస్త్రం ఆర్థిక వ్యవస్థలో ఎంత ఎక్కువ ఫలప్రదంగా ఉపయోగంలోకి తెస్తే, ఆ వ్యవస్థ సాంకేతిక పురోగమన వేగంఅంత ఎక్కువగా ఉంటుంది. ఈ రంగంలో సాహసోపేతమైన సృజనాత్మక అన్వేషణా, సాంకేతిక శాస్త్రానికి సంబంధించిన మన విధానంలో విశాలదృష్టి మనకు కావాలి.

సోవియట్ విజ్ఞాన శాస్త్రం ఇంకా పరిష్కరించవలసిఉన్న సమస్యలు నిజంగా బ్రహ్మాండమైనవి. ఒక నూతన సామాజిక వ్యవస్థను నిర్మించేటప్పుడు,

ఉత్పాదక శక్తులను అభివృద్ధి పరచడానికి, సామాజిక జీవితాన్నంతటినీ పునర్వ్యవస్థీకరించడానికి కూడా, చరిత్రలో ఇదివరకు కనివిని ఎరుగనంతటి శాస్త్ర పరిజ్ఞానం అవసరం

ప్రజల భౌతిక, సాంస్కృతిక సంపదలను అభివృద్ధి పరచడమూ, సోవియట్ ప్రజల జీవితాన్ని ఇంకా ఎక్కువగా సిరిసంపదలతో తులతూగ జేయడమూ, కమ్యూనిస్టు సామాజికవ్యవస్థను జయప్రదంగా నిర్మించేందుకు పార్టీకీ, ప్రజలకూ తోడ్పడడమూ, విజ్ఞాన శాస్త్ర రంగంయొక్క కర్తవ్యం.

సోవియట్ విజ్ఞానశాస్త్రం యింకా ఎక్కువగా అభివృద్ధిపొందేలా చేయడానికి శమ పర్యశక్తుస్తూ, సకల సాధనాలనూ వినియోగించేందుకు పార్టీ, ప్రజలూ ఏ మాత్రమూ వెనుకాడరు. తమ దేశం మేలుకోసం తాము పెద్ద ఎత్తున సాగించే ఫలవంతమైన కార్యక్రమంలో సహాయానికి శాస్త్రవేత్తలు, కమ్యూనిస్టుపార్టీమీనా, ప్రభుత్వంమీనా, సోవియట్ ప్రజలు యావన్మందిమీదా ఆధారపడవచ్చు

కార్మికుల, రాజకీయ ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధిలోనూ, నూతన మానవుణ్ణి తీర్చి దిద్దడంలోనూ, పాఠశాలలూ, ప్రత్యేక శిక్షణ యిచ్చే సెకండరీ, ఉన్నత విద్యాసంస్థలూ, నిర్వహించవలసిన పాత్ర చాల పెద్దది. విద్యా విజ్ఞానాలను పుణుపార్జించాలనే తృష్ణను సోవియట్ ప్రజల్లో రేకెత్తించినందుకు మన పార్టీ గర్వపడుతూంది. సాధారణ పాఠశాలలు దేశంలో 214,000 ఉన్నాయి. వాటిలో విద్యాభ్యాసం సాగిస్తూన్నవారి సంఖ్య 48 మిల్లియన్లకు పైబడి వుంది. 1966-70 లో కొత్తగా మరొక 22,000 పాఠశాలలను నిర్మించేందుకు నిర్ణయం జరిగింది.

పాఠశాలల పనిని అభివృద్ధి పరచడమూ, వాటికి ఆధారంగా గల భౌతిక వసతులను విస్తృతమొనర్చడమూ, బోధనా పద్ధతులను మరింత మెరుగు పరచడమూ, కమ్యూనిస్టు నిర్మాణ ప్రయోజనాలకు అవసరం. సాధారణ విద్య గరిపే సంస్థగానూ, కష్టపడి పనిచేయాలని ఎదగూన తరాల వారికి బోధించే పాఠశాలగానూ పాలిటెక్నిక్ పాఠశాలగానూ సోవియట్ పాఠశాల అభివృద్ధి చెందాలి. విజ్ఞాన శాస్త్ర ప్రాథమిక సూత్రాలను గురించి నాలుగు రోజులపాటు నిలిచే పరిజ్ఞానాన్ని అది తన విద్యార్థులకు సమకూర్చాలి. భౌతికవాద దృక్పథాన్నీ, కమ్యూనిస్టునీతిని

వారికి అలవడ జేయాలి. జీవితానికీ. జాగ్రత్తగా ఆలోచించి తన వృత్తిని ఎంచుకో గలిగేందుకూ అవసరమయిన శిక్షణను అది యువకులకు ఇవ్వాలి.

ఈ కర్తవ్య నిర్వహణలో ఉపాధ్యాయునికి చాల ముఖ్యమైన పాత్రఉంది. ఈ నాడు మనపాఠశాలల్లో 2,400,000 పైగా ఉపాధ్యాయులున్నారు. సోవియట్ మేధావుల్లో అందరికన్నా ఎక్కువమందిలో ఉపాధ్యాయులొకరు. బాలబాలికలకు విద్యాబుద్ధులను గరపడానికే తన శక్తిని, విజ్ఞానాన్ని, హృదయంలోని మార్దవాన్నంతటినీ అంకితంచేసే సోవియట్ ఉపాధ్యాయునిపట్ల పార్టీ, ప్రజలుకూడా గాఢమైన భక్తి శ్రద్ధలు కలిగి వున్నారు. పారిశ్రామిక, వ్యవసాయరంగాల్లోని బ్రహ్మాండమైన అభివృద్ధికార్యక్రమం దృష్ట్యా, కార్మికపర్గంలోనూ, వ్యవసాయ క్షేత్రాల్లోని శ్రామిక బలగాల్లోనూ. సమర్థులైన సిబ్బందిని నిరంతరం చేకూర్చుకుంటూ వాటిని బలపరచవలసిన కర్తవ్యం పార్టీకి ఎదురవుతూంది. బాధ్యతాయుతమైన యీ కర్తవ్యాన్ని నిర్వహించవలసిన పని వృత్తి పాఠశాలలది.

ఇటువంటి పాఠశాలలు దేశంలో ఈ నాడు 4000 లకు పైగా ఉన్నాయి. 1,500,000 మందికిపైగా యువతీ యువకులు వాటిలో శిక్షణ పొందుతున్నారు. వచ్చే ఐదేళ్ళల్లోనూ వృత్తి పాఠశాలలు 6,000,000 మందికిపైగా సమర్థులయిన యువకార్మికులను తరిఫీదు చేయవలసివుంది. పార్టీ, ట్రేడ్ యూనియన్, యువ కమ్యూనిస్టు సంస్థలూ, అన్ని మంత్రిత్వశాఖలూ, డిపార్టుమెంటులూ, ఈ కర్తవ్య నిర్వహణలో వీటికి ప్రతిరోజూ సహాయం అందజేస్తూ వుండాలి. వృత్తివిద్యారంగంలో పనిచేసే శిక్షకులూ, ఉపాధ్యాయులూ, ఇతర సిబ్బంది అందరూ కూడా తమ కర్తవ్యాన్ని గౌరవప్రదంగా నెరవేర్చుతారనేందుకు మనకు సందేహం లేదు.

కామ్రేడ్స్, ఆర్థికవ్యవస్థకూ, సాంస్కృతికీ చెందిన వివిధరంగాల్లో 12 మిల్లియన్లమందికి పైగా ప్రవీణులు పనిచేస్తున్నారు. వీరిలో 5 మిల్లియన్లమంది ఉన్నత విద్యను అభ్యసించినవారు. ఉన్నత పాఠశాలలు అద్భుతమైన విజయాలు సాధించాయి. సమర్థులయిన ప్రవీణుల అవసరం ఈనాడు అపారంగా పెరిగి పోయింది. కాబట్టి, ఉన్నతవిద్య ప్రత్యేక శిక్షణనిచ్చే సెకండరీ విద్యారంగాల అభివృద్ధిపట్ల పార్టీ నిరంతరం శ్రద్ధాసక్తులను కనబరుస్తూనే వుంటుంది. వచ్చే ఐదేళ్ళల్లోనూ, విద్యార్థుల సంఖ్య రమారమి 1,000,000 పెరుగుతుంది.

ఆర్థిక, పార్టీ, ప్రభుత్వ, దౌత్య, సైనిక, సామాజిక రంగాల్లోని పనులకు కావలసిన సిబ్బందిని, మన ఉన్నత పాఠశాలల్లో తరిఫీదుపొందిన నిపుణులనుండే

ప్రధానంగా ఎంచుకోవడం జరుగుతుంది. మన ప్రవీణులు తమ తమ వృత్తుల్లో పూర్తిగా నిష్ణాతులై ఉండడం మాత్రమే కాకుండా, సామాజిక పరిణామ సూత్రాలనూ, దేశీయ, విదేశాంగ విధానాలనూ కూడా తెలుసుకొని ఉండాలి. విశాల దృక్పథం కలిగి ఉండాలి. ప్రగాఢమైన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానమూ, పార్టీ, ప్రభుత్వ విధానాన్ని గురించి స్పష్టమైన అవగాహన లేని మంచి సోవియట్ ప్రవీణుణ్ణి మనం ఊహించ లేము. ఈ సవాలును ఎదుర్కోవడం కోసం, ఉన్నత పాఠశాలల్లో సామాజిక శాస్త్రబోధనను గణనీయంగా అభివృద్ధిపరచడమూ జరిగి తీరాలి.

కామ్రేడ్స్, సృజనశీలురయిన మేధావుల, లలితకళా, సాహిత్యరంగాల్లో, పనిచేసేవారు నిర్వహించే పాత్రపట్ల కమ్యూనిస్టు పార్టీ ఎల్లప్పుడూ ఎంతో గౌరవం కలిగివుంది. ఒక మహోత్తమ ఆశయానికి రాయీ అంకితులమనే ఉదాత్తమైన భావంతోనూ, ప్రజల ఆశయంపట్ల సేవాతత్పరతతోనూ నిండివున్న సోవియట్ లలితకళలూ, సాహిత్యమూ, కమ్యూనిస్టు చైతన్య ప్రబోధానికి శక్తివంతమైన ఆధారాల్లో ఒకటిగా రూపొందాయి.

లలితకళా, సాహిత్యరంగాల సృష్టి అంతాకూడా మన దేశంలో ప్రజలందరి అందుబాటులోకి వచ్చింది. సోవియట్ ప్రజలకు సమగ్రమైన విద్యాబోధనా, అత్యున్నత స్థాయికి చెందినవారి సంస్కృతీ, వారు తమ దేశానికి తామే అధినాథులు కావడమూ - ఇవన్నీకూడా, సోవియట్ లలితకళా, సాహిత్యరంగాల అభివృద్ధికి అద్భుతమైన అవకాశాలను కలిగించాయి. ఉత్తమమైన కళాఖండాలూ, రచనలూ సోవియట్ ప్రామాణిక కళా, సాహిత్య సంపదలకు మాత్రమే కాకుండా, ప్రపంచ కళాసంపదనూ, మానవజాతియొక్క అభివృద్ధికాముక సంస్కృతికీ కూడా మరింత పరిపుష్టిని చేకూర్చుతున్నాయి.

మంచి నవలలూ, మంచి పద్యరచనలూ, చక్కని పాటలూ, చిత్తరువులూ, ప్రశస్తమైన చలన చిత్రాలూ అనేకం గత కొద్ది సంవత్సరాల్లోనూ సృష్టి అయాయి. పాఠకుల, ప్రేక్షకుల, శ్రోతల ప్రశంసలను అవి చూరగొన్నాయి. వాటిలో అనేకం లెనిన్ బహుమతులను పొందాయి. అయితే, ఈ దశలో ప్రజల ఆత్మిక జీవితాన్ని మరింత పరిపుష్టంచేసిన రచనలు, చిత్రాలు మొదలయిన వాటిని సృష్టించిన రచయితల, శిల్పుల, నాటక ప్రయోక్తల, నటుల, చలనచిత్ర నిర్మాతల,

సంగీత విద్వాంసుల, చిత్రకారుల సంఖ్య, బహుమతి గ్రహీతల సంఖ్య కన్నా సహజంగానే చాల ఎక్కువగా వుంటుంది.

వర్తమాన విషయాలూ, మన దేశంలో కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన సమస్యలూ సోవియట్ సాహిత్యంలోనూ, సినిమాలు, నాటకాలు, చిత్రకళ, సంగీతం, శిల్పాల్లోనూ ప్రాధాన్యం వహించడం చాల ముఖ్యమయిన విషయము.

మన దేశంలోని వర్తమాన వాస్తవికతను మరింతలోతుగా అవగాహన చేసుకోడానికీ, ఈ దృశ్యాన్ని ఇంకా ఎక్కువ స్ఫుటంగా చిత్రించడానికీ వివిధతరాలకు చెందిన కళాకారులు కృషిచేస్తున్నారు. గట్టి పట్టుదలతో అన్వేషణ కొనసాగుతూంది. సృజనాత్మకమైన విజయాలతోపాటు పరాజయాలుకూడా కలుగుతున్నాయి. ఈ పరాజయాలు సాధ్యమయినంత తక్కువగా ఉండాలని మనం కోరుకోవడం సహజమే సోవియట్ ప్రజల్లో తక్కిన వారికి మార్గదర్శకంగా ఉన్న ఆశయాలూ కర్తవ్యాలూ, వారికి కమ్యూనిస్టుపార్టీ, మన సృజన శీలురయిన మేధావులకు కూడా మార్గదర్శకంగా ఉండడం, సోవియట్ సాంస్కృతిక రంగం విజయవంతంగా అభివృద్ధి పొందుతుందనేందుకు హామీ అని విశ్వసిస్తున్నాము.

యూనియన్ రిపబ్లిక్కుల్లోని కళాకారులు సృష్టించిన ప్రతిభావంత మయిన కళాఖండాలు అనేకం, ఇటీవలి సంవత్సరాల్లో సోవియటు, అంతర్జాతీయ రంగాలను అలంకరించాయి. మన రిపబ్లిక్కుల్లో ప్రతిఒక్క దానిలోనూ ఎంతో ప్రతిభావంతులున్నారు. లలితకళలకు, సాహిత్యానికీ సంబంధించిన ఆయా శాఖల్లో అవి అద్భుతమైన జయాలను సాధించాయి. వివిధ జాతుల సోదర కుటుంబమయిన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యలోని జాతుల సంస్కృతులు జాతీయమైనవి కావడం వల్ల వాటి రూపాల్లో వైవిధ్యం చాల ఎక్కువ. ఇవన్నీ కలిసి సోషలిస్టు స్వభావంలో ఏకత కలిగి, మహోన్నతమైన కమ్యూనిస్టు నిర్మాణభావంతోనూ, మన బహుళజాతి మహారాజ్యం శ్రేయస్సు, ఐశ్వర్యాభివృద్ధుల పట్ల సమిష్టి శ్రద్ధాసక్తులతోనూ నిండిఉన్న ఒక సంస్కృతిగా ఏర్పడుతున్నాయి.

లలిత కళల, సాహిత్య అభివృద్ధి పట్ల సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ఎల్లప్పుడు శ్రద్ధాసక్తులను కనబరుస్తూ వచ్చింది. ఇకముందు కూడా కనబరుస్తూనే ఉంటుంది. సృజనాత్మక సంస్థల కార్యకలాపాలకు పార్టీ ఎల్లప్పుడు మార్గదర్శకత్వం వహిస్తూ వచ్చింది. ఇక ముందుకూడా వహిస్తుంది. వాటికి అన్ని విధాలా అండ దండలనూ, సహాయాన్నీ అంద జేస్తుంది. లలితకళలనూ, సాహి

త్యానికీ సంబంధించిన విషయాల్లో అజమాయిషీకీ, నిరంకుశ పరిష్కారాలకూ పార్టీ వ్యతిరేకం. అదే సమయంలో, లలితకళలు ప్రజల పక్షం వహించాలన్న సూత్రాన్నీ సాంస్కృతిక రంగంలోని అన్ని విషయాలనూ బేరీజువేయడంలో వర్గ దృక్పథాన్నీ, మనం అచంచలంగా అనుసరిస్తాము. "సార్వజనిక కార్మికవర్గ ఉద్యమంలో సాహిత్యం అంతర్భాగం కావాలి" అన్న లెనిన్ పలుకులను మనం ఎన్నటికీ విస్మరించము.

మన ఆదర్శాలపట్ల విశ్వాసాన్ని ప్రతిబింబించి, అన్యసిద్ధాంతం ఏ రూపంలో ప్రదర్శితమయినా ఎన్నాళ్ళని రాజీ ఎరుగని పోరాటం సాగించే లలితకళల, సాహిత్యం పక్షమే మన పార్టీ ఎల్లప్పుడూ వహిస్తుంది.

సోషలిస్టు లలితకళలు ప్రగాఢమైన ఆశావాదపూరితాలు. మన జీవితంలోని కొత్తదనాన్నీ, అభివృద్ధికర అంశాలనూ గ్రహించి, మనం నివసిస్తూన్న ప్రపంచం యొక్క సౌందర్యాన్నీ, నవసమాజంలోని మానవుని ఆశయాల, ఆదర్శాల మహోజ్వల శోభనూ ప్రస్ఫుటంగానూ, ప్రతిభతోనూ చిత్రించగలనేర్పు వాటికి వుంది. రచయితలు మంచిని గురించి మాత్రమే రాయాలని దీని అర్థం ఎంతమాత్రమూ కాదు. మనలో చాల లోపాలున్న సంగతి మీకు తెలుసు. కళారూపాల్లో వాటిని విమర్శించడం, ఆ లోపాలను తొలగించుకొనేందుకు సోవియట్ ప్రజలకు తోడ్పడు తుంది కాబట్టి, వుపయోగకరమూ, అవసరమూకూడా.

ప్రజలకు తోడ్పడేందుకు బదులు, మన వ్యవస్థపై బురదజల్లడమూ, మన వీరప్రజానీకంపై అపనిందలు వేయడమే పనిగా పెట్టుకొన్న ధనదాసులు కూడా కొందరు వుండడం విచారకరం. వీరు బహుకొద్దిమంది మాత్రమే అన్నది నిస్సందేహం. ప్రజలతోనూ. పార్టీతోనూ దుర్భేద్యమైన సన్నిహిత సంబంధాలుగల మన సృజనశీలురైన మేధావుల మనోభావాలనుగాని, అభిప్రాయాలనుగాని వీరు ఎంతమాత్రమూ వ్యక్తంచేయడంలేదు. సోవియట్‌పౌరుల్లో ప్రతిఒక్కరికీ అత్యంత ప్రీతిపాత్రమయిన సోవియట్ దేశ ప్రయోజనాలను ఈ భ్రష్టులు శంసడించు తున్నారు. అప్రతిష్ఠాకరమయిన వీరి కార్యకలాపాలపట్ల సోవియట్ ప్రజలు వుపేక్ష వహించకుండా వుండడం సహజమే. సోవియట్ ప్రజలు వారిని ఎలా చూడాలో అలాగే చూస్తున్నారు.

మేధావుల అవసరాలపట్ల పార్టీ శ్రద్ధ వహిస్తూంది. వారి యూనియన్లనూ, సొసైటీలనూ యెల్లప్పుడూ బలపరుస్తూంది. ఉదాత్తమైన సూత్రాలతోనూ, ప్రజల

పట్ల కళాకారుల పౌరధర్మంతోనూ కూడిన నియమబద్ధమైన వాతావరణాన్ని కళాకారుల సంస్థల్లోనూ, ప్రచురణాలయాల్లోనూ, నాటక సంస్థల్లోనూ, ఫిల్ముస్టుడియోల్లోనూ అవశ్యం నెలకొల్పాలి. లలిత కళలూ, సాహిత్యమూ అభివృద్ధి పొందాలంటే మార్క్సిస్టు – లెనినిస్టు విమర్శ చాల ముఖ్యం.

సోవియట్ కళాకారుడు, ప్రపంచ విప్లవాత్మక పునర్నిర్మాణం కోసం క్రియాత్మకంగా పోరాడే యోధుడు. కళాత్మక కృషి రూపాలనూ, రీతులనూ మన లలితకళా సాహిత్య రంగాలు నిర్దుష్టం చేసుకొనుగాక. మన జీవితానికి సంబంధించిన వివిధ అంశాలను వాస్తవికంగానూ, సమగ్రంగానూ చిత్రించడం ఇక ముందుకూడా కొనసాగిస్తూ, సోవియట్ ప్రజలను బ్రహ్మాండమైన వారి కృషిలోనూ, మహోన్నతమూ, మహోదాత్తమూ అయిన మన లక్ష్యాల సాధనకై వారు సాగిస్తూన్న పోరాటంలోనూ ఉత్తేజపరుస్తూ వుండుగాక.

కామ్రేడ్స్, సోవియట్ ప్రజల జీవన స్థాయినీ, సంస్కృతినీ అభివృద్ధి పరిచేందుకూ, విజ్ఞాన శాస్త్ర, విద్యా, సాహిత్య, లలిత కళారంగాలను అభివృద్ధి పరిచేందుకూ మన దేశంలో జరుగుతున్నదంతా, మానవుని శ్రేయస్సు, మానవుని సర్వతోముఖ అభివృద్ధులే సోషలిజమ్ ప్రధాన లక్ష్యానికి ప్రాతిపదిక అన్న సామాన్య సత్యాన్ని నిరూపిస్తూంది. ఈ లక్ష్యం వైపు మన పురోగమనాన్ని మరింత త్వరితం చేసి, ఇంతకన్నా గొప్పవయిన కర్తవ్యాల నిర్వహణకు పూనుకోగల స్థాయిని మనం అందుకొన్నాము.

భవిష్యత్తును గురించిన మన ప్రణాళికల్లో అవాస్తవిక ప్రతిపాదన లేవీ ఉండకూడదు, సోవియట్ ఆర్థిక వ్యవస్థకుగల అవకాశాలపైని, దేశంలోని ఉత్పాదక శక్తులను అభివృద్ధి పరచడంలో ఇప్పటికి సాధించిన స్థాయిపైనీ అవి ఆధారపడి వుండాలి. ఈ అవకాశాలను అత్యంత ఫలప్రదంగా వుపయోగించు కోవడమూ మానవునికి అవసరమయిన భౌతిక, ఆత్మిక సంపదలను నిరంతరం పెంపొందజేయడమూ, ఇప్పుడు మనం చేయవలసిన పని. ఈ విషయంలో పార్టీతన సర్వశక్తులా కృషిచేస్తుంది. సోవియట్ ప్రజల జీవితం, సాంకేతికాభివృద్ధి, సంస్కృతి ప్రసాదించిన సకలసంపదలతోనూ తులతూగుతూ మరింత సౌఖ్యప్రదమూ, సమగ్రమూ అయేలా చేసేందుకు కమ్యూనిస్టులు, ప్రజలకు అగ్రగాములుగా వుంటూనే వారితో భుజం భుజం కలిపి తమ సర్వశక్తులతోనూ కృషిచేస్తారు. మన అత్యున్నత కర్తవ్యంగా దీనినే పరిగణిస్తున్నాము. ఇందుకోసమే మనం కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మిస్తున్నాము.

# IV

# కమ్యూనిస్టు నిర్మాణానికి సారథ్యం వహించడంలో అంతకంతకు పెరుగుతూన్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పాత్ర

## *1. పార్టీని పటిష్ఠం చేయడము, దాని నిర్మాణ, రాజకీయ కార్యక్రమం పెరుగుదల :*

క్రమేపీ, సోవియట్ సామాజిక జీవితంలో పార్టీ పాత్ర మరింత పెరగడమూ, పార్టీ సభ్యత్వం పటిష్ఠం కావడమూ, పనిరూపాలూ, పద్ధతులూ నిష్టం కావడమూ, ప్రజానీకంతో పార్టీ సంబంధాలు బలపడి, పెంపొందడమూ, ప్రస్తుతం సమీక్షిస్తూన్న దశలోని పరిణామానికి ముఖ్యమనక. సోవియట్ సమాజంలో నాయకత్వమూ, మార్గదర్శకత్వమూ వహిస్తూన్న శక్తి మన లెనినిస్టు కమ్యూనిస్టుపార్టీ. కార్మికవర్గంలోనూ, రైతుల్లోనూ, శ్రామికప్రజ అందరిలోనూ ఎన్నికైన అభివృద్ధిపొందిన సభ్యులను మన పార్టీ సమైక్యం చేస్తుంది. ప్రపంచ కార్మికవర్గంయొక్క సమరశీల విప్లవ సిద్ధాంతమయిన మార్క్సిజమ్ – లెనినిజమ్ మన పార్టీకి కరదీపిక. కమ్యూనిస్టు నిర్మాణపథాన సోవియట్ ప్రజలను విశ్వాసంతో ముందుకు నడుపుతూంది. సోషలిస్టు సామాజిక జీవితానికి సారథ్యం వహిస్తూ, దానిని నిర్మాణబద్ధం చేస్తూంది. యావన్మంది సోవియటు ప్రజలకు గురువు, ఆర్గనైజర్, రాజకీయ నాయకుడుగా అది తన పాత్రను విజయవంతంగా నెరవేర్చుతూంది. ప్రజల్లో పార్టీ కొనసాగించిన రాజకీయ, నిర్మాణ కార్యకలాపాలూ, సోవియటు ప్రజల దీక్షాపూరిత శ్రమా, దేశ ఆర్థిక వ్యవస్థలో కొత్తగా మరికొంత పెరుగుదలను సాధించాయి. ప్రజలకు మరింత ఉన్నతమయిన జీవనస్థాయిని సమకూర్చాయి. మన సోషలిస్టు దేశాన్ని ఇదివరకెన్నడూ లేనంత బలమయిన దేశంగా రూపొందించడమూ, ప్రపంచ వ్యవహారాల్లో సోవియటు యూనియన్ పలుకుబడిని పెంచడమూ సాధ్యమొనర్చాయి.

1964 అక్టోబరులో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర

కమిటీ విస్తృత సమావేశం మన పార్టీ జీవితంలో ఒక ప్రధానమైన ఘట్టం. పార్టీ జీవితాన్ని గురించి లెనిన్ నిర్దేశించిన ప్రమాణాలనూ, ఆయన ప్రవచించిన నాయకత్వ సూత్రాలనూ అభివృద్ధి పరచి, ఖచ్చితంగా పాటించాలని పార్టీకి గల అచంచలమైన దీక్షను ఆ సమావేశం వ్యక్తం చేసింది. ఆర్థిక వ్యవస్థ, పార్టీ నిర్మాణ రంగాల్లోని లోపాలనూ, పార్టీ సంస్థల్లోనూ, ప్రభుత్వ, ఆర్థిక సంస్థల్లోనూ తెచ్చిన అసమర్థనీయమైన మార్పుల వల్ల కలిగిన పొరపాటులనూ, అక్టోబరు విస్తృత సమావేశ నిర్ణయాల ప్రాతిపదికపై సవరించడం జరుగుతూంది.

పార్టీయొక్క, సోషలిస్టు దేశం యొక్క, సమస్త సోవియట్ సమాజం యొక్క జీవితానికీ, కార్యకలాపాలకూ సంబంధించిన అన్ని విషయాలపైనే అక్టోబరు విస్తృత సమావేశం సత్ప్రభావాన్ని ప్రసరించింది. ఏకశిలా సదృశమైన పార్టీ స్వభావానికీ, ఐక్యతకు, దాని రాజకీయ పరిపక్వతకూ, మన పురోగమనాన్ని కుంటుపరచగల ప్రతిదానినీ ధైర్యంతోనూ, ఖండితంగానూ పెకలించి వెలివేయగల దాని సామర్థ్యానికీ అనేక ప్రస్ఫుటమైన నిదర్శనం, మహత్తరమైన మార్క్సిజమ్ - లెనినిజం సిద్ధాంతాన్ని ఆయుధంగా కలిగి, ప్రజాసామాన్యం యొక్క సృజనాత్మక శక్తి సామర్థ్యాలపై గాఢమైన విశ్వాసం కలిగిన సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, ఆత్మ విశ్వాసంతో సోవియట్ ప్రజలను కమ్యూనిజమ్‌వైపు ముందుకు నడుపుతూంది.

అక్టోబరులోనూ, ఆ తరువాత జరిగిన కేంద్ర కమిటీ విస్తృత సమావేశాల నిర్ణయాలను. [illegible] మహాసభను మొదలు అన్ని ప్రాంతాల్లో జరిగిన పార్టీ సభలూ, సమావేశాలూ, మహాసభలూ, పూర్తిగా ఆమోదించాయన్న విషయం కేంద్ర కమిటీకి ఎంతో సంతృప్తి కలిగించింది.

ఈ పార్టీ సభలు, సమావేశాలు, మహాసభలు ఉన్నతమైన రాజకీయ స్థాయిలో జరిగాయి. ఆ సందర్భంలో కమ్యూనిస్టుల కార్యకలాపాలు పెద్ద ఎత్తున సాగాయి. ఒక్క ప్రాథమిక పార్టీ సంస్థల సమావేశాల్లోనే ఇంచు మించు 2,311,100 మంది పార్టీ సభ్యులూ, క్యాండిడేటు సభ్యులూ ప్రసంగించారు. నిర్దిష్టతనూ, సాధించిన విజయాలను గురించీ, పనిలోని లోపాలను గురించీ కూలంకషమైనవి చికిత్స చేసినందువల్లా, పార్టీ నాయకత్వసంస్థలూ, అధికారులూ ఇంక బాగా పని చేయాలని అంతకంతకు మరింత ఎక్కువగా కోరినందువల్లా ఈ ప్రసంగాలు, సర్వసాధారణంగా ప్రశంసనీయములు.

సోవియటు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ వెనుక కమ్యూనిస్టుల సమైక్యతనూ, తమ మహోన్నత కర్తవ్యాలను గురించీ విధ్యుక్త ధర్మాలను గురించీ వారికి గల సంపూర్ణ అవగాహననూ పార్టీ ప్రాథమిక సమావేశాలు ప్రస్ఫుటమైన ప్రదర్శనలు.

సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి, 23 వ మహాసభకూ అందిన వేలకొలది లేఖలు కమ్యూనిస్టుల కార్యకలాపాల పెరుగుదలనూ, పార్టీకార్యక్రమం అంతటిపట్లా పార్టీయేతర ప్రజానీకానికిగల శ్రద్ధాసక్తులకు మరొక నిదర్శనం. మన దేశ ప్రజలు ఈ లేఖల్లో మహాసభ విజయాన్ని కోరుతూ మహాసభ ప్రతినిధులకు హృదయ పూర్వక శుభాకాంక్షలనూ, అభినందనలనూ అందజేశారు. ప్రజల శ్రేయోభివృద్ధులపట్ల శ్రద్ధాసక్తులు కనబరుస్తున్నందుకు పార్టీకి తమ కృతజ్ఞత తెలుపుకున్నారు. పార్టీయొక్క, దేశంయొక్క జీవితానికి సంబంధించిన అనేక తరహాల సమస్యలపై తమ సూచనలనూ, సలహాలనూ, విమర్శలనూ అందజేశారు. తమ అంతరాంతరాల్లోని ఆలోచనలనూ, ఆశయాలనూ వ్యక్తంచేస్తూ సోవియట్ ప్రజలు పంపిన ఈ హృదయ పూర్వక సందేశాలను చదివినప్పుడు, ఎవరికైనా సరే హృదయం చలించక తీరదు.

శ్రామిక ప్రజలు చేసిన అనేక ప్రతి పాదనలనూ, వారు తెలిపిన అనేక కోరికలనూ, ఈ మహాసభ పత్రాలను రూపొందించినప్పుడు దృష్టిలోకి తీసుకోవడం జరిగింది. కమ్యూనిస్టులు, పార్టీయేతర ప్రజలూ చేసిన ఉపయోగ కరమయిన సూచనలనూ, వ్యాఖ్యలనూ, ఇచ్చిన సలహాలనూ పార్టీ నాయకత్వ సంస్థలూ, ప్రభుత్వ, ఆర్థిక ట్రేడ్ యూనియన్, కామ్‌సోమోల్ సంస్థలూ తమ తమపరి కార్యకలాపాల్లో తప్పకుండా ఆచరణలో పెట్టాలి.

కామ్రేడ్స్, మహాసభకు లేఖలను పంపిన పార్టీ సంస్థలకు, శ్రామిక బృందాలకు, సోవియట్ సైనికులకు, నావికులకు, కమ్యూనిస్టు పార్టీ సాధారణ సభ్యులకు, లేఖలు పంపిన తక్కిన సోవియటు పౌరు లందరికికూడా ఈ మహాసభ తరఫున ధన్యవాదాలర్పించేందుకూ, వారి విమర్శలనూ, ప్రతిపాదనలనూ, సలహాలనూ పార్టీ అత్యంత శ్రద్ధతో పరిశీలిస్తుందని వారికి హామీ ఇచ్చేందుకూ, నాకు అనుమతిని ఇవ్వవలసిందిగా కోరుతున్నాను.

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో 12,471,000 సభ్యులు, క్యాండిడేట్ సభ్యులూ ఉన్నారు. ప్రస్తుతం పరిశీలిస్తున్నదశలో 2,755,000 మంది పార్టీలో కొత్తగా సోవియట్. కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వంచే పెరగడం

పార్టీకి గల గొప్ప ప్రతిష్ఠకూ, దాని పట్ల సోవియట్ ప్రజలకు గల విశ్వాసానికీ ప్రతిబింబం.

కమ్యూనిస్టు నిర్మాణరంగాలన్నిటిలోనూ పార్టీ భావాలను ప్రజాసామాన్యానికి అందజేస్తూ, మనదేశ శ్రామికప్రజల అగ్రశ్రేణిల్లో నిలబడి ముందుకుసాగుతూన్న మిల్లియన్ల కొలది మన సోదర కమ్యూనిస్టులను చూచి మనం గర్వపడుతున్నాము. మిల్లియన్ల కొలది సభ్యత్వం గల కమ్యూనిస్టుల మహాసైన్యం మన దేశం యొక్క శక్తిని ఇనుమడింప జేసేందుకూ, మన మహత్తర విప్లవ ఆశయం కోసమూ, తన సర్వశక్తులనూ. పరిజ్ఞానాన్నీ, నిర్మాణ పటిమనూ వినియోగించి కృషి చేస్తూంది.

పార్టీ స్వరూపాన్ని గురించి తెలిపేందుకు అనుమతించండి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ స్వరూపం

(1966 జనవరి ఒకటవ తేదీనాటి శాతములు)

(అ) సమాజంలో హోదా

| | |
|---|---|
| కార్మికులు | 37.8 |
| రైతులు (సమిష్టి వ్యవసాయదారులు) | 16.2 |
| ఆఫీసు ఉద్యోగులు, తదితరులు | 46.0 |

(ఆ) పార్టీ సభ్యత్వకాలము

| | |
|---|---|
| 10 సంవత్సరాలలోపు | 47.1 |
| 10-30 సంవత్సరాలు | 47.3 |
| 30 ఏళ్ళకు పైగా | 5.6 |

(ఇ) వయసునుబట్టి వర్గీకరణ

| | |
|---|---|
| 25 ఏళ్ళలోపు వయస్సువారు | 6.2 |
| 26-40 ఏళ్ళవారు | 46.8 |
| 41-50 ఏళ్ళవారు | 24.9 |
| 50 ఏళ్ళు దాటినవారు | 22.1 |

(ఈ) విద్య

| | |
|---|---|
| ఉన్నత విద్యగలవారు, ఉన్నత విద్యను పూర్తిచేయనివారు | 18.2 |
| సెకండరీ విద్య ఉన్నవారు | 30.9 |
| సెకండరీ విద్యను పూర్తిచేయనివారు | 27.5 |
| ప్రాథమిక విద్యగలవారు | 23.4 |

మన పార్టీలోవున్నది ముఖ్యంగా కార్మికులూ, సమిష్టి వ్యవసాయదారులే అన్నది పైఅంకెలను బట్టి స్పష్టం. క్యాండిడేట్ సభ్యులుగా పార్టీలో చేర్చుకున్న కార్మికుల శాతం ఇటీవలి సంవత్సరాల్లో పెరిగింది. 20,22వ మహాసభల మధ్య కాలంలో క్యాండిడేట్ సభ్యులుగా చేర్చుకున్న వారిలో కార్మికులు 40.6 శాతం. అటువంటిది, ప్రస్తుతం సమీక్షిస్తూన్న కాలంలో వీరిశాతం 47.6. పార్టీయొక్క సాంఘిక వర్గీకరణలో భవిష్యత్తులో కూడా కార్మికవర్గం తన నాయకత్వ స్థానాన్ని నిలుపు కోవాలి.

పార్టీలో సభ్యులుగా చేరిన ఆఫీసు పనివారిలోనూ, ఆయా వృత్తుల ఉద్యోగుల్లోనూ సాంకేతిక నిపుణులయిన మేధావులు, దేశ ఆర్థిక వ్యవస్థకు చెందిన వివిధ శాఖల్లోని నిపుణులు మూడింట రెండు వంతులకుపైగా ఉన్నారు. కమ్యూనిస్టుల్లో ప్రతి యిద్దరిలోనూ ఒకరు చొప్పున ఉన్నత విద్యనో, అసంపూర్ణ ఉన్నత విద్యనో లేదా, సెకండరీ విద్యనో పొందినవారు ఉన్నారు.

సభ్యత్వ కాలానికి సంబంధించిన పార్టీ స్వరూపం గమనించదగినది. మూడు విప్లవాల్లోనూ పాల్గొన్న కాకలుదీరిన కమ్యూనిస్టు యోధులు. దేశ పారిశ్రామికీకరణ, వ్యవసాయరంగ సమష్టీకరణలకోసమూ, దేశంలో మహత్తరమైన సోషలిస్టు పరిణామాలకోసమూ సాగిన పోరాటంలో రాటుదేలిన కమ్యూనిస్టులను మన ముందులో చూస్తున్నాము. దేశభక్తియుత మహాయుద్ధంనాటి గడ్డురోజుల్లో తమ భవిష్యత్తును పార్టీతో ముడివేసుకొని యుద్ధానంతరం తమ సోవియట్ మాతృదేశాన్ని శిధిలాలు, బూడిదిరాసుల నుంచి పైకితీసిన వారుకూడా మనకిందులో కనబడుతున్నారు. వీరందరూ కూడా, ఒకే రాజకీయ యోధుల సైన్యంలో చేరి ఇప్పుడు కమ్యూనిస్టు సమాజ నిర్మాణాన్ని చురుకుగా సాగిస్తున్నారు.

వృద్ధ, యువక కమ్యూనిస్టులు కలిసివున్న ఒక చక్కని దృశ్యాన్ని పార్టీ స్వరూపం ప్రదర్శిస్తూంది. ఈనాడు పార్టీ సభ్యత్వంలో సగానికి పైగా 40 సంవత్సరాలలోపు వయసువారే. యువకులు మన పార్టీలో చేరుతున్నందుకు వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ ఎప్పుడూ గర్వపడుతూ వుండేవారు. ఒక తరం తరువాత మరొక తరం నిరంతరాయంగా ముందుకు వస్తూవుండడానికీ, పార్టీయొక్క విప్లవతత్వానికీ, దాని సమరశీల సంప్రదాయాలకూ ఇది ప్రతిబింబమని ఆయన పరిగణించేవారు.

మహత్తరమైన సోషలిస్టు విజయాలను సాధించడంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన చరిత్రాత్మకపాత్రనూ, మహోన్నతిమైన దాని ప్రతిష్ఠనూ

చూచి, చాలమంది సోవియట్ ప్రజలు సహజంగానే ఉత్తేజితులై, సిద్ధాంత రీత్యానూ, నిర్మాణ రీత్యానూ తమ జీవితాలను పార్టీకి ముడివేసుకుని, సామాజిక పరివర్తనం కోసమూ, కమ్యూనిజమ్ విజయసాధనకోసమూ సాగుతూన్న విప్లవ పోరాటానికి తమను తాము అంకితం చేసుకుంటున్నారు. పార్టీలో చేరే ప్రతి ఒక్కరినుండీ కోరే ఉన్నతమైన అర్హతలు, సోవియట్ ప్రజలపట్ల పార్టీకి గల బ్రహ్మాండమైన బాధ్యతలనుబట్టి అవసరమవుతున్నాయి.

కొన్ని పార్టీ సంస్థల పనిని కేంద్ర కమిటీ ఇటీవల తనిఖీ చేసింది. కొన్ని సంస్థలు, పార్టీలో చేరేవారినుండి తక్కువ అర్హతలను కోరినట్లు బయటపడింది. కొత్త సభ్యులను చేర్చుకోవడం త్వరగా పూర్తిచేయ వలసిందిగా కొన్ని పార్టీ కమిటీలు తమ ప్రాథమిక సంఘాలను ఆదేశించాయి. ఫలితంగా, సిద్ధాంత రీత్యా తగిన పరిపక్వత లేనివారికి కూడా కొన్ని సందర్భాల్లో పార్టీ సభ్యత్వం లభించింది. ఈ లోపాన్ని ఇప్పుడు సరిదిద్దడం జరిగింది.

పార్టీ సభ్యత్వ పారిశుద్ధ్యంపట్ల శ్రద్ధవహించడమూ, లెనినిస్టు పార్టీ సభ్యత్వం అనే మహోదాత్తమైన బిరుదును ప్రతిఒక్క కమ్యూనిస్టు సార్థకం చేసుకోవడమూ, దానికేమీ కళంకం రాకుండా కాపాడుకోవడమూ అనేది పార్టీ జీవిత సూత్రాలలో ఒకటి. పార్టీ సంస్థ లన్నిటికీ అనేక శాసనం. ఒక పొట్టి వాగుడు గాయకు పార్టీ సభ్యుడు కాగల హక్కూ, అవకాశమూ లభించడంకన్నా, గట్టిగా పనిచేసే వాళ్ళు పదిమంది తాము పార్టీ సభ్యులమని చెప్పుకోకుండా ఉండడమే మేలని వి. ఐ. లెనిన్ అన్నారు.

పార్టీకి పునాది అయిన ప్రాథమిక సంఘాలు మరింత ఎక్కువ సామర్థ్యంతో పనిచేయడం పార్టీ ఇంకా ఎక్కువగా పటిష్ఠం కావడానికి సర్వదా అవసరం. కర్మాగార పార్టీ సంఘాలూ, పార్టీ గ్రూపులు అనే శాఖోపశాఖలు గల పార్టీ ప్రాథమిక సంఘం, పార్టీ విధానాలను అమలు జరపడంలోనూ, కమ్యూనిస్టులకు విషయ పరిజ్ఞానం కలిగించడంలోనూ నిర్ణయాత్మకమైన పాత్రను నిర్వహిస్తూంది. పార్టీకీ, ప్రజాస్వామ్యానికీ మధ్య అవి సంధానక సంస్థలు, సృజనాత్మక కార్యకలాపాలు ప్రత్యక్షంగా జరిగే చోటనే అవి తమ బాధ్యతలను నిర్వహిస్తుంటాయి. పార్టీలో ఈ నాడు 320,000 ప్రాథమిక సంఘాలున్నాయి. ఇంచుమించు అన్ని సంస్థల్లోనూ, కార్యాలయాల్లోనూ అవి ఉన్నాయి.

పార్టీ జీవితం యావత్తూ, దాని విజయాలూ, పొరపాట్లూ, మనకు సంతోషం

కలిగించేవీ, విచారం కలిగించేవీ — ఇవి అన్నీకూడా పార్టీ ప్రాథమిక సంఘాల కార్యకలాపాల్లో ప్రతిబింబిత మవుతున్నాయి. అవి చేసేపనిలో సాధారణంగా కొత్తదనం చాల వుంటుంది. ఈ కొత్తది తరుచుగా యావత్తు పార్టీ సొత్తు అవుతూ ఉంటుంది. ప్రతికూల పరిణామాలుకూడా వీటికి ఎదురవుతుంటాయి. వాటిని ఎదుర్కొని ఇవి పోరాటం సాగిస్తాయి, ఆయా వ్యక్తుల వ్యక్తిగత స్వభావాన్నీ వారి అవసరాలనూ, కోర్కెలనూ, శక్తిసామర్థ్యాలనూ, పనిపట్లవారి వైఖరినీ ప్రాథమిక సంఘాలు సరిగా అంచనా వేయాలి. పార్టీ ప్రాథమిక సంఘాల యొక్క అత్యంత క్రియాశీలురయిన పార్టీ సభ్యుల పెద్దబలగమయిన పార్టీ ప్రాథమిక సంఘాల కార్యదర్శులూ, పార్టీగ్రూపుల ఆర్గనైజర్లయొక్క పని ఎంతో వైవిధ్యంతో కూడి, జటిలమయినదిగా ఉండడానికి కారణం ఇదే.

ప్రాథమిక సంఘాలపట్ల నిరంతరం శ్రద్ధవహించడం పార్టీ సంస్థలన్నిటి విధ్యుక్తధర్మం. పార్టీ ప్రాథమిక సంఘాలతోనూ, జిల్లా పట్టణ, మండల కమిటీల అధికారులతోనూ పార్టీ కమిటీలు నిరంతరం సంబంధాలు పెట్టుకుని ఉండాలి. యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీల ప్రాథమిక సంఘాలను క్రమబద్ధంగా సందర్శిస్తూ ఉండాలి. పార్టీ సభ్యులలో చర్చలు జరుపుతూ ఉండాలి, వారి సలహాలను స్వీకరిస్తూ ఉండాలి, వారికి నివేదికలను సమర్పిస్తూ ఉండాలి.

ఒక మహోదాత్తమయిన సిద్ధాంత పరిజ్ఞానము, తమ తమ బాధ్యతల పట్ల చైతన్య యుతమయిన వైఖరి, సోవియట్ కమ్యూనిస్టు విధానంగురించి గాఢమయిన అవగాహన – ఈ సరళిలో కమ్యూనిస్టులు పార్టీ యేతర ప్రజలకు చైతన్య ప్రబోధం సాగించడం పార్టీ సంస్థల కార్యకలాపాల లక్ష్యం కావాలి. ప్రజాసామ్యంలో తమ రాజకీయ నిర్మాణ కార్యక్రమాన్ని పార్టీ సంస్థలు మరింత ఉన్నతస్థాయికి అభివృద్ధిపరచాలి. కొత్త పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా నెరవేర్చేందుకు సాగించే కృషిలో ప్రజల సృజనాత్మక కార్యకలాపాలను అవి ప్రోత్సహించాలి. కార్మికులకూ, సమష్టి వ్యవసాయదారులకూ, ఆఫీసు ఉద్యోగులకూ, వివిధ వృత్తులకు చెందిన ఉద్యోగులకూ మునుపటికన్నా మేలయిన పనిపరిస్థితులూ, జీవన పరిస్థితులూ సమకూరేలా చూడాలి.

పార్టీ విధానాన్నీ, పార్టీ నిర్దేశించిన చర్యలనూ ఆయా ప్రాంతాల్లో కార్యరూపంలో అమలుజరపడంలో ప్రాంతీయ, మండల, పట్టణ, జిల్లా పార్టీ కమిటీలకు ఎంత గొప్పపాత్ర ఉన్నదో ప్రతిఒక్కరికీ తెలిసిన విషయమే. 1964 నవంబరులో

జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం మండల పారిశ్రామిక, వ్యావసాయిక పార్టీ సంఘాలను ఒకేసంస్థలుగా తిరిగి కలిపివేసి, పార్టీ నిర్మాణానికి సంబంధించిన లెనిన్ సూత్రాలను ఆ విధంగా పునఃప్రతిష్ఠించి. ఈ రంగంలో జరిగిన తీవ్రమయిన పొరపాటులను నిర్మూలించింది. అందుకు ఈ మహాసభలో సంతృప్తిని తెలుపుతున్నాము. గ్రామీణ జిల్లా పార్టీకమిటీలను కూడా పునరుద్ధరించడం జరిగింది. గ్రామసీమల్లో పార్టీ విధానాన్ని చురుకుగా ప్రచారం చేసే అధికార సంస్థలుగా. అనతికాలంలోనే అవి తమ స్థానాన్ని తిరిగి సంపాదించు కున్నాయి.

కామ్రేడ్స్, పార్టీ, దాని నాయకత్వ సంస్థలన్నీ కూడా పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని ఖచ్చితంగా పాటించాలి. అది నికరంగా అభివృద్ధి పొందేలాగా చూడాలి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఈ విషయమై ఇటీవల కొన్ని ముఖ్యమైన చర్యలను తీసుకుంది. కేంద్రంలోనూ, స్థానికంగానూ సమష్టి నాయకత్వ సూత్రాన్ని మరింత పటిష్టం చేయడంలోనూ. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీయొక్క, స్థానిక పార్టీ సంస్థలయొక్క విస్తృత సమావేశాల పాత్రను పెంచడంలోనూ, సభ్యులమీద పూర్తినమ్మకం ఉంచడంలోనూ, పార్టీలో ఆంతరంగి కంగా సమాచారాన్ని అందజేయడాన్ని అభివృద్ధిపరచడంలోనూ, కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాన్ని పెంపొందించడం వ్యక్తమవుతూంది.

అధ్యక్షవర్గ సభ్యులూ. ప్రత్యామ్నాయ సభ్యులూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శులూ, సభ్యులూ, ప్రభుత్వ సభ్యులూ, మంత్రులూ, తదితర ముఖ్యాధికారులూ పార్టీ ఆక్టివ్స్‌తోనూ, కమ్యూనిస్టుపార్టీ సాధారణ సభ్యులతోనూ, శ్రామిక ప్రజానీకంతోనూ, ఆర్థిక, సాంస్కృతిక పరిణామాలకు సంబంధించిన వర్తమాన సమస్యలను గురించీ, దేశ ఆంతరంగిక వ్యవహారాల గురించీ, అంతర్జాతీయ పరిస్థితిని గురించీ, తరుచు ముచ్చటించడం చాల అవసరం.

కమ్యూనిస్టుపార్టీ సభ్యుల అభిప్రాయాలపట్ల, వారి ప్రతిపాదనలపట్ల ఇంకా ఎక్కువ శ్రద్ధనూ, గౌరవాన్నీ చూపడం ముఖ్యం. కమ్యూనిస్టు లెవరైనాసరే పార్టీ నిబంధనలను అతిక్రమించినట్లయితే, వారి తప్పిదాన్ని వెంటనే సరిదిద్దేందుకు, పార్టీ పనిలో లోపాలు పెరగకుండా నివారించడానికీ, పార్టీ సంస్థలు ఏ క్షణంలో నైనాసరే సిద్ధంగా ఉండేందుకు వీలుగా విమర్శ. ఆత్మవిమర్శలు విస్తృతంగా సాగేందుకు తగిన పరిస్థితులను ఏర్పరచడం ఆవశ్యకం. విమర్శనను అణగద్రొక్కే వారిని అతి కఠినమైన దండనకు పాత్రులను చేసితీరాలి.

పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యం పెంపొందాలంటే, దానితోపాటుగా పార్టీ ఆంతరంగిక క్రమశిక్షణకూడా అభివృద్ధి పొందాలి. ఈ రెండూ విడదీయరాని విధంగా పరస్పరం ముడిపడి ఉన్నాయి. సంపూర్ణ ప్రజాస్వామ్యం, అన్నిసమస్య లనూ చర్చించే టప్పుడు అభిప్రాయ స్వాతంత్ర్యం. మెజారిటీ సభ్యుల అభీష్టాను సారం ఒక నిర్ణయం జరిగిన తరువాత గట్టి క్రమశిక్షణ – ఇదీ అనుల్లంఘ నీయమైన పార్టీ సూత్రం. కమ్యూనిస్టులందరూ కూడా వారు ఎక్కడున్నా సరే, ఏ స్థానంలో ఉన్నవారయినా సరే, ఈ సూత్రాన్ని అచంచలంగా పాటించాలని మనం డిమాండు చేయాలి.

తన సంస్థలోనూ, మొత్తం పార్టీలోనూ వుండే పరిస్థితులకు తానుకూడా బాధ్యుడ ననే భావాన్ని ప్రతి ఒక్క కమ్యూనిస్టులోనూ పెంపొందజేయడమూ, పార్టీసభ్యు లందరు తమ విధులను ఖచ్చితంగా నెరవేర్చేలా చూడడము, పార్టీ క్రమశిక్షణనూ, ప్రభుత్వ క్రమశిక్షణనూ అతిక్రమించేవారి విషయంలోనూ, పార్టీపట్ల తమ బాధ్యతలను విస్మరించి. పార్టీసభ్యులు కావడంవల్ల తమ కేవో ప్రత్యేక హక్కు లున్నాయని అనుకునేవారి విషయంలోనూ ఏలాంటి ఔదార్యానికీ తావులేకుండా చూడడమూ మన కర్తవ్యం.

పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యం సర్వతోముఖంగా పెంపొందడం పార్టీ మరింత పటిష్ఠం కావడానికి దోహదం చేస్తున్నది. ప్రజాసామాన్యంతో దాని సంబంధాలను మరింత విస్తృతం చేస్తుంది. దాని ప్రతిష్ఠను ఇనుమడింప జేస్తుంది.

కాంగ్రెస్, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి మును పెన్నడూ లేనంత హెచ్చుస్థాయిలో యిప్పుడు కొనసాగుతూంది. విదేశాంగ సమస్యలు మునుపటి కన్నా ఎక్కువ క్లిష్టమయ్యాయి. ఈ పరిస్థితుల్లో, పార్టీ ప్రధాన అధికారుల, ప్రభుత్వ అధికారుల ప్రమోషనూ, వారి లింపేమీ లోపరహితంగా వుండడం మరింత ఎక్కువ ప్రాధాన్యం వహిస్తుంది.

సిద్ధాంత పోష్టవమూ, మంచి విద్యా, శక్తిసామర్ధ్యాలు గల అనేక మంది యువ కొలది కార్యకర్తలకు తగిన పరిజ్ఞానం సమకూర్చి నాయకత్వ స్థానాలకు పార్టీ ప్రమోటుచేసింది. మన వ్యవస్థకు సహజమయిన సాయిలోనూ, వ్యవహార సరళి లోనూ వారు పార్టీ పంథాను అమలుజరుపుతున్నారు.

మన ముఖ్య కార్యకర్తల అర్హతలు ఇటీవలి సంవత్సరాల్లో చాల అభివృద్ధి పొందాయి. పార్టీ అధికారుల్లో చాలమంది బాగా అనుభవంగలవారు, రాజకీయ,

నిర్మాణ కార్యక్రమం అనే ఉత్తమ పాఠశాలలో శిక్షణపొందినవారు. ఇది కమ్యూనిస్టుపార్టీకి కలిగిన లాభాల్లో ఒకటి. తన కార్యకర్తలనుచూచి పార్టీ గర్వపడుతూంది.

పార్టీ, ప్రభుత్వ ఆర్థిక సంస్థల పునర్వ్యవస్థీకరణలు ఇటీవలి సంవత్సరాల్లో తరుచుగా జరగడం, కార్యకర్తల ఎంపిక, ప్రొమోషన్, తరిఫీదుల విషయంలో దుష్ఫలితాలు కలిగించింది. ఈ మార్పులతోపాటు, అధికారుల విషయంలో కూడా అసమర్థనీయమైన మార్పులు సర్వసాధారణంగా జరిగాయి. వారిలో విశ్వాసం సన్నగిల్లడానికి ఇది దారి తీసింది. వారు తమ శక్తిసామర్థ్యాలను పూర్తిగా ఉపయోగించడానికి ప్రతిబంధకమయింది. బాధ్యతారాహిత్యానికి అవకాశాలు కలిగించింది.

తాము చేయవలసిన పనిని గురించి పూర్తి పరిజ్ఞానమూ, కమ్యూనిస్టుల్లోనూ, కమ్యూనిస్టేతరుల్లోనూ పలుకుబడి కలిగిన సమర్థులయిన ఆర్గనైజర్లు పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక సంస్థలకూ, ప్రజాసంస్థలకూ అధిపతులుగా ఉండేలాగా చూడగల అవకాశాలు ఈనాడు మనకు పూర్తిగా ఉన్నాయి. శక్తిసామర్థ్యాలుగల యువకులను మరింత ధైర్యంతో ప్రొమోట్ చేయడం కమ్యూనిస్టు నిర్మాణ ప్రయోజనాలకు అవసరం. ఇలా చేయడంలో, పార్టీ అధికారుల్లో వయోధికులకూ, యువకులకూ మధ్య సరియయిన నిష్పత్తి ఉండేలాగా చూడవలసిన అవసరాన్ని జ్ఞాపకం ఉంచుకోవడం ముఖ్యం. తమ తమ ప్రాంతాల్లో ఆచరణ యుక్తమయిన కార్యక్రమాలనే గొప్ప పాఠశాలలో కాకలు దీరిన కామ్రేడ్స్‌ని అత్యున్నత స్థానాల్లో పనికి మరింత చురుకుగా ప్రొమోట్ చేయాలి.

కార్యకర్తలను ఎంచుకోవడమూ, వారికి అవసరమయిన పరిజ్ఞానం కలిగించడమూ, ఒక ప్రధానమైన పార్టీ, ప్రభుత్వ బాధ్యతగా పరిగణించాలి. కార్యకర్తలను ఎంచుకోవడము, ప్రొమోట్ చేయడము, వారికి కావలసిన పరిజ్ఞానం సమకూర్చడము, పార్టీ ఆదేశాలు ఎంతవరకు నెరవేరాయో తనిఖీ చేయడము, పార్టీ సంస్థల, ప్రభుత్వ సంస్థల పనిని మరింత మెరుగుపరచడము అనేది ప్రధాన కర్తవ్యం. పైనుండి కిందవరకు పార్టీ సంస్థలన్నిటి యొక్క దృష్టి దీనిమీద కేంద్రీకృతమయేలాగా మనం చూడాలి.

పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక సంస్థలకొరకు అధికారులకు ఇచ్చే తరిఫీదునూ, ఇదివరకే తరిఫీదు పొందినవారికి కొత్తగా ఇచ్చే తరిఫీదునూ ఇంకా ఎంతగానో

మెరుగుపరచవలసి ఉంది. ముఖ్య అధికారుల అర్హతలనూ, వారి సిద్ధాంత పరిజ్ఞానాన్నీ పెంపొందించేందుకు కేంద్రంలోనూ, స్థానికంగానూ శాశ్వతంగా పనిచేసే బోధనా తరగతులను విస్తృతంగా ఏర్పరచాలి. అదే సమయంలో పార్టీ విద్యాసంస్థల పనిని నిర్దుష్టం చేయాలి.

ఆయా పనుల్లో ప్రవీణులను నియమించే పద్ధతులను మెరుగు పరచేందుకు పార్టీ సంస్థలూ, ప్రభుత్వ సంస్థలూ పూనుకోవాలనీ, ఆ ప్రవీణులను సరిగా ఉపయోగించుకొనేలా చూడాలనీ జీవితానుభవం మనకు బోధిస్తూంది.

కార్యకర్తలను ఎంచుకోవడమూ, ప్రమోషను చేయడమూ అన్నది, పార్టీ ఆదేశలనూ ప్రభుత్వ ఉత్తర్వులనూ వారు ఏవిధంగా అమలు జరుపుతున్నారో, తమకు అప్పగించిన పనులను ఎలాచేస్తున్నారో ప్రతి నిత్యమూ తనిఖీ చేయడం నుండి విడిదీయరాని విషయం. కర్తవ్య నిర్వహణను పకడ్బందీగా తనిఖీచేయడం కార్యకర్తలను సరిగా తర్ఫీదు చేయడానికి అన్నిటికన్నా ముఖ్యమైన పద్ధతి. ఈ తనిఖీ ఎల్లప్పుడు ఉండాలి. పొరపాట్లను సవరించుకోడానికీ, సమస్యలకు మరింత సరియైన, మేలైన పరిష్కారాలను కనిపెట్టడానికీ, అది తోడ్పడాలి. మండల, ప్రాంతీయ కమిటీలూ, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీల కేంద్రకమిటీలూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి ఎప్పటికప్పుడు నివేదికలను అందజేస్తూ ఉండాలి. జిల్లా, పట్టణ కమిటీలు మండల, ప్రాంతీయ కమిటీలకూ, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీల కేంద్రకమిటీలకూ నివేదికలు పంపాలి. కమ్యూనిస్టులపార్టీ, ప్రభుత్వ క్రమశిక్షణను ఎంతవరకు పాటిస్తున్నారో తనిఖీ చేయడంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ కంట్రోలుకమిషనూ, స్థానిక పార్టీసంస్థల పార్టీ కమిషన్లూ మరింత ఎక్కువ పాత్రను నిర్వహించాలి.

కార్మికవర్గ, ప్రజలతో సన్నిహిత సంబంధాలే కమ్యూనిస్టుపార్టీకి బలం. ప్రజాస్వామ్యంతో తన సంబంధాలను మరింత బలపరచుకోవడమూ, సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని పెంపొందచేయడమూ, ప్రభుత్వ సంస్థల, ప్రజా సంస్థల పనిని మరింత మెరుగుపరచడమూ తన ముఖ్య కర్తవ్యంగా పార్టీ పరిగణిస్తూంది.

మన వ్యవస్థలోని సోషలిస్టు ప్రజాస్వామ్యం శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లలో ఉత్తమోత్తమంగా మూర్తీభవించింది. ఇవి ప్రభుత్వాధికార సంస్థలుమాత్రమే కాకుండా, మన ప్రజాసంస్థల్లో అన్నిటికన్నా పెద్దవికూడా. విద్య, ఆరోగ్య సౌకర్యాలు, సాంఘిక సమస్యలు, వర్తకము, భోజన వసతి,

ప్రజలకు సాంస్కృతిక, తదితర సౌకర్యాలు – వీటిని మరింత మెరుగుపరచ వలసిన బాధ్యత స్థానిక సోవియట్లది. పట్టణాలనూ, గ్రామాలనూ, పేటలనూ అభివృద్ధి పరచడంలోనూ, రోడ్లనూ, నివాస భవనాలనూ నిర్మించడంలోనూ అవి మరింత ఎక్కువ క్రియాత్మకంగా పాల్గొనాలి.

సోవియట్ల పనిలో అభివృద్ధి వాటిని మరింత ప్రజాస్వామికం చేయడంపై ఆధారపడి ఉండాలి. శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల సమావేశాలు ఇంకా పెద్ద పాత్రను నిర్వహించాలి. ఆర్థిక వ్యవస్థను, ఆర్థిక వ్యవహారాలను, భూమికి సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలోనూ, స్థానిక పారిశ్రామిక సంస్థలకు సారథ్యం వహించడంలోనూ ప్రజలకు అవసర మయిన సౌకర్యాలనూ వినోదాలనూ ఏర్పాటు చేయడంలోనూ స్థానిక సోవియట్లకు ఇంకా ఎక్కువ స్వాతంత్ర్యం ఇవ్వాలి. స్థాయీ సంఘాలపని మరింత చురుకుగా జరిగేలాగా చూడాలి. ప్రతినిధులు తమతమ నియోజక వర్గాలకు క్రమబద్ధంగా నివేదికలను సమర్పిస్తూ ఉండాలి. సోవియటు మంత్రిమండలి, సోవియటు యూనియన్ సుప్రీమ్ సోవియటు సమావేశాలకు నివేదికలను సమర్పించడమూ, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రి మండలులూ, ప్రాంతీయ, మండల, పట్టణ, జిల్లా కార్యనిర్వాహక కమిటీలు, తమకు సంబంధించిన శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల సమావేశాలకు నివేదించడమూ ఒక ఆచారం కావాలి. అతిముఖ్యమైన ముసాయిదా బిల్లులపైనీ, తదితర శాసనాల పైనీ దేశవ్యాపితంగా చర్చలు జరగాలి.

సోవియట్ శాసన నిర్మాణ వ్యవస్థ మరింత వేగంగా అభివృద్ధి పొందేలా చేయడమూ, శాసనాలు|ఎలా అమలు జరుగుతున్నాయో తనిఖీచేయడమూ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, ప్రభుత్వ సంస్థలకు సంబంధించిన సమస్యలను పలు విధములయిన వాటిని సమావేశాల్లో చర్చకు తేవడమూ సోవియటు యూనియన్ సుప్రీమ్ సోవియటుయొక్క యూనియన్‌ల రిపబ్లిక్కుల సుప్రీమ్ సోవియట్లయొక్క బాధ్యత. సోవియటు యూనియన్ సుప్రీమ్ సోవియటు ప్రతినిధులు, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీమ్ సోవియట్ల ప్రతినిధులు మరింత చురుకుగా పనిచేయాలి. సోవియటు యూనియన్, సుప్రీమ్ సోవియటు ఉభయ సభలకూ కొత్త స్థాయీ సంఘాలను ఏర్పాటుచేయడం ఇందుకు బహుశః తోడ్పడవచ్చు.

ప్రభుత్వ సంస్థల సంరక్షకులమనే సంకుచిత భావాన్ని, వాటిని నిర్లక్ష్యం చేసే అలవాటునూ పార్టీ|సంస్థలు పూర్తిగా విసర్జించాలి. అధికారుల్లో బాధ్యతా రాహిత్యానికీ, నిస్తబ్దతకూ ఇవి దారితీస్తాయి. సోవియట్ల కార్యాకలాపాలను అన్ని

విధాల అభివృద్ధి పరచడమూ, వాటి గౌరవను బలపరచడమూ, సోవియట్లలో పదవులకు సిబ్బందిని ఎంచడం, ప్రొమోట్ చేయడంపట్లా, సోషలిస్టు ప్రజాస్వామ్య సూత్రాలను అమలు జరపడం, వాటిని మరింత అభివృద్ధిపరచడం పట్ల నిరంతరం శ్రద్ధవహించడమూ, పార్టీ సంస్థల విధ్యుక్తధర్మం.

సోవియట్లు చేసేపని విజయవంతం కావడం, ఆ పనిలో పాల్గొనేలా ప్రజా సామాన్యాన్నికూడా ఆకర్షించడంపైని చాలవరకు ఆధార పడిఉంది. ఈ విషయంలో ప్రజా అజమాయిషీ సంఘాలకుచాలఎక్కువ ప్రాధాన్యంఉంది. ప్రజా అజమాయిషీ సంఘాల పనికి పార్టీ సంస్థలు అనునిత్యము మార్గ దర్శకత్వం వహించాలి. వాటికి సర్వతోముఖ సహాయాన్ని అందజేయాలి.

సోవియటు సంస్థల సకల కార్యకలాపాలూ, దేశ వ్యవహారాల నిర్వహణలో ప్రజలు విరివిగానూ, సృజనాత్మకంగానూ పాల్గొనడమూ సోషలిస్టు సూత్రాలను ఖచ్చితంగా పాటించడంపైనే ఆధారపడి ఉండాలన్న సూత్రమే, ప్రభుత్వ యంత్రాంగం యొక్క ప్రజాస్వామిక సూత్రాలను అభివృద్ధి పరచడంలో పార్టీకి ప్రాతిపదికగా ఉంటుంది. ఆచరణలో నిగ్గుదేలి ప్రజల మనోభీష్టానికి ప్రతిబింబంగా వున్న సోషలిస్టు న్యాయశాస్త్ర ప్రమాణాలు సోవియటు శాసనాల్లో మూర్తీభవించాయి. ప్రజల పట్ల శ్రద్ధాసక్తులతో అవి నిండివున్నాయి. మన సామాజిక వ్యవస్థకూ, సోవియటు పౌరుల ప్రయోజనాలకూ, హక్కులకూ అవి నమ్మకమైన రక్షణ. రక్షకభట సంస్థలూ, ప్రభుత్వ న్యాయవాదుల కార్యాలయాలూ, న్యాయస్థానాలూ – ఇవన్నీకూడా సోషలిస్టు న్యాయసూత్రాలనూ, న్యాయనిర్వహణనూ మరింత పటిష్ఠం చేయడంలో ఎంతో సేవ చేస్తున్నాయి. సామ్రాజ్యవాద గూఢచారి శాఖలను, వాటి ఏజెంటులను బటబయలు చేయడంలోనూ, వాటి కుతంత్రాలను భగ్నమొనర్చడంలోనూ మన దేశ భద్రతా సంస్థలూ, సరిహద్దు రక్షక దళాలూ అప్రమత్తులై తమ విధులను నిర్వర్తిస్తున్నాయి.

కామ్రేడ్స్, మన దేశరక్షణ పాటవాన్నీ, ప్రఖ్యాతమైన మన సాయుధ బలాల శక్తినీ పెంపొందజేయడంపట్ల నిరంతరం శ్రద్ధవహించడం సోవియటు దేశంయొక్క ముఖ్య కర్తవ్యం. అంతర్యుద్ధంలోనూ, సోవియటు ప్రజల దేశభక్తియుతమైన మహాయుద్ధం అగ్ని పరీక్షల కాలంలోనూకూడా సోవియటు సైన్యం, తనను సృష్టించిన కార్మిక, కర్షక వర్గాల, మేధావుల పేరు నిలబెట్టింది. మన దేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సోవియటు సేనలు వీరోచితంగా కాపాడాయి.

అత్యంత శ్రేష్టమయిన అణురాకెటు ఆయుధాలనూ, అధునాతనమైన ఇతర ఆయుధాలనూ మన సైన్యానికీ, నౌకాబలానికీ సమకూర్చడం, ఆర్థికాభివృద్ధి రంగంలోనూ, మన విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్రాల అభివృద్ధి రంగంలోనూ సాధించిన విజయాలవల్ల మనకు సాధ్యమయింది. సోవియటు సాయుధబలాల ఆయుధాలు ఆధునిక అవసరాలకు అనుగుణమయినవి. సుదూర లక్ష్యాలను ఛేదించడంలోనూ, అగ్నివర్షం కురిపించడంలోనూ వాటికి గల శక్తి యెటువంటి దురాక్రమణదారునైనా సరే హతమార్చగలదు.

భవిష్యత్తులోకూడా సోవియటు ప్రజలు కఠినపరీక్షలకు గురికావడం జరగ వచ్చు ననే విషయాన్ని మనం యెన్నడూ మరచిపోకూడదు. ప్రస్తుత ఉద్రిక, సంక్లిష్టప్రపంచ పరిస్థితిలో నిర్విరామంగా జాగరూకులమై వుండడం మన విద్యుక్త ధర్మం. రక్షణ పరిశ్రమ మరింత అభివృద్ధి పొందేలాగా చూడడమూ, అణు రాకెటు ఆయుధాలనూ, అన్నిరకాల ఇతర ఆయుధాలనూ మరింత మెరుగుపరచ డమూ చాల ముఖ్యమని పార్టీ భావిస్తూంది. మన దేశరక్షణకు ఇది చాల అవసరం.

పౌర రక్షణను మనం నిర్దుష్టం చేయాలి. ప్రజలను, ముఖ్యంగా యువజను లను రక్షణ కార్య కలాపాలకు సంసిద్ధమొనర్చే దేశభక్తియుత కార్యక్రమాన్ని అభివృద్ధి పరచాలి. సైన్య విభాగాలకూ, సైనిక దళాలకూ వివిధ పారిశ్రామిక సంస్థలూ, విద్యా సంస్థలూ, ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ పోషకత్వం వహించడాన్ని పెంపొందించాలి. సోవియట్ సైనికాధి కారులకూ, సైనికులకూ, వారికుటుంబాలకూ ఇంకా ఎక్కువ సౌకర్యాలను సమకూర్చాలి.

సైనికులూ, నావికులూ, సార్జెంటులూ, కింది అధికారులూ, పై అధికారులూ, జనరల్, అడ్మిరల్ హోదాలవారూ, కష్టపడి కొనసాగిస్తూన్న గౌరవ ప్రధానమైన కృషిని కమ్యూనిస్టుపార్టీ, సోవియటు ప్రభుత్వమూ, యావన్మంది ప్రజలూ ఎంతగానో హర్షిస్తున్నారు. తమ సాయుధ బలాలపట్ల అపారమైన ప్రేమాభిమానాలను కనబరుస్తున్నారు. రణరంగంలో అవి సముపార్జించిన ఘనకీర్తికి గర్వపడుతున్నారు. సోవియటు యూనియన్ రక్షణ పాటవాన్ని అన్నివిధాలా బలపరచడమూ, సోవియటు సాయుధ బలాల శక్తిని పెంచడమూ, సోవియటు ప్రజల శాంతియుత శ్రమకు నమ్మకమయిన రక్షగా ఉండగల స్థాయిలో సాయుధ బలాలను సర్వ సంసిద్ధంగా ఉంచడమూ, పార్టీ ఇకముందుకూడా కొనసాగిస్తుంది.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు నిర్మాణ సమస్యలను పరిష్కరించడంలో ట్రేడ్

యూనియన్లు చాల పెదపాత్రను నిర్వహించ వలసిఉంది. వీటిసభ్యత్వం సుమారు 80 మిల్లియన్లు. కమ్యూనిజమ్ బోధనాసంస్థలుగా ట్రేడ్‌యూనియన్ల కార్యకలాపాలనూ నేటిపరిస్థితులను బట్టి ఒకకొత్త స్వభావాన్ని సమకూర్చడం జరుగుతుంది.

పారిశ్రామిక సంస్థల హక్కులనూ, ఆర్థిక స్వాతంత్ర్యాన్నీ విస్తృతం చేయడంలోనూ, ఆర్థిక ప్రోత్సాహకాలను నికరంగా ఉపయోగించడంతోనూ, ప్రభుత్వ ప్రణాళికలు పూర్తిగా నెరవేరేందుకూ, వస్తూత్పత్తిని సాంకేతికంగా నిపుణమొనర్చేందుకూ, కొత్త కొత్త యంత్రాలనూ, పద్ధతులన్నూ కనిపెట్టడమూ, తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాలను సాధించే పద్ధతులను ప్రవేశ పెట్టడమూ భారీ ఎత్తున సాగేందుకూ, ట్రేడ్‌యూనియన్లు మరింత ఎక్కువగా బాధ్యత వహించ వలసి వస్తూంది. ప్రజల సృజనాత్మక కార్యకలపాలను అభివృద్ధి చేయడంలోనూ, వస్తూత్పత్తి మేనేజిమెంటులో శ్రామిక ప్రజలు పాల్గొనేలా చేయడంలోనూ, సోషలిస్టు పోటీనీ, కమ్యూనిస్టు శ్రమఉద్యమాన్నీ పెంపొందించడంలోనూ అవి అంతకంతకు మరింత ఎక్కువ పాత్రను నిర్వహించ వలసి ఉంది

శ్రామికప్రజల రాజకీయ బోధన, శ్రమశక్తి వ్యవస్థీకరణ, శ్రమ శక్తికి ప్రతిఫలం, ఇంకా ఎక్కువ నైపుణ్యం అవసరమయిన పనుల్లోకార్మికులకు తరిఫీదు ఇవ్వడం – వీటిపై ట్రేడ్ యూనియన్లు దృష్టిని కేంద్రీకరించాలి. పరిశ్రమల్లో పారిశుద్ధ్యాన్ని గురించీ, ప్రమాదాలను నివారించే రక్షణ ఏర్పాట్లను గురించీ అవి శ్రద్ధ తీసుకోవాలి. ప్రజలు సౌకర్యాల విషయంలోనూ, గృహనిర్మాణ పథకాలూ, శిశుసంరక్షణ, శిశువిద్యా కేంద్రాల నిర్మాణపథకాలూ ఎలా అమలు జరుగుతున్నా యనేవిషయంలోనూ అవి అనుదినమూ శ్రద్ధాసక్తులను కనబరచాలి.

ట్రేడ్ యూనియన్ల కార్యకలాపాలు మరింత ఉన్నత సాయినందుకోవాలంటే వాటికి పార్టీ మార్గదర్శకత్వాన్ని అభివృద్ధిపరచాలి. ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలను ఎంచుకోవడం పట్లా వారికి తరిఫీదునివ్వడం పట్లా పార్టీ సంస్థలు మరింత ఎక్కువ శ్రద్ధ చూపాలి. ట్రేడ్ యూనియన్ సంస్థలు చేసే ప్రతిపాదనలను అవి మరింత ఎక్కువగా బలపరచాలి.

సుమారు 23 మిల్లియన్ల యువతీ యువకులు సభ్యులుగా ఉన్న లెనినిస్టు కామ్సొమోల్ సంస్థా, అది నాయకత్వం వహిస్తూన్న అద్భుతమైన సోవియటు యువజనమూ, సోవియటు సమాజంలో ఒక క్రియాశీలమైన సృజనాత్మక శక్తి. మహత్తరమైన, కమ్యూనిసు ఆదర్శాలపట్ల అపారమైన విధేయత సరళిలో వివిధ

తరాల ప్రజలను యావన్మందినీ చైతన్యవంతులను చేయగలిగి నందుకు పార్టీ గర్వపడుతూంది. కామ్‌సొమోల్‌ని సోవియటు యువజనుల సమరశీలమైన అగ్ర దళంగానూ, పార్టీకి నమ్మకమయిన రిజర్వబలగముగానూ అది పరిగణిస్తూంది. అన్ని విషయాల్లోనూ కమ్యూనిస్టుపార్టీని అనుసరించడమూ, దానికి విశ్వాస పాత్రమయిన, ఆధారపడదగిన సహాయకునిగానూ ఉండడమే మన సమాజం యొక్క జీవితంలో దాని పరిణామక్రమంలో అన్ని సమయాల్లోనూ, అన్ని దశల్లోనూ కూడా కామ్‌సొమోల్ పరమ పవిత్రంగా పరిగణిస్తూ వచ్చింది. ఆ సంప్రదాయాన్నే కొనసాగించింది.

కామ్‌సొమాల్ సభ్యులయిన సోవియటు యువతీ యువకులు, మన ప్రజల, మన దేశ భవిష్యత్తు పట్ల ఉదాత్తమైన బాధ్యతాయుత వైఖరినీ, చైతన్యాన్నీ కనబరుస్తున్నారు. ఒక తరానికీ, మరొక తరానికీ మధ్య అవిచ్ఛిన్నత, విప్లవ సంప్రదాయాల్లోని బ్రహ్మాండమయిన శక్తీ, యువజనుల క్రియాత్మక కార్యకలాపాల్లోను, వారి ఉన్నత ఆదర్శాల్లోను ప్రస్ఫుట మవుతున్నాయి. బ్రహ్మాండమయిన విద్యుత్ కేంద్రాలను, రైలు మార్గాలను, కొత్త కొత్త పట్టణాలను నిర్మిస్తూన్న వారూ, బీడుభూములను సస్యశ్యామలం చేస్తున్నవారూ, రోదసీ పరిశోధనలో అగ్రగాములూ అయిన యువజనుల శ్రామికవిజయాలు సోవియటు యూనియన్ చరిత్రకు మరికొన్ని అద్భుతమైన అధ్యాయాలనుచేర్చారు.

సంవత్సరాలు గడచిపోయిన తరువాత, మన సంతతివారు నేటి ప్రజల వీరత్వాన్నీ, ప్రపంచంలో సోషలిస్టు ఆదర్శాలను పటిష్ఠ మొనర్చేందుకు సాగిన పోరాటం ఉద్దేశాల విషయంలో వీరు కనబరచిన స్పష్టతను ప్రస్తుతిస్తారు.

యువజనులే మన భవిష్యత్తు. ప్రస్తుత కాలానికీ, మన విప్లవాలకూ మధ్య గల బంధం వారి హృదయంలో నిరంతరం హత్తుకొని వుండాలనీ, జీవితంయొక్క లోతులనూ, చిక్కులనూ వారు అవగతం చేసుకోగలగాలనీ, కమ్యూనిజం నిర్మాణంలో తమ పాత్రనూ, ఆ నిర్మాణంపట్ల తమ బాధ్యతనూ వారు గుర్తించాలనీ మనం కోరుకుంటున్నాము. విప్లవాత్మక, ఉత్సుకత, శ్రామిక వీరావేశం, మానవుని ఔన్నత్యమూ, ఉదాత్తమైన ఆదర్శాలూ, శత్రువుల అన్నిరకాల దురాక్రమణలనుండి తమ దేశాన్ని కాపాడేందుకు సంసిద్ధత సోవియటు యువజనుల్లో తొణికిసలాడుతున్నాయి.

యువతీ యువకుల్లోని సృజనాత్మక శక్తి పట్ల పార్టీకీ, యావన్మంది ప్రజ

లనూ విశ్వాసం వుంది. మన దేశంయొక్క మంచికోసం సాగే నిర్దిష్టమైన కార్యక్రమంతో యువజనుల జీవితం ప్రతిరోజూ నిండివుండాలన్నది మన అభిలాష. పార్టీ, ప్రభుత్వమూ ఇచ్చే పిలుపు లన్నింటినీ సోవియటు యువతీ యువకులు ఉత్సాహంతో అందుకుంటున్నారు.

కామ్సొమోల్ కార్యకలాపాల స్వభావమూ, యువజనుల్లో సాగే యావత్తు కార్యక్రమ స్వభావమూ చాల ఉన్నతస్థాయిలో వుండడం, జీవిత వాస్తవికతను బట్టి అవసరమవుతూంది. వర్తమాన తరంవారిని విజ్ఞానవంతులను చేయడమే పనిగా పెట్టుకున్న సంస్థలు దేశంలో అనేకం వున్నాయి. అయితే, తమ తమ కార్యకలాపాల్లో అవి తరుచుగా ఒకదానినుండి ఒకటి వేరైపోతున్నాయి. ఒక విధంగా చెప్పాలంటే మన దేశం యువజనుల దేశమన్న విషయాన్ని మరచిపో కూడదు. దీని జనాభాలో సగంమంది 26 సంవత్సరాలలోపు వయసువారే. అందువల్ల, యువజనులకు విద్యాబుద్ధులను నేర్పడంపట్ల పార్టీ కామ్సొమోల్, తదితర సంస్థలన్నీకూడా మరింత ఎక్కువ శ్రద్ధ చూపడం చాల ముఖ్యం. యువజనుల్లో సైద్ధాంతిక, బోధనాత్మక కృషిని మరింత ఉన్నతస్థాయిలో సాగించ డమూ, ఆ కృషిని మరింత పరిపుష్టమొనర్చడమూ. పార్టీ కామ్సొమోల్ నిర్వ హించవలసిన ముఖ్యమైన కర్తవ్యం. కామ్సొమోల్ సభ్యులూ, తక్కిన యువ జనులూ నిర్మాణకేంద్రాల్లో ఉత్సాహంగా పనిచేయడమూ, ఇతర ఆర్థిక సమస్యల పరిష్కారంలో పాల్గొనడమూ ప్రశస్తమైన విషయం. ఐనప్పటికీ, కామ్సొమోల్ కార్యక్రమంలో ప్రధానాంశాన్ని – యువజనులకు విద్యాబుద్ధులను నేర్పడాన్ని – విస్మరించకూడదు.

యువజనుల్లో కొనసాగుతూన్న సైద్ధాంతిక, బోధనాత్మక కార్యక్రమంలో లోపా లున్నాయన్న విషయాన్ని మనం ఒప్పుకోవాలి. నేటి యువతరంవారికి విప్లవపోరాట మనే పాఠశాలలోని కఠినమైన శిక్షణానుభవం లేదన్న సంగతినీ, వారికన్నా ముందుతరం వారిలో కలిగిన రాటుదేలడం వీరికి లేదన్న సంగతినీ కొన్ని పార్టీ కామ్సొమోల్ సంస్థలు దృష్టిలోకి తీసుకోకుండా ఉన్న సందర్భాలు ఉన్నాయి. కొంతమంది యువజనులు క్రియాశీలమైన జీవితానికి దూరంగా వుండాలని కోరుకుంటున్నారు. ఇతరులపై ఆధారపడి జీవించాలనే ధోరణి కన బరుస్తున్నారు. ప్రభుత్వం తమకు ఏమేమో చేసిపెట్టాలని కోరుతున్నారు. కాని, సమాజంపట్ల. ప్రజలపట్ల తమ విధ్యుక్త ధర్మాన్ని విస్మరిస్తున్నారు. ఏలాంటి

సైద్ధాంతిక అంటువ్యాధికడ్డా ఇట్టే లోనయిపోయే ఈ దుర్బలులను మన శత్రువు లయిన బూర్జువా సిద్ధాంతవేత్తలు కనిపెట్టి, లొంగదీసుకొని ఉపయోగించుకోడానికి ప్రయత్నిస్తారు. అదృష్టవశాత్తు మన యువజనుల్లో ఇటువంటి వారు బహు కొద్ది మంది మాత్రమే వున్నారు.

పార్టీ, కామ్సొమోల్ సైద్ధాంతిక రాజకీయకృషి వర్ధమాన తరంలో మార్క్సిస్టు – లెనినిస్టు చైతన్యాన్ని పెంపొందించి, పటిష్ఠం చేయాలి. జీవిత యావత్ పరిణామాల పట్ల వారిలో వర్గదృక్పథాన్ని పెంచాలి. కమ్యూనిస్టుపార్టీకి సదా విశ్వాస పాత్రులుగా వుండాలనే విషయాన్ని వారికి బోధించాలి. యువజనులు తమ దేశం పట్ల, సోషలిజం వల్ల కలిగిన గొప్పలాభాల రక్షణపట్ల మరింత బాధ్యతతో మెలగేలా వారిని తీర్చిదిద్దగల శక్తి ఇదే: బూర్జువాసిద్ధాంతాల నీతి సూత్రాల ప్రభావానికి వ్యతిరేకంగా పోరాడటంలో పదునైన ఆయుధంగా ఉపయోగ పడేది ఇదే.

పార్టీసంస్థలు కాంసొమోల్ నాయకత్వాన్ని అభివృద్ధిచేయాలి; కామ్సొమోల్ కార్యకర్తలను ఓపికతో, శ్రద్ధతో తరిఫీదు చేయాలి. రాజకీయ, నిర్మాణరంగాలలో తమ అనుభవాన్ని వారికి అందివ్వాలి. కామ్సొమోల్ సంస్థలలో పార్టీ నిర్మాణాన్ని పటిష్ఠం చేయాలి. ముప్పై సంవత్సరాలలోపు వయస్సుగల రెండున్నర మిల్లియన్ల కమ్యూనిస్టులలో 2,70,000 మందిమాత్రమే కామ్సొమోల్‌లో పనిచేస్తూ వుండటం పూర్తితప్పు. పార్టీలోని యువసభ్యులు కామ్సొమోల్ పనిలోనికి మరింత క్రియా శీలంగా ఆకర్షింప బడాలి. ఆపని ముఖ్యమైన పార్టీ పనిగా వారు పరిగణించాలి. కాంసొమోల్ సంస్థల్లోని పనిస్వభావం మరింత ఉన్నతస్థాయిలో వుండాలని కోరాలి.

కాంసొమోల్‌లో నిర్మాణదక్షతనూ, క్రమశిక్షణనూ పెంపొందించాలి. దాని బోధనాత్మక కృషిరూపాలను పద్ధతులను మరింత అభివృద్ధిపరచాలి. కాంసొమోల్ పిల్లలలో ఇతోధికంగా పని చేయాలి. యంగ్‌పైనీర్ సంస్థను అభివృద్ధిచేయడానికి తగిన చర్యలు తీసుకోవాలి. కాంసొమోల్‌తోపాటు, ట్రేడ్‌యూనియన్, క్రీడా, సాంస్కృతిక సంస్థలూ, పరిశ్రమల, భవననిర్మాణాల మేనేజిమెంటూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలూ సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, యువజనుల పెంపకంపట్ల మరింత శ్రద్ధవహించాలి.

లెనినిస్టు కాంసొమోల్‌యొక్క సకల సోవియట్ యువకులయొక్క జవ సత్వాలలోనూ వారి భవిష్యత్‌లోనూ పార్టీకి విశ్వాసముంది. గతంలో వారికి ముఖ్య

మైన బృహత్ కర్తవ్యాలను అప్పజెప్పింది; భవిష్యత్తులోకూడా అలా అప్పజెప్పుతూనే వుంటుంది.

యువజనులను చైతన్య వంతులనుచేసి, మనవిప్లవ కాలానికి తగిన వారుగా వారిని తయారు చేయటం యావత్ పార్టీకి గౌరవ ప్రదమైన విషయం. యువకులు మన మహాదేశానికి ఆశాజ్యోతి; దాని భవిష్యత్తు; వారు ఆత్మబలం కలవారు. మన మహాదర్శంకోసం దీక్షతో పోరాడినారు. అందువల్ల, తల్లి తన పిల్లల్ని శ్రద్ధాసక్తులతో పెంచినట్లుగా పార్టీ యువతరాన్ని చైతన్యవంతం చేయాలి.

## 2. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో కొన్ని మార్పులు :

కామ్రేడ్స్, 22వ మహాసభ ఆమోదించిన సోవియటు కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళి పార్టీ జీవిత ప్రమాణాలకు, కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ కాలానికీ, దాని కర్తవ్యాలకు అనుగుణంగావున్నది. కాని, దానికి కొన్ని సవరణలు, మార్పులు అవసరమని గత కొద్ది సంవత్సరాల అనుభవం నిరూపించింది. ఇందుకై పార్టీ సాధారణ సమావేశాలలోనూ, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీ సమావేశాలలోనూ, మహాసభలలోనూ, సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి వచ్చిన లేఖలలోనూ అనేక ప్రతిపాదనలు చేయబడ్డాయి. ఈ ప్రతిపాదనల ప్రధాన ఉద్దేశం పార్టీ సభ్యుడనే హోదాను మరింత ఉదాత్తం చేయడం, పార్టీ సంస్థల పాత్రను కార్యకలాపాలను మరింత అభివృద్ధి చేయడం, తమ సంస్థ పని పట్ల, మొత్తం పార్టీ పనిపట్ల పార్టీసభ్యుల బాధ్యతను పెంచడం.

పార్టీ మహాసభల మధ్యకాలంలో ఆచరణలో వచ్చిన అనుభవాన్ని స్థానిక పార్టీసంస్థల,పార్టీసభ్యుల ప్రతిపాదనలను సమీకరించిన ఫలితంగా, సోవియటు కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళికి క్రింది సవరణలు, మార్పులు మహాసభ పరిశీలనకై నివేదించడం అవసరమని కేంద్రకమిటి భావిస్తున్నది.

పార్టీ సభ్యత్వాన్ని మరింత కట్టుదిట్టం చేయడానికి 23 సంవత్సరాలలోపు వయస్సు గలవారిని యువకమ్యూనిస్టు లీగ్ద్వారానే పార్టీలోకి తీసుకోవాలని సూచించ బడింది. ఇందువల్ల పార్టీ మూలబలంగా కాంసొమాల్ నిర్వహిస్తున్న పాత్ర హెచ్చుతుంది. యువకమ్యూనిస్టులీగ్లో తరిఫీదు పొంది, అత్యంత కార్య

వ్యగ్రులయిన యువకులను పార్టీ సభ్యులుగా ఎన్నుకోవడానికి మనకు అవకాశం కలుగుతూంది.

ప్రస్తుత నిబంధనావళి ప్రకారం, పార్టీలో మూడేళ్లుగా సభ్యులుగా వున్న వారికి, అయిదేళ్లకు తక్కువ కాకుండా సభ్యులుగా వున్నవారికి మాత్రమే పార్టీ లోనికి కొత్తవారిని తీసుకొనే విషయంలో సిఫార్సులు చేసేహక్కు ఉండాలని సూచించిన సంస్థలతోనూ, కామ్రేడ్స్‌తోనూ, మేము ఏకీభవిస్తున్నాము.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిని ఉల్లంఘించే వారినీ, తమ ప్రవర్తనద్వారా కమ్యూనిస్టు అనే ఉన్నతమైన పేరుకే అప్రతిష్ఠ తెచ్చేవారినీ పార్టీ నుంచి తొలగించాలనే అంశాన్ని నిబంధనావళి ఉపోద్ఘాతంలో పొందుపరచాలని సూచన చేస్తున్నాము.

పార్టీనుంచి ఒకసభ్యుణ్ణి బహిష్కరిస్తూ పార్టీ ప్రాథమిక సంస్థ చేసే నిర్ణయం పార్టీయొక్క జిల్లా లేక నగర కమిటీ ఆమోదంపొందిన వెంటనే అమలులోనికి వచ్చేవిధానాన్ని ప్రవేశపెట్టాలని సూచిస్తున్నాము. పార్టీలోనికి సభ్యులను తీసుకొనే విషయంలో వారి నిర్ణయానికి ఎలా తిరుగులేదో అదేవిధంగా బహిష్కరణ విషయంలో ఈ నిర్ణయానికి తిరుగు వుండదు. ఈ పద్ధతివల్ల కమ్యూనిస్టు హక్కులకు ఎలాంటి భంగము వాటిల్లదు. ఎందుకంటే మునుపటిలాగానే వారు సోవియటు కమ్యూనిస్టుపార్టీతోసహా ఏ పార్టీలో ఏ పైసంస్థకైనా అప్పీలు చేసుకోవచ్చు. పార్టీ సభ్యుల విషయంలో జిల్లా, నగరపార్టీ సంస్థలు వ్యవహరిస్తున్న విధానంపై యూనియన్ రిపబ్లిక్ కమ్యూనిస్టు పార్టీల ప్రాంతీయ, ప్రాదేశిక, కేంద్ర కమిటీలు ఇప్పటి లాగానే తప్పనిసరిగా అజమాయిషి చేయవలసి వస్తుందని నిశ్చయంగా చెప్ప వచ్చు. పార్టీ సభ్యుడు చేసే తప్పులకు శిక్షగా అతన్ని కొంతకాలం సభ్యుడుగా చేయడం అవాంఛనీయమని తోస్తుంది. ఇది సరియైనదని ఆచరణలో రుజువు కాలేదు. పార్టీ సభ్యుల చైతన్యాన్ని పెంచే ఇతర చర్యలు అనేకం పార్టీ సంస్థలు తీసుకోవడానికి అవకాశముంది. పార్టీ సభ్యుడనే ఉన్నతమైన పేరుకు ఏ కమ్యూనిస్టు అయినా అర్హుడుకాని పక్షంలో సోవియటు కమ్యూనిస్టుపార్టీలో అతని సభ్యత్వాన్ని కొనసాగించే విషయాన్నిగురించి పార్టీ సంస్థ ఆలోచించాలి.

కొన్ని సవరణలు, చేర్పులు పార్టీపై సంస్థలను గురించిన నిబంధనావళికి సంబంధించినవి.

రోజు రోజుకు పెరుగుతున్న కర్తవ్యాల దృష్ట్యా, కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణంలో పార్టీ నిర్వహించే ఇతోధికపాత్ర దృష్ట్యా, మహాసభల మధ్యకాలంలో సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశాలకన్న విస్తృతమైన పార్టీ ప్రతినిధుల సమావేశాలలో ముఖ్య రాజకీయ సమస్యలను చర్చించవలసిన అవసరం ఏర్పడవచ్చు. ఇటువంటి సందర్భాలలో లెనిన్ జీవితకాలంలోనూ, 1941 వరకూ అటువంటి అఖిలపార్టీ సమావేశాలు జరిగాయి. అందువల్ల, అవసర మైనప్పుడల్లా, కేంద్ర కమిటీ అఖిల సోవియటు కమ్యూనిస్టుపార్టీ సమావేశాలనూ, యూనియన్ రిపబ్లిక్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీలు రిపబ్లిక్ పార్టీల సమావేశాలనూ జరపవచ్చునని నిబంధనలో పేర్కొనాలి.

యూనియన్ రిపబ్లిక్‌ల, కమ్యూనిస్టుపార్టీల మహాసభలను జరిపే తేదీల విషయంలో ఆ పార్టీల కేంద్రకమిటీలు చేసిన ప్రతిపాదనలను మనం అంగీకరించా లనీ, అటువంటి మహాసభలు ప్రతి నాలుగు సంవత్సరాలకు కనీసం ఒక దఫా జరగాలని నిర్దేశించాలని సూచిస్తున్నాము.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గానికి పొలిటికల్ బ్యూరో అనే పేరు తిరిగి పెట్టాలని అనేకమంది కమ్యూనిస్టులు తమ లేఖల్లో తెలియజేశారు. లెనిన్ జీవితకాలంలోనూ, ఆ తరువాత చాలాకాలంవరకు పార్టీ కేంద్ర కమిటీకి ఒక పొలిటికల్ బ్యూరో వుండినందువల్ల ఈ ప్రతిపాదనలు చేయబడ్డాయి. మన పార్టీ అత్యున్నత రాజకీయ సంస్థ నిర్వహించే పని స్వభా వాన్ని పొలిటికల్ బ్యూరో అనే పేరు మరింత సమగ్రంగా ప్రతిబింబిస్తున్నది. ఈ సంస్థ సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాల మధ్య కాలంలో పార్టీ కార్యకలాపాలను నడిపిస్తున్నది. ఈ ప్రతిపాదనను మేము బలపరుస్తున్నాం. ప్రస్తుతం రష్యన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్‌ల ఫెడరేషన్‌కు సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ బ్యూరో వుండటం అనవసరమనే అభిప్రాయం సర్వత్రా వ్యక్తమయింది.

రష్యన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్‌ల ఫెడరేషన్‌కు కేంద్రకమిటీ బ్యూరో వున్నప్పటికీ, ఫెడరేషన్ ప్రాదేశిక, ప్రాంతీయ పార్టీ సంస్థల పనికి సంబంధించిన ముఖ్యవిషయాలన్నీ సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యొక్క అధ్యక్ష వర్గమూ, సెక్రటేరియట్ చూస్తున్నాయి. అందువల్లరష్యా ఫెడరేషన్‌కు సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి సంబంధించిన యింకో సంస్థ అటువంటిదే వుండడం

అనవసరం. ఈ అభిప్రాయంతో సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఏకీభవిస్తున్నది.

పార్టీ సంస్థలలోనూ, వాటి నాయకత్వ స్థానాలలోనూ కొత్తవారిని తేవడం, పాతవారిని కొనసాగించడం అనే సమస్యకు సంబంధించిన నిబంధనలపై సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి 23వ మహాసభకు అనేక ప్రాతిపాదనలువచ్చాయి. వీటి దృష్ట్యాపార్టీ నిబంధనావళిలో వీటిని ఉంచడం మంచిదా అనే విషయంపై మనం సమాలోచనలు జరిపాలి.

నాయకత్వస్థానాలలో ఒక పద్ధతి ప్రకారం కొత్తవారిని తేవడం, పాతవారిని కొనసాగించడం అనే సూత్రం మన పార్టీలో చాలా కాలంగావుంది. అది మంచి సూత్రంకూడా. తమ కర్తవ్యాలను నిర్వహించగల శక్తిసార్జించిన కొత్తకార్యకర్తలు పార్టీలోను, ప్రభుత్వంలోను నాయకత్వస్థానాలకు ప్రమోషను చేయబడేలా పార్టీ జాగ్రత్తవహిస్తుంది.

ఈవిధానానికి సంబంధించిన నిబంధనలను పరిశీలించినప్పుడు, ఇవి సముచితమైనవి కావని ఋజువు అయింది. పార్టీనాయకత్వ సంస్థలకు కమ్యూనిస్టులను ఎన్నుకొనే సందర్భంలో వారి శక్తి సామర్థ్యాలను రాజకీయ అర్హతలను బట్టి ఎన్నుకోవాలనే సూత్రానికన్న యాంత్రికప్రాయమైన విషయాలకే ప్రాధాన్యమివ్వడం జరిగింది. ఫలితంగా పార్టీకమిటీలలో ఇంకా బాగా పనిచేయగలిగినటువంటి సభ్యులు తరుచుగా నాయకత్వ సంస్థలనుండి దిగిపోవలసి వచ్చింది.

పార్టీ ప్రాథమిక సంస్థల కార్యదర్శులు తమ పదవిలో రెండేళ్ళకు మించి వుండరాదనే నిషేధంవల్ల చాలా అస్థిరత ఏర్పడింది. మునుపు, ప్రాథమిక సంస్థల కార్యదర్శులలో 30–35 శాతం ప్రతిఏటా మారేవారు. ఇటీవల ఇది 60 శాతానికి పెరిగింది. ఇంతేకాదు, కార్యదర్శులలో మూడింట రెండువంతులు, నిబంధనలలో నిర్దేశించిన కాలపరిమితి ముగిసిందనే కారణంతోనే తమ స్థానాలనుండి తొలగవలసి వచ్చింది. పార్టీ ప్రాథమిక సంస్థల పనిపై దీని దుష్ఫలితాలు పడనారంభించాయి.

స్థానిక, నగర, జిల్లా కమిటీలలోనూ, పార్టీ ప్రాథమిక సంస్థల కమిటీలలోనూ, బ్యూరోలలోనూ, ఎన్నికలు జరిగినప్పుడల్లా సగం స్థానాలు కొత్తవారికి ఇవ్వాలనే నిబంధనవల్ల, పార్టీ కమిటీలకు ఎన్నికయ్యే అర్హతగల అనుభవజ్ఞుల, పరిణతమనస్కుల సంఖ్య తగ్గిపోయింది.

ఈ కారణాలవల్ల, సోవియటు కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలోని ఈ అంశాలను మన మహాసభ పరిశీలనచేయాలి. ప్రాథమిక సంస్థలు మొదలుకొని కేంద్ర కమిటీ వరకు గల అన్ని పార్టీ సంస్థల ఎన్నికలలో క్రమపద్ధతిలో కొత్తవారికి స్థానం ఇవ్వడం, పాతవారిని కొనసాగించడం అనే సూత్రాన్ని పాటించాలనే స్థూల నిబంధనను అలాగేవుంచి, ఈ పరిమాణాన్ని సంకుచితంచేసే నిబంధనను తొలగించడం మంచిదని తోస్తుంది. ఫలానా పార్టీ సభ్యుడు అతని రాజకీయ గుణగణాలు, శక్తి సామర్థ్యాలనుబట్టి పార్టీ నాయకత్వ సంస్థలో పనిచేయడానికి అర్హుడా కాదా అనే విషయాన్ని పార్టీ సభ్యులు తమకు తాము నిర్ణయించడం సముచితమూ, మరింత ప్రజాస్వామికమూను.

పెద్ద పెద్ద పార్టీ సంస్థల కమిటీలకు జిల్లా కమిటీ అధికారాలిచ్చి, అటువంటి పార్టీ కమిటీలకు రెండేండ్లకొకసారి ఎన్నికలు జరిపే పద్ధతి ప్రస్తుతం ఆచరణలో వున్నది. దీనిని లాంఛనంగా నిబంధనావళిలో పొందుపరచాలని ప్రతిపాదిస్తున్నాము.

పార్టీ నిబంధనావళికి సూచించబడ్డ సవరణలు, చేర్పులు, పార్టీ నిర్మాణకృషి స్థాయిని మరింత పెంచగలవనీ, పార్టీ కార్యకలాపాలను మెరుగు పరచగలవనీ కేంద్ర కమిటీ నిశ్చితాభిప్రాయం.

## 3. పార్టీ సైద్ధాంతిక - బోధనా కృషి :

కామ్రేడ్స్, సైద్ధాంతికరంగంలోని కృషిలో కమ్యూనిస్టులను, సకల శ్రామిక ప్రజలను సైద్ధాంతికంగానూ, రాజకీయంగాను పరిపుష్టం చేయడమూ కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలలో అత్యంత ప్రధానమయిన అంశం. మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవ సిద్ధాంతాల పరిరక్షణకు మనపార్టీ ఎల్లప్పుడూ సగర్వంగా చేయూనిచ్చింది. దీని విప్లవ ప్రబోధనలపై అచంచల విశ్వాసం, దీని శత్రువులకు వ్యతిరేకంగా రాజీ లేని పోరాటం - ఇవి మనపార్టీ ఒక ముఖ్య కలాపాల కీలక సూత్రాలుగా ఎల్లప్పుడూ వుంటూ వచ్చాయి.

మార్క్సిస్టు విప్లవసిద్ధాంతంలో నిష్ణాతులు కావాలని, దాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేయాలనీ పార్టీసభ్యులకు లెనిన్ ఎల్లప్పుడూ ఉద్బోధించారు. సిద్ధాంతాన్ని సృజనాత్మక దృష్టితో ఎలా పరిశీలించాలో ఆయన ఒరవడిపెట్టారు, సోషలిస్టు విప్లవపరిణామానికి, నూతన సమాజనిర్మాణానికి సంబంధించిన అనేక మూలసమస్యలను సైద్ధాంతికంగానూ, ఆచరణలోనూ ఎలా పరిష్కరించాలో అద్వితీయమైన

ఉదాహరణలు ఆయన మూలంగా మనకందాయి. ఆయన భావాలు, ఆయన పథకాలు, ఆయన బోధలు ఈనాటికీ మన దైనందిన సామాజిక, రాజకీయ ఆర్థిక జీవితాన్ని, ఊహించవీలులేనంత గొప్పగా ప్రాభావితం చేస్తున్నాయి.

మన దేశంలో సోషలిజం సాధించిన మహత్తర విజయాలన్నీ మార్క్సిస్టు–లెనినిస్టు ప్రబోధాలపై ఆధారపడి వున్నాయి. కమ్యూనిస్టుపార్టీ, సోవియటు ప్రజలూ సైద్ధాంతికంగా పతనమవుతున్నారనే మన శత్రువుల ఆశలు అడియాసలయ్యాయి. ఇది ఎన్నటికి జరగదు. మార్క్సిజం – లెనినిజంలో మన అచంచల విశ్వాసాన్ని ప్రపంచంలో ఏశక్తి నిర్మూలించలేదు.

మార్క్స్–ఎంగెల్స్–లెనిన్‌లు కలసి మనకిందించిన సైద్ధాంతిక వారసత్వం మన పార్టీకి యావత్ ప్రపంచ ఉద్యమానికి గల అత్యంత ప్రీతిపాత్రమైన ఆస్తి. శాస్త్రీయ మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాల సృజనాత్మకాభివృద్ధి, అది కార్మికవర్గ తదితర సకల శ్రామిక ప్రజల విప్లవ కార్యాచరణతో అవినాభావంగా సమ్మేళన చెందడం ఇది మనపార్టీ చరిత్రలో మొదటినుంచి తుదివరకు పార్టీకార్యకలాపాల ప్రధాన లక్షణమని మనం నిస్సందేహంగా చెప్పుకోవచ్చు.

ప్రస్తుత పరిస్థితులలో మన సైద్ధాంతిక కృషి కర్తవ్యాలు, ప్రమాణాలు మరింత గొప్పవి. సోషలిస్టు సమాజంలాగా, మరే సమాజానికి శాస్త్రీయ సిద్ధాంతాల ఆవశ్యకత ఏర్పడలేదు. అందువల్లనే సిద్ధాంతం ఆచరణకు దారి సుగమంచేయవలసి వచ్చింది; సోవియటు ప్రజల ఆర్థిక, సాంస్కృతిక జీవిం నిర్వహణపట్ల ఖచ్చితమైన శాస్త్రీయ దృక్పథం కొనసాగేలా చూడవలసి వుంది. పెద్దయెత్తున నిర్వహింపబడే సైద్ధాంతిక కృషి ఉజ్జ్వలమైన కరదీపికలా మన పార్టీకి మార్గం చూపవలసి వుంది. మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాలను సృజనాత్మకంగా మరింత అభివృద్ధి చేయడం ఒక ప్రధాన కర్తవ్యంగానూ, కమ్యూనిజాన్ని నిర్మించడంలో విజయం పొందటానికి అత్యవసరంగానూ పార్టీ భావిస్తున్నది.

మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతాన్ని అభివృద్ధిచేయడంలో సామాజిక శాస్త్రాలు గొప్ప పాత్ర నిర్వహిస్తాయి. వాటిపై పార్టీ గొప్పగా ఆశలుపెట్టుకొన్నది. అవి గురుతరమైన బాధ్యత నిర్వహించనున్నాయని కూడా భావిస్తున్నది. సోవియటు సామాజిక శాస్త్రజ్ఞులు నిర్వహించవలసిన ముఖ్యమైన కర్తవ్యమేమిటంటే, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన కార్యాచరణనుబట్టి ఆర్థిక, రాజకియ, తాత్విక, సాంఘిక, శాస్త్ర, చరిత్ర, న్యాయ, తదితర సామాజిక శాస్త్రాలలోని ప్రధాన

సమస్యలను పరిష్కరించడం. కమ్యూనిస్టు సమాజ సంబంధాలు రూపొందే ధోరణి, వాటి స్వభావం, రాజకీయ వ్యవస్థను మెరుగుపరచడం, సోషలిస్టు ప్రజాస్వామ్య అభివృద్ధి, ఆర్థిక వ్యవహారాల నిర్వహణ రూపాలు, పద్ధతులు, మానవ శ్రమను శాస్త్రీయ ప్రాతిపదికపై వ్యవస్థీకరించడం, కమ్యూనిస్టు చైతన్యం వృద్ధి చేయడానికి యిచ్చే శిక్షణాపద్ధతులు, వాటి స్వభావం, తదితర తక్షణ సమస్యలు కూలంకషంగా పరిశీలన చేయవలసిన కర్తవ్యం వారిదే. వస్తూత్పత్తి రంగం లోనూ, జాతి ఆత్మిక జీవితాభివృద్ధి కోసమూ, ప్రకృతి విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన అన్ని శాఖల విజయాలను వినియోగించడం ఎంత ముఖ్యమో, సామాజిక శాస్త్రాలను అభివృద్ధిచేయడమూ, వాటి నిర్ణయాలను ఆచరణకు అన్వయించడమూ అంత ముఖ్యం.

బూర్జువా సిద్ధాంతాలను, రివిజనిజాన్ని, పిడివాదాన్ని, సంస్కరణ వాదాన్ని ఎదుర్కొనడం చాలాముఖ్యం, సామ్రాజ్యవాదం మనవర్గశత్రువ విషయాన్నిమనంనే ఎప్పటికీ మరువరాదు. సోషలిస్టు వ్యవస్థకు, దానినియమాలకు, దానిసిద్ధాంతాలకు, దాని నీతిసూత్రాలకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాదం విధ్వంసకచర్యలు సాగిస్తూఉంటుంది. బ్రహ్మాండమైన సామ్రాజ్యవాద ప్రచార యంత్రం మనిషి మనస్సును కలుషితం చేస్తుంది; ప్రజలదృష్టిని రాజకీయాలనుంచి మళ్ళించడానికి ప్రయత్నిస్తుంది. అన్ని పరిస్థితులలోనూ, బూర్జువాసిద్ధాంతాలకు వ్యతిరేకంగా రాజీలేనిపోరాటం సాగించాలి. ఎందుకంటే అది వర్గ పోరాటం. మనిషికోసం, అతనిఆత్మగౌరవం కోసం, స్వేచ్ఛ కోసం జరిగే పోరాటం, సోషలిజం, కమ్యూనిజం స్థానాలను బలపరచడానికి జరిగేపోరాటం, అంతర్జాతీయ కార్మికవర్గ శ్రేయస్సు కోసం జరిగే పోరాటం.

మహా నవంబరు సోషలిస్టు విప్లవం 50వ వార్షికోత్సవానికీ, లెనిన్ శత వర్ధంత్యుత్సవానికీ అంకితమైన రచనలు చేయడం మన శాస్త్రజ్ఞులకు ఎంతో గౌరవప్రదమైన కర్తవ్యం.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం రకరకాల వక్రభాష్యాలకు వ్యతిరేకంగా, దోపిడీవర్గాల సిద్ధాంతాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటంసాగించే సందర్భంలో రూపొందింది, ఒక శాస్త్రంగా అభివృద్ధి చెందింది. అది భౌతికచరిత్ర పరిణామాలను వర్గ పోరాటాన్ని, ఎల్లప్పుడూ లోతుగా పరిశీలనచేస్తూ వచ్చింది. ఈ ప్రాతిపదికపై విప్లవ సిద్ధాంతాన్ని, ఎత్తుగడలను రూపొందించింది. ఒక నూతన సమాజ నిర్మాణ

నికి వెలుగుబాట చూపింది. ఇందులోనే వున్నాయి కమ్యూనిస్టుపార్టీ బోధల జీవ శక్తి, అనశ్వర స్వభావమూ.

అన్ని తరగతులకు చెందిన ప్రజల సృజనాత్మక కృషితోనూ, కమ్యూనిస్టు నిర్మాణంలో వారు చొరవతో పాల్గొనడంతోను మార్క్సిస్టు – లెనినిస్టు మహత్తర భావాలు వాస్తవం కావడ మనేది ముడిపడివుంది. పార్టీ విస్తృతంగాను, లక్ష్య శుద్ధితోను సాగించే నిర్మాణ, సైద్ధాంతిక కృషివల్ల కమ్యూనిస్టు వ్యవస్థను సాధించ గలం.

సోవియటు మానవుని తీర్చిదిద్దడం పార్టీ అనేక సంవత్సరాలుగా సాగించిన సైద్ధాంతిక కృషి మహత్తర ఫలితమే. సోవియటు మానవుడు ప్రపంచంలో మొట్ట మొదటిసారిగా కార్మిక కర్షక రాజ్యాన్ని స్థాపించిన యోధుల విప్లవ సంప్రదాయా లకు వారసుడు. అతను సోషలిజం నిర్మించాడు; ఫాసిజం ధాటికి తట్టుకొని నిల్చాడు. జీవన్మరణ పోరాటంలో దాన్ని ఓడించాడు. ఇప్పుడు మొట్టమొదటిసారిగా ప్రపం చంలో కమ్యూనిజాన్ని నిర్మిస్తున్నాడు. కార్మికవర్గమూ, సమష్టి వ్యవసాయదారులు, సోవియటు మేధావులు ఉన్నత సోషలిస్టు చైతన్యానికి వీరోచిత శ్రమను మచ్చు తునకలైన వారిని సృష్టిస్తున్నారు. సోషలిజం విజయంపొందిన తరువాత సోవియటు ప్రజల చైతన్యంలో అసాధారణమైన మార్పువచ్చింది.

పార్టీ సైద్ధాంతిక కృషికి సంబంధించిన అన్ని రంగాల ప్రమాణాన్ని మరింత పెంచడం నేటి ప్రధాన కర్తవ్యం. చైతన్యయుతమైన శ్రమకు సామాజిక కార్య కలాపాలకు పెరిగే కమ్యూనిస్టు చైతన్యం పెంపొందించే శిక్షణ అనూహ్యమని లెనిన్ చేసిన సూత్రీకరణను మనం మరువరాదు. సైద్ధాంతిక రంగంలో కృషి యావత్తు జీవితంతో కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన కార్యాచరణతో సన్నిహితంగా ముడిపడి వుండాలి. లేనంటట, లెనిన్ పదేపదే చెప్పినట్లు, అది కేవలం రాజకీయ పదజాలాన్ని వల్లించడంగా దిగజారిపోయింది. కమ్యూనిజానికి పాదార్థిక సాంకేతిక ప్రాతిపదికను నిర్మించడానికి సంబంధించిన కర్తవ్యాలను జయ ప్రదంగా నిర్వహించేందుకు శ్రామిక జనావళిని సమీకరించడం, వారిలో శాస్త్రీయ ప్రపంచ దృక్పథాన్ని దిద్దితీర్చడం, సమాజంలోని యావన్మంది హృదయాల్లోనూ కమ్యూనిస్టునీతిని పాదుకొల్పడం, వ్యక్తి చక్కగా సర్వతోముఖాభివృద్ధి చెందేలా చూడటం — ఇవి పార్టీ సైద్ధాంతిక కృషి ధ్యేయాలు.

కమ్యూనిజాన్ని నిర్మించడంద్వారా, సోవియటు ప్రజలు మానవచరిత్రలో

అత్యుత్తమైన సామాజిక కర్తవ్యం నెరవేరుస్తున్నారు. ఈ సృజనాత్మక పరిణామంలో కోట్లాది ప్రజలుపాల్గొంటున్నారు. ఈనాడు తమతమ పనుల్లో మొనగాళ్లు ఎలా పనిచేస్తున్నారో అలా పనిచేసే పద్ధతిని అధిక సంఖ్యాకులకు, ఆ తరువాత సమస్త శ్రామికులకు మనం నేర్పాలి. ఇది నిస్సందేహంగా సాధ్యమే. ఈ మొనగాళ్లూ, తమపనిలో కొత్త పద్ధతులను ప్రవేశపెట్టేవారూ సామాన్య ప్రజలే. వారు తమపనిలో సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపూర్ణంగా ఆకళింపు చేసుకున్నందువల్లనూ, వారు సమాజానికి చైతన్యంతో సేవచేస్తున్నందువల్లనూ, ఉన్నతమైన నీతిసూత్రాలను సమష్టితత్వాన్ని పాటిస్తున్నందువల్లనూ. ప్రజలపట్ల తమ బాధ్యతలను నిస్వార్థ బుద్ధితో, శక్తి వంచన లేకుండా నెరవేరుస్తున్నందు వల్లనూ వారు ఇతరులకు మించి పోయి గణనకెక్కారు. కమ్యూనిస్టు సమాజంలో ప్రజలందరూ ఎలా పనిచేయగలరో అలా వారీనాడు పని చేస్తున్నారు. ఈ విషయంపై మన సైద్ధాంతిక కృషికి విజయం ఎంతో ఆధారపడి వుంది. మారిన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు తన పనిలో ఒక కార్యక్రమాన్ని నిర్ణయిస్తున్నదని ప్రతి సోవియట్ పౌరుడు గుర్తించేలా, అందుకు ఆ కార్యక్రమనిర్వాహణకు తన యావచ్ఛక్తిని వినియోగించేలా పార్టీ సంస్థలు కృషిచేయాలి.

సమాజంలోని యావన్మందిలోను క్రమశిక్షణా భావాన్ని పాదుకొల్పడానికి మన పార్టీ చాలా ప్రాధాన్య మిస్తుంది.

పనిలో మంచి క్రమశిక్షణా. సోషలిస్టు సమాజ శాసనాలను. నిబంధనలను పాటించడమూ సోవియట్ వ్యవస్థ ప్రజాతంత్ర ప్రాతిపదికకు విరుద్ధం కాకపోగా, పైపెచ్చు సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధిపరచి మరింత విస్తరింప జేస్తాయి. సమాజ మంతటినీ ప్రతి వ్యక్తికోసం చక్కని సోషలిస్టు ప్రాతిపదికపై వ్యవస్థీకరించడం, యావత్ సమాజంకోసం ప్రతి వ్యక్తీ సోషలిస్టు క్రమశిక్షణ పాటించడం – ఇందులోవుంది సోషలిస్టు ప్రజాస్వామ్య సార మంతా. పార్టీ, ప్రభుత్వంలోని అన్ని లంకెలలోను ఉన్నతమైన క్రమశిక్షణా, నిర్మాణమూ నెలకొల్పడం పార్టీ కర్తవ్యం.

ప్రభుత్వ సంపదను కాపాడుకొంటూ, దాన్ని మరింత పెంపొందించాలనే శ్రద్ధను, పొదుపరితనాన్ని సోవియట్ ప్రజలలో పాదుకొల్పే పనికి పార్టీ సంస్థల కృషిలో ఒక ముఖ్యస్థాన మివ్వాలి. ఇప్పటికే సోవియట్ సమాజానికి అపారమైన జాతీయ సంపద వుంది. అయితే దేశసంపదను నిర్విరామంగా అభివృద్ధి చేయాలి;

దాన్ని పొదుపుతో, జాగ్రత్తగా వాడాలి. దురదృష్టవశాత్తు భౌతిక సంపదను దుబారా లేక దుర్వినియోగం చేస్తున్న ఉదాహరణలు ఇంకావున్నాయి. ప్రతి కిలో లోహాన్ని బొగ్గును, సిమెంటును, పెట్రోలియంను, ప్రభుత్వానికి చెందిన ప్రతి రూబుల్‌ను పొదుపుతో జాగ్రత్తతో వాడటంమనం నేర్చుకొంటే, దేశం యింకా ఎంత బలంగా, సౌభాగ్యవంతంగా వుండేది ! ప్రజలు తమ పని విషయంలో చైతన్యంతో పాటు బడాలని బోధించడం పార్టీ సిద్ధాంత కృషిలో ఎంత ముఖ్యమైన కర్తవ్యమో పొదుపును గురించి బోధించడంకూడ అంత ముఖ్యమైన కర్తవ్యంగా వుండాలి.

కామ్రేడ్స్, మనదేశంలోని వివిధ జాతుల సౌహార్దత, స్నేహ, పరస్పర సహకారాలపైన, ఉమ్మడి సామాజిక – ఆర్థిక వ్యవస్థపైన, ఉమ్మడి రాజకీయ వ్యవస్థపైన ఉమ్మడి సోషలిస్టు సిద్ధాంతాలపైన మన దేశం, అంటే మహా సోవియటు యూనియన్ ఆధారపడివుంది. సోవియటు యూనియన్‌లోని వివిధ జాతులకు చెందిన ప్రజల మధ్య ఆర్థిక, సాంస్కృతిక బంధాలు మరింత పటిష్ఠ మౌతున్నాయి; మరింత బహుముఖమవుతున్నాయి. ఈ ప్రజలు పరస్పరం మరింత సన్నిహితంకావడం దుర్భేధ్యమయిన వారి మైత్రి సౌహార్దబంధాలూ, వారి ఐక్యత పటుతరంకావడం – ఈ పరిణామం బాగా సాగుతూవుంది.

ఈ ఐకమత్యాన్ని రూపొందించి, శక్తివంతంచేసి, దాన్ని సర్వసమగ్రం చేయటానికై మనపార్టీ సుమారు అర్థ శతాబ్దంపాటు నిర్విరామంగా పనిచేసింది. తుదకు ఇది సోవియటు రాజ్యవ్యవస్థ అనే ఒక అజేయమయిన బలమైన శక్తిగా మారింది. ఈ రాజ్యవ్యవస్థ సోవియటులోని వివిధ జాతులకు చెందిన ప్రజల స్నేహసౌహార్దాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నది. మన శత్రువులు ఆయుధ బలంతో విషపూరితమయిన తమ బూర్జువా సిద్ధాంతాలతోనూ ఈ స్నేహాన్ని విచ్ఛిన్నం చేయ డానికి అనేకమార్లు ప్రయత్నించారు. అయినా వారి పన్నాగాలు భగ్నమయ్యాయి. అదే సమయంలో సోవియట్ జాతుల మధ్య స్నేహం కొత్తబలం పుంజుకొని సర్వతోముఖంగా వికసిస్తూవుంది; విస్తరిస్తూవుంది; అభివృద్ధి చెందుతూవుంది.

శ్రామికవర్గ అంతర్జాతీయతా భావానికీ వివిధజాతుల ప్రజల మధ్య స్నేహ సౌహార్దాలకు సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ సజీవ ప్రతీక. మన దేశం లోని 131 జాతుల ఉపజాతుల ఉత్తమ పుత్రులకు, పుత్రికలకు ఇది ప్రాతినిధ్యం వహిస్తూవుంది. మన పార్టీలోని అన్నిజాతులకుచెందిన దళాలు, నదీనదాల జలాలు సముద్రంలో విలీనమయినట్టుగా, సోవియటు కమ్యూనిస్టుపార్టీలో విలీన మవుతున్న

వనే విషయం మన కందరికీ గర్వ కారణం. సోవియటు కమ్యూనిస్టుపార్టీ ఏక మనస్కులయిన లెనినిస్టుల సంస్థ. వారు ఒకే సంకల్పం, ఒకే లక్ష్యం, ఒకే సిద్ధాంతం కలవారు.

దీనికి మన మహాసభ అద్భుతమైన ఉదాహరణ; నిదర్శన. ఈ హాలులో మీ చుట్టూ ఒకసారి దృష్టి సారించండి కామ్రేడ్స్. మన దేశంలోని జాతులకు ఉప జాతులకు చెందిన పురుషులు, స్త్రీలు ఇక్కడ వున్నారు. వీరిలో ప్రతిఒకరూ తన సోషలిస్టు జాతి పుత్రుడు; అదే సమయంలో తన పార్టీ పుత్రుడు, దాని యోధుడు, కమ్యూనిస్టు, అంతర్జాతీయవాది. అతడు తన జాతి ప్రయోజనాలను, సోవియటు యూనియన్‌లోని ఇతర జాతుల ప్రయోజనాలను సమానంగా ప్రేమిస్తాడు; అర్థంచేసుకొంటాడు. ఇందులోవుంది మన పార్టీ బలం; బహుళజాతి సోవియటుదేశ బలం. సోవియటు ప్రజల బలం.

సోవియటు యూనియన్‌లోని వివిధ జాతి ప్రజల ఆర్థిక, సాంస్కృతిక, ఆత్మిక సంబంధాలు మరింత సన్నిహితమూ బహుళముఖమూ కావడానికి వీలుగా, వారిమధ్య స్నేహసౌహార్దాలను పెంపొందించడానికై పార్టీ యావన్మంది కమ్యూనిస్టులూ వారేజాతికి చెందినప్పటికీ, నిర్విరామంగా పనిచేస్తూవుంటారు. దేశాభివృద్ధికి సంబంధించిన ఏ సమస్యనైనా, (అది రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో దేనికి సంబంధించినదైనా) పరిష్కరించే సందర్భంలో పార్టీ ప్రతిజాతి ప్రయోజనాలను, లక్షణాలను ఎల్లప్పుడూ పరిగణనలోనికి తీసుకొంది. సకల సోవియటు ప్రజలలోనూ శ్రామిక అంతర్జాతీయతా భావాన్ని సోవియటు జాతుల మధ్య సౌహార్దత స్నేహాలవల్ల అనుల్లంఘనీయమైన అనురాగాన్ని పాదుకొల్పుతుంది. ఇదొక్కటే సరియైన జాతీయ విధానం. సోవియటు యూనియన్‌ను అభివృద్ధి చేయడంలో మనం సంపాదించిన అనుభవమంతా ఇదే సరియైన, సర్వసమగ్రమైన విధానమని రుజువుచేస్తున్నది.

కామ్రేడ్స్, గ్రామీణ ప్రాంతాలలో సైద్ధాంతిక రాజకీయ రంగాలలో పనిని మరింత మెరుగు పరచే మహత్తర కర్తవ్యాలను మనం ఎదుర్కోవలసి వుంది. వ్యవసాయాన్ని సోషలిస్టు మార్గంలో పునర్వ్యవస్థీకరించడంలో గ్రామీణ కార్మికుని మనస్తత్వం సంపూర్ణంగా మారిపోయింది. అతడు మరింత విద్యావంతుడయ్యాడు. సాంస్కృతికంగా అభివృద్ధి చెందాడు. కార్మికవర్గానికి రైతాంగానికి మధ్య మైత్రి మరింత దృఢంగా పదిలపడింది. అయితే, గ్రామీణ ప్రాంతాలలో, సాంస్కృతిక

విద్యారంగాల కృషిలో వున్న తీవ్ర లోపాలను గమనించడం అవసరం. అనేక సంవత్సరాలుగా, గ్రామీణ ప్రాంతాలలో క్లబ్బులను గ్రంథాలయాలను, సినిమాలను, క్రీడాసౌకర్యాలను విస్తరింపచేసే పనికి తగిన ప్రాధాన్యం ఇవ్వలేదు.

ఈ లోపాలను తొలగించ వలసిన ఆవశ్యకత పార్టీ, స్థానిక ప్రభుత్వం ట్రేడ్ యూనియన్, కొంసొమోల్, సకల సైద్ధాంతిక సంస్థ దృష్టితీసుకొని రావాలి. గ్రామీణ కార్మికులకు రాజకీయ సాంస్కృతిక స్థాయిని పెంచేందుకు ఇచ్చే శిక్షణ విషయంలో అభివృద్ధి రావాలి. పట్టణ సాంస్కృతిక, విద్యా సంస్థలు, నాటకశాలలు, సృజనాత్మకకళా సంఘాలు, తదితర సంస్థలు పల్లెప్రాంతాలకు ఇతోధిక సహాయం అందచేయాలి. ఈ పని విస్తృత ప్రాతిపదిక పైసాగించాలి. పల్లెపట్టుల్లో సాంస్కృతిక స్థాయి పెరిగితే, జీవితం మరింత మెరుగయితే, సమిష్టి క్షేత్రాలలోనూ, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను ఉత్పత్తి శక్తులు నిస్సందేహంగా అభివృద్ధి చెందుతాయి.

కామ్రేడ్స్, ప్రజలలో సిద్ధాంత, విద్యరంగాలలో జరిగే కృషి ప్రమాణం కమ్యూనిస్టుల సిద్ధాంత రాజకీయ పరిజ్ఞానంపై ఆధారపడివుంది. ఇంతేకాదు, మన పార్టీ సంఖ్యాబలం మరింత పెరిగిందనే విషయంకూడా మనం గమనించాలి. మొత్తం సభ్యులలో మూడేళ్ల అంతకు ఎక్కువ పార్టీ జీవితం వున్న సభ్యులు కాండిడేట్ సభ్యులు దాదాపు నాల్గింట ఒకపాలు.

సిద్ధాంత రంగంలో కమ్యూనిస్టుల తరిఫీదుకు ఏర్పాట్లు చేయడంలో పార్టీకి విస్తారమైన అనుభవముంది. గతానుభవంలో వున్న మంచిని జాగ్రత్తగా రక్షించు కొంటూనే, పార్టీ శిక్షణా విధానాన్ని నిరంతరం మెరుగు పరుస్తూ వుంటుంది. ఇప్పటికన్నా చక్కటి నూతనపార్టీ శిక్షణవిధానాన్ని కేంద్రకమిటీ రూపొందించింది. దాన్ని అమలు జరుపుతూవుంది. ఈవిధానం, పార్టీకార్యకర్తలు సైద్ధాంతిక స్థాయిలో చాలా తేడాలున్నవనే విషయం పరిగణనలోకి తీసుకొంటున్నది. ప్రజలలో క్రియాత్మకమైన ఆందోళనా ప్రచారకృషి చేయడానికి కమ్యూనిస్టుల సందరినీ సమీకరించడం దీని లక్ష్యం.

ప్రపంచాన్ని ప్రాభావితంచేసే రాజకీయ ఆర్థిక కర్తవ్యాల నిర్వహణకు పార్టీ కృషి చేస్తున్న ఈనాడు జీవితానికి అనుగుణంగా పురోగమించడం, మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలను జీర్ణించుకోవడం, బోల్షివిక్ సిద్ధాంతాలను నియమాలను అలవరుచుకోవడం, నూతనమూ, ప్రగతిశీలమూ అయిన ప్రతిదాన్ని బలపరచడం నేర్చుకోవడం, అలసత్వంపట్ల, రొటీనుపాటు ధోరణిపట్ల అసహ్యం ప్రదర్శించడం

ప్రతి కమ్యూనిస్టు విధ్యుక్తధర్మం. మనపార్టీ కార్యకర్తల శక్తికీ, పార్టీవిధానాన్ని అమలు జరపడంలో వారి అచంచల దీక్షకు కమ్యూనిస్టు సిద్ధాంతం మూలం.

సిద్ధాంత రంగంలో,బృహత్తరమైన, క్లిష్టమైన కర్తవ్యాలు నెరవేర్చవలసి వున్నది. ఇందుకు పార్టీమార్గదర్శకత్వంలో అపారమైన అభివృద్ధి రావలసివుంది. నేడు సోవియటు మానవుడు పార్టీ పంథాకై జరిగే పోరాటంలో భాగస్వామి; తన దేశానికి నిజమైన యజమాని. అతనికి ఆసక్తిదాయకమైన విషయాలు అతని సాంస్కృతిక అవసరాలు బహు విస్తృతమయినవి. సిద్ధాంత కృషిలో ఈ విషయాలన్నిటినీ గమనంలోనికి తీసుకోవాలి.

ప్రజలలో బోధనాకృషి ఇతోధికంగా పెంపొందించడానికి మనకు గణనీయమైన భౌతిక వసతులున్నాయి. మనదేశంలో మొత్తం 7,700 వార్తా పత్రికలు, ఇంచుమించు 4,000 మాగజైన్లు ప్రకటింపబడుతున్నవి. మనం సమీక్షిస్తున్న కాలంలో వాటిసర్క్యులేషన్ 74 మిలియన్ ప్రతులకు అంటే 60 శాతం పెరిగింది. పుస్తకాల ప్రతులు మొత్తం 1,250 మిలియన్‌లు ఏటా అచ్చవుతున్నాయి. మన దేశంలో 70 మిలియన్లకుపైగా రేడియో రిసీవర్లు, రేడియో రి-డిఫ్యూషన్ సెట్లు, 120 టెలివిజన్ కేంద్రాలు వున్నాయి. పంచవర్ష ప్రణాళికలోని ఆదేశాల ప్రకారం, 1970 లో సోవియట్ యూనియన్‌లో 40 మిలియన్ టెలివిజన్‌ల సెట్లు వుంటాయి.

పార్టీకి నైపుణ్యం గల ప్రచారకులు, ఆందోళనకారులు పాత్రికేయులు టెలివిజన్, సినిమా, రేడియో, నాటక రంగాలలో పనిచేసే వారు వున్నారు. వీరు నిజంగా బంగారు నిధి. వీరిని పార్టీ ఆదరంలోను జాగ్రత్తగాను అభివృద్ధిచేసి సరిగా వినియోగించుకోవాలి.

సిద్ధాంతకృషి పార్టీ కార్య కలాపాలకు సంబంధించిన ఈ రంగంలోని నిపుణుల పని అనే తప్పుడు అభిప్రాయాన్ని మనం ఏవిధమైన సందేహం లేకుండా విసర్జించాలి. ఈ దృక్పథం పార్టీ సంప్రదాయాలకు విరుద్ధమయింది: దాని సైద్ధాంతిక ప్రభావ పరిధిని కుంచిస్తుంది. సైద్ధాంతిక కృషి మన పార్టీ మొత్తంగా కమ్యూనిస్టులందరూ నిర్వహించవలసిన కర్తవ్యం. ప్రజలపై సిద్ధాంత ప్రభావం, పార్టీ ఆందోళనా ప్రచారాలు ఫలప్రదంగా వున్నవా లేవా అనే విషయం పార్టీ సభ్యులు, నాయకులు వ్యక్తిగత ఆదర్శంపై ప్రత్యక్షంగా ఆధారపడి వుంటుంది. మాటలూ, చేతలూ ఒకేవిధంగా వుండాలనేది ఉన్నతమైన లెనిన్ నిర్దేశం; మన పార్టీ

ప్రతి కమ్యూనిస్టు, ప్రతి పార్టీ ప్రముఖుడు నిర్వహించే అన్ని పనుల్లోనూ ఇది శాసనంగా వుండాలి.

పార్టీ సంస్థలు సిద్ధాంత, రాజకీయ చైతన్యం పెంచేఅన్ని బోధనారూపాలను పద్ధతులను నిర్విరామంగా అభివృద్ధి చేయాలి ; ఒక పథకం ప్రకారం సిద్ధాంతకృషి సాగించాలి. సిద్ధాంత రంగంలో పనిచేసే అన్ని దళాల పనిని మరింత చక్కగా సమన్వయం చేయాలి. పార్టీ ప్రభావాన్ని ప్రజలలో ఆందోళనను, సంస్కృతిని, విద్యను, ఒక్కమాటలో చెప్పాలంటే అన్ని సాధనాలను సోవియట్ ప్రజలలో మార్క్సిస్టు లెనినిస్టు చైతన్యాన్ని పెంపొందించే ఉన్నత ధ్యేయంకోసం, కమ్యూనిజాన్ని నిర్మించే మహాలక్ష్యంకోసం వినియోగించే విధంగా పనిని వ్యవస్థీకరించాం.

కామ్రేడ్స్ ప్రతినిధులారా, సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ రెండుగొప్ప వార్షికోత్సవాలకు ముందు జరుగుతున్నది. వచ్చేసంవత్సరం మహా నవంబరు సోషలిస్టు విప్లవం, ప్రపంచ ప్రథమ సోషలిస్టు రాజ్యస్థాపన 50 వ వార్షికోత్సవం జరుపనున్నాము. చరిత్రలోకల్లా ప్రతిభావంతుడూ, మన పార్టీకి రాజ్యవ్యవస్థ నాయకుడూ, వాటి నిర్మాతా అయిన వ్లాదిమిర్ ఇలియచ్ లెనిన్ శత జయంత్యుత్సవం కొత్తపంచవర్ష ప్రణాళికలోని ఆఖరు సంవత్సరమైన 1970 లో జరుపనున్నాము. సోవియటు ప్రజలు కమ్యూనిజాన్ని నిర్మించడంలో నూతన విజయాలను సాధించడం ద్వారా ఈ రెండు వార్షికోత్సవములను నిస్సందేహంగా జరుపుతారు.

ఈ మహత్తర సంఘటనలు పంచవర్ష ప్రణాళికకు ఒక వైశిష్ట్యాన్ని, ప్రాధాన్యాన్ని ఇస్తున్నాయి. నూతన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు సాధించడానికి పార్టీ, ప్రజలు చేసే బ్రహ్మాండమైన కృషి ఈ రెండు చరిత్రాత్మక వార్షికోత్సవాల వెలుగుతో జాజ్వల్యమానం అవుతాయి.

నూతన పంచవర్ష ప్రణాళిక రాజకీయ, ఆర్థిక, సామాజిక ప్రాధాన్యం, దాన్ని అమలుజరపడానికి జరిగే కృషి మన దేశ సరిహద్దులను దాటి వాలా దూరం ప్రసరిస్తుంది. శ్రామిక అంతర్జాతీయత అనే లెనినిస్టు సూత్రాలనూ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థపట్ల, ప్రపంచ కమ్యూనిస్టు కార్మికోద్యమంపట్ల, జాతీయ విముక్తి ఉద్యమంపట్ల నిర్వర్తించవలసిన అంతర్జాతీయ విధ్యుక్త ధర్మానికి మన పార్టీ, సోవియటు రాజ్యమూ దుర్భేధ్యంగా కట్టుబడి వున్నవని మన నూతన ఆర్థికాభి వృద్ధి ప్రణాళిక ఆచరణలో వేనోళ్ళ చాటుతూ వుంది. పంచవర్ష ప్రణాళికను

జయప్రదంగా అమలు జరపడంవల్ల ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఐక్యత మరింత పటిష్టం కావడానికి తోడ్పడుతుంది; సోవియటుయూనియన్ ఆర్థిక రక్షణపాటవాన్ని, దేశ అంతర్జాతీయ ప్రతిష్ఠను మరింత పెంపొందిస్తుంది.

కామ్రేడ్స్, ఈ కారణాలవల్ల కమ్యూనిస్టులకుండే యావచ్ఛక్తితో, పట్టుదలతో మనం పంచవర్ష ప్రణాళిక నిర్దేశించిన కర్తవ్యాలను పూర్తిచేయడానికి పూనుకోవాలి.

భవిష్యత్తు నిర్మాణానికై తమ యావచ్ఛక్తిని అంకితం చేయడంలో పార్టీ, సోవియట్ ప్రజలు గత అర్ధశతాబ్దంగా తాము పయనించిన కష్టభూయిష్ఠమైనప్పటికీ, మహోజ్జ్వలమైన మార్గాన్ని సగర్వంగా వెనుదిగిరి చూడవచ్చు.

మనకు గర్వ కారణమైన విషయాలు చాలావున్నాయి. కామ్రేడ్స్, నూతన సమాజాన్ని నిర్మించడంలోనూ, ఆర్థిక వ్యవస్థను, శాస్త్రీయ విజ్ఞానాన్ని సంస్కృతిని అభివృద్ధి చేయడంలోనూ సోవియట్ ప్రజలవలె, అంతటి సంస్థల్లో అంతటి స్వల్ప కాలంలో, అంతటి బ్రహ్మాండమైన విజయాల సాధించిన దేశం మానవజాతి చరిత్రలోలేదు. ప్రపంచ ప్రథమ సోషలిస్టు సమాజం యొక్క 50 ఏళ్ల వీరోచిత చరిత్రకు కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజలు తమ కృషిద్వారా సాధించే నూతన ఘనకార్యాలు, సాహస కృత్యాలు, ఇదివరకే వారు నిర్వహించిన కృషికుకుటాయ మానంగా వుంటాయి.

మన సోషలిస్టు దేశగతానికీ వర్తమానానికీ మధ్య గల భేదం మనం నేడు స్పష్టంగా చూడగలం.

మన చరిత్రలోని ఒక ఉదంతాన్ని జ్ఞప్తిచేస్తున్నాను. 1918 మార్చి తొలి రోజుల్లో, సోవియటు ప్రభుత్వ కార్యస్థానాన్ని పెట్రోగ్రాడ్‌నుంచి మాస్కోకు మారుస్తూ వున్నప్పుడు, లెనిన్ రైలులో రాత్రి రాత్రి చిన్న గుడ్డిదీపంముందు "ఈనాటి ప్రధాన కర్తవ్యం" అనే ప్రసిద్ధమైన వ్యాసాన్ని రచించారు.

ఆ రోజులు మన సోషలిస్టు మాతృభూమికి కష్టకాలం. అప్పుడప్పుడే అవలంబించిన సోషలిస్టు రాజ్యంపై జర్మన్ సామ్రాజ్యవాదులు క్రూరంగా దాడి చేశారు. ఆ రోజుల్లో పార్టీ సభ్యులనేకమంది నిరాశా నిస్పృహలలో మునిగి ఉన్నారు. అయితే లెనిన్ క్షణకాలమైనా భయానికి తావిచ్చి, తల్లకిందులయ్యే మనిషికాదు. దృఢదీక్షతో సోషలిస్టు మార్గంలో పురోగమించవలసిందిగా ఆయన

పార్టీకి ప్రజలకు ఈ వ్యాసంలో పిలుపు ఇచ్చాడు. ఒక్కొక్క రాయినే పేర్చు కొంటూ సోషలిస్టు సమాజానికి దృఢమైన పునాది నిర్మించాలనీ, ఆధునిక ఇంజనీరింగ్ పరిశ్రమను సృష్టించడానికి శాయశక్తులా కృషిచేయాలనీ, శాంతి భద్రతలను పటిష్ఠంచేయాలనీ దేశవ్యాపితంగా సామర్థ్యాన్ని, సహకారాన్ని పెంపొందించాలనీ ఆయన పిలుపునిచ్చాడు. భవిష్యత్ అవసరాలనుగూర్చి ప్రతిభావంతమైన ఊహతో ఆయన తన వ్యాసాన్ని ముగించాడు. కామ్రేడ్స్, ఈ మాటలను మీరు జాగ్రత్తగా వినండి: "సోవియటు సోషలిస్టు రిపబ్లిక్‌కు నేడు సరిగ్గా అవసరమయిందిది: దీనంగా, నిస్సహాయంగా పడివుండటం మాని, అప్రతిహతమైన శక్తిని సర్వ సంపత్తిని సమకూర్చుకోవడం."

ఈ జోస్యం నిజమైంది. అప్పుడు, అటువంటి అప్రతిహతమైన శక్తి, సర్వ సంపత్తికల సోషలిస్టు దేశం ప్రపంచంలో వుంది. అది మనసోవియటు మాతృభూమి. సోవియటు సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్. ఆర్థికంగానూ, సైనికంగానూ, ప్రతి విషయంలోనూ దానిశక్తి అజేయమే. ఏడేటా లెనిన్ నిర్దేశించిన మార్గాన పార్టీ, ప్రజలు క్రమంగా పురోగమించట మొక్కటే ఇందుకు కారణం.

మన బహుళ జాతి సోషలిస్టుదేశ శక్తి, కీర్తి పరాకాష్ఠ నందుకొన్న దశలో అది తన 50 వ వార్షికోత్సవాన్ని జరుపుకొంటుంది. గత అర్థ శతాబ్దంలో అనేక దఫాలు సామ్రాజ్యవాదులు దీనిపై క్రూరంగా దాడిచేశారు. అయితే, ప్రతిసారీ మన ప్రజలు శత్రువులను ఘోరమైన, మహాభీషణమైన యుద్ధాలలో అణచివేసి, దిగ్విజయంగా తమ మార్గాన పురోగమించారు. సోవియట్ ప్రజలందరికీ న్యాయంగా గర్వకారణమైన, బ్రహ్మాండమైన విజయాలను వారు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాధించారు.

ప్రజలను సంఘటితపరచి, మహత్తర సాహసకృత్యాలు నెరవేర్చగల ఉత్తేజం వారికి కలుగచేయడంద్వారా మన పార్టీ పేరు చరిత్రలో శాశ్వతంగా నిల్చిపోయింది. మన దేశం సాధించిన విజయాలన్నిటికీ పార్టీ నాయకత్వం వహించడమే కారణం. ఇక పార్టీకూడా, ప్రజలు త్యాగబుద్ధితో పనిచేసి, హృదయ పూర్వకంగా బలపరచడంవల్లనే ఈ విజయాలు సాధించగలిగింది.

వీరోచిత కార్మికవర్గమూ, పేరుమోసిన వ్యవసాయ క్షేత్ర రైతాంగమూ, శక్తి సామర్థ్యాలుగల మన మేధావులు, పురుషులు, స్త్రీలు, యువజనులు — వీరంతా పార్టీ బృహత్ ప్రణాళికలను అమలుజరిపినవారు. వీరంతా లోహం కరగించిన

వారు, బొగ్గును, ఖనిజాలను గనులనుండి త్రవ్వి తీసినవారు, పొలాలను విత్తిన వారు, దేశ సంపదను నిర్మించి, శతాధికం చేసినవారు, అవసరమైనప్పుడు దేశాన్ని శత్రువుల దండయాత్రల నుండి రక్షించడానికై పోరాడినవారు, సోవియటు ప్రజల లాంటి మహా ప్రజలు, వీరప్రజలు అర్ధశతాబ్దంగా తమ భవిష్యత్తును తనకు అప్పచెప్పుతూ వున్నందుకు పార్టీ ఎంతో గర్విస్తున్నది, సంతోషిస్తున్నది.

యావత్తు కమ్యూనిస్టుపార్టీకి ప్రాతినిధ్యం వహిస్తున్న మన మహాసభ తరఫున సోవియటు ప్రజలను ఉద్దేశించి మాట్లాడటానికి నాకు అనుమతి ఇవ్వండి: వారు పార్టీయందుంచిన విశ్వాసానికీ, వారిచ్చిన అండదండలకు వారి మహత్తర కృషికీ, విజ్ఞతకు, ధైర్యానికీ దీక్షకు లెనిన్ లక్ష్యసిద్ధికై, పార్టీ లక్ష్యసిద్ధికై పోరాటంలో వారు చూపిన సాహసానికి సోవియటు ప్రజలకు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెల్పడానికి అనుమతి ఇవ్వండి.

పార్టీ తమకు నాయకత్వం వహించే టటువంటి, విజయసిద్ధికై వీరిని సంఘటిత పరచేటటువంటి శక్తి అని సోవియటు ప్రజలు భావిస్తున్నారు. పార్టీ విదేశాంగ రంగంలోనూ అనుసరిస్తున్న విధానం మాత్రమే సరియైన విధానమని, పార్టీ తము నడిపిస్తున్న మార్గమొక్కటే సరియైన లెనినిస్టు మార్గమని సోవియటు ప్రజలు లోగడచూశారు. రోజూ ఆచరణలో చూస్తూవున్నారు.

ప్రజల సుఖజీవితంకోసం దేశ సౌభాగ్యంకోసం, కమ్యూనిజంకోసం జరిగే పోరాటానికి కమ్యూనిస్టు పార్టీ తన సర్వశక్తులను ధారపోస్తుందనీ, సోవియట్ ప్రజలు తనయందు విశ్వాసం వుంచడం సరియైనదని తన కార్యాచరణద్వారా నిరూపిస్తుందనీ కార్మికవర్గానికీ సకల శ్రామిక ప్రజలకు, మన బహుళజాతి దేశంలోని సకలజాతి ప్రజానీకానికి అనేక మిల్లియన్ల కమ్యూనిస్టులుగల కమ్యూనిస్టుపార్టీలోని అన్ని విభాగాలకు ప్రాతినిధ్యం వహించే ఈ మహాసభ తరఫున హామి ఇవ్వడానికి నాకు అనుమతి ఇవ్వండి.

— లెనిన్‌పార్టీ అయిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ చిరకాలం వర్ధిల్లుగాక !

— మహోజ్వలమైన, శ్రమశీలురైన వీరసోవియట్ ప్రజలు చిరకాలం వర్ధిల్లుదురు గాక !

— మన బహుళజాతి మహాదేశమైన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ చిరకాలం వర్థిల్లుగాక !

— శక్తివంతమైన సోషలిస్టు దేశాల కుటుంబ బలం చిరకాలం వర్థిల్లు గాక !

— ప్రపంచ కమ్యూనిస్టు కార్మిక ఉద్యమం అభివృద్ధిచెంది మరింత బలోపేతమవుగాక !

— మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలు శతాబ్దాలుదాటి చిరకాలం వర్థిల్లుగాక !

— కమ్యూనిజం చిరకాలం వర్థిల్లుగాక !

# అంత్యోపన్యాసం

## యల్. ఐ. బ్రెజ్నెవ్

కామ్రేడ్స్, ప్రతినిధులారా!

బహుళజాతి సోవియట్ మాతృభూమిగా ఏర్పడ్డ యూనియన్ రిపబ్లిక్‌ల కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు, మాస్కో, లెనిన్‌గ్రాడ్ వీరనగరాల, యూరల్స్, సైబీరియా, వోల్గాలోయ, దూరప్రాచ్యం, తదితర అనేక మండలాలు, ప్రాంతాలు, రష్యన్ ఫెడరేషన్ స్వయంపాలిత రిపబ్లిక్కులకు చెందిన పార్టీ సంస్థల ప్రతినిధులు పార్టీ కేంద్ర కమిటీ నివేదికపై మన మహాసభలో ప్రసంగించారు.

అగ్రశ్రేణికి చెందిన కార్మికుల, సమిష్టి వ్యవసాయదారుల, ఇంజనీయర్ల, శాస్త్రజ్ఞుల, ప్రముఖ రచయితల, కళాకారుల పార్టీ నాయకుల, రాజకీయవేత్తల, ట్రేడ్‌యూనియన్, యువ కమ్యూనిస్టు లీగ్‌నాయకుల ప్రసంగాలను ఈ వేదిక నుంచి విన్నాము.

12 మిల్లియన్ల సభ్యులున్న లెనినిస్టు పార్టీ ప్రతినిధులు, పార్టీ, దేశజీవితానికి సంబంధించిన అత్యంత ముఖ్యమయిన సమస్యలనుగూర్చి ఇంతవరకు అమలు జరిపిన కార్యక్రమ ఫలితాలనుగూర్చి భవిష్యత్ పథకాలనుగూర్చి కూలంకషంగా, సమర్థవంతంగా చర్చించారు.

ఈ ప్రసంగాల ప్రధాన లక్షణాలను క్లుప్తంగా పేర్కొనాలంటే ఇలా చెప్పవచ్చు.

ఆంతరంగిక విషయాలపైన, విదేశాంగశాఖ విషయాలపైన కేంద్ర కమిటీ రాజకీయ పంథాను గురించి మహాసభలో ఏకాభిప్రాయముంది.

సకల సోషలిస్టు దేశాలతో యావత్ ప్రపంచంలోని కమ్యూనిస్టులతో,

సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడే యావన్మంది యోధులతో హృదయ పూర్వకమైన బోల్షివిక్ అంతర్జాతీయ సంఘీభావం వుంది.

ఆఖరు విషయం, పార్టీలో నిజమైన సోదరభావం వుంది. ఉమ్మడి లక్ష్యసిద్ధి కోసం, శక్తి వంచన లేకుండా కృషి జరపాలన్న పట్టుదల మనలోనూ, యితరుల లోనూ, వ్యక్తమౌతున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే, కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాతలుగా కూడిన బ్రహ్మాండమైన సేనయొక్క అగ్రగామి దళం అవలంబించ వలసిన వ్యవహార సరళి వైఖరిని అవలంబిస్తున్నాము.

ఇది చాలా మంచిది. కామ్రేడ్స్, ఇది మన పార్టీ ఉన్నతమైన రాజకీయ పరిణతికి తార్కాణం.

మహాసభలో ప్రసంగించిన ప్రతినిధులు కేంద్ర కమిటీ విధానాన్ని గట్టిగా బలపరచడమేగాక, కేంద్ర కమిటీ నివేదికకు అనేక వాస్తవ విషయాలను చేర్చి, దాన్ని పరిపుష్టం చేయడంద్వారా, ముఖ్యమైన కొత్తసమస్యలను లేవనెత్తడంద్వారా కేంద్ర కమిటీ విధానాన్ని పెంపొందించారు.

ఈవిధంగా మహాసభలో మాట్లాడిన అందరు కామ్రేడ్స్ ప్రసంగాలు, కేంద్ర కమిటీ నివేదికకు అనుగుణంగా వున్నాయి. మన పార్టీ కార్యకలాపాల విస్తృత పరిధిని, వైవిధ్యాన్ని ప్రతిబింబించాయి.

కామ్రేడ్స్, ఈ అన్ని కారణాలవల్ల, ఇంతకన్నా దీర్ఘమైన అంత్యోపన్యాసం చేయవలసిన ఆవశ్యకత నాకు తప్పింది.

# కేంద్రకమిటీ నివేదికపై తీర్మానం

సోవియటు కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పనిపై, సోవియటు కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రథమకార్యదర్శి నివేదికను పార్టీ 23 వ మహాసభ విని, చర్చించిన తరువాత ఇలా తీర్మానిస్తున్నది :

సోవియటు కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ రాజకీయ పంథాను, దాని కార్య కలాపాలను మొత్తంగానూ, పూర్తిగానూ ఆమోదించడమైనది ;

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నివేదికలోని ప్రతిపాదనలను నిర్ధారణలను ఆమోదించడమైనది.

సి. పి. యస్. యు. 23 వ కాంగ్రెస్

మార్చి, ఏప్రిల్, 1966

# యు. యస్. యస్. ఆర్. 1966-70 ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళిక ఆదేశ సూత్రాల నివేదిక

ఎ. ఎన్. కొసిగిన్

(యు. యస్. యస్. ఆర్. మంత్రిమండలి అధ్యక్షులు)

# యు. యస్. యస్. ఆర్. ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళిక (1966-70) గురించి సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23వ కాంగ్రెస్ ఆదేశాలు

ఎ. యన్. కొసిగిన్

(యు. యస్. యస్. ఆర్. మంత్రి మండలి అధ్యక్షులు)

సమర్పించిన నివేదిక

ప్రియమైన ప్రతినిధి కామ్రేడ్స్, యు. యస్. యస్. ఆర్. ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళిక (1966–70)పై సి. పి. యస్. యు. (సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ) కేంద్రకమిటీ ఆదేశాల ముసాయిదా మీ ముందుంచ బడుతున్నది. వచ్చే అయిదేండ్లలో ఆర్థిక అభివృద్ధికోసం ఉద్దేశించిన పథకం ముసాయిదా యిది. దీనిని మన పార్టీ సోవియట్ ప్రజలముందు పుంచుతోంది. యు.యస్.యస్.ఆర్.లో కమ్యూనిజం నిర్మాణాన్ని ముందుకు గొనిపోవాలనే విధానం మన సి.పి.యస్.యు. కార్యక్రమంలో రూపొందించబడివుంది. సోవియట్ దేశ ప్రజల ప్రధాన ప్రయోజనాలను మన పార్టీ యొక్క యీ విధానం వ్యక్తీకరిస్తున్నది. మన దేశ ఆర్థికాభివృద్ధి కోసం ఉద్దేశించిన ప్రణాళికా ఆదేశాల ముసాయిదా, యీ విధానంలోని అంశాన్ని ప్రతిబింబిస్తూవుంది.

ఈ ఆదేశాల ముసాయిదాను యిదివరకే ప్రచురించడం జరిగింది. దీనిమీద మనదేశంలోనూ, మనదేశం వెలుపలగూడా విస్తారమైన చర్చలు, అభిప్రాయ ప్రకటనలు జరిగాయి. మనదేశంలోని వివిధ రిపబ్లిక్కుల పార్టీ కాంగ్రెసుల్లోనూ, వివిధప్రాంతాల, మండలాల పార్టీ కాన్ఫరెన్సుల్లోను ఈ ముసాయిదాపై అధ్యయనం జరిగింది. పార్టీ ప్రాథమిక సంస్థల సమావేశాల్లోనూ, శ్రామిక ప్రజల మీటింగుల్లోనూ వీనిపై చర్చలు జరిగాయి. పత్రికల్లోగూడా వీటిపై విపులమైన చర్చలు జరిగాయి. ఈ ముసాయిదాకు సర్వత్రా ఏకగ్రీవమైన ఆమోదం లభించింది. అనేక సూచనలు వచ్చాయి. పంచవర్షప్రణాళికా రచన జరిగేటప్పుడు వీటన్నింటినీ శ్రద్ధగా పరిశీలించడం జరుగుతుంది. కొన్ని సూచనల సారాంశాన్ని ఆదేశ సూత్రాల్లో పొందుపరచవలసిగూడా వుంటుంది.

కొత్త ప్రణాళిక ప్రధాన లక్ష్యాలను వివరించేముందు, ఆర్థిక, సాంఘికాభివృద్ధి కృషిలో మనం సాధించిన ముఖ్యమైన ఫలితాలగురించి కొద్దిగా చెప్పేటందుకు నాకు అనుమతివ్వండి!

## 1. యు. యస్. యస్. ఆర్. ఆర్థిక వ్యవస్థ ప్రస్తుత దశ, గత 7 సంవత్సరాల్లో సాధించిన ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి

సోవియట్ సమాజాన్ని అభివృద్ధి పరచడంలో సి. పి. యస్. యు 22 వ కాంగ్రెస్ దరిమిలా పార్టీ నిర్వహించిన బృహత్ కృషినీ, అది నిర్వర్తించిన నాయకత్వ పాత్రనూ, పార్టీ ప్రథమ కార్యదర్శి కామ్రేడ్ యల్. ఇ. బ్రెజ్నేవ్, ఈ మహాసభకు సమర్పించిన సి. పి. యస్. యు. కేంద్రకమిటీ నివేదిక విపులంగా వివరించింది.

సోవియట్ యూనియన్ ఆంతరంగిక పరిస్థితినీ, విదేశాంగ విధానం పరంగా వున్న పరిస్థితినీ గురించి యీ నివేదిక సమగ్రమైన రాజకీయ అవగాహన నిచ్చింది. సాంఘిక ఆర్థికాభివృద్ధి ఫలితాలను అంచనా కట్టింది.

కమ్యూనిజం నిర్మాణాన్ని పురోగమింపజేసే సందర్భంగా మనఆర్థిక రాజకీయ కర్తవ్యాలను ఆ నివేదిక నిర్వచించింది.

సోషలిస్టు సాంఘికవ్యవస్థ ప్రసాదించే విశిష్ట ప్రయోజనాలను ప్రతిబింబించే,

దీర్ఘ కాలిక ఆర్థిక పథకాలను, ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధి సాధనకృషిలో కీలకమైన పాత్రవుంది. ఆకృషిని సంఘటిత పరచే బాధ్యతకూడా వాటిదే. సోషలిస్టు ఆర్థిక ప్రణాళికా రచన అనే లెనినిస్టు అభిప్రాయానుగుణంగా మనదేశపు తొలి పంచవర్ష ప్రణాళిక ఆదేశాలు రూపొందించబడినవి. వాటిని 15వ పార్టీ కాంగ్రెస్ ఆమోదించింది. ఇది జరిగి నలభై యేడ్లంకు పై బడింది. పంచవర్ష ప్రణాళికల వ్యవస్థ యీవిధంగా ప్రారంభమయినది. ఈ ప్రణాళికలు సోవియట్ యూనియన్ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధిలో ఎంతో గొప్ప పాత్ర నిర్వహించాయి.

మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రవేశ పెట్టబడే నాటికి మనదేశం అప్పుడప్పుడే భారీ పరిశ్రమలను ప్రారంభించుతున్న దశలోవుంది. ఆ నాటికి దేశ పారిశ్రామికోత్పత్తిలో పెద్దభాగం ముఖ్యంగా చిల్లర వర్తకం ప్రయివేటు పెట్టుబడుల అధీనంలో వుంది. గ్రామీణ ప్రాంతాల్లో చిన్న తరహా వ్యవసాయం ప్రబలంగా వుండేది. వ్యవసాయోత్పత్తిలో ప్రభుత్వ, సహకార క్షేత్రాల స్థానం అతిస్వల్పం. పట్టణ ప్రాంతాల్లోనూ, పల్లెప్రాంతాల్లోనూగూడా దోపిడి వర్గాలు యింక కొనసాగుతున్న దశ అది. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కార్మిక వర్గమూ, యితర శ్రామికప్రజానీకమూ, సోషలిస్టు వ్యవస్థకు పునాదివేసే కోసం తొలిచర్యలు ప్రారంభించిన దశ అది.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు పూర్తి చేయబడ్డవి. మూడవ ప్రణాళిక పాక్షికంగా (రెండవప్రపంచయుద్ధ ఫలితంగా దీనికి అడ్డంకి యేర్పడింది) అమలుజరిగింది. వీటిద్వారా దేశపారిశ్రామికీకరణ బృహత్ కార్యం వ్యవసాయాన్ని సోషలిస్టు పథంలోకి పరివర్తన చెందించడం జరిగింది. దోపిడీ వర్గాలనూ, ఒకవ్యక్తి మరొక వ్యక్తి శ్రమను దోపిడీ చేసే వ్యవస్థలను రూపు మాపడం జరిగింది. ఉత్పాదక శక్తుల అభివృద్ధి వేగాన్ని పెంపొందించే అవకాశాన్ని ప్రసాదించే నూతన సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలది పైచేయి అయింది, సోషలిస్టు నిర్మాణానికి అవసరమైన బలీయమైన భౌతిక పునాది కల్గిన, బాగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక రాజ్యంగా సోవియట్ యూనియన్ మార్పుచెందింది.

దేశంలో యథార్థమైన సాంస్కృతిక విప్లవం వచ్చింది. సోవియట్ రిపబ్లిక్కులన్నీ ఆర్థిక సాంస్కృతిక రంగాల్లో గొప్ప విజయాలను సాధించాయి.

జర్మన్ నాజీలు తెచ్చిపెట్టిన యుద్ధకారణంగా సోవియట్ యూనియన్ అపారమైన కష్టాలకు గురైంది. 20 మిలియన్లకు పైగా జననష్టం జరిగింది.

సుమారు 30 శాతం జాతీయ సంపద నష్టపడింది. యుద్ధానంతరం స్వల్ప వ్యవధి లోనే ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించుకొని, యుద్ధాపూర్వపు స్థాయిని గణనీయంగా అధిగమించవలసిన అత్యవసర కర్తవ్యం మన పార్టీపైనా, దేశప్రజలపైనా పడింది. నాలుగో ప్రణాళికను పూర్తి చేయడంద్వారా మనమీ సమస్యను మొత్తం మీద పరిష్కరించుకో గలిగాం. ఐదవ ప్రణాళికను మన ఆర్థిక వ్యవస్థను మరింత ముందుకు తీసుకొని వెళ్ళింది.

భారీ ఎత్తున కమ్యూనిజం నిర్మాణం మార్గాన్ని నిర్దేశించిన 20 వ పార్టీ కాంగ్రెసు 6 వ పంచవర్ష ప్రణాళిక ఆదేశసూత్రాలకు ఆమోదముద్రవేసింది. మూడు సంవత్సరాల అనంతరం జరిగిన 21 వ పార్టీ కాంగ్రెసు 1959–65 ఆర్థికాభి వృద్ధి ప్రణాళికా కంట్రోల్ అంచనాలను ఆమోదించింది. ఈ వ్యవధిలో రెండు పంచవర్షప్రణాళికలు అమలుజరిగాయి. మన దేశం యిప్పటికి మొత్తంపైన 7 పంచవర్ష ప్రణాళికలను అమలు జరిపింది. ప్రతిఒక్క ప్రణాళిక సోవియట్ ప్రజల ఘన విజయాలకు ప్రతీక అయింది. మన సోషలిస్టు దేశపు వీర చరిత్రలో సోషలిజం, కమ్యూనిజం నిర్మాణంలో ఒక్కొక్క ముందంజగా నిలిచింది.

మొదటి పంచవర్ష ప్రణాళిక నాటినుండి ఇప్పటి వరకు మనం సాధించిన విజయాల అంచనా కోసం మనం ఇకముందు రచించే 8 వ పంచవర్ష ప్రణాళికా ప్రాతిపదికలను నిర్వచించే కోసం, మొదటి ప్రణాళికనుండి యీ నాటివరకు కీలక, భారీపరిశ్రమల అభివృద్ధి గురించిన కొంత సమాచారాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను.

| | 1928 | 1940 | 1945 | 1958 | 1965 |
|---|---|---|---|---|---|
| విద్యుచ్ఛక్తి (1000 మిలియన్ కిలోవాట్ గంటలు) | 5.0 | 48.3 | 43.3 | 235 | 507 |
| ఉక్కు (మిలియన్ టన్నులు) | 4.3 | 18.3 | 12.3 | 549 | 91.0 |
| చమురు .. | 11.6 | 31.1 | 194 | 113 | 233 |
| గ్యాస్ (1000 మిలియన్ క్యూబిక్ మీటర్లు) | 0.3 | 3.4 | 3.4 | 29.9 | 129 |
| బొగ్గు (మిలియన్ టన్నులు) | 35.5 | 166 | 149 | 493 | 578 |
| సిమెంటు .. | 1.8 | 5.7 | 1.8 | 33.3 | 72.4 |
| లోహాలు కోసే లేతులు (1000) | 2.0 | 58.4 | 38.4 | 138 | 185 |
| ఆటోమోబైల్స్ (1000) | 0.8 | 145 | 75 | 511 | 616 |
| ట్రాక్టర్లు (1000) | 1.3 | 31.6 | 7.7 | 220 | 355 |
| ఖనిజ ఎరువులు (సాంప్రదాయిక యూనిట్లలో మిలియన్ టన్నులు) | 0.14 | 3.2 | 1.1 | 12.5 | 31.3 |

మొదటి పంచవర్ష ప్రణాళిక ఆరంభించి నప్పుడు మన దేశంలో 5000 మిలియన్ కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తి మాత్రమే పుత్పత్తి అవుతుండేది. అంటే క్యుబిషేవ్ మండలంలోని ఓల్గా నదిపైవున్న లెనిన్ హైడ్రో ఎలక్ట్రిక్ పవర్ స్లాంట్ లో యీనాడు సాలీనా ఉత్పత్తి చేయబడుతున్న విద్యుచ్ఛక్తిలో సగం. ఒకటవ, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలోనూ, మూడో ప్రణాళిక తొలిమూడు సంవత్సరాల్లోనూ విద్యుదుత్పత్తి సుమారు పదిరెట్లు పెంచడం జరిగింది. యుద్ధ కాలంలో సంభవించిన నష్టాల ఫలితంగా పుత్పత్తి పడిపోయింది. అయితే యుద్ధానంతరం చేపట్టిన పంచవర్ష ప్రణాళిక కాలంనుండి, యిటీవలనే ముగిసిన సప్తవర్ష ప్రణాళిక మధ్యకాలంలో తిరిగి విద్యుదుత్పత్తి యేటేటా వేవేగంగా పెరుగుతూ వచ్చింది. 1965 సంవత్సరంలో మనదేశంలో 507,000 మిలియన్ కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తి అంటే 1928 నాటితో పోల్చితే 101 రెట్లు అధికంగా పుత్పత్తి జరిగింది.

ఇంచుమించుగా యితర భారీ పరిశ్రమ లన్నింటిలోనూ యిదేస్థితి వుంది. 1965లో ఉక్కు, చమురు వుత్పత్తి 1928 నాటి స్థాయికి 21 రెట్లు, బొగ్గు వుత్పత్తి 16 రెట్లు, సిమెంటు వుత్పత్తి 39 రెట్లు, లోహాన్ని కోసే లేతుల వుత్పత్తి 93 రెట్లు పెరిగింది.

వినిమయ వస్తువుల వుత్పత్తికి సంబంధించిన యీక్రింది సమాచారం చూడండి.

| | 1928 | 1940 | 1945 | 1958 | 1965 |
|---|---|---|---|---|---|
| అన్నిరకాల వస్త్రాలు (1000 మి. లీనియర్ మీటర్లు) | 3.0 | 4.5 | 1.8 | 7.5 | 9.1 |
| అల్లిక సరుకులు (మిలియన్) | 8.3 | 183 | 50 | 496 | 907 |
| చర్మపు కాలిజోళ్లు (మిలియన్ జతలు) | 58 | 211 | 63 | 356 | 486 |
| బీట్ రూట్ చక్కెర (మిలియన్ టన్నులు) | 1.3 | 2.2 | 0.5 | 5.2 | 8.9 |
| రేడియో రిసీవర్లు (1000 లు) | — | 160.5 | 13.9 | 3,902 | 5.159 |
| టెలివిజన్ సెట్లు (1000 లు) | — | 0.3 | — | 979 | 3,655 |
| రిఫ్రిజరేటర్లు (1000 లు) | — | 3.5 | 0.3 | 360 | 1.675 |

ప్రణాళికలు అమలు ప్రారంభమైన దరిమిలా వస్త్రాల వుత్పత్తిలో 200 శాతం, చర్మపు కాలిజోళ్ళ వుత్పత్తిలో 740 శాతం, చక్కెర వుత్పత్తిలో 600 శాతం పెరుగుదలను పై పట్టిక సూచిస్తూవుంది.

వ్యవసాయోత్పత్తి రంగంలోను నిరంతర అభివృద్ధి జరిగింది. వివిధ పంచ వర్ష ప్రణాళికల దశలో సగటు వార్షిక వ్యవసాయోత్పత్తి స్థితిని యీ క్రింది పట్టిక తెలియజేస్తుంది :

| | 1924-28 | 1936-40 | 1946-50 | 1956-60 | 1960-65 |
|---|---|---|---|---|---|
| మొత్తం వ్యవసాయ ఉత్పత్తి (ధరలరీత్యా అంచనా కట్టి 1000 మిలియన్ రూబుళ్ళలో) | 22.0 | 23.5 | 27.3 | 46.7 | 52.3 |
| ప్రధానమైన సరుకులు | | | | | |
| ధాన్యాలు (మిలియన్ టన్నులు) | 69.3 | 77.4 | 64.8 | 121.5 | 130.2 |
| ముడి పత్తి ,, | 0.6 | 2.5 | 2.3 | 4.4 | 5.0 |
| మాంసం ,, | 4.2 | 4.0 | 3.5 | 7.9 | 9.3 |
| పాలు ,, | 29.3 | 26.5 | 32 3 | 57.2 | 64.7 |
| గ్రుడ్లు (1000 మిలియన్) | 9 2 | 9.6 | 7.5 | 23.6 | 28.7 |
| ఉన్ని (1000 టన్నులు) | 157 | 129 | 147 | 317 | 361 |

మొత్తంమీద యీ ప్రణాళికల కాలంలో వ్యవసాయోత్పత్తి వార్షిక సగటు పరిమాణం సుమారు 159 శాతం పెరిగింది. ఈ వ్యవధిలో దేశ జనాబా 50 శాతం పెరిగింది. దేశ ప్రజల కొనుగోలు శక్తి అంతకు పైగానే పెరిగింది. అయితే వ్యవసాయోత్పత్తి, జనాభా, పెరుగుదలకంటె, కొనుగోలు శక్తి పెరుగుదలకంటే వెనుకబడింది. జాతీయ ఆర్థిక వ్యవస్థ అవసరాలను అది సమగ్రంగా తీర్చలేక పోయింది.

కామ్రేడ్స్, అభివృద్ధి వివిధ దశల్లో కొన్ని యిబ్బందులు ఎదుర్కొవలసి వచ్చినా మన సోవియట్ ఆర్థిక వ్యవస్థ నిలకడగా అభివృద్ధి చెందుతున్నదనేది దీని అంతటిని బట్టి స్పష్టం అవుతూవుంది. దేశ అంతరంగిక వనరుల వినియోగం ద్వారా, మన కార్మిక, రైతు, మేధావిప్రజల వీరోచిత శ్రమ ఫలితంగా. సోషలిస్టు వ్యవస్థ విశిష్టత కారణంగా మనమీ ఆర్థిక విజయాలను సాధించాం.

సప్తవర్ష ప్రణాళిక పూర్తిచేయడం ద్వారా లభించిన ప్రధాన ఫలితాలు కూడా మన విజయాల్నే ధృవపరుస్తున్నవి.

గత ఏడు సంవత్సరాల్లో పారిశ్రామికోత్పత్తి 84 శాతం, పారిశ్రామిక నిర్మాణం (పరిశ్రమల నిర్మాణం, యంత్రాల కూర్పు) 49 శాతం, వివిధ రకాల సాధనాలద్వారా సరుకు రవాణా 72 శాతం పెరిగింది. వినిమయంక్రింద, పెట్టు

బడులక్రిందా వినియోగపడే జాతీయాదాయం మొత్తం 53 శాతం పెరిగింది. జాతీయార్థిక వ్యవస్థలో మౌలికమైన ఉత్పాదక ఆస్తి 90 శాతం పెంపొందింది. పారిశ్రామిక పుత్పత్తి రంగంలో సాధించబడిన రెట్టింపు అభివృద్ధికూడా ఈ మొత్తంలో చేరివుంది.

సప్తవర్ష ప్రణాళికా కాలంలో ఎన్నో కొత్త ఫ్యాక్టరీల నిర్మాణమూ, వాటిలో వుత్పత్తి ప్రారంభించబడటమూ జరిగింది. ప్రపంచంలోకల్లా పెద్ద బ్లాస్టుఫర్నేసుల నిర్మాణం జరిగింది కోకింగ్‌బ్యాటరీలు, రోలింగ్ మిల్లులు, భారీ యింజనీరింగ్, రసాయనిక కర్మాగారాలతోపాటు అనేక సాధారణ పరిశ్రమలు, ఆహార సరుకులను తయారుచేసే ఫ్యాక్టరీలు నిర్మించబడ్డవి. అనేకవేల కొత్త యంత్రాలను, పరికరాలను అభివృద్ధి చేయడం జరిగింది. బహుముఖమైన రవాణా వ్యవస్థ సాంకేతిక పునర్నిర్మాణంలోనూ గొప్ప కృషి జరిగింది.

మన శాస్త్రవేత్తలు గణనీయమైన కొన్ని విజయాలు సాధించారు. సోవియట్ శాస్త్రవేత్తలు, యింజనీర్లు అంతరిక్ష పరిశోధనలో, క్వాంటం ఎలక్ట్రానిక్స్, ఘన పదార్థాల భౌతికశాస్త్రం, పోలిమర్, మరియు యితర సెమికండక్టర్ పదార్థాల కృషి వంటి శాస్త్రీయరంగాల్లోనూ, అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించే విషయంలోనూ సాధించిన ఘన విజయాలు యావత్ ప్రపంచం మన్ననల నందుకున్నవి.

మనదేశ ఆర్థిక వ్యవస్థ సాధించిన పారిశ్రామిక, సాంకేతిక అభివృద్ధి ఆధారంగా మన రక్షణ పరిశ్రమల రంగంకూడా నిరంతరం, బహుముఖంగా అభివృద్ధి పరచ బడుతూవుంది. సైనిక సామాగ్రి పుత్పత్తిని పెంచడంతో బాటు, నూతన ఆయుధాలను కనిపెట్టి వాటిని అభివృద్ధి చేయడం, వాటిని వుత్పత్తి చేయడం పట్ల గట్టిశ్రద్ధ చూపడం జరిగింది. మన ఆయుధాల పాటవాన్ని పెంచే విషయంలో, వాటి సాంకేతిక ప్రమాణాలను పెంపొందించే విషయంలోనూ బాగా శ్రద్ధ చూపడం జరిగింది.

సోవియట్ భూ నౌకా సైన్యానికి నేడు అత్యంత శక్తివంతమైన, ఆధునిక ఆయుధాలు సమకూరినవి.

అతిశ్రేష్టమైన ఆయుధాలను అభివృద్ధి చేస్తున్న, మన రక్షణ పరిశ్రమకు చెందిన శాస్త్రవేత్తల, డిజైనర్ల, యింజనీర్లు, సాంకేతికుల, కార్మికుల సామర్థ్యం మనకు గర్వకారణ మౌతూవుంది. మన సోవియట్ దేశానికి సహజ వనరులు

అపారంగా వున్నవి. ప్రజ్ఞావంతులైన మన భూగర్భ శాస్త్రజ్ఞులు నిస్వార్థ కృషి ఫలితంగా సహజ వనరులు అనేకంగా కనుగొనబడినవి. వీటివల్ల మన ఆర్థిక వ్యవస్థ యితోధిక అభివృద్ధికి సమగ్రమైన హామీ యేర్పడుతూ వున్నది.

గడచిన 7 సంవత్సరాలకాలంలో మనదేశ జనాభా 23 మిలియన్‌లు పెరిగి 232 మిలియన్‌లు అయింది. పారిశ్రామిక కార్మికుల సంఖ్య, ఆఫీసుల్లో పనిచేసే వారి సంఖ్య 56 మిలియన్‌లనుండి 77 మిలియన్‌లకు పెరిగింది. పారిశ్రామిక, వ్యవసాయ, రవాణా, నిర్మాణరంగాల్లో గతంలోకంటే నిపుణులసంఖ్య గణనీయంగా పెరిగింది. విజ్ఞానశాస్త్రం, సంస్కృతి, విద్య, ప్రజారోగ్యంవంటి రంగాల్లోనూ, మానసిక శ్రమకు సంబంధించిన యితర రంగాల్లోనూ పనిచేసేవారి సంఖ్యకూడా బాగా పెరిగింది. ఈ క్రింది సమాచార పట్టిక చూడండి :

| | 1926 జనాభా లెక్కలు (అంటే మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రారంభానికి కాస్త ముందుగా) | జనవరి 1959 (సప్తవర్ష ప్రణాళిక ప్రారంభంలో) | 1965 చివరలో |
|---|---|---|---|
| మానసిక శ్రమ చేసేవారు (మిలియన్‌లలో) | 2.6 | 20.5 | 25.3 |
| ప్రత్యేక సెకండరీ విద్య లేదా ఉన్నతవిద్య డిప్లొమా కలిగిన నిపుణులు (మిలియన్‌లలో) | 0.5 | 7.5 | 12.1 |

శారీరక శ్రమచేసే తరగతుల ప్రజల్లో సాధారణ విద్యాస్థాయి బ్రహ్మాండంగా పెరిగింది. గత 7 సంవత్సరాల కాలంలో సెకండరీ విద్యార్హతలు గల వారి సంఖ్య పారిశ్రామిక కార్మికుల్లో 45 నుండి 58 శాతం వరకూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతాంగంలో 23 నుండి 31 శాతం వరకు పెరిగింది. సామాజికోత్పత్తిలో స్త్రీలు. యువజనులు పెద్ద పాత్ర వహిస్తున్నారు.

సప్తవర్ష ప్రణాళికా కాలంలో ముఖ్యంగా 1965లో ప్రజల జీవన ప్రమాణాలను అభివృద్ధిపరచే కోసం అనేక ముఖ్యమైన చర్యలు తీసుకోవడం జరిగింది. దేశం మొత్తంగా తీసుకున్నప్పుడు 1958, నుండి 1965 నాటికి పారిశ్రామిక కార్మికుల ఆఫీసు పనివారల నెలసరి వేతనాలు సగటున 78 నుండి 95 రూబుల్సుకు పెరిగాయి. ప్రభుత్వ వినిమయ నిధులనుండి వివిధ సౌకర్యాల రూపంలో వారికి

అందే మొత్తం గూడా 104 రూబుళ్ల నుండి 128 రూబుళ్ళకు పెరిగింది. 1965లో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పనిచేసే వారికి ప్రభుత్వ పింఛన్ల పథకం అమలు జరుప బడింది. ఈ ఏడు సంవత్సరాల వ్యవధిలో ప్రభుత్వ పింఛన్లు పుచ్చుకునే వారి సంఖ్య 20 మిలియనుల నుండి 32 మిలియన్ల వరకు పెరిగింది.

ఇటీవలి సంవత్సరాలలో గృహనిర్మాణంపట్ల బాగా శ్రద్ధ వహించడం జరిగింది. ఈ 7 సంవత్సరాల కాలంలో పట్టణ, గ్రామీణప్రాంతాల్లో కలిపి మొత్తం పైన సుమారు 17 మిలియనల ప్లాట్లు, విడియిండ్ల నిర్మించడం జరిగింది. అంటే సప్తవర్ష ప్రణాళిక ఆరంభం నాటికంటే 40 శాతం ఎక్కువ గృహాల నిర్మాణం జరిగింది.

దేశ ప్రజల వస్తు వినిమయం కూడా గణనీయంగా పెరిగింది. ఈ సంవత్సరాల్లో ప్రభుత్వ సంస్థల ద్వారాను, సహకార చిల్లర అమ్మకం దుకాణాల ద్వారాను సరుకుల అమ్మకం 60 శాతం పెరిగింది.

ఈవిధంగా మొత్తం పారిశ్రామికోత్పత్తి, సరుకుల రవాణా తదితర ప్రధాన రంగాల్లో ప్రణాళికా లక్ష్యాలను అధిగమించడం జరిగింది.

అయితే, వ్యవసాయరంగంలో మాత్రం ప్రణాళికా లక్ష్యాలు నెరవేరలేదు. గడచిన 7 సంవత్సరాల కాలంలో వ్యావసాయిక ఉత్పత్తి 14 శాతం మాత్రమే పెరిగింది.

సి.పి.యస్.యు. కేంద్ర కమిటీ మార్చి నెలలో విస్తృత సమావేశం జరిపి, యీ రంగంలో యేర్పడిన వెనుకబాటు తనానికి గల కారణాలను పరిశీలించింది. ఈ లోపాలను సరిదిద్ది, వ్యవసాయరంగానికి సంబంధించిన అన్ని శాఖల్లో వేగంగా అభివృద్ధి సాధించేటందుకు తీసుకోవలసిన చర్యలను నిర్దేశించింది.

వ్యవసాయరంగం వెనుకబడిన ఫలితంగా ఆహారం తేలికరకపు పరిశ్రమల్లో లక్ష్యాల సాధన కుంటుపడింది. జాతీయాదాయం, ప్రజల సంపద పెరుగుదల మందగించింది.

ఇటీవలి సంవత్సరాలలో శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదల రేటు తగ్గింది. ఇది దేశ ప్రజల నిజ వేతనాల పెరుగుదల మందగించడానికి మరో కారణం. పరిశ్రమల రంగంలో శ్రామిక ఉత్పాదకశక్తి 1956–60 సంవత్సరాల మధ్య 6.5 శాతం పెరగ్గా, 1961–65 మధ్య కాలంలో 4.6 శాతం మాత్రమే పెరిగింది. ఈ లోటును పూడ్చడానికి శక్తివంచన లేకుండా కృషిచేయవలసి వుంది.

ఈ స్థితిలో అమెరికా దుష్టచర్యల ఫలితంగా యిటీవల ఉద్రిక్తమైన అంతర్జాతీయ పరిస్థితికి నిర్దిష్టమైన పాత్ర వుంది. అమెరికా వియత్నాంపై దురాక్రమణయుద్ధం ప్రారంభించి, దానిని నానాటికి మరింత విస్తరింపచేస్తు వున్నది. ఈ యుద్ధం ఏ క్షణాన్నైనా మరింతగా విస్తరించి ప్రపంచ శాంతికి ముప్పు తెచ్చిపెట్టగల ప్రమాదం వుంది. ఇంపీరియలిస్టు, సామ్రాజ్యవాదులు జరుపుతున్న యింకా యితర దురాక్రమణచర్యల దృష్ట్యానూ సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ దేశ రక్షణ వ్యయాన్ని పెంచడం తప్పనిసరైంది.

సప్తవర్ష ప్రణాళిక మరికొన్ని లక్ష్యాలు నెరవేరకపోవడానికి మరికొన్ని యితర కారణాలుగూడా వున్నవి. ఆ ప్రణాళికలో కొన్ని పొరపాట్లు, మరికొన్ని పొరపాటు అంచనాలు జరిగాయి. ఈ విషయం వ్యవసాయ రంగానికీ, మరికొన్ని పరిశ్రమలకూ ప్రత్యేకంగా వర్తిస్తుంది. అనేక క్లిష్టమైన ఆర్థిక సమస్యల పరిష్కారం విషయంలో అనాలోచితమైన స్వేచ్ఛాత్మక ధోరణి ప్రదర్శించినందువల్ల యీ పొరపాటు అంచనాలు మరింత ఉధృతమైనవి. ఇందువల్ల జాతీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ రంగాలమధ్య, ఆయా రంగాలలోని వివిధ విభాగాల మధ్య వుండవలసిన సమతూకం తారుమారైంది. కొన్ని సందర్భాల్లో ఆర్థికంగా సమర్థనీయంకాని లక్ష్యాలను పెట్టుకోవడం, వాటిని పూర్తిచేయలేకపోవడం జరిగింది. అందుకనే, నూతన ప్రణాళికలో కొన్ని పరిశ్రమలకు సంబంధించిన 1970 లక్ష్యలను పూర్వం నిర్దేశించిన స్థాయికంటే తగ్గించడం జరిగింది.

ఆర్థిక సమస్యలపట్ల స్వేచ్ఛాత్మక ధోరణి, శాస్త్రీయ గణాంక సమాచారాన్ని ఆచరణాత్మకమైన అనుభవాన్ని ఆకతాయితనంగా నిర్లక్ష్యం చేసే పద్ధతి లెనినిజానికి విరుద్ధమని కేంద్రకమిటీ ఖండించింది.

1964 అక్టోబరులోనూ, ఆ తదుపరి జరిగిన కేంద్రకమిటీ ప్లీనరీ సమావేశాల్లో దీన్నిగురించి నిర్ణయాలు చేయడం జరిగింది. పైలాంటి నాయకత్వ "పద్ధతుల"కు స్వస్తి జరిగింది. వర్తమాన పరిస్థితులకు అనుగుణంగా సోషలిస్టు నిర్మాణంలో లెనినిస్టు సిద్ధాంతాలకు అనుగుణమైన శాస్త్రీయ వైఖరిని పునరుద్ధరించి, పెంపొందించడం జరిగింది. మేనేజిమెంటు, ప్లానింగ్ పద్ధతులను భౌతిక సోషలిస్టు ఆర్థిక సూత్రాలకు అనుగుణంగా మార్చడం, ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానంవల్ల కలిగేప్రయోజనాలనూ, శక్తిసామర్థ్యాలను సమగ్రంగా కమ్యూనిస్టు నిర్మాణకృషి

కోసం కూడగట్టడం, సమీకరించడం, సాధారణ ప్రజానీకపు సృజనాత్మక చొరవను యితోధికంగా పెంపొందించడానికి వీలు కల్పించడం వుద్దేశ్యం.

సప్తవర్ష ప్రణాళిక ఫలితాలను సమీక్షించుకొనే సందర్భంలో ఆర్థికాభివృద్ధిలో మనం గొప్ప విజయాలను సాధించామని చెప్పుకోవడానికి సంకోచించ వలసిన అవసరమేలేదు. మన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ బహుముఖంగానూ, బహురూపాలు గానూ, గొప్ప అభివృద్ధి పొందింది. శాస్త్ర, సాంకేతికాభివృద్ధి, వాటిద్వారా లభించిన, నూతన అంశాల వినియోగం వేగిర పరచ బడింది.

అంతర్జాతీయ రంగంలో సోవియట్ యూనియన్ స్థానం యితోధికంగా బలపడింది; దాని ప్రతిష్ఠ యినుమడించింది. సప్తవర్ష ప్రణాళిక సోషలిస్టు పారిశ్రామికాభివృద్ధి కోసం నిర్దేశించిన గొప్ప, క్లిష్టమైన కర్తవ్యాలను పూర్తి చేయడంలో మన కార్మిక వర్గం ఎంతో మహత్తరమైన చైతన్యాన్ని, వున్నతమైన రాజకీయ చైతన్యాన్ని వ్యక్తం చేసింది. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లోనూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లోనూ పని చేసే కార్మికులు ఎంతో విపులమయిన ఫలవంతమైన కృషి చేశారు. తమ వీరోచిత కృషి ద్వారా, తమకు యెదురైన అడ్డంకులను గట్టి పట్టుదలతో అధిగమించారు. సమిష్టి, ప్రభుత్వ, వ్యవసాయక్షేత్రాల ఆర్థిక వ్యవస్థను పుష్టి చేకూర్చి దానిని గట్టి పరిచారు.

శాస్త్రవేత్తలు, డిజైనర్లు, యింజనీర్లు, సాంకేతిక నిపుణులు, వ్యవసాయ నిపుణులు, విద్య, ప్రజారోగ్యశాఖల్లో పనిచేస్తున్న కార్మికులు, వివిధ రంగాలకు చెందిన సోవియట్ మేధావులు మన జాతీయ లక్ష్యమైన కమ్యూనిజానికి భౌతిక సాంకేతిక ప్రాతిపదికను నిర్మించే కృషికి అమోఘమైన దోహదంచేస్తున్నారు. ఉత్పాదక శక్తులను పెంపొందించేటందుకు, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి సాధించేటందుకూ ఎంతో కృషిచేస్తున్నారు.

దేశ ఆర్థిక, సాంస్కృతిక విజయానికి కోట్లాది శ్రామిక ప్రజల నిస్వార్థ శ్రమ ప్రముఖమైన అంశం. వచ్చే అయిదేండ్ల వ్యవధిలో సోవియట్ ప్రజలు ఆర్థిక, సాంఘిక అభివృద్ధిలో మరో పెద్ద ముందడుగు సాధించగలరనేది నిస్సంశయం.

# 2. కొత్త పంచవర్ష ప్రణాళికలో ప్రధాన కర్తవ్యాలు

కాగ్రేడ్స్. ఈ పంచవర్ష ప్రణాళిక ఆదేశ సూత్రాల ముసాయిదా ప్రధానమైన కొన్ని ఆర్థిక కర్తవ్యాల పరిపూర్తిని విధిస్తున్నది. వచ్చే అయిదేండ్ల వ్యవధిలో మనదేశపు భౌతిక, సాంకేతిక పునాదికి బలీయమైన ఉత్తేజన లభిస్తుంది. మన దేశ ఆర్థిక, రక్షణ పాటవం ఇనుమడింప జేయబడుతుంది. కమ్యూనిజం నిర్మాణంలో సోవియటు సమాజం ఇతోధిక అభివృద్ధి సాధిస్తుంది.

యావత్తు సోవియట్ ఆర్థిక విధానానికి వలెనే, కొత్త పంచవర్ష ప్రణాళికను గూడా మార్క్సిస్టు-లెనినిస్టు తత్వ శాస్త్రమే సిద్ధాంత పునాది. పంచవర్ష ప్రణాళిక ప్రధాన లక్ష్యాలను నిర్వచించడంలో పార్టీకి కమ్యూనిజం నిర్మాణం విషయంలో, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ గురించి, సోషలిస్టు రాజ్యాంగ వ్యవస్థ ఆర్థిక సాంఘిక వ్యవహారాల శాస్త్రీయ నిర్వహణ గురించిన లెనిన్ మహాశయుని బోధనలే మార్గదర్శకం. అదేసమయంలో యు. యస్. యస్. ఆర్. లో సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణంలో లభించిన అనుభవాన్ని, యితర సోషలిస్టు శాఖల అనుభవాన్ని దృష్టిలో పెట్టుకోవడం జరుగుతుంది.

ఈ నూతన ప్రణాళిక మనదేశ ఆర్థికాభివృద్ధికోసం నిర్దేశించిన ప్రధాన ఆదేశాలు, ఆధునిక విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో వచ్చిన విప్లవంయొక్క ప్రధాన ధోరణులను, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, గణితశాస్త్రం, జీవశాస్త్రం, సైబర్నెటిక్స్ తదితర విజ్ఞానశాస్త్ర రంగాల్లో సాధించబడిన ప్రముఖ విజయాలకు అనుగుణంగానే వున్నవి.

విజ్ఞానశాస్త్రం, సాంకేతిక రంగాల్లో సాధించబడిన విజయాలను గరిష్ట ప్రమాణంలో వినియోగించడం, పారిశ్రామికాభివృద్ధిని, మొత్తంగా సామాజికోత్పత్తిని పెంపొందించడం; నైపుణ్యాన్ని, శ్రామిక ఉత్పాదక శక్తిని అభివృద్ధి పరచడం; పారిశ్రామిక రంగాన్ని గణనీయంగా పెంచడం; వ్యవసాయరంగంలో నికరమైన అభివృద్ధి ప్రమాణాలను సాధించటం-తద్వారా ప్రజాజీవిత ప్రమాణాల్ని గణనీయంగా అభివృద్ధి చేసి, సోవియటుదేశ ప్రజల భౌతిక, సాంస్కృతిక అవసరాలకు ఇతోధికంగా తృప్తిపరచడం పంచవర్షప్రణాళిక ప్రధాన ఆర్థిక కర్తవ్యంగా పార్టీ భావిస్తున్నదని ప్రణాళికా ఆదేశాల ముసాయిదా తెలియజేస్తున్నది.

ఈ కర్తవ్య నిర్వాహణకోసం, గడచిన పంచవర్ష ప్రణాళికలో కంటే మొత్తం సామాజికోత్పత్తిని మరెంత వేగంగా అభివృద్ధి పరచేందుకు, జాతీయా దాయాన్ని, నిజ ఆదాయన్ని పెంచేటందుకు అవకాశం కల్పించ బడింది.

మొత్తం సామాజికోత్పత్తిలో 40 శాతం, మౌలిక ఉత్పాదక ఆస్తుల్లో 50 శాతం (యిందులో 60 శాతం పారిశ్రామిక అభివృద్ధి, 60 శాతం వ్యవసాయ అభివృద్ధి కూడా చేరికుంది) పెరుగుదల సాధించ వలసివుంది. జాతీయాదాయం 38-41 శాతం. జనాభా తలసరి నిజ ఆదాయం 30 శాతంచొప్పున పెరగవలసివుంది.

ఈ ప్రణాళిక పటిష్ఠమైన ఆర్థిక, శాస్త్రీయ పునాదిపై రూపొందించ బడింది. సోవియట్ సమాజం పెరుగుతున్న అవసరాలను తృప్తిపరచే లక్ష్యాలను దేశ ఆర్థికాభివృద్ధి యథార్థ స్థాయికి, సామాజికోత్పత్తి విస్తరణకుగల యథార్థ అవకాశా లకు అనుగుణంగా యేర్పాటు చేయడం జరిగింది.

కూడబెట్టడం, వినియోగం అనే రెండింటి పెరుగుదలను ఏకకాలంలో హామీ లభించేవిధంగా మనిమి ప్రముఖ కర్తవ్యాలను నిర్వర్తించ వలసివుంది. సామాజి కోత్పత్తిపటిష్ఠతను పెంచడం ద్వారానే యిదిసాధ్యం అవుతుంది. సామాజికోత్పత్తి పటిష్ఠత త్వరిత గతిని జరిగే శాస్త్ర, సాంకేతికాభివృద్ధితో విడదీయరాని విధంగా ముడిపడి వుంటుంది. అందుకని, ప్రస్తుత ప్రణాళికలోని ఒక ముఖ్య విషయం యేమంటే అది సర్వ ఉత్పత్తి రంగాలనూ వేగంగా సాంకేతిక పునర్నిర్మాణం తలపెట్టింది. వాటి నిర్మాణ చట్రాన్ని అభ్యుదయకరంగా మార్చుతూ, అన్ని రంగాల్లోనూ కాలం తీరిన ఉత్పత్తుల స్థానే అధునాతనమైన వాటిని, ఉత్తమమైన వాటినీ ప్రవేశ పెట్టడం దాని లక్ష్యం. అన్ని సామాజికోత్పత్తి రంగాల్లోనూ యితోధిక పారిశ్రామికాభివృద్ధి సాధించాలని ప్రణాళిక నిర్దేశిస్తున్నది.

సామాజిక శ్రమ వుత్పాదకశక్తిని పెంచేటందుకు శాస్త్ర, సాంకేతిక రంగాల్లో సాధించబడిన విజయాలను వినియోగించడం ప్రధాన అవసరంగా యీనాడు రూపొం దింది. ఇది లేకుండా కమ్యూనిజానికి అవసరమైన భౌతిక సాంకేతిక పునాదిని విజయ వంతంగా నిర్మించడం అసాధ్యం. ఉత్పత్తి నైపుణ్యాన్ని అభివృద్ధి పర్చ డంలో విజ్ఞానశాస్త్రం అమోఘమైన పాత్ర వహిస్తున్నది. ప్రజల నిత్యజీవితావస రాలను తీర్చేటందుకూ, వారి పనిపరిస్థితులనూ, జీవిత పరిస్థితులనూ మెరుగు పరిచేటందుకు ఎంతిగానో సహాయకారి అవుతున్నది. రెండు ప్రపంచ వ్యవస్థల మధ్య జరుగుతున్న ఆర్థిక పోటీతీరూ, దాని ఫలితమూ, చాలా పెద్ద భాగం, విజ్ఞాన

శాస్త్ర అభివృద్ధిస్థాయినిబట్టి, విజ్ఞానశాస్త్ర పరిశోధనల ఫలితాలను ఆచరణలో వినియోగించే స్థాయినిబట్టి వుంటున్నది.

ఈ దృష్ట్యా, పంచవర్ష ప్రణాళిక విజ్ఞానశాస్త్ర రంగంలో మౌలిక, సైద్ధాంతిక, ప్రాయోగిక పరిశోధనాకృషిని వేగిర పరచడం పట్ల హెచ్చు శ్రద్ధ వహించవలసి వుంటుంది. కీలకమైన, అత్యంత ఫలదాయకమైన శాస్త్ర, సాంకేతిక రంగాలలో యిరోధిక పనులను కేంద్రీకరించవలసి వుంటుంది.

శాస్త్ర, సాంకేతిక పరిశోధనాకృషి ఉత్పత్తికి దోహదకారిగా వుండాలి; ఉత్పాదక రంగానికి స్పష్టమైన భవిష్యదవగాహన చేకూర్చేదిగానూ, ఆ రంగంలో యేర్పడే వివిధ సమస్యలకు పరిష్కారాలు చూపేదిగానూ వుండాలి. ఉత్పత్తి రంగానికి పరిశోధనాకృషి ఫలితాలను వేగంగానూ, పొందుపుగానూ వర్తింపజేయగల క్రమబద్ధమైన వ్యవస్థను సాధ్యమైనంత త్వరగా ఏర్పాటుచేయాలి. పరిశోధనా సంస్థలకు, ఫ్యాక్టరీలకు మధ్య ఉత్పత్తిఖర్చు మదింపు విషయంలో ప్రత్యక్ష సంబంధాలు యేర్పరచాలి. ఈ పద్ధతిని అమలుజరపడంవల్ల వివిధ పరిశోధనా ఫలితాలను ఉత్పత్తిరంగానికి మరెంత వేగంగా వర్తింపజేయడం సాధ్యమౌతుంది. విజ్ఞానశాస్త్ర రంగానికి, ఉత్పత్తి రంగానికి మధ్య ఘనిష్ఠ సంబంధాలకు హామీ కల్పించడం, శాస్త్రీయ సంస్థల, అందుకు సంబంధించిన మంత్రిత్వశాఖల తక్షణ ప్రత్యక్ష విధి.

పారిశ్రామిక శక్తి యిరోధిక అభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయమైన సూత్రాలను రూపొందించడం చాలా ముఖ్యం. నూతనమైన స్ట్రక్చరల్ బిల్డింగ్ పద్ధతులను, కొత్త నిర్మాణ సామాగ్రిని, అత్యంత నిపుణమైన సాంకేతిక పద్ధతులను, స్వయం చాలక యాంత్రిక విధానాలనూ, ఆర్థికంగా పొదుపైన నిర్వహణా పద్ధతులను చేపట్టడం అవసరం.

నూతన అంశాలను కనిపెట్టినవారూ, వివిధ రంగాలలో ఉత్పత్తి నిర్వహణల్లో కొత్త మెళకువలను, పొదుపైన పద్ధతులను కనుగొన్నవారూ, శాస్త్ర, సాంకేతిక రంగాల కార్యకర్తలూ, వారి సంఘాలూ, సాంకేతికాభివృద్ధి సాధనలోనూ, శాస్త్ర సాంకేతిక రంగాల్లో లభించిన విజయాలను ఉత్పత్తి రంగాలకు అనువర్తింప జేసే కృషిలోనూ ప్రముఖమయిన పాత్ర నిర్వహించుతున్నారు. సాంకేతిక ఉత్పత్తి విధానాలను అభివృద్ధిపరచడానికీ, వాటిని మెరుగుపరచడానికీ

వారెంతో కృషి చేస్తున్నారు. వారి సృజనాత్మక కృషికి దోహదమయ్యే విధంగా, ఆర్థిక, ప్రజాసంస్థలు, వారికి యితోధిక సౌకర్యాలు కలిగించాలి.

పెద్దయెత్తున శాస్త్ర, సాంకేతిక రంగాలలో లభించిన విజయాలను ఉత్పత్తి రంగానికి అనువర్తింప జేయడం ద్వారా, ప్రత్యేక ఉత్పత్తి రంగాలలో విశేష నైపుణ్యం సాధించడం ద్వారా, శాస్త్రీయపద్ధతులమీద పనిని నిర్వహించడంద్వారా, నైపుణ్యాన్ని పెంపొందించడం ద్వారా, ఇతోధిక ఆర్థికరూపమైన ప్రోత్సాహాలు కల్పించడంద్వారా శ్రామిక ఉత్పాదక శక్తి పెరుగుదల రేటును పెంపుచేయాలని ప్రణాళిక నిర్దేశిస్తున్నది. పరిశ్రమల రంగంలో కార్మికుల తలసరి ఉత్పాదక శక్తి సంవత్సరానికి సగటున 6 శాతం (ఇది 1961-65 లో 4.6 శాతం వుంది) చొప్పున, నిర్మాణరంగంలో 6.6 శాతానికి (ఇప్పుడున్న స్థాయి 5.3 శాతం) సమాజపరం గావించబడిన వ్యవసాయరంగంలో సుమారుగా 7 శాతం (ఇప్పటి స్థాయి 3.7 శాతం) చొప్పున పెంచవలసి వుంది. కార్మికుల పని పరిస్థితులను మెరుగుపరిచేటందుకు, వారి శ్రమను సులభం చేసేటందుకు, శారీరక శ్రమ స్థానే యంత్రాలను ప్రవేశ పెట్టేటందుకూ, విపులమైన చర్యలు తలపెట్టబడ్డవి. ఆధునిక యంత్రాల ప్రవేశం ద్వారా, శారీరక శ్రమ మాత్రమే గాక మానసికశ్రమగూడా సులభతరం అవుతుంది, నైపుణ్యం పెరుగుతుంది.

ఆర్థిక వ్యవహారాల నిర్వహణలో ఆధునిక సాంకేతిక పద్ధతులకు యితోధిక ప్రాముఖ్యత యేర్పడుతుంది.

ఆర్థిక నిర్వహణలో ఆధునిక సాంకేతిక సాధనాలకు యితోధిక పాత్ర సమ కూర్చబడాలి. వివిధ ఫ్యాక్టరీలమధ్య సమాచార వినిమయానికి యేర్పాట్లు జరగాలి. ఎలక్ట్రానిక్ కంప్యూటర్లను ప్రవేశపెట్టాలి. ఈ చర్యలద్వారా పరిశ్రమల నిర్వహణ, నిర్మాణం, రవాణా వ్యవస్థ నైపుణ్యం పెరుగుతుంది. సంక్లిష్టమైన ప్రణాళికా లక్ష్యాలను శాస్త్రీయమైన పద్ధతుల్లో ఆధారసహితంగా రూపొందించడంలో సౌలభ్యం యేర్పడుతుంది. ఈ యంత్రాల యేర్పాటువల్ల ఆర్థిక అంచనాల తయారీ, యింజ నీరింగ్ కార్యక్రమాల నిర్వహణ, అక్కౌంటింగ్ మొదలైన విధుల నిర్వహణ సులభమౌతుంది. మానవశ్రమ తగ్గుతుంది. ఉత్పాదకశక్తి అభివృద్ధి అవుతుంది. నిర్వహణా రంగంలో యిలాంటి యంత్రాలను ప్రవేశపెట్టడం ఒక ముఖ్యమైన ఆర్థిక కర్తవ్యం

దేశంలోనూ, విదేశాల్లోనూ లభించిన పరిశోధనా ఫలితాలు, ఉత్పత్తిలో

తలపెట్ట బడిన సరికొత్త పద్ధతులు, కొత్తపరిశోధనలు, సాంకేతిక అభివృద్ధి రిగుంచిన సూచనలు మొదలైన వాటి గురించిన సమాచారాన్ని సేకరించి, వాటిని ఒక క్రమ పద్ధతిలో పెట్టి మన దేశంలోని వివిధ రంగాలకూ అందజేసేటందుకు సరైన వ్యవస్థను యేర్పాటు చేసుకుపోవాలి. ఆర్థిక వ్యవస్థలో సాంకేతిక అభివృద్ధి సాధన, విజ్ఞాన శాస్త్రం పురోభివృద్ధి చాలా వరకు మనము పని ఏ మేరకు సమర్థవంతంగా నిర్వహించ గలమనే దాని పైనే ఆధార పడివుంటుంది.

శాస్త్రీయ సమాచారం వినిమయానికి జాతీయ స్థాయిలో సమర్థవంతమైన వ్యవస్థను ఏర్పాటుచేసుకోవాలి. ఆర్థిక సాంకేతిక రంగాల విజయాలకు, మన ప్రణాళికా సంస్థలు, ఆర్థిక సంస్థలు సమర్థవంతంగా వినియోగించు కోవడానికిది సహాయ పడుతుంది. పరిశోధనా రంగంలో కృషిచేసే మన కార్యకర్తల పనిలో శ్రమా, కాలమూ, డబ్బు ఖర్చుకూడా యిందువల్ల కలిసి వస్తుంది.

శాస్త్రవేత్తలు, శాస్త్రసాంకేతిక కమిటి పరస్పర సహకారంలో శాస్త్రీయ సమాచారం వినిమయానికి, నమ్మకమైన క్రియాశీలమైన ఒక వ్యవస్థను సృష్టించాలి.

శాస్త్ర సాంకేతికాభివృద్ధి ఉత్పత్తి నాణ్యతలో కలిసి కట్టుగా ముందుకు సాగుతుంది. సరుకు నాణ్యత పెంచేందుకు, మనం పాతబడిపోయిన రకాల సరుకుల పుత్పత్తిని నిలిపి వేసేందుకు గట్టిగా పూనుకోవాలి. వాటిస్థానే కొత్తవాటిని, ఆధునిక ప్రమాణాలకు అనువైన వాటిని ప్రవేశపెట్టాలి. మన పరిశ్రమలకు మన సంస్థలకు సంబంధించిన ప్రణాళికల్లో యీ పంథా స్పష్టంగా పేర్కొనబడాలి. వచ్చే ఐదేండ్ల కాలంలో పరిశ్రమలు, ప్రపంచ ప్రమాణాలలో పోటీ పడగల, వాటిని అధిగమించడం సైతం చేయగల కొత్త తరహా సరుకులను యితోధికంగా పుత్పత్తి చేయాలి.

సామాజికోత్పత్తి పటిష్టతను పెంచేటందుకు, స్థిరాస్తులను, ముడి సరుకులను. యింధనాలను, విడిభాగాలను, శ్రామిక, ఆర్థిక వనరులను, పొదుపుగా, వినియోగించాలి. అన్నిరకాల సరుకుల యూనిట్ వారి పుత్పత్తి ఖర్చులను తగ్గించాలి. వివిధ పరిశ్రమల్లో పారిశ్రామిక ముడి సరుకుల యూనిట్ వారి వినిమయాన్నికూడా పొదుపు చేయాలని ప్రణాళిక సూచిస్తున్నది. యంత్రాల నిర్మాణంలోనూ, లోహకార పరిశ్రమల్లోనూ యినుప రేకుల వినిమయాన్ని యూనిట్‌కు 20–25 శాతం చొప్పున, పరిశ్రమల్లో యింధనాల వాడుకను కనీసం 8–10 శాతం చొప్పున తగ్గించాలని అది సూచిస్తూవుంది. ఈ లక్ష్యసాధన ప్రణాళికా విజయానికి ఎంతో ముఖ్య

మైంది. ఎందుకంటే, పరిశ్రమల్లో జరిగే పాదార్థిక వినిమయాన్ని ఒక శాతం పొదుపు చేస్తే ఆ ఒక్క శాతం వెనుక జాతీయాదాయం 1500 మిలియన రూబుళ్ళ చొప్పున పెరుగుతుంది. 1970 సంవత్సర కాలంలోనే మనం 80 లక్షల టన్నుల యినుప రేకును పొదుపు చేయవలసి వుంది. ఈ మొత్తం మెగ్నిటో గోర్స్క్‌లోని బ్రహ్మాండమైన ఉక్కుమిల్లు ఒక సంవత్సరం వుత్పత్తిలో సమానం. ఈ సంవత్సర కాలంలో 85 మిలియన్ టన్నుల సంప్రదాయక యింధనాలను, 40-50 వేల మిలియన్ కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తిని, మరి యితర భౌతిక సంపత్తిని పొదుపు చేయాలి. ఈ సంపద అంతటినీ దేశ ప్రయోజనాల కోసం, ప్రజల సంక్షేమం కోసం వినియోగించవచ్చు.

పారిశ్రామిక నిధులనుండి గరిష్ఠ వుత్పత్తి సాధనను (రాసిపరంగానూ, నాణ్యత పరంగానూ, అమ్మకానికి విడుదలయిన సరుకుల మీద వచ్చే లాభాన్ని అంచనా గట్టడం) ప్రతిఒక్క సంస్థ ప్రతిఒక్క పరిశ్రమ పని కొలిచేటందుకు ప్రమాణంగా తీసుకోవాలి. వివిధ సంస్థలకు ప్రణాళికా రచన చేసేటప్పుడు వాటి లాభాన్ని అంచనా కట్టేందుకు మూలనిధులను, లాభానికి, చెలామణి అవుతున్న ఆస్తులూ, యీ మూడింటి మధ్య వుండే నిష్పత్తిని ఖచ్చితంగా నిర్ధారణ చేస్తారు. పారిశ్రామిక నిధుల సక్రమ వినియోగం కోసం జరిపే కృషికి ఆర్థికంగా రాజకీయం గాకూడా మౌలిక ప్రాధాన్యత వుంది. దీని గురించి యావత్తు ప్రజానీకమూ శ్రద్ధ చూపవలసి వుంది.

ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి నిర్మాణం అసంపూర్తిగా వున్న పథకాల సంఖ్యను తగ్గించాలి. సేకరించబడి, నిర్మాణంలో పెట్టడం జరక్కుండా మిగిలివున్న పరికరాల సంఖ్యను, అమ్మకం కాకుండా వున్న సరుకు మొత్తాన్ని తగ్గించాలి! వివిధ పథకాల నిర్మాణానికి, వాటిలో ఉత్పత్తి ప్రారంభించేటందుకు అవసరమైన వ్యవధిని పరిశ్రమల నిర్మాణ వ్యయాన్ని తగ్గించాలి. ఇవీ మన కొత్త ప్రణాళిక నిర్దేశించుతున్న ఇతర ముఖ్య కర్తవ్యాలు.

పరిశ్రమల పని సజావుగా జరిగేలా చేయడం, అనుబంధ కార్యకలాపాలను యాంత్రీకరించడంవల్ల, శ్రామిక క్రమశిక్షణను పెంచడం, పనిలేకుండా ఖాళీగా వుండడంవల్ల వృథా అయ్యే పని కాలాన్ని తగ్గించడంవల్లా, మన ఆర్థిక వ్యవస్థను బాగా పెంపొందిజేయడానికి అవకాశం వుంది.

ఉత్పత్తి ఖర్చులను గణనీయంగా తగ్గించి, మొత్తం ఉత్పత్తి మీద లాభం

స్థాయిని పెంచేటందుకు ప్రణాళికా ఆదేశాల ముసాయిదాలో అవకాశం కల్పించ బడింది. పారిశ్రామిక రంగం లాభాలస్థాయిని రెట్టింపు చేయాలనీ, ఆ మొత్తాన్ని ప్రజల జీవనప్రమాణం స్థాయిని అభివృద్ధి పరచేటందుకు వినియోగించాలనీ నిర్దేశించడం జరిగింది.

ఈ ముసాయిదా నిర్దేశించిన విధంగా ఉత్పత్తిలో అభివృద్ధినీ, దాని పటిష్ఠతనూ పెంపొందించడంపైననే, వచ్చే పదేండ్ల కాలంలో మనం అమలు జరప తలపెట్టిన విపులమైన సాంఘిక, ఆర్థిక కార్యక్రమం అంతా ఆధారపడి వుంది.

ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడం అనేది ఈ ప్రణాళిక మన ముందుంచుతున్న సాంఘిక కర్తవ్యాలలో ఒక ప్రధాన అంశం. జాతీయాదాయం పెరుగుదలతోబాటు ప్రజల నిజ ఆదాయాలుగూడా వేగంగా పెరుగుతవి. గడచిన ప్రణాళికా కాలంలో పోల్చితే, వచ్చే ఐదేండ్ల కాలంలో వినిమయ నిధులను మరింత వేగంగా పెంపొందించగలుగుతాము. ఈ నిధుల పెరుగుదల 36-39 శాతం వరకు వుంటుంది. గత 5 సంవత్సరాల కాలంలో సాలీనా సగటున 6,500 మిలియన్ రూబుళ్ళ చొప్పున పెరిగిన వినిమయ నిధుల మొత్తం వచ్చే ఐదేండ్లలో సాలీనా 11,000 మిలియన్ రూబుళ్ళవుతుంది.

1970 సంవత్సరంలో 1965 నాటికంటే సుమారు 59,000 మిలియన్ రూబుళ్ళ అదనపు మొత్తాన్ని జీవిత ప్రమాణాల అభివృద్ధికోసం వెచ్చించవలసి వుంటుంది.

అనేక సంవత్సరాలపాటు వినిమయ వస్తూత్పత్తి రేటు, పారిశ్రామిక వస్తూత్పత్తి రేటు కంటే గణనీయంగా వెనుకబడివుంటూ వచ్చింది. ఆర్థికవ్యవస్థలో సాధించబడిన అభివృద్ధి ఫలితంగా ప్రస్తుత ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధి రేటును అత్యధికంగా పెంపొందించి, దానిని పారిశ్రామికాభివృద్ధి రేటుకు చేరువగా తెచ్చేటందుకు ప్రతిపాదించ బడింది. పారిశ్రామిక రంగంలోనూ స్వయంగా వినిమయ వస్తూత్పత్తి రంగంలోని అభివృద్ధి రేటుకు, పారిశ్రామిక రంగంలోని అభివృద్ధి రేటుకూ మధ్యవున్న వ్యత్యాసాన్ని తగ్గించవలసి వుంది. పారిశ్రామికోత్పత్తి, వినిమయ వస్తూత్పత్తి మొత్తంగా 47 నుంచి 50 శాతం వరకూ పెంచవలసి వుంది. ఇందులో 'ఏ' గ్రూపు (పారిశ్రామిక వస్తూత్పత్తి) అభివృద్ధి రేటు 49 - 52 శాతంగానూ, 'బి' గ్రూపు వినిమయ వస్తువుల ఉత్పత్తి అభివృద్ధి రేటు 43 మొదలు 46 శాతం వరకూ నిర్దేశించబడింది. గత ఐదేండ్లలో 'ఎ' గ్రూపులో పెరుగుదల రేటు 58 శాతం, 'బి' గ్రూపు రేటు 36 శాతం వుంది.

వచ్చే ఐదేళ్లకాలంలో జాతీయార్థిక వ్యవస్థలోని వివిధ రంగాల మధ్య నిష్పత్తిలో ప్రధానమైన మార్పు కొని రాబడుతుంది. ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి ప్రాధాన్యతను కొనసాగించుతూనే, వినిమయ వస్తూత్పత్తిని పెంచే విధంగా నిధుల కేటాయింపును పెంచడం జరుగుతుంది.

ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి దృష్ట్యా, ప్రభుత్వము పార్టీ కేంద్రకమిటీ, దేశ రక్షణా బలగాల పాటవాన్ని పెంపొందించే విషయంలో యిప్పుడు చూపుతున్న శ్రద్ధను కొనసాగించ గలవని వేరే చెప్ప నవసరంలేదు. సోవియటు ప్రజల శాంతి యుత శ్రమజీవనంలో జోక్యం కల్పించుకొన సాహసించే దురాక్రమణదారుల్ని నులిమి వేసేటంత శక్తివంతంగా మన సాయుధబలగాల పాటవాన్ని పెంచడం జరుగుతుంది.

వినిమయ వస్తూత్పత్తి అభివృద్ధి రేటు పెంచేటందుకు చేయ వలసిన పనులు యివి: వ్యవసాయం, ఆహార సరుకుల తయారీ పరిశ్రమ, వర్తకం, భవననిర్మాణం యితర సాంస్కృతిక సేవాసౌకర్యాల పెంపుదలకు ఆధారభూతమైన పారిశ్రామిక సరుకుల ఉత్పత్తిని రెట్టింపు చేయాలి. తేలికరకం పరిశ్రమలకు, ఆహార సరుకుల తయారీ పరిశ్రమకూ, అవసరమయిన వ్యవసాయ ముడి సరుకుల సరఫరాను స్థిర పరచాలి. భారీపరిశ్రమల రంగంలో మొత్తం ఉత్పత్తి ముఖ్యంగా రసాయనిక, యింజనీరింగ్ విభాగాల్లో వినిమయ వస్తూత్పత్తి వాటాను పెంచాలి.

ఎ, బి గ్రూపులమధ్య వ్యత్యాసాన్ని తగ్గించేటందుకు, ఉత్పత్తి సాధనాలను యితోధికంగా సద్వినియోగపరచడం అవసరం. ఉత్పత్తి సాధనాల వినియోగాన్ని మెరుగుపరచడంద్వారా, ఏ గ్రూపు ఉత్పత్తిని పరిమితంగానే వినియోగించుకుంటూ, వినిమయ వస్తూత్పత్తిని గణనీయంగా పెంపొందించడం సాధ్యమౌతుంది. తోడ్తో, ఆర్థికాభివృద్ధి సాధించేటందుకు, వినిమయ వస్తూత్పత్తి వేగాన్ని పెంచడంకూడా అవసరం. ఇది జరిగినప్పుడే, అధికోత్పత్తి సాధించేటందుకు, పాదార్థిక ప్రోత్సాహాలను సమగ్రంగా సమకూర్చడానికి వీలవుతుంది.

పట్టణ, పల్లె ప్రాంతాలమధ్య యీనాడున్న ప్రధాన వ్యత్యాసాలను యితోధికంగా రద్దుపరచడం, గ్రామీణ ప్రాంతాల ప్రజల భౌతిక, సాంస్కృతిక స్థాయిని నిరంతరం అభివృద్ధిపరచి, వారి జీవన స్థాయిని పట్టణ ప్రాంతాల స్థాయికి చేరువగా తీసుకొని రావడం అనేది నూతన పంచవర్ష ప్రణాళిక నిర్దేశిస్తున్న మరో ముఖ్యమైన సాంఘిక కర్తవ్యం.

ఉత్పత్తిరీత్యా, సాంకేతికస్థాయి రీత్యా వ్యవసాయాన్ని, పారిశ్రామిక రంగానికి మరింత సన్నిహితంగా తీసుకువెళ్ళడం జరుగుతుంది. వచ్చే ఐదేండ్లలో వ్యవసాయరంగంలో మౌలిక ఆస్తులను అధునాతన మొనరించడమూ, రెట్టింపు చేయడమూ జరుగుతుంది. ఉత్పాదకశక్తి రేటు పారిశ్రామిక రంగంలో కంటే సారూప్యంగాచూస్తే, హెచ్చుగా వుంటుంది.

సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ మార్చి, సెప్టెంబర్ సమావేశాల్లో ప్రణాళికా రచనలోనూ, ఆర్థిక నిర్వహణలో అనుసరించదగిన నూతన పద్ధతులను రూపొందించింది. ఈ కొత్త పద్ధతుల పరివర్తన సాధించడంపైనే నూతన పంచవర్ష ప్రణాళిక పరిపూర్తి నిర్ణయాత్మకంగా ఆధారపడి వుంటుంది. ఈ పద్ధతులను నిలకడగా ఆచరణలో పెట్టాలి. ప్రణాళికా నిర్వహణలో కేంద్రీకృత నిర్దేశనా విధానాన్ని అభివృద్ధిపరచాలి; దానికి కృషి చేయాల్సి. అదే సందర్భంలో ఆర్థిక నిర్వహణలో ప్రజాతంత్ర సూత్రాల అమలును అభివృద్ధిపరచాలి; సాధారణ ప్రజల సృజనాత్మక కృషికి యథోచిత అవకాశాలను కల్పించాలి. ఆర్థిక వ్యవస్థను సంబంధించిన అన్ని రంగాల్లోనూ, అన్ని శాఖల్లోనూ, లాభదృష్టి సూత్రం అమలుజరిగేలా హామీ కల్పించాలి.

వర్తమాన పరిస్థితుల్లో మన ఆర్థిక వేత్తల పైన యథోచితమైన అదనపు బాధ్యతలు పడుతూన్నవి. నూతన పరిస్థితుల్లో మన శాస్త్రవేత్త ప్రణాళికా రచనకు, ఆర్థిక వ్యవహారాల నిర్వహణకు సంబంధించిన తక్షణ సమస్యల పరంపరను పరిష్కరించ వలసిఉంది. ఇందుకు ఆర్థిక వ్యవహార క్రమాలను సమగ్రంగానూ, లోతుగానూ అధ్యయనం చేయడం, ఆర్థికాభివృద్ధి సాధన కృషికి సంబంధించిన ఆచరణాత్మక సమస్యల పరిష్కారానికి వారు శాస్త్రీయమైన సూచనలు చేయవలసి ఉంటుంది.

మన దేశంలోని అన్ని రిపబ్లిక్కులలోనూ ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో బలీయమైన అభివృద్ధి వెల్లువను కల్పించాలని ప్రణాళిక ఆదేశాల ముసాయిదా సూచిస్తూ వుంది. యు.యస్.యస్.ఆర్.లోని వివిధ జాతుల ప్రజల మధ్య సోదర భావాన్ని, మైత్రినీ పెంపొందించి, దానిని పరిపుష్టం చేయాలనే లెనినిస్టు జాతుల విధానానికి యీ ఆశయం అనుగుణమైనది. వచ్చే అయిదేండ్లలో ఆర్.యస్.యఫ్. యస్.ఆర్, యుక్రెయిన్, లాట్వియాలలో పారిశ్రామికోత్పత్తిని సుమారు 50 శాతం; జార్జియా, ఆజర్‌బైజాన్, ఉజ్బెకిస్తాన్, కిర్ఘిజియా, తుర్క్‌మెనియాలలో

60 శాతం: పైలో రష్యా, కజకిస్తాన్, లిథువేనియా, మోల్డేవియాలలో 70 శాతం; తజికిస్తాన్, ఆర్మేనియాలలో 80 శాతం సాధించాల్సి వుంది. ఇప్పటి వరకూ పారిశ్రామికంగా వెనుకబడివున్న రిపబ్లిక్కులలో పారిశ్రామికాభివృద్ధి యితోధిక వేగంతో జరిగేటందుకు యిందువల్ల హామీ ఏర్పడుతున్నది.

యూనియన్ రిపబ్లిక్కులు తమ ప్రణాళికలను, సిద్ధపరచుకొనే సందర్భంలో తమ తమ ఆర్థిక శక్తి వనరులను, ప్రత్యేక లక్షణాలనూ దృష్టిలో వుంచుకోవాలి. వివిధ రిపబ్లిక్కుల మధ్య ఆర్థిక సంబంధాలను పెంపొందించు కోవలసిన అవసరాన్ని, ఆ సంబంధాలను బలపరుచు కోవలసిన అవసరాన్ని, యు. యస్. యస్. ఆర్. లో వసిస్తున్న సర్వసోదరప్రజ ఉమ్మడి ప్రయోజనాల్ని పరిగణించాలి. ప్రతిఒక్క రిపబ్లిక్కు తన స్వంత ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధిని సాధించు కోవడంతో బాటు మొత్తం సోవియట్ దేశానికి సంబంధించిన కర్తవ్యాల పరిష్కారంలో గూడా తనవంతు బాధ్యతను నిర్వర్తించవ లసివుంది. దీనినే లెనినిస్టులైన కమ్యూనిస్టులు సోషలిస్టు అంతర్జాతీయతాసారంగా పరిగణిస్తారు. మన దేశంలో నివసిస్తున్న సర్వజాతుల ప్రజలమధ్య అభేద్యమైన మైత్రి పటిష్ఠతకు ఇదే పునాది.

ఉత్పాదక శక్తులను, వివిధ యూనియన్ రిపబ్లిక్కులమధ్య, ఆర్థిక ప్రాంతాలమధ్య సహేతుకంగా, ప్రయోజనకరంగా పంపిణీచేయటం చాలముఖ్యం. వచ్చే ఇరువదేండ్లలో యూరల్ పర్వతశ్రేణికి తూర్పుగా వున్న ప్రాంతాల్లో పారిశ్రామిక వ్యవసాయక ఉత్పత్తిని పెద్ద ఎత్తున పెంపొందించవలసి వుంది. ఆ ప్రాంతాల్లో పారిశ్రామిక ముడిసరుకుల వనరులు, యింధనాలు, విద్యుచ్ఛక్తి అపారంగా కేంద్రీకృతమై వున్నవి.

దేశంలో తూర్పు ప్రాంతాల్లో భారీ ఎత్తున ఆర్థికనిర్మాణం జరపాల్సివుంది. ఆ ప్రాంతాల్లో చమురు, సహజ వాయువు, చౌకగా లభించే బొగ్గు, ఇతర యినుము లోహాలు, సహజ రూపంలో ముడిలోహాల అపార నిక్షేపాలున్నవి. వాటిలో కొన్నింటిని లోగడే కనిపెట్టడంగాని, కొత్తగా కనిపెట్టి వెలికి తీస్తూ వుండటం గాని జరుగుతూ వుంది. వీటి ఆధారంగా ఆ ప్రాంతాల్లో సర్వతోముఖమైన పలు భారీ పారిశ్రామిక ప్రాజెక్టులను నిర్మించాలి. గనులను యితర పరిశ్రమలను కొత్త రైల్వేలను రోడ్లనూ, నూనె గ్యాసుపైపు లైన్లను పెద్దఎత్తున నిర్మించాలి.

ఉక్కు యినుము, నాన్ ఫెర్రస్ లోహాలు, వివిధ రకాల యింధనాలు విద్యుచ్ఛక్తి, కలప, చేపలు, మొదలైన సహజసంపద, సహజ వనరులు అపారంగా

వున్న సోవియటు దూర ప్రాచ్యం ఆర్థిక స్తోమతను వినియోగించి వచ్చే ఐదు సంవత్సరాల్లో గణనీయంగా పారిశ్రామిక నిర్మాణం సాధించవలసి వుంది.

ఇతర సోషలిస్టు దేశాలతో సన్నిహిత సహకారం నెరపుతూ మనం మన దేశంలో ఆర్థికాభివృద్ధి సాధిస్తున్నాం. ప్రపంచ సోషలిస్టు శిబిరంలో మన ఆర్థిక సంబంధాలను ఇతోధికంగా అభివృద్ధి పరచుకోవడంపైనే మన పంచవర్ష ప్రణాళిక ప్రధాన లక్ష్యాల పరిపూర్తి ఆధారపడి వుంటుందనే విషయంపై ఆదేశ సూత్రాల్లో చెప్పబడింది.

యావత్తు సోవియట్ దేశప్రజలముందు, మొత్తం పార్టీముందు, స్థానిక ప్రభుత్వాలముందు, ఆర్థిక, కార్మిక, యితర ప్రజా సంఘాలముందు మన నూతన పంచవర్ష ప్రణాళిక సంక్లిష్టమైన, బృహత్ కర్తవ్యాలను వుంచుతున్నది. ప్రణాళికా కర్తవ్యాల పరిపూర్తిలో సోషలిస్టు ఉత్తేజన అభివృద్ధికి ప్రముఖమైన పాత్ర కల్పించబడింది. కమ్యూనిస్టు నిర్మాణంలో సాధారణ ప్రజల భాగస్వామ్యం యీ ప్రధాన రూపంలో వ్యక్తమవుతున్నది. వారి విప్లవాత్మకమైన సృజనాత్మక కృషిని గూడా యిది ప్రకటిస్తున్నది. ఈ కృషిలో పాల్గొంటున్న కోట్లాది ప్రజల శక్తి సామర్థ్యాలను ప్రణాళిక ప్రధాన లక్ష్యాల సాధన దిశగా మరలించాలి.

ఈ సందర్భంలో ప్రజల అజమాయిషీ సంస్థల గురించి కూడా కొద్దిగా చెప్పడం అవసరం. తమకు అప్పగించిన విధుల నిర్వహణలో ప్రజలు తమ బాధ్యతలను యితోధికంగా గుర్తించేలా చేయడానికి యివి పార్టీకి ఎంతో తోడ్పడు తున్నవి. తమ దేశానికి యజమానులము తామే అనే చైతన్యాన్ని వారిలో పెంపొందించడానికి అవి దోహదంచేస్తున్నవి. ఉత్పత్తిని, పెట్టుబడులను మరింతగా పటిష్టం చేసేటందుకు, నూతన సాంకేతిక ప్రక్రియలను అమలుజరపడంద్వారా, సరుకు నాణ్యతను పెంచేటందుకు, రాజ్యాంగ క్రమశిక్షణను పెంపొందించేటందుకు దేశవ్యాపితంగా ఆరంభించబడిన ఉద్యమంలో యీ ప్రజా అజమాయిషీ సంస్థలు మరింత చురుకుగా పనిచేయవలసి వుంది.

సోషలిస్టు ఉత్తేజనను, ప్రజా అజమాయిషీని పెంపొందించే విధంగా కృషి జరగాలి. ఉత్పత్తి మహాసభలను, యితర ప్రజా కార్యాచరణరూపాలను పెంపొందించాలి. ఉత్పత్తిలోను, ఉత్పత్తి నిర్వహణలోను గరిష్ట సంఖ్యలో ప్రజలు భాగస్వాములయ్యేలా చేయాలి. ఇంతవరకు వినియోగంలోకి రాకుండా వుండి పోయిన వనరులను, నిధులను వెలికితెచ్చి వినియోగపరిచేటందుకు కృషి జరగాలి.

# 3. పరిశ్రమలు

కామ్రేడ్స్, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో పారిశ్రామికోత్పత్తి యించుమించు 50 శాతం పెరుగుతుంది.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో, పారిశ్రామికాభివృద్ధిలో ఈ క్రింది అంశాలు ప్రాముఖ్యం వహించగలవు: శాఖలు, అంతర్‌శాఖల వ్యవస్థను అభివృద్ధి పర్చడం; ఆధునికమైన, ఆర్థికంగా గిట్టుబాటు కాగల పరిశ్రమలకు, సరుకుల తయారీల అభివృద్ధికి అగ్ర తాంబూలం యివ్వడం; యావత్తు జాతీయ ఆర్థిక వ్యవస్థను సాంకేతిక సాధన సంపత్తితో పునః సమాయత్త మొనర్చ డానికి దోహద మిచ్చే పరిశ్రమలను అధికంచేయటం; కొత్తవీ, ఉత్తమమైనవీ అయిన సరుకుల ఉత్పత్తికి అధికతర ప్రాధాన్యమొనర్చడం; ఎలెక్ట్రానిక్స్, రేడియో ఎలెక్ట్రానిక్ ఇంజనీరింగ్, అణుశక్తి ఇంజనీరింగ్, మూల పదార్థాలు (ప్యూర్ అండ్ ఎక్స్ట్రాప్యూర్ మెటీరియల్స్) ఉత్పత్తి, కంప్యూటర్లు, సింథటిక్ పదార్థాల ఉత్పత్తికి సంబంధించిన కొత్త పరిశ్రమలను గణనీయంగా విస్తరింప చేయటం, వ్యవసాయావసరాలన్నింటిని తీర్చగలిగిన విధంగా పారిశ్రామికరంగాన్ని సమాయత్తపర్చడం; వాడకం వస్తువుల ఉత్పత్తిని పెంపొందించడం. మౌలికమైన ఈ వ్యవస్థాత్మక మార్పులు జాతీయ ఆర్థిక విధానపు తక్షణావసరాలను తీర్చ గలవిగా వున్నాయి.

ఉత్పత్తిస్థాయి పెరుగుదల దృష్ట్యా, పరిశ్రమలలో ఉన్నతమైన, ఉత్తమమైన ప్రమాణాలను నెలకొల్పవలసిన అవసరం ఏర్పడుతున్నది. ఉత్పత్తి సాధనాలు వినియోగాన్ని గణనీయంగా మెరుగుపర్చాలి. ముడిపదార్థాలు, విడిభాగాలు, ఇంధనాల వ్యయాన్ని కొంత తగ్గించాలి. ఈ కర్తవ్యాన్ని ముఖ్యంగా పారిశ్రామిక సంస్థలు, వాటిలోని కార్మికులే నిర్వహించవలసి వుంటుంది. అదేసమయంలో, సాంకేతిక విధానంలోని మౌలికధోరణులను నిర్ణయించే సందర్భంలో ఇది ప్రాథమిక మైనదిగా పరిగణించాలి.

ఉత్పత్తిలో ప్రత్యేకతను సాధించడం అన్న అంశంపైననే ప్రధానంగా సాంకేతికాభివృద్ధి వేగం ఆధారపడి వుంటుంది. మనదేశంలో, ముఖ్యంగా యంత్ర నిర్మాణం, లోహ పరిశ్రమలలోని అనేక శాఖలలో ప్రత్యేకతను సంతరింపచేసు

కొన్నవి వున్నవి. అయితే, ప్రత్యేకతను సంతరింపచేసుకొన్న అంతర్శాఖ కర్మాగారాలు తగినంతగా అభివృద్ధి చెందలేదని చెప్పక తప్పదు. అనేక యంత్ర నిర్మాణ పరిశ్రమలు, తమకు అవసరమైన విడిభాగాలు, పోతలు, ఫోర్జింగ్స్, పరికరాలు, ఉపకరణాలు మున్నగు వాటిని తామే ఉత్పత్తి చేసుకోవడం సరియైన పద్ధతికాదు. పోత ఉత్పత్తి మూడువేల కర్మాగారాలకు పంపిణీ చేయబడి వుంది. వాటిలో అనేక పరిశ్రమలు అతి స్వల్పమైన సాంకేతిక స్థాయితో వుండడంవల్ల, ఉత్పత్తి వ్యయం అమితంగావుంది.

ఈ పద్ధతులను మార్చే విషయంలో మనం గట్టి పట్టుదల వహించాలి. పంచవర్ష ప్రణాళికను రూపొందించే సందర్భంలో, ప్రభుత్వ ప్రణాళికా సంఘం ప్రస్తుతమున్న కర్మాగారాలు ప్రత్యేకతను సంతరింప చేసుకోవడానికీ, ప్రత్యేకతను సంతరింపచేసుకొనే కొత్త అంతర్శాఖ కర్మాగారాలను, షాపులను స్థాపించడానికి అవకాశం కల్పించాలి. యంత్రాలకు, కర్మాగారాలకు అవసరమైన విడి భాగాల ఉత్పత్తిలో ప్రత్యేక సాధనాలు విస్తరింప చేయడానికి కృషిని మరెంత ఎక్కువగా లగ్నం చేయాలి. దీని వల్ల కర్మాగారాల మరమ్మతులను గురించి సమర్థవంతంగా సాగించ వచ్చు. ఇప్పుడు మరమ్మతుల సంఖ్య చాలా అధికంగా వుంది. ఇందు కోసం సాలీనా 1,000 కోట్ల రూబుళ్లు హరించుకు పోతున్నది.

విద్యుచ్ఛక్తి, ఇంధన పరిశ్రమ సాధించడం అన్నది కొత్తపంచవర్ష ప్రణాళిక నిర్వహించవలసిన అతి ప్రధానమైన కర్తవ్యాల్లో ఒకటి. యావత్తు దేశాన్ని విద్యుదీకరించడం అనే లెనిన్ భావంకూడా కొత్త పంచవర్ష ప్రణాళికకు మూల కందంగావుంది. అయిదేళ్లలోను విద్యుత్పాదక ఇంజనీరింగ్ 70 శాతం పెరుగుతుంది. విద్యుచ్ఛక్తి పరిశ్రమను పెంపొందించడంలో, పెద్దపెద్ద థర్మల్ విద్యుత్కేంద్రాలను నిర్మించడానికి ఆర్థికంగా గిట్టుబాటుకాగల జల విద్యుత్కేంద్రాలు నిర్మించడానికి మనం అధికతర ప్రాధాన్యం యివ్వాలి. అనేక డజన్ల పెద్ద థర్మల్ విద్యుత్కేంద్రాలు నిర్మించ బోతున్నాము. యూరప్లో నిర్మించే బృహత్తరమైన రెఫ్టిన్స్కాయా థర్మల్ విద్యుత్కేంద్రం, యుక్రెయిన్లో నిర్మించే బృహత్తరమైన డుగ్లెగార్స్కా థర్మల్ విద్యుత్కేంద్ర ప్రథమదశ కొత్తపంచవర్ష ప్రణాళికా కాలంలోనే పూర్తి కాగలవు. ఓల్గా, కామా, నీపర్ నదులపై జల విద్యుత్కేంద్రాల నిర్మాణం పూర్తి చేయబడుతుంది. పైబీరియాలో ప్రపంచంలోకెల్లా పెద్దదైన క్రస్నొయార్స్క

జల విద్యుత్కేంద్రం నిర్మాణం పూర్తి చేయవలసివుంది. అణు విద్యుత్కేంద్రాల నిర్మాణాన్ని కొనసాగించాలి.

సోవియట్ విద్యుచ్ఛక్తి పరిశ్రమను పెద్ద ఎత్తున పునర్వ్యవస్థీకరించబోతున్నాము. నిర్మించ తలపెట్టిన థర్మల్ విద్యుత్కేంద్రాల ఉత్పాదకపరిమాణంలో హెచ్చుభాగం బృహత్తరమైన 3 లక్షల కిలోవాట్ల యూనిట్లతో సాధించబడుతుంది. 5 లక్షల కిలోవాట్ల, 8 లక్షల కిలోవాట్ల ఉత్పాదక స్తోమతగల కేంద్రాలు కూడా నెలకొల్పబడనున్నవి.

సోవియట్ యూనియన్‌లోని యూరపియన్ ప్రాంతంలో ఒకే పవర్ గ్రిడ్‌ను నెలకొల్పాలని నిర్ణయించాం. అలాగే సైబీరియా, కజకిస్తాన్‌ల నుంచి దేశంలోని మధ్య ప్రాంతాలకు, యూరల్స్‌కు 15 లక్షలు ఓల్టుల డి. సి. ట్రాన్స్‌మిషన్ లైన్స్ నెలకొల్పాలని నిశ్చయించాము. గ్రామీణ ప్రాంతాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో చాలా వాటిని స్టేట్ పవర్ గ్రిడ్స్‌తో కలుపుతూ, విద్యుచ్ఛక్తి పంపిణీ పద్ధతిని అభివృద్ధి చేయబోతున్నాం. వస్తూత్పత్తిశాఖ లన్నిటిలోను విద్యుచ్ఛక్తి వాడకం గణనీయంగా పెరుగుతుంది. పట్టణాలలోని గృహావసరాలకు విద్యుచ్ఛక్తి సరఫరాను 60 శాతం, గ్రామీణ ప్రాంతాలలోని గృహావసరాలకు విద్యుచ్ఛక్తి సరఫరాను 200 శాతం పెంచబోతున్నాము.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో ఇంధనపు పరిశ్రమల అభివృద్ధి గణనీయంగా త్వరితం చేయబడుతుంది. తద్వారా ఇంధనపు నిల్వల పరిస్థితి మెరుగు కాగలదు. మొత్తం ఇంధనపు ఉత్పత్తిలో సహజవాయువు, నూనె వాటా 60 శాతానికి పెంచబడుతుంది. 1965 లో ఇది 52 శాతం వుంది.

1970 నాటికి నూనె ఉత్పత్తిని 34½ కోట్ల టన్నులు మొదలుకొని 35½ కోట్ల టన్నులవరకూ, సహజవాయువు ఉత్పత్తిని 22,500 కోట్ల ఘనపు మీటర్లు మొదలుకొని, 24,000 కోట్ల ఘనపు మీటర్ల వరకు పెంచాలని నిర్ణయించాం. నూనె ఉత్పత్తి సాలీనా పెరుగుదల 2 కోట్ల టన్నుల పైగా వుంటుంది. అలాగే సహజవాయువు సాలీనాఉత్పత్తి పెరుగుదల 2 వేలకోట్ల ఘనపు మీటర్లకు పైగా వుంటుంది. నూనె, సహజ వాయువు ఉత్పత్తిని యింకా తీవ్రతరం చేయవలసి వుంది. నూనె పొరలనుంచి హెచ్చు నూనెను వెలికి తీయడానికి కొత్తపద్ధతి చేపట్టవలసి వుంది. నూనె బావులలోని వివిధ పొరలనుంచి ఏకసమయంలో నూనెను

వెలికి తీసేపద్ధతి, అత్యున్నతమైన ఇతర శక్తివంతమైన పద్ధతులను చేపట్టాలి. ఒకే నూనె బావిలోని వివిధ పొరలనుంచి నూనెను బయటకు లాగే పద్ధతిని చేపట్టడం వల్ల బావుల డ్రిల్లింగ్ వ్యయం బాగా తగ్గించవచ్చు. ఈ విధంగా అయిదేళ్ల కాలంలో 40 కోట్ల రూబుళ్ళను పెట్టుబడి వ్యయంలో అదాచేయవచ్చు.

నూనె ఉత్పత్తి పెరుగుదలలో హెచ్చు భాగాన్ని పాత నూనెప్రాంతాలలోనే సాధించవలసి వుంటుంది. అయితే, ఇతర ప్రతినిధులు చెప్పినట్లు, విశాలమయిన కొత్త నూనె, సహజవాయువు ప్రాంతాలను, త్యుమెన్, ముంగేష్లవ్ ప్రాంతాలను కూడా అభివృద్ధి చేయవలసి వుంటుంది. పశ్చిమ సైబీరియాలోని సహజ సంపదను వెలికితీసే పెద్ద పరిశ్రమలకు కొత్తగా కనుగొన్న నూనె, సహజవాయువు నిధులే ప్రాతిపదిక కావలసివుంటుంది. వచ్చే అయిదేళ్ళ కాలంలోనూ యీ ప్రాంతంలో ఉత్పత్తి అయ్యే నూనె. ఆజర్‌బైజాన్ రిపబ్లిక్‌లో ఉత్పత్తి అవుతున్న నూనె పరిమాణంతో సమానంగా వుంటుంది. ప్రధాన వాయుగొట్టపు 'నెట్‌వర్క్' విస్తరణను 50 శాతం పెంచాలి. కొత్త వాయుగొట్టపు మార్గాలను వేసే సందర్భంలో పెద్ద వ్యాసార్థంగల గొట్టాలను వాడటం ద్వారా, వాయు సరఫరా స్తోమతను పెద్దయెత్తున పెంచవలసి వుంటుంది.

ఉజ్బెక్ రిపబ్లిక్ (బుఖారా) యూరల్స్‌లమధ్య వేసిన జంటగొట్టపు మార్గాలు, ఇగ్రెం, సెరోవ్‌లమధ్య వేసిన మరో గొట్టపుమార్గం యూరల్స్‌లోని విద్యుత్ పరిశ్రమాభివృద్ధికి ఎంతగానో తోడ్పడతాయి. యూరల్స్‌లోని ప్రధానమైన పట్టణాలకు, స్వెర్డ్‌లోవ్‌స్క్, చెల్యాబిన్‌స్క్, మాగ్నిటోగోర్‌స్క్. నిజ్నీతగిల్, ఒర్‌స్క్, సెరోవ్, ఇతర పట్టణాలకు చౌకగా ఇంధనాలను సరఫరాచేయవచ్చు. సహజ వాయువు సరఫరావల్ల, అనేక పట్టణాలలో జీవన పరిస్థితులు అభివృద్ధిచెందాయి; అనేక ఉత్పత్తి కేంద్రాలలో ఉత్పత్తి క్రమంలో మార్పులు వచ్చాయి.

పదవమైన పంచవర్ష ప్రణాళికా కాలంలో, దేశంలోని మధ్యప్రాంతాల పారిశ్రామిక, గృహావసరాలను తీర్చటానికి ఉజ్బెకిస్తాన్, తుర్క్‌మీనియా, ట్యూమెన్‌లనుంచి భారీ నూనె గొట్టపు మార్గాలు నిర్మించబడతాయి.

నూనె శుద్ధి కర్మాగారాల ఉత్పాదక స్తోమత 50 శాతం పెంచబడుతుంది. నూనె ఉత్పత్తుల నాణ్యతకూడా యింకా పెంచబడుతుంది. పెద్దపెద్ద నూనెశుద్ధి కర్మాగారాలు నిర్మించ బడుతాయి. ఇప్పుడు నిర్మాణంలోవున్న నూనెశుద్ధి కర్మాగారాల ఉత్పాదక స్తోమత 50 శాతం నుంచి నూరుశాతం వరకు హెచ్చించ బడుతు

తుంది. దీనివల్ల పెట్టుబడి వ్యయం కొంత తగ్గుతుంది. లోహం వినిమయం తగ్గు తుంది. శ్రమోత్పాదక స్థాయి పెరుగుతుంది.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో నూనె, సహజవాయు పరిశ్రమలు త్వరితంగా అభివృద్ధి చెందడంతోపాటు, బొగ్గు పరిశ్రమకూడా అభివృద్ధి చెందు తుంది. బొగ్గు ఉత్పత్తి 10 కోట్ల టన్నులకు పెరుగుతుంది. 1970 నాటికి 6 కోట్ల 65 లక్షల టన్నుల నుంచి 6 కోట్ల 75 లక్షల టన్నులవరకు బొగ్గు ఉత్పత్తి కాగలదు. కోక్‌గా తయారు చేయటానికి ఉపకరించే బొగ్గు త్రవ్వకం అభివృద్ధి రేటు అత్యున్నతంగా వుంటుంది. జాతీయార్థిక విధానపు ఉత్పత్తి అవసరా లన్నింటినీ, అలాగే ప్రజల అవసరా లన్నింటినీ తీర్చగలిగిన రీతిలో బొగ్గు పరిశ్రమ మేలురకం బొగ్గును సరఫరా చేస్తుంది. బొగ్గు గనులన్నీ యింకా అభివృద్ధిపర్చ బడతాయి. బొగ్గు త్రవ్వకపు యాంత్రీకరణ ఇతోధిక మొనర్చబడుతుంది. బావుల నుంచి బొగ్గును తరలించడానికి యంత్రాలు ప్రవేశ పెట్టబడతాయి. శ్రామిక ఉత్పాదక శక్తిని పెద్దయెత్తున పెంచడానికీ, గని కార్మికుల పని స్థితిగతులను గణనీయంగా మెరుగుపర్చడానికి అనువుగా యాంత్రీకరణ కార్యక్రమం అమలు జరుగుతుంది. ఓపెన్ కాస్ట్ మైనింగ్‌ను పూర్తిగా వినియోగించాలి. ముసాయిదా ఆదేశాలలో సూచించిన చర్యలు కార్మికుల సంఖ్యను పెంచకుండానే బొగ్గు ఉత్పత్తిలో క్రమబద్ధమైన అభివృద్ధిని సాధించడానికి సహాయపడగలవు.

సోవియట్ లోహ పరిశ్రమ గర్వించదగ్గ విజయాలను సాధించింది. అనేక సాంకేతిక, ఆర్థిక విషయాలలో ఈ పరిశ్రమ బాగా అభివృద్ధిచెందిన దేశాలనుకూడా అధిగమించింది. ప్రపంచంలోకల్లా అత్యంత శక్తివంతమైన బ్లాస్ట్, ఓపెన్ హార్త్ ఫర్నేసులను సోవియట్ యూనియన్ నిర్మించింది. నిరంతరం ఉక్కును కరిగించి, ప్రవహింపచేసే కర్మాగారాలను నిర్మించింది. స్మెల్టింగ్‌కు సంబంధించిన సాంకేతిక విషయాలు గణనీయంగా మెరుగుపర్చబడ్డాయి.

మన లోహ పరిశ్రమ సాంకేతిక స్థాయిని పెంచడానికి మనం నిరంతరం విరామ మెరుగని పరిశ్రమ చేయాలి. వచ్చే అయిదేండ్లలోను మనం మరెంతో శక్తివంతమైన లోహ పరిశ్రమలను నిర్మించ వలసి వుంది. 2,700 ఘనపు మీటర్ల పరిమాణం గల్గిన బ్లాస్ట్ ఫర్నేసులను, పెద్దపెద్ద ఎలక్ట్రిక్ స్మెల్టింగ్ ఫర్నేసులను, ఆక్సిజన్ కన్వర్టర్లను, యాంత్రీకరించ బడిన బలీయమైన రోలింగ్ మిల్లులను మనం నిర్మించవలసి వుంది. ప్రాణవాయువు, సహజవాయువు, సింటరు

ఫ్యూజింగ్ ఏంజెట్స్, ఐరన్ ఓర్ గ్రానెల్స్ వంటి వాటిని వినియోగించటం ద్వారా, లోహాలను కరిగించడంలో అధికోత్పత్తికి దోహదమిచ్చే పద్ధతులను, కొత్త సాంకేతిక రీతులను పెద్ద ఎత్తున ప్రవేశపెట్టవలసి వుంది. ఈ విధంగా 1970 నాటికి పుత్పత్తిఅయ్యే మొత్తం ఉక్కులో అయిదింట ఒక వంతు ఆక్సిజన్ కన్వర్టర్ పద్ధతి ద్వారా తయారుఅవుతుంది. కొత్త పంచవర్ష ప్రణాళికా కాలం ముగిసే నాటికి, 6 కోట్ల టన్నుల పోత ఇనుము, 9 కోట్ల టన్నుల ఉక్కు ప్రాణవాయువుతో కరిగించే పద్ధతిలో తయారుచేయ బడుతుంది.

లోహాల మేలిమిని మెరుగుపర్చడానికి అనేకానేక చర్యలు తీసుకోవలసి వుంది. మేలురకం ఉక్కు స్మెల్టింగ్‌ను అనేక రెట్లు పెంచాలి. రోల్డుసాక్, పైపింగ్ హాలువేర్‌లలో రకాలను యింకా ఎంతగానో హెచ్చించాలి. మేలురకానికి చెందిన హై ప్రెసిషన్ షేప్డ్‌గూడ్స్, కోల్డ్ రోల్డ్, కోల్డ్ డ్రాన్ షీట్, హైగ్రేడ్ రోల్డ్ స్టాక్, థిన్ వాల్డ్ స్టీల్ పైప్స్, వైర్ల వంటి సరుకుల ఉత్పత్తిని యితోధికం చేయాలి. హైగ్రేడ్ కోల్డ్‌రోల్డ్ ట్రాన్స్‌ఫార్మర్ స్టీల్ ఉత్పత్తి స్తోమతను 200 శాతం పెంచాలి. విద్యుత్ ప్రవాహాన్ని మరింత బాగా తట్టుకోగలిగిన లోహాభివృద్ధిని గణనీయంగా సాధించాలి.

మాగ్నిటొగొరిస్క్, చెల్యాబిన్‌స్క్, వెర్కు-ఇస్సెట్‌స్క్, యుదనోవ్ కర్మాగారాలలో హాట్ అండ్ కోల్డ్ రోలింగ్ పద్ధతిలో బ్రాడ్‌షీట్స్‌ను తయారుచేయడం కోసం స్టెయిన్‌లెస్, ట్రాన్స్‌ఫార్మర్ ఉక్కునుంచి షీట్లను, టిన్‌ప్లేటులను తయారు చేయడంకోసం ఫెర్రస్ లోహ పరిశ్రమల మంత్రిత్వశాఖ షాపులను ఎక్కువ చేయాలి. అలాగే 1420 మిల్లీమీటర్ల వ్యాసంగల బ్రాడ్‌ఫ్లాంగ్డ్ బీములను, పైపులను తయారుచేయడానికి రోలింగ్ మిల్స్ నిర్మించాలి. ప్రిసిషన్ షేప్డ్ వస్తువులను తయారుచేసే కర్మాగారానికి రోలింగ్ షాపులను సమకూర్చాలి. ఆర్థిక రీత్యా దీనికి ఎంతో ప్రాధాన్యంవుంది. 1970 నాటికి లోహాల గుణాన్ని, రకాలను, ముసాయిదా ఆదేశాలలో పేర్కొన్న ప్రకారం, పెంపొందించడానికి 50 లక్షల టన్నుల రోల్డ్‌స్టాక్‌ను అదనంగా తయారుచేయవలసివుంటుందని చెబితే సరిపోతుంది.

వర్తమాన పంచవర్ష ప్రణాళిక కాలంలో, మిశ్రమ లోహాల పరిశ్రమలను త్వరితగతిని అభివృద్ధి చేయవలసి ఉంటుంది. అల్యూమినియమ్ ఉత్పత్తి 90 మొదలు 110 శాతం వరకు పెరుగుతుంది. రాగి, జింక్ ఉత్పత్తి 60 మొదలు 70 శాతం పెరుగుతుంది. సీసం, మాగ్నీషియం, టిన్, నికెల్, టిటానియం, టిన్‌స్టెన్,

మోలిబ్డెనమ్ కాన్‌సెన్ ట్రేట్స్, ఉత్పత్తి అలాగే అమూల్య లోహాలు డైమండ్స్ వుత్పత్తి గణనీయంగా పెంచ బడుతుంది. ముడి ఖనిజాలనుపూర్తిగా వినియోగించ డానికి ప్రత్యేక ప్రాధాన్యం యివ్వబడుతుంది.

రసాయనిక పరిశ్రమను ముఖ్యంగా రసాయనిక ఎరువులు, రసాయనిక ఫైబర్లు, ప్లాసిక్స్, సింథటిక్ రిసిన్స్, సింథటిక్ రబ్బరు, తదితర కృత్రిమ సరుకులు, రసాయనిక వాడకం వస్తువులు, వివిధ నిత్యజీవితావసర వస్తువుల ఉత్పత్తిని అత్యంత త్వరితగతిని అభివృద్ధి చేయడానికి అవకాశం కల్పించబడుతున్నది. పంచవర్ష ప్రణాళిక ముగిసేటప్పటికి, మినరల్ ఎరువులు సాలీనా ఉత్పత్తి 6 కోట్ల 20 లక్షల టన్నులు మొదలు 6 కోట్ల 50 లక్షల టన్నులవరకు పెంచబడుతుంది. రసాయనిక ఫైబర్ల ఉత్పత్తి 7 లక్షల 80 వేల టన్నులు మొదలు 8 లక్షల 30 వేల టన్నులకు పెంచబడుతుంది. వస్త్రాలు, అల్లిక దుస్తులు, కృత్రిమ ఫర్స్ తయారుచేయడానికి అవసరమైన సింథటిక్ సరుకుల ఉత్పత్తి గణనీయంగా పెంచబడుతుంది. టైరు దారమంతా రసాయనిక ఫైబర్లనుంచి తయారుచేయబడుతుంది. అలాగే చేపల వలలు, టాకిల్, ఫిల్టర్, తదితర టెక్నికల్ ఫాబ్రిక్స్‌లలో హెచ్చుభాగం రసాయనిక ఫైబర్లనుంచి తయారు చేయబడతాయి.

50 వేల టన్నుల లావ్‌సాన్ ఫైబర్‌ను ఉత్పత్తిచేసే సింథటిక్ ఫైబర్ మిల్లు నొకదానిని మోడిర్ మేవ్‌లో నెలకొల్పాలని నిర్ణయమైంది.

పొలొట్‌స్క్ రసాయనిక మిల్లులో సాలీనా 48 వేల టన్నుల పోలిథిలిన్‌ను, 50 వేల టన్నుల నైట్రాన్ ఫైబర్‌ను ఉత్పత్తిచేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

మామూలు రబ్బరుకు బదులు మేలురకం కృత్రిమ రబ్బరును తయారుచేయడానికి, ప్రపంచంలోని భారీ కర్మాగారాలలో ఒకటికాగల నిజ్నీ - కామా కెమికల్ మిల్లును త్వరలో ప్రారంభించబోతున్నాము.

కొత్తరకం రంగులను, అత్యంత శక్తివంతమైన ప్లాంట్ ప్రొటెక్షన్ ఏజెంట్లను ఉత్పత్తి చేయడానికి చెబొవ్‌స్కరీలో నెలకొల్పుతున్న కెమికల్ మిల్లు నిర్మాణం పూర్తికావచ్చింది.

వచ్చే అయిదేళ్ళలోను రసాయనికోత్పత్తి గణనీయంగా పెరుగుతుంది. అయినప్పటికీ, కొన్ని సరుకుల విషయంలో ఇంతకుముందు అనుకొన్నదానికంటే,

ఉత్పత్తి కొంత తక్కువగానే వుంటుంది. దీని అర్థం మనం కెమిస్ట్రీని అలక్ష్యం చేశామని కాదు. వాస్తవిక దృక్పథం అలవర్చుకోవడం వల్లనే ఇలా జరుగుతున్నది. ఇంతకుముందు రసాయనిక పరిశ్రమకు కేటాయించిన లక్ష్యాలు వాస్తవిక దృష్టితో రూపొందించబడినవి కావు పాత లక్ష్యాల సాధనకు అవసరమయిన ప్రాజెక్టులుగాని, ఉత్పత్తి కార్యక్రమంగాని, యంత్ర పరికరాలుగాని, నిర్మాణ వ్యవస్థగాని సమకూర్చబడలేదు. 1965 లో ఉత్పత్తిని ప్రారంభించిన అనేక రసాయనిక కర్మాగారాలు ప్రాజెక్టు లోపాలవల్లను, కర్మాగారంలోని లోట్లవల్లను, కర్మాగార నిర్మాణ లోపాలవల్లను, నిపుణుల కొరతవల్లను అనుకొన్న ప్రకారం ఉత్పత్తి సాధించలేక పోతున్నాయి.

రసాయనిక సముకుల గుణాన్ని, రకాలను పెంచడానికీ, కొత్త రకం రసాయనిక సముకుల ఉత్పత్తిని ఏర్పాటు చేయడానికి ప్రత్యేక శ్రద్ధ వహించవలసి వుంటుంది.

జాతీయార్థిక విధాన సాంకేతిక పునర్వ్యవస్థీకరణ విషయంలో నైతేనేమి శ్రామికోత్పాదక శక్తిని ఇతోధిక మొనర్చడంలో నైతేనేమి ఇంజనీరింగ్ నిర్ణయాత్మకమైన పాత్ర వహిస్తుంది.

అత్యున్నత ఉత్పాదక యంత్రాల విషయంలో, జాతీయార్థిక విధాన వసరాలన్నింటినీ తీర్చ గలిగే స్థితిలో సోవియటు ఇంజనీరింగ్ వున్నది. ప్రపంచంలోని అత్యున్నత సాంకేతిక ప్రమాణాలకు సాటిరాగలిగిన విధంగా అనేక యంత్రపరికరాలను మనదేశంలోని ఇంజనీరింగ్ కర్మాగారాలు ఈనాడు పెద్ద ఎత్తున ఉత్పత్తి చేస్తున్నవి. ఉదాహరణకు 1964 లో క్రివోయ్‌రాగ్, చెల్యాబిన్‌స్కలలో ప్రారంభించిన బ్లూమింగ్ మిల్స్ ఉత్పాదక స్తోమత, విదేశాలలోని ఆ రకం మిల్స్ ఉత్పాదక స్తోమతకంటే, గణనీయంగా హెచ్చు. ప్రపంచంలోకల్లా అత్యంత శక్తివంతమైన హైడ్రోటర్బైన్లు, వాటికి తగిన జనరేటర్లు బ్రాట్‌స్క్, క్రాస్నొయార్‌స్క్ జలవిద్యుత్కేంద్రాలకొరకు తయారు చేయబడినవి. బ్లాస్ట్ ఫర్నెసులకు, సిమెంట్ పరిశ్రమకు అతి నవీనమైన యంత్రాలు తయారుచేయబడుతున్నాయి. భారీ మట్టిత్రవ్వక యంత్రాలు ఉత్పత్తిచేయబడుతున్నాయి. గత కొలది సంవత్సరాలలోను, లోహ పరిశ్రమలోని వివిధ విభాగాలకు పనికివచ్చే 1300 రకాల ఆటోమేటిక్, సెమీ ఆటోమేటిక్ యంత్రాలు నిర్మించబడినవి.

అయినప్పటికీ అనేక కర్మాగారాలు ఈనాటికీ సాంకేతికంగా అల్పప్రమాణా

లలో గల యంత్రాలను, కర్మాగారాలను ఉత్పత్తి చేస్తున్నవన్న సంగతిని మనం విస్మరించరాదు. అందుకొక ఉదాహరణ : కొత్త టి ఇ.-10 డీజిల్ రైలు ఇంజన్ల మొదటి నమూనాలు 1958 లో తయారైనవి. ఆటు తరువాత టి.ఇ. - 3 డీజిల్ రైలు ఇంజన్లను కొద్దిగా అభివృద్ధిచేసి, 1 5 మొదలు 2 రెట్లు హార్స్ పవర్ అధికంగా వుండే రైలు ఇంజన్లను హెచ్చు సంఖ్యలో ఉత్పత్తిచేయడం జరిగింది. పదేళ్ల అనంతరం కూడా టి. ఇ. 10 డీజిల్ ఇంజన్ల ఉత్పత్తి పెద్దయెత్తున జరగటం లేదు. అంతకంటే శక్తివంతమైన డీజిల్ ఇంజన్లు తయారు చేయడానికి ప్రయత్నించనూ లేదు. 1965 లో ఉత్పత్తి అయిన పాత టి,ఇ. - 3 డీజిల్ రైలు ఇంజన్లతో పోల్చితే, ఉత్పత్తి అయిన టి. ఇ. - 10 ఇంజన్లు 25 శాతం మాత్రమే. శక్తివంతమయిన కొత్త డీజిల్ రైలు ఇంజన్లను బయటకు తీసుకురావడంలో లుగాన్స్క్, ఖార్కోవ్, కొలొమ్నా కర్మాగారాల మేనేజిమెంట్లు చాలా వెనకబడి పోయాయి. ఖార్కోవ్ ఎలెక్ట్రో - త్యాజ్మాష్ వర్క్స్ మానేజిమెంటు అవసరమైన విద్యుత్పరికరాలను సరఫరా చేయడంలో విఫలమైంది. నొవొచెర్కాస్క్, టిబిలిసి ఎలెక్ట్రిక్ లోకోమోటివ్ నిర్మాణ కర్మాగారాలలో ఎలెక్ట్రిక్ రైలు ఇంజన్ల ఉత్పత్తి సక్రమంగా జరగడంలేదు.

మన కర్మాగారాలలో ఉత్పత్తి అవుతున్న యంత్రపరికరాల సాంకేతిక, ఆర్థిక ప్రమాణాలు సోవియట్ యూనియన్, ప్రపంచ విజ్ఞాన శాస్త్రం, ఇంజనీరింగ్ ప్రమాణాలకు తగిన రీతిలో వుండాలి. అత్యున్నత యాంత్రీకరణ స్థాయిని కలిగి వున్న, స్వయంచలిత యంత్రాగారలను పెద్దఎత్తున ఉత్పత్తిచేయడం మరింతముఖ్యం. ఉత్పత్తిచేసే యంత్రాలు, ముఖ్యంగా విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు, బ్లాస్ట్ ఫర్నేసులు. స్టీల్ స్మెల్టింగ్ యంత్రాలు, రసాయనిక కర్మాగార యంత్రాలు, నూనె శుద్ధి కర్మాగార యంత్రాలు సాధ్యమైనంత పెద్దవిగా వుండాలి.

యంత్రాల డిజైన్లను రూపొందించే కార్యాలయాల ప్రాధాన్యం గణనీయంగా పెరగాలి. ఈ కార్యాలయాలకు, కర్మాగారాలకు సన్నిహిత సంబంధాలు ఏర్పడాలి. డిజైనర్లు సృజనాత్మకంగా కృషి జరపడానికి తగిన మంచి స్థితిగతులను సమకూర్చాలి. వారు తమ ప్రతిభను, సామర్థ్యాన్ని వ్యక్తీకరించడానికి అవకాశమివ్వాలి. డిజైన్ల, సాంకేతిక ప్రమాణాలను ఉన్నత స్థాయిలోకి కొనిపోవడంలో వారికి ఇతోధిక బాధ్యత అప్పగించాలి. డిజైన్ కృషిలో అద్భుత విజయాలు సాధించిన వారికి మరింత ప్రోత్సాహం కల్గించాలి. కొత్తరకం యంత్రాల, యంత్ర భాగాలు,

యంత్ర పరికరాల ఉత్పత్తిని జాగులేకుండా ప్రారంభించడానికి వీలుగా ప్రాజెక్టు డిజైన్లు ఎప్పుడూ నిల్వలో ఉండేటట్టు చూడాలి.

స్టేట్ ప్లానింగ్ కమిటీ, యంత్రపరికరాల పరిశ్రమల మంత్రిత్వశాఖ, ఫోర్జ్, ప్రెస్ యంత్రపరికరాలు, అత్యంత ఆధునిక తరహాకుచెందిన మెటల్ కటింగ్ లేత్‌లు, ప్రత్యేకంగా హైప్రిసిషన్ లేత్‌లు, స్పెషల్, ఎగ్రగేట్ లేత్‌లు, గ్రైండర్లు హానర్లు, ఆటోమేటిక్. సెమీ ఆటోమేటిక్ లేత్‌లు, తదితర స్వయంచాలిత యంత్ర పరికరాలకు అగ్రతాంబూలం సమకూర్చవలసి వుంటుంది. ప్రోగ్రామ్డ్ లేత్‌ల ఉత్పత్తిని గణనీయంగా అధికం చేయడానికి తగిన చర్యలు తీసుకోవాలి.

వివిధ పరిశ్రమల శాఖలను, విభాగాలను, యంత్రాలను, పరికరాలను ప్రామాణీకరించేందుకు, ఏకోన్ముఖం చేసేందుకు ప్రామాణిక సంఘం, ఇంజనీరింగ్ మంత్రిత్వశాఖలతో కలసి. కృషి సాగించాలి.

యంత్ర పరికరాల ఉత్పత్తి కర్మాగారాలను మన సాంకేతికావసరాలు తీర్చగల్గిన విధంగా అభివృద్ధి చేయడం, ఆధునిక యంత్ర పరికరాలను, ముఖ్యంగా సకల స్వయంచాలిత సాధనాలను, సాంకేతిక క్రమాలను కంట్రోలుచేసే, రెగ్యులేట్ చేసే సాధనాలను, సున్నిత కాలమాన యంత్రపరికరాలను ఇతోధికంగా ఉత్పత్తి చేయటం మన ముందున్న కర్తవ్యం. మన జాతీయార్థిక వ్యవస్థ సాంకేతిక స్థాయిని పెంపొందించాలంటే. మనం ఎలెక్ట్రానిక్ కంప్యూటర్ల ఉత్పత్తిని, వాటి గుణాన్ని పెంపొందించాలి. పరిశోధనలు, అంచనాలు, డిజైన్లు, ఉత్పత్తి నిర్వహణ మున్నగు విషయాలలో మనం కంప్యూటర్లను విస్తారంగా వినియోగించాలి.

మన జాతీయార్థిక వ్యవస్థ అవసరాలను పరిగణనలోకి తీసుకొన్న ముసాయిదా ఆదేశాలు, ఇంజనీరింగ్‌కు చెందిన ప్రతి శాఖలోని అభివృద్ధికి సంబంధించిన కీలక సమస్యలను వివరిస్తున్నాయి. విద్యుచ్ఛక్తి, లోహ, రసాయనిక, నూనె, ఎలెక్ట్రానిక్స్, రేడియో ఇంజనీరింగ్‌ను గణనీయంగా అభివృద్ధి చేయడానికి అవకాశం కల్పించబడింది. ట్రాక్టర్ నిర్మాణ, వ్యవసాయ యంత్ర నిర్మాణ పరిశ్రమలకు గురుతర బాధ్యతలు అప్పగించబడ్డాయి. మోటారు పరిశ్రమ త్వరితంగా అభివృద్ధి చేయబడాలి. లారీల ఉత్పత్తిని 60–70 శాతం, కారుల ఉత్పత్తిని దాదాపు 300 శాతం అధికం చేయాలని ప్లాన్ చేయబడింది. ఈ లక్ష్యాల సాధనకు ఇప్పుడున్న మోటారు పరిశ్రమలను విస్తరింపచేయడం మాత్రమే కాక, కొత్త మోటారు పరిశ్రమలను స్థాపించాలి. మన ఇంజనీరింగ్ పరిశ్రమలు, తమ

సాంకేతిక ప్రమాణాల సహాయంతోను, మన నిపుణుల బృందం సహాయంతోను ప్రపంచ మార్కెట్టులో పోటీకి నిలబడి, నెగ్గగలిగిన సరుకులను ఉత్పత్తి చేయాలి.

మన ఇంజనీరింగ్ పరిశ్రమలో తేలిక పరిశ్రమలకు, ఆహార పరిశ్రమకు సంబంధించిన యంత్రాలను ఉత్పత్తిచేసే శాఖలను అభివృద్ధి పర్చడం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఈ శాఖలలోని ఉత్పాదక స్తోమత గణనీయంగా విస్తరిస్తుంది. స్పిన్నింగు, వీవింగు, ఫినిషింగు, మిక్స్, నిటెడ్‌వేర్, హాబర్డ్ యేషరీ, ఫుట్‌వేర్ ఫ్యాక్టరీస్, ఆహారం, మాంసం, డయరీ ప్లాంట్సు మున్నగు వాటికి అత్యంత ఉత్పాదక స్తోమత గల్గిన 3 వేల కొత్త తరహా యంత్రాలను పెద్ద యెత్తున ఉత్పత్తిని ప్రారంభించవలసి వుంది.

శారీరక శ్రమ హెచ్చుగా వున్న పనుల నిర్వహణను సాధ్యమైనంత ఎక్కువగా యాంత్రీకరించడానికి అవసరమైన పరికరాల ఉత్పత్తిని పెంచడానికి పంచవర్ష ప్రణాళికలో అవకాశం కల్పించాలి.

ఇప్పుడున్న కర్మాగారాలలో యంత్ర పరికరాలను మరింత నేర్పుగా వినియోగించడంద్వారాను, షిప్టులు పెంచడంద్వారాను ఉత్పత్తిని ఇనుమడింపచేయడానికి ఇంజనీరింగ్ పరిశ్రమలో గణనీయమైన అవకాశాలు వున్నాయి. లాభాలలో కొంత భాగాన్ని అదనంగా యిళ్ళను నిర్మించడానికి కేటాయించగల్గిన పరిశ్రమలు అదనపు మానవ శక్తిని తేలికగా ఆకర్షించ గలుగుతాయి.

కలప, పల్ప్ అండ్ పేపర్, వుడ్ వర్కింగ్ పరిశ్రమల్లో కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో గణనీయమైన మార్పు సంభవం. ఇప్పటివరకు కలప, ఉడ్ వర్కింగ్ పరిశ్రమలో బహు కొద్దిరకమైన సరుకులు మాత్రమే తయారవుతున్నాయి. మరొకవైపున దుబారా జాస్తీగా వుంది. ఆధునికమైన సాంకేతిక పద్ధతులలో ఒక క్యూబిక్ మీటర్‌నుంచి తయారయ్యే వస్తువులలో మూడవ వంతు మొదలు 5 వ వంతు సరుకులను మాత్రమే మన పరిశ్రమలలో హెచ్చుభాగం తయారుచేస్తున్నాయి. ముడి పదార్థాలను సంక్లిష్టరీతిలో శుద్ధిచేసే పరిశ్రమలకు అవసరమైన పెట్టుబడులను కేటాయించాలి. ముడి పదార్థాలను మరింత సక్రమంగా వినియోగించడంద్వారా, పేపరు, సెల్యులోజ్, కార్డుబోర్డు, ప్రెస్‌డ్ వుడ్, వుడ్‌ఫైబర్ బోర్డు, జాయినరీ, ఈస్టు, తదితర సరుకుల ఉత్పత్తి పెద్ద యెత్తున పెంచబడుతుంది.

వచ్చే అయిదేళ్ళలోను దేశంలో, ముఖ్యంగా తూర్పు ప్రాంతాలలో భారీ టింబర్ ప్రోసెసింగ్ మిల్లులు నిర్మించబడతాయి. వాటిలో బ్రాటిస్క్ టింబర్ అండ్ వుడ్ ప్రోసెసింగ్ కాంప్లెక్స్, క్రాస్నోయార్స్క్ సెల్యులోజ్ అండ్ పేపర్ మిల్లు, కామ్సొమోలస్క్ ఆన్ అమోర్ వద్ద నిర్మించే సెల్యులోజ్ అండ్ పేపరు మిల్లుల మొదటి దశ పూర్తి కాగలవు. సైబీరియా తూర్పు ప్రాంతాలు షుమారు 25 లక్షల టన్నుల సెల్యులోజ్, ఇంచుమించు 13 లక్షల టన్నుల కార్డుబోర్డు ఉత్పత్తి చేయగలిగిన స్తోమతను సంతరించ చేసుకుంటాయి.

కార్డుబోర్డు, ఉడ్ బోర్డు, ప్లయివుడ్ వంటి వాటి ఉత్పత్తిని ఇతోధికం చేసే ఈ లక్ష్యాలను సాధించడం అవసరం. 1970 లో మన దేశం 6 కోట్ల క్యూబిక్ మీటర్ల పారిశ్రామిక కలపను ఆదా చేయగలుగుతుంది.

సోవియట్ ప్రజల జీవన ప్రమాణాభివృద్ధిలో వాడకం వస్తువులను ఉత్పత్తి చేసే పరిశ్రమలపై పృథుతర బాధ్యతలు పడుతున్నాయి.

తేలిక పరిశ్రమల రంగంలో దాదాపు 300 పెద్ద పరిశ్రమలను స్థాపించాలని, 100 పరిశ్రమలకు పైగా రీమోడల్ చేయాలని నిర్ణయించాము. తేలిక పరిశ్రమల అభివృద్ధి వేగం రేటు 110 శాతం పెరుగుతుంది. 1970 లో ఈ పరిశ్రమలు 950 కోట్లు మొదలు 980 కోట్ల చదరపు మీటర్ల వస్త్రాలు, 165 కోట్లు మొదలు 175 కోట్ల అల్లిక సరుకులు, 61 కోట్ల మొదలు 63 కోట్ల వరకు తోళ్ళతో తయారయ్యే పాదరక్షల జతలు ఉత్పత్తి చేస్తాయి. అల్లిక వస్తువుల పరిశ్రమాభివృద్ధిపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించబోతున్నాం. వచ్చే అయిదేళ్ళలోను అల్లిక వస్తువులను ఉత్పత్తిచేసే 75 ఫ్యాక్టరీలను, వందకు పైగా దుస్తుల ఫ్యాక్టరీలను నిర్మిస్తాం. సాలీనా 12 కోట్ల జతల పాదరక్షలను తయారుచేయగల్గిన ఫ్యాక్టరీలలో ఉత్పత్తి ప్రారంభం కాగలదు. ఇంకా అనేక పాదరక్షల ఫ్యాక్టరీలను రీమోడల్ చేయబోతున్నాము.

తేలిక పరిశ్రమలలో పనిచేసే కార్మికులు తాము ఉత్పత్తిచేసే సరుకులను ఎప్పటికప్పుడు కొత్త తరహాలో తయారుచేసే బాధ్యతలను స్వీకరించాలి. వాడకం దారులకు ఆసక్తిదాయకమైన కొత్త తరహా వస్తువుల ఉత్పత్తిని క్రమబద్ధంగా పెంచుతూ ప్రజలలో వాటికి గిరాకీని కల్పించగలగాలి.

వ్యవసాయ రంగంలోని కార్మికులు, పరిశ్రమలలోని కార్మికులతో కలిసి.

ప్రత్తి, ఉన్ని, ఫ్లాక్స్, తోళ్ళు, చర్మాలు, తదితర ముడి సరుకుల నాణ్యాన్ని పెంచడానికి తగిన చర్యలు గైకొనాలి. ఈ సరుకుల నాణ్యాన్ని మెరుగు పర్చడంలో, ఉత్పత్తి క్రమంలో మెరమెరకు ఏ ఏ బాధ్యతలు తీసుకోవాలో, వాటిని కొనుగోలు కేంద్రాలకు, ప్రాథమిక కేంద్రాలకు చేర్చే బాధ్యత ఎవరిదో స్పష్టంగా నిర్ణయించాలి. తదనుగుణంగా, రవాణా సౌకర్యాల కల్పన, ప్యాకింగ్, తదితర సరుకుల సరఫరా ముఖ్యంగా వాటికి అవసరమైన మొత్తాలను ప్రణాళికలో ఆయా సంస్థలకు సమకూర్చాలి. ఈ విధంగా సరుకులు చెడిపోకుండాను, సరుకుల నాణ్యం దెబ్బతినకుండాను చూడాలి.

రసాయనిక పరిశ్రమలో పనిచేస్తున్న కార్మికులు రసాయనిక ఫైబర్లు రంగులు, కృత్రిమతోళ్ళు, ఫిల్మ్స్. రసాయనిక సరుకుల ఉత్పత్తికి అవసరమైన ముడి సరుకుల నాణ్యాన్ని గణనీయంగా పెంచడానికి బాధ్యత తీసుకోవాలి. తేలిక పరిశ్రమలు, ఆహారపరిశ్రమలకు ప్రామాణికమైన సరుకులను సరఫరాచేసే బాధ్యతలను తీసుకోవాలి. ఈ చర్యలను అమలు జరపడంతో, మన పరిశ్రమలలో తయారయ్యే వాడకం సరుకుల సంఖ్యను, శ్రమోత్పాదక స్తోమతను, పెంచగలం. ఉత్పత్తి వ్యయం తగ్గించగలం. సరుకుల నాణ్యం ఎక్కువ చేయగలం.

దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు మేలురకం ఆహారపదార్థాలను, రక రకాలైన ఆహార పదార్థాలను మనం సరఫరాచేయాలి. వచ్చే ఐదేళ్ళలోను ఆహార పరిశ్రమ లో ఉత్పత్తి పరిమాణాన్ని 40 శాతం పెంచాలి.

వచ్చే అయిదేళ్ళ కాలంలోను, ప్రభుత్వ సంస్థలలో ఉత్పత్తిఅయ్యే మాంసం 59 లక్షలు మొదలు 62 లక్షల టన్నులకు పెరుగుతుంది. 1965 లో యిది 48 లక్షల టన్నులుమాత్రమే వుంది. కోడిమాంసం, పాలు, వెన్న, గ్రుడ్లు తదితర సరుకుల ఉత్పత్తి గణనీయంగా పెరుగుతుంది.

పట్టే చేపలను 50 నుంచి 60 శాతం వరకు పెంచవలసివుంది. వానికోసం మత్స్యపరిశ్రమలకు ఆధునికమైన పెద్ద పెద్ద నావలు అనేకవాటిని సమకూర్చాలి. మత్స్యపరిశ్రమలో పనిచేస్తున్న కార్మికులు తమ నావలను సక్రమంగా వినియోగించడం ద్వారా చేపల సరుకుల ధరలను క్రమేణా తగ్గించ గలగాలి.

చెరువులు, సరస్సులలో చేపల పెంపక పరిశ్రమను పెద్ద ఎత్తున అభివృద్ధి చేయడానికి పంచవర్ష ప్రణాళిక అవకాశం కల్పించాలి. నదులలోను, రిజర్వాయర్ల లోను చేపల సంపద రక్షణకు అదనపు చర్యలు గైకొనాలి. నదులను, సరస్సు

లను, రిజర్వాయర్లను పారిశ్రామిక, మున్సిపల్ ప్రాంతాల మురికినీటితో మలినపర్చే వారిని తగినవిధంగా శిక్షించాలి.

మన ఆహార పరిశ్రమ యిప్పుడు కొత్త పరిస్థితిలో పనిచేస్తున్నది. సరుకులు కావాలనే డిమాండ్ బహుముఖంగా పెరుగుతున్నది. ఉన్నత ప్రమాణంగల సరుకులు కావాలని ప్రజలు కోరుతున్నారు. వంటకు - వడ్డనకు సర్వసిద్ధంగావున్న అన్నిరకాల ఆహారపదార్థాలు ప్రిపాక్డ్ సరుకులు ఉత్పత్తిని గణనీయంగా పెంచాలి. కానింగ్ పరిశ్రమ నిర్వహణను మెరుగుపర్చాలి.

వాడకం సరుకుల ఉత్పత్తి అతి ప్రధానమైన, గౌరవప్రదమైన కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణ ఎలా కొనసాగుతున్నదీ పార్టీ, ప్రభుత్వం, కార్మిక సంఘాలు, కామ్‌సొమాల్ సంస్థలు, ఒక్క మాటలో చెప్పాలంటే, యావన్మంది ప్రజలు నిరంతరం తనిఖీ చేస్తుండాలి.

కామ్రేడ్స్, పారిశ్రామికాభివృద్ధి పథకం జయప్రదం కావడం అన్నది సెప్టెంబరు ప్లీనరీ సమావేశంలో ఆమోదించిన ఆర్థిక సంస్కరణలను పారిశ్రామిక సంస్థలలో ప్రవేశపెట్టడంపై ఆధారపడివుంటుంది. మూడు లక్షలమందికిపైగా పారిశ్రామిక కార్మికులు, ఆఫీసుపనివారలు పనిచేస్తున్న అనేక పెద పారిశ్రామిక సంస్థలు ఇప్పటికప్పుడే కొత్తపద్ధతిలో పనిచేస్తున్నాయి. ఇంచుమించు 7 లక్షల మంది పనిచేస్తున్న మరికొన్ని పెద్ద పరిశ్రమలు వచ్చే మూడునెలలలోను కొత్త పద్ధతిక్రిందకు తేబడతాయి. అటుతరువాత, ఇంజనీరింగ్, ఆహార, జౌళి పరిశ్రమలలోని కొన్ని శాఖలలో ఈ కొత్తపద్ధతి ప్రవేశపెట్టబడుతుంది 1967 సంవత్సరాంతానికి, పారిశ్రామికరంగంలో పనిచేస్తున్న మొత్తం కార్మికులలో మూడోవంతు కార్మికులు కొత్తపద్ధతిక్రింద పనిచేస్తుంటారు.

కొత్త పద్ధతిని చేపట్టిన మొదటి రెండు గ్రూపుల పారిశ్రామిక సంస్థలు 15 కోట్ల రూబుళ్లు విలువచేసే అదనపు పారిశ్రామిక సరుకులను ఉత్పత్తి చేయాలని, అంచనా వేసిన లాభానికి మించి 5 కోట్ల 60 లక్షల రూబుళ్ళ లాభాన్ని ఆర్జించాలని తలపెట్టాయి. ఈ యేడాది మొదటి మూడు నెలలలోను, కొత్త పద్ధతి చేపట్టిన పారిశ్రామిక సంస్థలలో యెక్కువ భాగం సరుకుల అమ్మకం, లాభార్జన విషయంలో వేసుకొన్న అంచనాలను మించిపోయాయి. స్టేట్ బడ్జెట్‌కు వచ్చే ఆదాయం పెరిగింది. ఉత్పత్తిని పెంచడానికి, పాదార్థిక ప్రోత్సాహాలను కల్గించడానికి, సామాజిక, సాంస్కృతిక సౌకర్యాల కల్పనకీ, గృహ నిర్మాణానికి

అవసరమైన నిధులు తగినంతగా యిప్పుడు పారిశ్రామిక సంస్థలకు సమకూడినవి. పారిశ్రామిక కార్మికులు, ఆఫీసు పనివారల జీతాలు పెంచబడినవి.

ఈ కొత్తపద్ధతి అమలులోకి రావడంతో, పాదార్థిక, సాంకేతిక సరఫరాల విషయంలో సామర్థ్యాన్ని పటుతరం చేయక తప్పదు. పాదార్థిక, సాంకేతిక సరఫరాలు సోవియట్ యూనియన్ మంత్రిమండలి, మంత్రిత్వశాఖలు, స్టేట్‌కమిటీ సరఫరా సంస్థల కృషిని పైనుంచి క్రిందివరకు మెరుగుపర్చడానికి తగుచర్యలు తీసుకొనాలి.

పారిశ్రామిక సంస్థలలో ఆర్థిక వాతావరణాన్ని గణనీయంగా అభివృద్ధి పర్చడానికి, ఇతోధికమైనర్చిన శ్రమోత్పాదకత, పాదార్థిక పొదుపు, ఉత్పత్తి వ్యయం తగ్గింపు, సరుకుల నాణ్యం పెరుగుదల మున్నగువాటిలో కార్మికులకు అధికాసక్తిని కల్గించడానికి ఈ కొత్తపద్ధతి ఉపకరిస్తుంది.

మన నిధులను - ఇవి అపారంగా వున్నాయి - మనం సక్రమంగా వినియోగిస్తే, పారిశ్రామిక రంగానికి పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన లక్ష్యాలను పూర్తి చేయడం మాత్రమే కాక, వాటిని అధిగమించగలం. మన కార్మిక వర్గానికి, ఇంజనీర్లకు, సాంకేతిక నిపుణులకు, డిజైనర్లకు, పరిశ్రమలలో పనిచేస్తున్న వారందరికీ యిది ఘన విజయం కాగలదు.

## 4. వ్యవసాయం

మన దేశ ఆర్థికాభివృద్ధి సాధనలో వ్యవసాయ రంగం నిర్వర్తించవలసిన పాత్రకు ప్రత్యేక ప్రాధాన్యం వున్నది. ఆర్థిక విధానంలోని ఇతర శాఖల అభివృద్ధి, శ్రామిక జనుల జీవన ప్రమాణాభివృద్ధి చాలవరకు వ్యవసాయరంగం పైననే ఆధారపడివుంటుంది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ మార్చినెల ప్లీనరీ సమావేశం నిర్ణయాలను ఆధారం చేసుకొని, వ్యవసాయానికి సంబంధించిన పంచవర్ష ప్రణాళిక ఆదేశాలు రూపొందించబడినవి.

వచ్చే అయిదేళ్ళలోను వ్యవసాయోత్పత్తి, పశుగణ ఉత్పత్తులను గణనీయంగా పెంచడం, వాటి పెరుగుదల రేటు హెచ్చుగాను, నికరంగాను వుండేటట్లు చూడడం వ్యవసాయరంగం బాధ్యత. అన్ని వ్యవసాయోత్పత్తుల సాలీనా సగటు

పరిమాణాన్ని, ఈ అయిదేళ్ళలో, గత అయిదేళ్ళ దశకంటే, 25 శాతం అధికంగా వుండేటట్లు చూడాలి

తృణ ధాన్యాల ఉత్పత్తిని పెంచడానికి అధికతర ప్రాధాన్యమివ్వాలి. సాలీనా సగటు ధాన్యం ఉత్పత్తిని 30 శాతం పెంచాలి. 16 కోట్ల 70 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి ఏటేటా జరగాలి.

ఇతర వ్యవసాయ సరుకుల సాలీనా సగటు ఉత్పత్తి యీ క్రింది విధంగా వుండాలి.

సుగర్ బీట్ ఉత్పత్తిని 8 కోట్ల టన్నులకు పెంచాలి. 1961–'65 మధ్య కాలంలో దీని సగటు ఉత్పత్తి 5 కోట్ల 90 లక్షల టన్నులు మాత్రమే వుంది.

1961–'65 మధ్య కాలంలో సాలీనా సగటు ఉత్పత్తి 50 లక్షల టన్నులు వున్న ప్రత్తి ఉత్పత్తిని 56 లక్షలు మొదలు 60 లక్షల టన్నులకు పెంచాలి.

బంగాళాదుంపల ఉత్పత్తిని 8 కోట్ల 10 లక్షల టన్నులనుంచి 10 కోట్ల టన్నులకు పెంచాలి.

మాంసం ఉత్పత్తిని 93 లక్షల టన్నుల నుంచి కోటి 10 లక్షల టన్నులకు పెంచాలి.

పాలను 6 కోట్ల 50 లక్షల టన్నులనుంచి 7 కోట్ల 80 లక్షల టన్నులకు పెంచాలి.

గ్రుడ్లు ఉత్పత్తిని 2900 కోట్లనుంచి 3400 కోట్లకు పెంచాలి.

ధాన్యోత్పత్తిని పెంచడానికి హెచ్చు ఫలసాయాన్ని తీసే పద్ధతులను అనుసరించడం అత్యవసరం. దీనికి శాస్త్రీయ సూత్రాల ప్రాతిపదిపై సాగుచేసే ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టాలి. మనదేశం సువిశాలమైనది కావడంవల్లను, మనదేశంలో విభిన్న వాతావరణ పరిస్థితులు వున్నందువల్లను, ఒకే మూసలో వ్యవసాయ పథకాలను తయారుచేయడం సాధ్యంకాదు. అలాంటివాటికి ఎంత మాత్రం అవకాశంలేదు. వీటిని తయారుచేయడంలో వ్యవసాయశాస్త్రం, ప్రభుత్వం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పనిచేస్తున్న నిపుణులు, వ్యవసాయదారుల మాట తుదివాక్కు కాక తప్పదు.

యుక్రెయిన్, ఉత్తర కాకసస్, మధ్యప్రాంతపు నల్ల రేగడ ప్రదేశాలు,

డెల్టాప్రాంతం, కజకస్తాన్, సైబీరియాలలో ధాన్యం ఉత్పత్తిని గణనీయంగా పెంచాలి. ఈ ప్రాంతాలలో ధాన్యం పంట రాలుబడిని పెంచడానికి అపారమైన అవకాశాలు కలవు.

యు. ఎస్. ఎస్. ఆర్. వ్యవసాయ మంత్రిత్వశాఖ, ఆర్. ఎస్. ఎఫ్. ఎస్. ఆర్., కజకస్తాన్ మంత్రి మండలులు బీడు భూముల స్థితిని గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. ఆ బీడు భూములలో కలుపు మొక్కలు జాస్తిగా వున్నాయి. అనేక ప్రాంతాలలోకి ఆ కలుపు వ్యాపిస్తున్నది. అక్కడ వ్యవసాయ పరిస్థితిని చక్కదిద్దాలి. హెచ్చు రాలుబడిగల, నికరంగా పండే పైరులను సాధ్యమైనంత త్వరగా ప్రవేశపెట్టాలి.

వచ్చే అయిదేళ్లలోను రష్యన్ ఫెడరేషన్, బైలోరష్యా, బాల్టిక్ రిపబ్లిక్స్, పోలెసీ, పశ్చిమ యుక్రెయిన్ వంటి నల్లరేగడ గల ప్రాంతాల భూములలో వ్యవసాయోత్పత్తిని పెంచడం అన్నది మనం పరిష్కరించవలసిన కొత్త కర్తవ్యాలలో ఒకటి. అక్కడ మురుగునీటి పథకాలను పెద్ద మొత్తున అమలు జరపాలి. భూములు చవుడు బారకుండా అరికట్టాలి. మినరల్, ఆర్గానిక్ ఎరువులను పెద్ద మొత్తున వాడాలి. పచ్చగడ్డిని విస్తారంగా పెంచాలి. తదితర వ్యవసాయ సాంకేతిక చర్యలను అమలు జరపాలి. ఈ ప్రాంతాలలో పాలు, మాంసం, ధాన్యం, తదితర సరుకులను అదనంగా పెద్ద మొత్తాలలో వుత్పత్తి చేయాలి. గాలిలో తగినంత తేమ గల యితర ప్రాంతాల విషయంలో కూడా గట్టి శ్రద్ధ తీసుకోవాలి. ఈ ప్రాంతాలలో ఎరువులను వాడడంవల్ల, తక్కువ వ్యయంతో వుత్పత్తి కాగల కొన్ని రకాల ధాన్యాలను అదనంగా పెద్ద మొత్తాలలో పండించవచ్చు. ఈ విధంగా నీటి పారుదల సౌకర్యాలు గల భూములన్నింటిని యింతకు ముందుకంటే మరింత పెద్ద ఎత్తున, విస్తృతంగా వుపయోగించడం జరుగుతుంది.

అత్యంత సారవంతమైన మెట్టప్రాంతాలలో నీటిపారుదల సౌకర్యాల కల్పనకు పెద్ద ఎత్తున ప్రయత్నం జరపాలి. మధ్యఆసియా, ఉత్తర కాకసస్‌లోని కొంత భాగం, వోల్గాప్రాంతం, దక్షిణ యుక్రెయిన్‌లలో యిలాంటి భూములు వున్నాయి.

గాలిలో తేమ విపరీతంగా వున్న ప్రాంతాలలో మురుగునీటి పారుదల పథకాలు, మెట్టప్రాంతాలలో నీటిపారుదల సౌకర్యాల కల్పనద్వారా సాంద్ర వ్యవసాయాన్ని మనం ప్రవేశపెట్టవచ్చు. తృణ ధాన్యాలతోపాటు ప్రత్తి, సుగర్‌బీట్,

ఫ్లాక్స్, సన్‌ఫ్లవర్, కూరగాయలు, పళ్లు, ద్రాక్షపళ్ళు, పచ్చగడ్డివంటి వాటిని కూడా ఉత్పత్తిచేయవచ్చు.

పశుగణ ఉత్పత్తులను పెంచడం. వాటి నాణ్యాన్ని పెంచడం మనం నిర్వర్తించవలసినవాటిలో మరొక ముఖ్యమైన కర్తవ్యం. నిరంతరం పచ్చగడ్డి లభించే వనరులను సృష్టించడం పశుగణ ఉత్పత్తులను, మాంసం ఉత్పత్తిని, పాలు దిగుబడిని, ఉన్ని ఉత్పత్తిని, అలాగే పశుగణ సంఖ్యను, కోళ్ళ సంఖ్యను పెంచడానికి ప్రధాన సాధనం.

ఇందుకోసం తృణధాన్యపు గడ్డితోపాటు, ఆరుగాలం పెరిగే పచ్చగడ్డినికూడా పెంచాలి. పచ్చిక బయళ్ళను సక్రమంగా వినియోగించాలి. ఈ విషయంలో పెద్దయెత్తున అభివృద్ధిని సాధించడానికి అవసరమైన నిధులు ప్రణాళికలో కేటాయించబడ్డాయి. ఈ మొత్తాలను అతి జాగ్రత్తగా వినియోగించి, సాధ్యమైనంత హెచ్చు ఫలితాన్ని సాధించాలి. గడ్డిపైరులువేసే ప్రాంతాలనుకూడా మరింత లాభదాయకంగా ఉపయోగించుకోవాలి.

స్థూలంగా చెప్పాలంటే, వ్యవసాయరంగంలో ఉత్పత్తి కార్యక్రమం ఇది. ఈ కార్యక్రమాన్ని ఫలప్రదంగా పూర్తిచేయడానికి, వ్యవసాయ క్షేత్రాలకు వివిధ యంత్రాలను పెద్దఎత్తున సరఫరాచేయాలని ముసాయిదా ఆదేశాలు నిర్దేశిస్తున్నాయి.

తృణ ధాన్యాలు, సుగర్ బీట్, బంగాళాదుంపలు, ప్రత్తి, మొక్కజొన్న వుత్పత్తికి సంబంధించిన సంక్లిష్టమైన యాంత్రీకరణకు అవసరమైన అన్ని రకాల యంత్రాలను మన ట్రాక్టర్, వ్యవసాయ యంత్ర పరిశ్రమలు ప్రస్తుతం తయారుచేస్తున్నాయి. ఫ్లాక్స్, కూరగాయలు, తదితర పైరులు వేయడం, కోయడం వంటి పనులకు వుపకరించే కొత్త తరహా యంత్రాలు ఇప్పుడు తయారుచేయబడుతున్నాయి. అలాగే పశుగణాభివృద్ధి కేంద్రాలలో యాంత్రీకరణకు అవసరమైన యంత్రాలుకూడా తయారవుతున్నాయి.

ఇప్పటికే పనిచేస్తున్న యంత్ర పరిశ్రమలను రీకండిషన్ చేయాలి. కొత్త పరిశ్రమలను, ముఖ్యంగా మోటార్లు, యూనిట్లు, విడిభాగాలు తయారుచేయడంలో ప్రత్యేకతను సంతరింప చేసుకొన్న కొత్త ప్లాంట్లను నెలకొల్పాలి. వచ్చే కొలది సంవత్సరాలలోను (కజకస్తాన్‌లోని) పావ్‌లోడార్‌లో భారీ ట్రాక్టర్ కర్మాగారం నిర్మించబడుతూంది. ట్రాక్టర్ల కంబైన్ హార్వెస్టర్ల నాణ్యాన్ని పెంచడం, వేగాన్ని, హార్స్ పవర్ల రేటింగ్స్‌ను పెంచడం, ఇంధనం వినిమయాన్ని

గణనీయంగా తగ్గించడం వంటి వాటిపట్ల యంత్ర నిర్మాతలు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఆ యా ప్రాంతాలలోని వాతావరణ పరిస్థితులను దృష్టిలో వుంచుకొని, ఇతర వ్యవసాయ యంత్రాలను తయారు చేసేటప్పుడు కూడా, ఇది స్థూలంగా అవలంబించాలి.

వ్యవసాయ పనులకు, పనుగణ కేంద్రాలకు మరింత మంచిరకం యంత్రాలను, ట్రాక్టర్, వ్యవసాయ యంత్ర నిర్మాణ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులు తయారుచేయాలి. దానితోపాటు, వారు వుత్పత్తిని కూడా పెంచాలి. అలాగే, ట్రాక్టర్, వ్యవసాయ యంత్ర విడిభాగాల అవసరాలన్నింటిని తీర్చగల్గేటట్టు వారు కృషిచేయాలి.

వచ్చే అయిదేళ్ళలోను సమష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు 17,90,000 ట్రాక్టర్లు సరఫరా కాగలవు. అంటే, గత అయిదేళ్ళలో కంటే 60 శాతం అధికంగా సరఫరా కానున్నాయి. వచ్చే అయిదేళ్ళలో 11 లక్షల లారీలు, 5,50,000 గ్రెయిన్ హార్వెస్టర్లు, ఇంకా అనేక యితర యంత్రాలు, పరికరాలు సరఫరా కానున్నాయి.

1965 సంఖ్యలతో పోల్చితే, వచ్చే అయిదేళ్ళలోను వ్యవసాయంలో తలసరి కార్మికునికి విద్యుచ్ఛక్తి సౌకర్యాలు రెట్టింపు కాగలవు. వ్యవసాయ యంత్రాల మరమ్మత్తులకు అవసరమైన ఏర్పాట్లను పెంచాలి. వ్యవసాయ క్షేత్రాలకు అపార సంఖ్యలో సరఫరా అవుతున్న యంత్రాలను, యంత్ర పరికరాలను సక్రమంగా వినియోగించడానికి, వాటిని భద్రంగా వుంచడానికీ కూడా తగిన ఏర్పాట్లు చేయాలి.

రసాయనిక పరిశ్రమ ఖనిజ ఎరువుల ఉత్పత్తిని ఏటేటా పెంచుతుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు నీటి సరఫరా రెట్టింపు కాగలదు. దీనివల్ల వాణిజ్యపంటలకు అవసరమైన అన్ని ఖనిజ ఎరువులు సమకూడుతాయి. ధాన్యపు, గడ్డిపైరులకు ఇతోధిక మొత్తాలతో ఎరువులు సరఫరా చేయబడతాయి. ఎరువుల ఉత్పత్తిని పెంచడంతోపాటు, ఎరువుల నాణ్యాన్నికూడా పెంచడం, వాటిని రవాణా చేసేటప్పుడు, నిల్వచేసినప్పుడు, వాడేటప్పుడు జరిగే దుబారాను నష్టాన్ని బాగా తగ్గించడం ఎంతేని అవసరం.

కంబైన్డ్ – ఫాడర్ పరిశ్రమల వుత్పత్తి కనీసం 100 శాతం పెంచాలి. ప్రొటీన్లు హెచ్చుగా వుండే ఫీడ్స్‌ను, విటమిన్‌లను, క్రిమిసంహారక ఓషధులను, ఫీడ్ ఎడిటివ్స్‌ను పెద్ద యెత్తున వుత్పత్తి చేయాలి.

1970 నాటికి, పొలాలలో వాడకం కాగల విద్యుచ్ఛక్తి 6 కోట్లు మొదలు 6 కోట్ల 50 లక్షల కిలోవాట్స్ వరకు పెరుగుతుంది. అంటే, 1965 నాటితో పోల్చితే అది 200 శాతం అధికం. 1940 లో దేశంలో మొత్తం విద్యుచ్ఛక్తి వాడకంతో పోల్చితే, అది 30 శాతం అధికం. గ్రామీణ ప్రాంతాలలో విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలు రెట్టింపు కాగలవు. సమష్టి వ్యవసాయ క్షేత్రాలకు, ప్రభుత్వ క్షేత్రాలకు సెంట్రలైజ్‌డ్ ఎలెక్ట్రిక్ సప్లయిస్‌నుంచి, కొత్త విద్యుత్కేంద్రాల నుంచి సరఫరా అయ్యే విద్యుత్ సరఫరాలు బాగా గణనీయంగా పెంచబడుతుంది. మానవ శ్రమ విపరీతంగావున్న పనిపాటల యాంత్రీకరణకు, ముఖ్యంగా పశుగణ కేంద్రాలలో యాంత్రీకరణకు, అలాగే వ్యవసాయ క్షేత్రాలలో జీవన స్థితిగతు లను మెరుగుపర్చడానికి, విద్యుచ్ఛక్తి ప్రాతిపదికగా వుండాలి.

అన్నిరకాల విద్యుత్ పరికరాలు టెలివిజన్, రేడియో సెట్లు, రిఫ్రిజరేటర్లు, బట్టలు వుతికే యంత్రాలు మున్నగు వాటిని పెద్ద ఎత్తున వాడడంద్వారా గ్రామీణ ప్రాంతాలలో ప్రజల సాంస్కృతిక స్థాయిని, జీవన స్థితిగతులను పెంపొందించ వచ్చు.

గ్రామీణ ప్రాంతాలలో గృహ నిర్మాణం, ఇళ్ళకు గ్యాస్ సప్లయి, స్కూళ్లు, ఆసుపత్రులు, పట్టణ తరహా సినిమాహాళ్ళ నిర్మాణం గణనీయంగా పెరుగుతుంది.

వచ్చే అయిదేళ్ళలోను వ్యవసాయదారుల ఆదాయం 35 శాతం మొదలు 40శాతంవరకు పెరుగుతుంది.దీనికితోడు కొద్దిపాటిసొంతభూములలో సేద్యంవల్ల మరి కొంత రాబడికూడా వారికి వస్తుంది. సమష్టి వ్యవసాయ క్షేత్రాలలోకూడా, దాదాపు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోని పద్ధతిలోనే శ్రమను లెక్కకట్టటం, శ్రమ విభ జన, ప్రతిఫలం చెల్లింపు మున్నగునవి జరుగుతాయి. శ్రమకు ప్రతిఫలాన్ని నెలవారీ పద్ధతిపై నిశ్చితంగా చెల్లించే విధానాన్ని సమష్టి వ్యవసాయక్షేత్రా లన్నింటి లోను క్రమంగా ప్రవేశపెడతారు. పారిశ్రామిక శ్రామికులకు చెల్లిస్తున్న పద్ధతిలోనే ఇంచుమించుగా సమష్టి వ్యవసాయదారులకుకూడా పింఛన్లు చెల్లిస్తారు.

పట్టణ, గ్రామీణ ప్రాంతాలలోని జీవన ప్రమాణాలలో గల వ్యత్యాసాలను తగ్గించడం చారిత్రాత్మకమైన కర్తవ్యపాలనలో భాగంగా గ్రామాలలోని పని, జీవన స్థితిగతులను మెరుగుపర్చడం, సమష్టి వ్యవసాయ క్షేత్రాలలో పని చేస్తున్న వ్యవసాయదారుల ఆదాయాలను పెంచడం జరగాలి.

ఈ విధంగా వ్యవసాయాభివృద్ధి కార్యక్రమం క్రింద వ్యవసాయోత్పత్తి

అధికంగాను, నికరంగా జరుగుతుంటుంది. ఈ కార్యక్రమం పూర్తిగా ఆచరణ సాధ్యమైనది. వాస్తవిక దృష్టితో రూపొందించబడినది. ఈ కార్యక్రమం అమలు జరపడానికి అవసరమైన యంత్రాలు, రసాయనిక ఎరువులు, విద్యుచ్ఛక్తి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు పెద్దఎత్తున సరఫరా చేయబడతాయి. గ్రామీణ జీవన ప్రమాణాలను పెంచడానికి, గ్రామీణప్రాంతాలలో సాంస్కృతిక. నిత్యజీవితావసర సౌకర్యాలను ఇతోధికంగా సమకూర్చడానికి, పార్టీ, ప్రభుత్వమూ విస్తృతమైన చర్యలు అమలు జరుపుతున్నాయి. దీనివల్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వ్యవసాయదారులు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల లోని కార్మికులు శ్రమోత్పాదక స్తోమతులు పెంచడంలో ఇతోధికమైన పాదార్థిక ప్రయోజనాలు కలిగివుంటారు కనుక, ఈ కార్యక్రమం జయప్రదంగా పూర్తికాగల దని చెప్పవచ్చు. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో శ్రమోత్పాదక స్తోమతను 40 శాతం మొదలు 45 శాతం వరకూ పెంచాలని తల పెట్టింది. వచ్చే అయిదేళ్ళలోను సాధించవలసిన ప్రధాన కర్తవ్యాలలో ఇదొకటి. ఈ కర్తవ్య నిర్వహణకు పైన పేర్కొన్న చర్యలు అత్యంత అనుకూలమయిన పరిస్థితులను కల్పించగలవు.

వ్యవసాయరంగంలో తలపెట్టిన చర్యలకు ఎంతో మొత్తం ఖర్చు అవుతుంది. ఇందుకు అవసరమైన మొత్తాలు ప్రణాళికలో కేటాయించబడ్డాయి. ఇందుకు 4100 కోట్ల రూబుళ్ళు కేటాయించాం. గత అయిదేళ్ళతో పోల్చితే, వచ్చే అయిదేళ్ళలో ఇందుకు ఖర్చుచేసే మొత్తం ఇంచుమించు రెట్టింపుగావుంటుంది. ఉత్పత్తి సౌకర్యాల కల్పనకు, (భూములను అభివృద్ధిచేయడంతో సహా) అవసరమైన మొత్తం, ప్రభుత్వం యంత్రాలకు చెల్లించే మొత్తం ఇందులో కలిసివున్నాయి.

వ్యవసాయరంగంలో ఉత్పత్తిని పెంచే కార్యక్రమానికి ప్రభుత్వం పెద్ద మొత్తాలను పెట్టుబడులుగా పెట్టవలసివుంటుందన్న విషయం గుర్తుంచుకోవాలి. ఉదాహరణకు వ్యవసాయ యంత్ర నిర్మాణ పరిశ్రమలు, రసాయనిక పరిశ్రమలు (ఎరువుల ఉత్పత్తిని పెంచడానికి) విద్యుచ్ఛక్తి, వ్యవసాయావసరాలను తీర్చే అంతర శాఖలకు పెద్దమొత్తాల పెట్టుబడులు తప్పవు.

ప్రభుత్వం పెట్టే యంత్ర నిర్మాణ పెట్టుబడులకు తోడుగా, ప్రభుత్వ, సమష్టి వ్యవసాయ క్షేత్రాలు తమ ఆర్థిక విధానాన్ని విస్తరింప చేసుకొనడానికి, ప్రాథమిక అంచనాల ప్రకారం, ఇంచుమించు 3 వేల కోట్ల రూబుళ్ళకు పెట్టుబడి పెట్టబోతున్నాయి.

వచ్చే అయిదేళ్ళలోను సమష్టి వ్యవసాయ క్షేత్రాల సాలీనా సగటు ఆదాయాలు, 1961–65 మధ్య కాలంలోని సగటు ఆదాయాలతో పోల్చితే, 40 శాతం అధికం కాగలవు. సమష్టి వ్యవసాయ క్షేత్రాలలో మొత్తం ఉత్పత్తి పెరగడంతో పాటు, సమష్టి వ్యవసాయ క్షేత్రాలలో ఉత్పత్తిఅయ్యే సరుకుల కొనుగోలుకు రూపొందించిన కొత్త నిబంధనలక్రింద హెచ్చు ధరలవల్ల అధిక ఆదాయం రావడం, అదే సమయంలో సమష్టి వ్యవసాయ క్షేత్రాలకు సరఫరాచేసే సరుకుల ధరలను తగ్గించడం, మార్చి నెలలో జరిగిన ప్లీనరీ సమావేశం నిర్ణయించిన ప్రకారం సమష్టి వ్యవసాయ క్షేత్రాలపై ఆదాయపు పన్నును సగానికి సగం తగ్గించడంవల్ల యిది సాధ్యమవుతుంది.

సమష్టి వ్యవసాయ క్షేత్రాల రాబడులు పెరగడంవల్ల, ఆ యా వ్యవసాయ క్షేత్రాలలో సాధించే మొత్తం ఆర్థిక కమతాలనుబట్టి, ప్రతి వ్యవసాయ దారుని ఆదాయం పెరుగుతుంది. సమష్టి వ్యవసాయ క్షేత్రాలను, ఆ క్షేత్రాలలోని ప్రతి శాఖను సాధ్యమైనంత ఎక్కువ లాభసాటిగా చేయడంలో సమష్టి వ్యవసాయ దారులకు యిది ప్రోత్సాహక అంశంగా వుంయింది. ఒక సోషలిస్టు వ్యవసాయక రూపంగా సమష్టి వ్యవసాయ క్షేత్రం ఆర్థిక పునాదిని పటిష్ఠవంతం చేయడానికి ఇది తోడ్పడుతూంది.

మొత్తం వ్యవసాయోత్పత్తిలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పాలు వాలా హెచ్చుగావుంది. కనుక వాటి సామర్థ్యాన్ని పెంపొందించడం అన్నది ఇప్పటి అతి ప్రధాన కర్తవ్యాలలో ఒకటి. దీనిని దృష్టిలో వుంచుకొని, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో కొత్త ప్లానింగ్ పద్ధతిని ప్రవేశపెట్టడానికి, ఆ క్షేత్రాలు పూర్తిగా స్వయంపోషక పద్ధతిపై పనిచేయడానికి అవసరమైన చర్యలు ఇప్పుడు రూపొందించబడుతున్నవి. ఈ చర్యలు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల ఆర్థిక పరిస్థితిని పటిష్ఠవంతం చేయగలవు. ప్రత్యేకతా సాధనకు, ఉత్పత్తి వ్యయం తగ్గింపునకు ఇవి దారితీస్తాయి. వీటిని ఆదర్శప్రాయమైన వ్యవసాయ క్షేత్రాలుగా రూపొందించడానికి ఈ చర్యలు తోడ్పడతాయి.

వచ్చే అయిదేళ్ళలోను కొనుగోలు, వాణిజ్య సంస్థల, పాదార్థిక, సాంకేతిక పునాదులు పటిష్ఠవంత మొనర్చబడతాయి. సమష్టి వ్యవసాయ క్షేత్రాలకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు, కొనుగోలు సంస్థలకు రవాణా వాహనాలు అదనంగా అందచేయబడతాయి. సమష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు, పారిశ్రామిక సంస్థలు, షాపులకు మధ్య ప్రత్యక్ష సంబంధాలు నెలకొల్పే

పద్ధతి విస్తరింపచేయబడుతుంది. ఈ పద్ధతివల్ల కూరగాయలు, పళ్ళు, పుచ్చకాయలు, త్వరగా చెడిపోగల తదితర సరుకులను వాడకం దారుల ప్రాంతాలకు ఎలాంటి నష్టం లేకుండా త్వరగా సరఫరా చేయవచ్చు. ప్రజలకు తాజా వ్యవసాయ సరుకుల సరఫరా మెరుగుకాగలదు. సేకరణ వ్యయం తగ్గుతుంది. సమష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకు అదనంగా గణనీయమైన ఆదాయం లభించగలదు.

వ్యవసాయపు పనులు కొన్నికొన్ని తరుణములలోమాత్రమే జరగడంవల్ల, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలోను, సమష్టి వ్యవసాయక్షేత్రాలలోనుగల అంగబలం సంవత్సరం పొడుగునా పూర్తిగా ఉపయోగించబడడంలేదు. అందుచేత, వ్యవసాయ పుత్పత్తులను ప్రాథమికంగాను, అటుపిమ్మటకూడా బాగుచేసే ఉపాంగ పరిశ్రమలను, ఇతర సరుకులు, పుత్పత్తిచేసే పరిశ్రమలను, వ్యవసాయ క్షేత్రాలలోని స్థానిక వాతావరణ పరిస్థితులకు అనువైన వివిధ పరిశ్రమలను అభివృద్ధి చేయాలన్నది ఆర్థిక సంబంధమైన ఇంగిత జ్ఞానమని వేరే చెప్పనవసరంలేదు. ఇవి సమష్టి వ్యవసాయ క్షేత్రాలకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు, గ్రామీణ ప్రజానీకానికి అదనపు ఆదాయాలను సమకూర్చగలవు.

ముడిసరుకులు, అంగబలం లభించే వ్యవసాయ క్షేత్రాలలో అనేక ఆహార పరిశ్రమలను నిర్మించాలి. తేలిక పరిశ్రమలు, ఆహార పరిశ్రమలు కొన్ని తరుణాలలో పనిచేసే ప్రాతిపదికపై తమ శాఖలను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను స్థాపించడం మంచిది.

వ్యవసాయ రంగానికి బృహత్తర కార్యక్రమం రూపొందించబడింది. దానిని పూర్తిగా జయప్రదం చేయడానికి అవసరమైన పరిస్థితులు కల్పించబడినవి. ఈ అవకాశాలను పూర్తిగా సద్వినియోగం చేయడం, వ్యవసాయ రంగంలో, పెట్టుబడి పెట్టే ప్రతి రూబుల్ పైన పూర్తి ప్రతిఫలాన్ని సాధించడం ఇప్పటి కర్తవ్యం.

పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరంలో పైపైల సేద్యంలోను వ్యవసాయోత్పత్తికి సంబంధించిన ఇతర శాఖలలోను నిర్ణయాత్మకమైన మలుపు కొనిడానికి సమిష్టి వ్యవసాయదారుల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో, కార్మికులు యంత్రాల నిర్వాహకులు, వ్యవసాయ నిపుణులు అందరూ కృషి చేయాలనిపార్టీ ఆదేశిస్తున్నది. వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాల సాధనకు ఇది సుస్థిరమైన పునాది ఏర్పరచగలదు.

## ౫. రవాణా, కమ్యూనికేషన్లు

కామ్రేడ్స్,

పరిశ్రమలు, వ్యవసాయ రంగాలలో కృషి ఫలప్రదం కావడంగాని, దేశ రక్షణలు పటిష్ఠవంతం కావడంగాని చాలావరకు రవాణా వ్యవస్థపైన ఆధారపడి వుంటుంది. రైళ్ళు, నావలు, బస్సులు, విమానాలను సక్రమంగా, ప్లాను ప్రకారం నడపడం కోటానుకోట్ల ప్రజలకు సంబంధించిన ముఖ్య విషయం.

రవాణాలో 70 శాతానికి పైగా రైళ్ళద్వారానే జరుగుతున్నది. అవి ఉద్యోగుల సంఖ్యను పెంచకుండానే, రవాణాచేసే సరుకుల పరిమాణాన్ని ఇతోధికం చేస్తున్నాయి. కొత్త సాంకేతిక నైపుణ్యాన్ని ప్రవేశపెట్టి, దాని ప్రాతిపదికపై శ్రమోత్పాదక స్తోమతను పెంచడంద్వారా అవి ఈ విజయాన్ని సాధించాయి. రైల్వేలద్వారా రవాణా అవుతున్న సరుకులలో 85 శాతం విద్యుచ్ఛక్తి, డీజిల్ రైళ్ళ ద్వారానే జరుగుతున్నది. విద్యుచ్ఛక్తి, డీజిల్ రైళ్ళ సంఖ్యను పెంచడం వల్ల, రైల్వేలలో పెద్ద మార్పు వచ్చింది. వాటి ఆర్థిక నిర్వహణ మెరుగు అయింది. రైల్వే కార్మికుల పని స్థితి గతులు అభివృద్ధి చెందాయి.

రైల్వేలలో యంత్రనిర్మాణ పెట్టుబడులకు ముసాయిదా ఆదేశాలలో గణనీయమైన మొత్తాలు కేటాయించాలని నిర్దేశించబడింది. 1970 నాటికి విద్యుచ్ఛక్తి, డీజిల్ రైళ్ళను ప్రవేశపెట్టే కార్యక్రమం దాదాపు పూర్తి కాగలదు. శక్తివంతమైన రైళ్ళ ఇంజనర్లతోను, ఆధునికమైన భారీ వాగన్లతోను రైల్వేల రోలింగ్‌స్టాక్‌లు పెర్చబడతాయి. అనేక రైలు మార్గాల రవాణా స్తోమతను విస్తరింప చేయడానికి చర్యలు తీసుకొనబడతాయి. జంటమార్గాలు వేయడం, స్టేషన్లను విస్తరింప చేయడం ఆటోమేటిక్ డివైసలను నెలకొల్పడం జరుగుతుంది. టస్‌గార్డ్ నుంచి మకాతకు, గుర్యేవ్ నుంచి అస్త్రఖాన్‌కు మొత్తం 1600 కిలో మీటర్ల కొత్త రైల్వే మార్గాలు నిర్మించబడతాయి. మధ్య ఆసియా నుంచి ఈ నాడు మన దేశంలోని యూరోపియన్ ప్రాంతానికి కొత్త మార్గం ఏర్పరించడంతో మంగిష్లాక్ ద్వీపకల్పంలో అపారంగాగల నూనె గనులను త్వరగా అభివృద్ధి చేయవీలవుతుంది.

త్యుమెన్ నుంచి తొబొల్స్క్‌కు, సూర్గుత్ ప్రాంతానికి, 650 కిలోమీటర్ల

కొత్త రైలుమార్గం నిర్మించబడుతుంది. త్యుమెన్ ప్రాంతంలోని నూనె పరిశ్రమ అభివృద్ధికి, మొత్తం ఆ ప్రాంతం అభివృద్ధికి ఇదెంతో ముఖ్యం.

బర్నాల్ నుంచి కుస్తనామ్ వరకు మిడ్-సైబీరియాలో రైల్వే నిర్మాణం పూర్తి చేయబడుతుంది. దీనివల్ల కుజ్నాస్కు, యూరల్స్కు మధ్య రవాణాసౌకర్యాలు అభివృద్ధి చెందుతాయి. మెయిన్-సైబీరియన్ ట్రంక్ లైన్పై రవాణా రద్దీ దీనివల్ల తగ్గిపోతుంది.

రైల్వేలలో గుప్తమైవున్న అపార నిధులను పూర్తిగా వినియోగించడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఉదాహరణకు పారిశ్రామిక సంస్థలవద్ద, సముద్ర, నదీ, రేవులవద్ద వాగన్లు నిలిచివుండే అనవసరకాలాన్ని తగ్గించాలి. లోడింగ్, అన్లోడింగ్ పనులను యాంత్రీకరించడంద్వారా వృథా అవుతున్న ఈ కాలాన్ని చాలావరకు తగ్గించవచ్చు. సెల్ఫ్ - అన్లోడింగ్ లోడింగ్స్ స్టాక్ను ప్రవేశపెట్టడం, కంటెయినర్స్ సిస్టమ్ను మెరుగుపర్చడం, ఫ్యాక్టరీలవద్ద రైల్వే సైడింగ్స్లో పరిస్థితిని మెరుగుపర్చడం ఇందుకు దోహదకరం కాగలవు. ఆర్థిక దృష్ట్యా చూస్తే, ఇదే ఎంతో ఎక్కువ ప్రాధాన్యంగల సమస్య కూడా. ఎందుకంటే, మొత్తం రవాణా వ్యయంలో సుమారు మూడోవంతు లోడింగ్కు, అన్లోడింగ్కు అవుతున్నది.

హేతురహితమైన రీతిలో సరుకులను రైల్వేలకు ఎక్కించే పద్ధతికి స్వస్తి చెప్పితే, ఎంతో లాభం చేకూరుతుంది. ప్లానింగ్, ఆర్థిక సంస్థలు సప్లయిదారులకు వాడకందారులకు మధ్య రవాణా సౌకర్యాలను సాధ్యమైనంత ఎక్కువ చేయాలి. సంవత్సరం పొడుగునా ఒకే రీతిలో సరుకుల రవాణా జరిగే అవకాశాన్ని కల్పించాలి. రైలు, జల, రోడ్డు, ఇతర రవాణా మార్గాలు వినియోగాన్ని సక్రమంగా సమన్వయపర్చాలి.

విభిన్న రవాణామార్గాలలో సరుకుల రవాణా తగిన విధంగా పంపిణీ కావడానికి ఆర్థిక ప్రోత్సాహం కల్గించేరీతిలో రవాణా రేట్లను పునర్నిర్ణయం చేయాలి. రవాణా సౌకర్యాల అవకాశాలను పూర్తిగా వినియోగించాలి.

ఇటీవల కాలంలో సోవియట్ వాణిజ్య నౌకాదళానికి అనేకఆధునిక భారీనౌకలు సమకూర్చబడినవి. గడచిన ఏడేళ్ళలోను వాటి సరుకుల రవాణా స్తోమత 150 శాతం అధికమైంది. పెట్టుబడిదారీ ఫ్రీట్ మార్కెట్టు నుంచి మన విదేశీ వాణిజ్యం స్వేచ్ఛను మన వాణిజ్య నౌకాదళం కాపాడుతున్నది.

విదేశీ వాణిజ్యం పెంపుదలవల్లను, కోస్టవ్‌షిప్‌మెంట్స్ పెరగడం వల్లను వాణిజ్య నౌకాదళం టన్నేజిని మరింత విస్తరింప చేయవలసిన అవసరం ఏర్పడుతున్నది. వేగంగా ప్రయాణం చేయగలిగిన భారీ నౌకలను నిర్మించాలని, సరుకుల ఎగుమతి, దిగుమతుల యాంత్రీకరణ జరగాలని ముసాయిదా ఆదేశాలు నిర్దేశిస్తున్నవి. రేవులను అభివృద్ధి చేయడం, యాంత్రీకరించడం, నౌకల మరమ్మతుల యార్డుల నిర్మాణం గణనీయంగా జరగాలని అవి నిర్దేశిస్తున్నవి.

దేశంలోపల జలమార్గాల అభివృద్ధికి నౌకల సంఖ్యను పెంచాలని, రేవులలో సౌకర్యాలను విస్తరింప చేయాలని నిర్ణయించబడింది. సైబీరియా, దూర ప్రాచ్య ప్రాంతాల్లో కొత్త పారిశ్రామిక కేంద్రాలను త్వరగా ప్రారంభించడానికి ఇవెంతగానో తోడ్పడగలవు. ఓల్గా, కామా, నీపర్ నదులపై నౌకా రవాణాను విస్తరింప చేయడంవల్లను, బాల్టిక్, కాస్పియన్, నల్ల సముద్రాల మధ్య సరాసరి రవాణా మార్గాలను ప్రారంభించడంవల్లను, దేశంలోని యూరపియన్ ప్రాంతంలో రైల్వేలపై రవాణారద్దీ ఎంతో తగ్గిపోవడమేకాక, పెద్దమొత్తాలలో సరుకుల రవాణా ఛార్జీలు చౌక కాగలవు. ఈ విషయంలో రైల్వేమెన్, రివర్‌మెన్ మధ్య ఖచ్చితమైన సమన్వయకృషి ఎంతేని అవసరం. సరుకుల ఉమ్మడి రవాణాను విస్తరింప చేయడం, రేవులలో రీ లోడింగ్ సౌకర్యాలను పెంచడం ఎంతో అవసరం.

పైప్ లైన్ రవాణా గణనీయంగా అభివృద్ధి చెందింది. దీనిద్వారా రవాణా అవుతున్న సరుకుల పరిమాణం గత ఏడేళ్ళలోను 300 శాతం పెరిగింది. ఆయిల్‌ను రైళ్ళద్వారా రవాణా చేయడానికి బదులు, పైప్‌లైన్‌ద్వారా రవాణాచేస్తున్నందున ఖర్చులలో 50 మొదలు 67 శాతం వరకు కలిసి వస్తున్నది. మన దేశంలో అనేక పెద్ద పైప్‌లైన్లు నిర్మించబడినవి. ఉదాహరణకు త్యుమజీఓమ్‌స్క్—క్రాస్నోయారస్క్ – ఇర్‌కొటెస్క్ పైప్‌లైన్ పొడవు 3600 కిలోమీటర్లు. టాటార్ అటానొమొస్ రిపబ్లిక్ నుంచి పోలెండ్, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, చెకొస్లావియా మీదుగా హంగెరీకి వేసిన 'మైత్రీ' (ద్రుజ్బా) పైప్‌లైన్ పొడవు 4500 కిలో మీటర్లు. అర్మిత్యవ్‌స్క్ – గోర్కీ – ర్యెజాన్ – ల్యుబర్ట్స్కీ పైప్‌లైన్ 1500 కిలోమీటర్ల పొడవు కలిగి వున్నది.

ఇప్పటి పంచవర్ష ప్రణాళికా కాలంలో, మొత్తం 37 వేల కిలోమీటర్ల పొడవుగల ఆయిల్, గ్యాస్ పైప్‌లైన్ల నిర్మాణం జరుగుతుంది. దీనివల్ల 1970 నాటికి దూరప్రాంతాలకు రవాణా అయ్యే ఆయిల్‌లో సగానికిపైగా పైప్‌లైన్లద్వారా

రవాణా అవుతుంది. బొగ్గు, తదితర ఇంధనాల వాడకానికి బదులు గ్యాస్ వాడకం గణనీయంగా పెరుగుతుంది.

రైల్వేలు, వంతెనలు, పైప్‌లైన్ల నిర్మాణానికి మనం ప్రత్యేక నైపుణ్యం కలిగిన పెద్ద పెద్ద సంస్థలను ఏర్పాటు చేశాం. సాంకేతికంగా మేలురకానికి చెందిన యంత్ర పరికరాలు ఆ సంస్థలవద్ద వున్నాయి. అత్యంత సమర్థవంతమైన నిపుణులు ఆ సంస్థలలో పని చేస్తున్నారు. మన దేశంలో వెనుకబడివున్న ప్రాంతాలలో క్లిష్టమైన పరిస్థితులలో వారు సంక్లిష్టమైన నిర్మాణ బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు. నిజంగా వీరు చేస్తున్నది భగీరథ ప్రయత్నం వంటిది. వీరి కృషిని మన ప్రజలు హృదయపూర్వకంగా ప్రశంసిస్తున్నారు. ఇప్పటి పంచవర్ష ప్రణాళిక ఈ నిర్మాతలపై వుంచుతున్న పృథుతర బాధ్యతలను జయప్రదంగా నిర్వర్తించగలరన్న విశ్వాసం మనకు వున్నది.

మోటారు వాహనాల ఉత్పత్తిని చాలా పెద్ద సంఖ్యలో పెంచాలని ముసాయిదా ఆదేశాలు నిర్దేశిస్తున్నవి. సాధారణమైన ఆటోమోబైల్స్‌తో పాటు, అనేక ప్రత్యేక వాహనాలుకూడా ఉత్పత్తి చేయాలని అవి ఆదేశిస్తున్నవి. లారీల రవాణా పెంచబడుతుంది. ప్రజల అవసరాలు పెరుగుతున్న దృష్ట్యా, ఆధునిక బస్సులు, మోటారుకారుల ఉత్పత్తిని గణనీయంగా పెంచబోతున్నాము.

గడచిన ఏడేళ్ళలోను మోటారు ట్రాన్స్‌పోర్టు సంస్థలను విస్తరింపచేయడంలోను, వాటికి అవసరమైన సాంకేతికసౌకర్యాలను సమకూర్చడంలోను కేంద్రీకృత సరుకుల రవాణాను ఏర్పాటు చేయడంలోను చాలా కృషి జరిగింది. ఈనాడు లారీలు ప్రయాణంచేసే మొత్తం దూరంలో దాదాపు సగం దూరం ఖాళీగా తిరుగుతున్నాయి. అలాగే లోడింగ్, అన్ లోడింగ్‌లలో జరుగుచున్న జాప్యంవల్ల, అవి వృధాగా పడివుంటున్న కాలం ఎక్కువగానే వున్నది. కొత్త ప్లానింగు పద్ధతిని, ఆర్థిక ప్రోత్సాహాలను కల్పించేపద్ధతి ప్రవేశపెట్టిన మోటారు ట్రాన్స్‌పోర్టు సంస్థల అనుభవాన్ని పరిశీలిస్తే లారీలు వృధాగా పడివుండేకాలాన్ని, ఖాళీగా తిరిగే దూరాన్ని చాలా తగ్గించవచ్చునని కళ్లకు కట్టినట్టు రుజువవుతున్నది.

మరమ్మతులకోసం అనేక మోటారువాహనాలు రోజులుతరబడి మూలపడి వుంటున్నాయి. ఈ వృధాకాలాన్ని బాగా తగ్గించగలగాలంటే, మరమ్మతుల నిర్మాణాన్ని, సాంకేతిక స్థాయిని పెంచడం అవసరం. మరమ్మతులు కర్మాగారాలకు, మోటారు ట్రాన్స్‌పోర్టు సంస్థలకు తగినన్ని విడిభాగాలను సరఫరా చేయాలి. వాటి

నాణ్యాన్ని పెంచాలి. తగినన్ని పైరులను సమకూర్చాలి. దీనినిగురించి సోవియట్ యూనియన్ స్టేట్ ప్లానింగ్ కమిటీ, ఆటోమోబైల్ పరిశ్రమల మంత్రిత్వ శాఖ, యూనియన్ రిపబ్లిక్‌ల మంత్రి మండలులు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి.

వచ్చే అయిదేళ్ళలోను 63 వేల కిలోమీటర్ల పొడవు గల గట్టి ఉపరితలపు మోటారు రోడ్లు నిర్మించబడతాయి. స్థానిక రెవెన్యూ వనరులను, పారిశ్రామిక సంస్థలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నిధులను కేటాయించడంద్వారా ఈ విషయంలో యింకా చాలా సాధించవచ్చు.

గత ఏడేళ్ళలోను దేశ వైమానిక రవాణా పూర్తిగా పునర్నిర్మించ బడింది. ఆధునికమైన, మహావేగాన ప్రయాణం చేయగలిగిన భారీ విమానాలు యిప్పుడు వాడకంలోకి వచ్చాయి. దేశంలో దూరప్రాంతాలకు ప్రయాణం చేస్తున్న వారు గణనీయ సంఖ్యలో సోవియట్ పౌర విమానయాన సంస్థద్వారా ప్రయాణ సౌకర్యాలను పొందుతున్నారు. ఈ సంస్థ రెగ్యులర్‌గా 38 దేశాలకు ఈ పౌర విమానాలను నడుపుతున్నది. ఈ పంచవర్ష ప్రణాళికా కాలంలో విమానయాన పరిమాణం షుమారు 80 శాతం పెరుగుతుంది. దీనికోసం ఇప్పుడున్న విమానాలకు తోడు, ఆధునికమైన మరికొన్నింటిని సమకూర్చాలి. కొత్త విమానాశ్రమాలను నిర్మించాలి. పౌర విమానయాన శాఖ ఉద్యోగులు ముందు ముందు సాధించవలసినది చాలా వుంది. ప్రయాణీకులకు సౌకర్యాలను పెంచడంలోను, విమాన రవాణాల స్తోమతను విస్తరింప చేయడంలోను వారు చేయువలసింది ఎంతో వుంది.

రవాణా శాఖలలోని కార్మికులు నిర్వర్తించవలసిన బాధ్యతలు చాలా పెద్దవి. రవాణా వ్యవస్థలోని అన్నిశాఖలు ఖచ్చితమైన సమన్వయకృషిని సాగించడంపైన ప్రణాళికా విజయం చాలవరకు ఆధారపడి వుంటుంది. రవాణా సౌకర్యాలను మరింత బాగా వినియోగించడం రవాణా వ్యయాన్ని తగ్గించడంవల్ల సామాజికోత్పాదక సామర్థ్యం ఎంతో పెరుగుతుంది మన ఆర్థిక విధానం మరింత అభివృద్ధి చెందడానికి వారు చేసే కార్యక్రమాన్ని సంపూర్తిచేయడంతో తమ వంతు కర్తవ్యాన్ని రవాణా కార్మికులు పూర్తిచేస్తారనడంలో సందేహం లేదు.

ప్రజల సౌకర్యార్థం వివిధ రకాల కమ్యూనికేషన్ సర్వీసులను మెరుగు పర్చడానికి ముసాయిదా ఆదేశాలు అనేక చర్యలను సూచించాయి. మల్టీ-చానెల్ కేబుల్స్, రేడియో రిలే వైర్లు నిర్మించాలని అవి నిర్దేశిస్తున్నాయి. నమ్మకమయిన టెలిఫోన్ సర్వీస్‌ను ఏర్పాటు చేయడానికి, వివిధరకాల సమాచారాన్ని ప్రసారం

చేయడానికి సింగిల్ ఆటోమేటిక్ నెట్‌వర్క్‌ను అభివృద్ధిచేయనున్నాము. ఇళ్లలోని, టెలిఫోన్ల సంఖ్య ఇంచుమించు రెట్టింపు కాగలవు. సైబీరియా మూర్ర్ప్రాచ్యం మధ్య ఆసియా ప్రాంతాలలోని మారుమూల ప్రాంతాలకు ప్రసారాలు చేరడానికి వీలుగా శక్తివంతమయిన రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్‌లను నిర్మించనున్నాము. టెలివిజన్ స్టేషన్ల నెట్‌వర్క్‌ను గణనీయంగా విస్తరింపచేస్తాం. దీనివల్ల టెలివిజన్ కార్యక్రమాలను దాదాపు దేశంలోని అన్నిప్రాంతాలకు ప్రసారంచేయ వీలవుతుంది. మారుమూల నున్న మగదాన్స్క్ ప్రాంతం, కామ్‌చట్కా, సఖాలిన్, యాకుతియా తదితర మారుమూల ప్రదేశాలకు కేంద్ర టెలివిజన్ స్టుడియోల కార్యక్రమాలను కమ్యూనికేషన్ ఉపగ్రహాలు రిలే చేస్తుంటాయి.

ఆర్థిక విధానం, సంస్కృతి త్వరితంగా అభివృద్ధి చెందుతున్నందునను, ప్రజల అవసరాలు పెరుగుతున్నందునను, అన్ని కమ్యూనికేషన్ల కృషిని త్వరితంగా అభివృద్ధి చేయవలసిన అగత్యం ఏర్పడుతున్నది. ఈ విషయంలో శాస్త్రీయ సాంకేతికాభ్యుదయంవల్ల చేకూరుతున్న అవకాశా లన్నిటిని కమ్యూనికేషన్ శాఖలో పనిచేస్తున్న కార్మికులు పూర్తిగా వినియోగించుకోవాలి.

## 6. యంత్ర నిర్మాణ పరిశ్రమలు

కామ్రేడ్స్, నూతన పంచవర్ష ప్రణాళికలో పొందు పరచబడిన పెట్టుబడి వ్యయాల ప్రమాణాల మూలంగా నిర్మాణంలో వనరులను అత్యంత సమర్థవంతంగా వినియోగించడం మిక్కిలి ప్రధానమైన అంశం.

గత ఏడుసంవత్సరాల్లో యంత్ర పరిశ్రమల నిర్మాణాన్ని అభివృద్ధి పరచ డానికిఎంతో కృషి జరిగింది. వాటి నిర్మాణంలో పాల్గొన్నవారు, విధానాలను యంత్రాలుగా సమకూర్చే కార్మికులు సాధించిన విజయాలు అందరికీ తెలిసినవే. ఇంకా పూర్తి చెయ్యవలసిన కర్తవ్యాలపైన, ప్రణాళికలను రూపొందించడం, నమూనాలు తయారు చెయ్యడం, పనిని వ్యవస్థీకరించడంలో జరిగిన లోపాలపైన, ఆ లోపాలను తొలగించుకోడం ఎలా అనే అంశంపైన మనం యిప్పుడు కేంద్రీక రించి పనిచెయ్యాలి.

అధిక సంఖ్యాక ప్రాజెక్టులలో పెట్టుబడి, వ్యయాల పంపకం యింతవరకు అత్యంత తీవ్రమైన లోపంగా నిలిచి పోయింది.

తత్ఫలితంగా నిర్మాణం ప్రారంభించ వలసిన అనేక నిర్మాణ ప్రాజెక్టులకు

ఆర్థిక, పాదార్థిక వనరులు సమకూర్చ బడలేదు. సాంకేతిక పత్రాలు లేకపోవడం, ఉన్నా నాసిరకమైనవి కావడంవల్ల అనేక వాటి నిర్మాణం అడ్డిపోయింది. నిర్మాణ స్థలాలకు సర్వ సమగ్రమైన యంత్ర పరికరాల సరఫరా సంతృప్తికరంగా లేదు.

నమూనాలు తయారు చేసేసంస్థలు కొన్నిసందర్భాల్లో నాసిరకం నమూనాలు తయారు చేశాయి. ప్రాజెక్టుల వ్యయాన్ని అంచనా వేయడంలో ఘోరమైన తప్పులు చేశారు. అనేక ప్రాజెక్టుల విషయంలోను, ప్రత్యేకించి విద్యుచ్ఛక్తిస్టేషన్ల విషయంలోను తగిన ఆధారాలుగాని, లెక్కలుగాని లేకుండా అంచనా వ్యయం నిర్ణయించారు. ఫలితంగా అట్టిప్రాజెక్టుల నిర్మాణాన్ని పూర్తిచేయడానికి చాలా ఎక్కువగా ఖర్చు అయింది. పెద్దఅదనపు వ్యయాలు అవసరమయ్యాయి. నిర్మాణంలో వున్న కొన్నిపరిశ్రమల విషయంలో, ప్రత్యేకించి రసాయనిక, కాగితపుగుజ్జు, కాగితం పరిశ్రమల నిర్మాణం విషయంలో రూపొందించ బడిన ఫ్యాక్టరీనమూనాలు, అవలంబించ బడిన ఉత్పత్తి విధానాలు ముందుగా సమగ్రంగా పరిశీలింపబడలేదు. అందుకు ఉపయోగించిన యంత్రపరికరాలు పాతబడి పోయినవి. అందువల్ల ఆ పరిశ్రమల నిర్మాణం నమూనా మేరకు ఉత్పత్తి సాధించడం ఆలస్యమైపోయింది. కొత్త ఫ్యాక్టరీలలో పెట్టుబడికి, ఉత్పత్తికి మధ్య వుండవలసిన నిష్పత్తి పడిపోయింది.

పరిశ్రమల నిర్మాణ కృషిని వ్యవస్థీకరించడంలో కూడా గణనీయమైన లోపాలు జరిగాయి: కార్మికుల ఉత్పాదిక శక్తి యింకా తక్కువగా వుంది. యంత్రాలను, యాంత్రిక ప్రక్రియలను ఉపయోగించడం అసంతృప్తి కరంగావుంది. పనికాలం నష్టాలు చాలా ఎక్కువగా వున్నాయి.

ప్రణాళిక బాధ్యతలు వప్పగించ బడిన సంస్థలు, పరిశ్రమ నిర్మాణాన్ని క్రమబద్ధమొనర్చే సంస్థలు తమ విధులను నిర్వహించ లేదని చెప్పవలసి వుంది.

వచ్చే ఐదుసంవత్సరాల్లో పరిశ్రమల నిర్మాణానికి సంబంధించిన కర్తవ్యాలు బ్రహ్మాండంగా విస్తృత మొనర్చ బడ్డాయి. 1966-70 సంవత్సరాలకు సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థలో పరిశ్రమల నిర్మాణానికి 3,10,000 మిలియన్ల రూబుళ్లు కేటాయించ బడ్డాయి. గత ఐదుసంవత్సరాల్లోను వ్యయపరచినదానికంటె 47శాతం డబ్బు అధికంగా వ్యయపరచ బడుతుంది. గత ఐదు సంవత్సరాల్లోను వచ్చిన ఆదాయంతో పోల్చిచూచినప్పుడు, పై విధంగా పరిశ్రమలను నిర్మిస్తే, 50శాతం ఆదాయం పెరుగు తుంది.

ఆర్థిక వ్యవస్థలో సాంకేతికాభివృద్ధికి, జీవన ప్రమాణాల పెరుగుదలకు నిర్ణాయాత్మకమైన పాత్రవహించే పరిశ్రమల్లో పెట్టుబడి వ్యయాలు గణనీయంగా గడచిన ఐదు సంవత్సరాలలోను పోల్చి చూచినప్పుడు రసాయనిక పరిశ్రమ కేటాయింపులు 100 శాతం అధికంగా వుంటాయి. ఇనుము, ఉక్కు పరిశ్రమకు సుమారు 70 శాతం, విద్యుచ్ఛక్తి, ఇంజనీరింగు, ఇంధన పరిశ్రమలలో 50 శాతం, తేలిక రకపు పరిశ్రమలు, ఆహారం, చేపల పరిశ్రమల్లో 84 శాతం అదనంగా కేటాయించ బడ్డాయి.

వీటికి తోడు పనిచేస్తున్న పరిశ్రమలలో తిరిగి సాంకేతిక పరికరాలను సమకూర్చటానికి ప్రస్తుతం నెలకొల్పనున్న ఉత్పత్తి అభివృద్ధి నిధిని, బ్యాంకి రుణాలను వినియోగించడం ద్వారా పెట్టుబడి వ్యయాలు విస్తృత పరచ బడతాయి.

ఆర్థిక వ్యవస్థలోని అన్ని శాఖల మధ్య సహేతుకమైన, క్రమబద్ధమైన నిష్పత్తిని నెలకొల్పుటకు, ఉత్పత్తి పథకాలను కొనసాగించుటకు పరిశ్రమ నిర్మాణ పథకాలను పూర్తి చెయ్యడం, ఉత్పాదక శక్తికి అనుగుణంగా పనిచేయుటకు షెడ్యూళ్ళను నిర్దుష్టంగాను, తప్పని సరిగాను అనుసరించడం ప్రాథమికమైన అవసరం.

పరిశ్రమల నిర్మాణంతో ప్లానింగును, అందుకు సంబంధించిన సాంకేతిక అంశాలను, ఆర్థిక వ్యయానికి సంబంధించిన లెక్కలను అభివృద్ధి పరచడం ప్రధాన కర్తవ్యాలలో ఒకటి.

పనిచేస్తున్న పరిశ్రమలలో తిరిగి సాంకేతిక పరికరాలను సమకూర్చడానికి, స్వల్పకాలంలో, మితవ్యయంతో దేశం నూతన ఉత్పాదక శక్తిని సాధించడానికి నిర్మాణంలో వున్న ప్రాజెక్టులను అత్యంత త్వరితగతిని పూర్తిచెయ్యడానికి పెట్టుబడులను తరలించడం అవసరమని అనుభవం,;ఆర్థిక విశ్లేషణలు తెలియజేస్తున్నాయి. ప్రాజెక్టుల నిర్మాణానికి సంపూర్ణమైన ఆర్థిక లెక్కలను సమకూర్చాలి.

పెట్టుబడి వ్యయానికి సంబంధించిన పథకాలను రూపొందించుటకు ముందు పరిశ్రమల నిర్మాణానికి అవసరమైన ముఖ్య రకాలకు చెందిన పరికరాల, వస్తువుల నిల్వల వివరాలను, నిర్మాణ సంస్థల శక్తిని వివరించ వలసివుంది.

నిర్మాణంలో వున్న అన్ని పరిశ్రమలకు వార్షిక కేటాయింపు పద్ధతిపై పంచవర్ష ప్రణాళికయిప్పుడు రూపొందించ బడుతుంది. అది ప్రతి ఒక్క ప్రాజెక్టు పూర్తికాలపు నిర్మాణ లక్ష్యాన్ని నిర్మాణ సంస్థలకు అందజేస్తుంది. ఫలితంగా వివిధ

ఫ్యాక్టరీలు రాబోయే సంవత్సరాల్లో పని ప్రారంభించుటకు వీలుగా ముందుగానే సంసిద్ధమౌతాయి; సకాలంలో పరికరాలకు ఉత్తర్వులు యిస్తాయి. ప్రణాళికకు అనుగుణంగా విజయవంతంగా పనిచేస్తున్న నిర్మాణ ప్రాజెక్టులకు ఐదుసంవత్సరాలకు కేటాయించిన పూర్తిమొత్తాలు యిచ్చి వేయబడతాయి. ఫలితంగా స్వల్ప కాలాలో ఫ్యాక్టరీల నిర్మాణం పూర్తి చెయ్యడం సాధ్యమౌతుంది.

నమూనా సంస్థల సిబ్బంది బృహత్కర్తవ్యాలను ఎదుర్కోవలసి వుంది. అత్యంత అభివృద్ధికర వస్తువులతో, ఉన్నత శ్రేణి ఉత్పాదక శక్తిగల పెద్దయంత్రాలతో స్వయంచాలిత పద్ధతులపైన అధునాతన ఉత్పాదక పద్ధతుల ప్రాతి పదిక పైన మన పరిశ్రమలు అభివృద్ధి పొందాలి. తమకు సంబంధించిన రంగాల్లో ప్రపంచంలో కల్లా అభివృద్ధి చెందిన వాటిలో అత్యుత్తమ మైన అభివృద్ధికర పద్ధతులను నమూనా సంస్థలు ప్రాజెక్టుల నిర్మాణంలో ప్రవేశపెట్టాలి. అతినవీనమైన యంత్రాలను ఉపయోగించాలి. ఆ విధంగా ఆధునిక విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక శాస్త్రం సాధించిన విజయాలకు అనుగుణంగా నూతన పరిశ్రమలను నెలకొల్పాలి.

ఉత్పత్తిచేస్తున్న పరిశ్రమలలో ప్రస్తుతం దొరికే వస్తువులకంటే మంచిరకం వస్తువులను ప్రతి కిలోగ్రాం ముడి పదార్థంనుండీ. తదితర వస్తువులనుంచి కొత్త పరిశ్రమలు పుత్పత్తి చేసేటట్టు వాటి ఉత్పత్తి పదార్థాలను గురించి నమూనాలు యోచించాలి.

పెట్టుబడుల వ్యయం శక్తివంతంగా జరిగేటట్లు కొత్త నమూనాలు హామీ యివ్వాలి.

పరిశ్రమలలో అత్యంత శక్తివంతమైన ఫ్యాక్టరీలను నెలకొల్పడం ఉచితంగా వుంటుందని అనుభవం తెలియజేస్తోంది. అందువల్ల ఆర్థికంగా ఎంతో సత్ఫలితం చేకూరుతుంది. ఉదాహరణకు 8 లక్షల టన్నుల ఉత్పాదక శక్తిగల సింథటిక్ అమోనియా పరిశ్రమను నెలకొల్పుటకు, లక్షటన్నుల ఉత్పాదకశక్తి గల ఫ్యాక్టరీలను స్థాపించుటకన్న రెండులక్షల టన్నుల ఉత్పాదక శక్తిగల ఫ్యాక్టరీలతో అంతే ఉత్పాదక శక్తిగల పరిశ్రమను నిర్మిస్తే సుమారు 25 శాతం చౌకగా తయారవుతుంది. నూనెశుద్ధి పరిశ్రమలో ప్రతి ఫ్యాక్టరీ ఉత్పత్తి శక్తిని రెట్టింపు చేయుటవల్ల, ప్రతి ఫ్యాక్టరీని నెలకొల్పుటలో సుమారు 20, 25 శాతం ఖర్చులు తగ్గుతాయి. కార్మికుల ఉత్పత్తి శక్తి రెట్టింపు అవుతుంది.

నమూనాలను పూర్తిగా అభివృద్ధి పరచడానికి, అంచనాలను సరిగా లెక్క

కట్టడానికి గాను నమూనా సంస్థలు చేసే కృషిలో వారి బాధ్యతలను పెంచవలసిన అవసరం వుంది.

వచ్చే ఐదు సంవత్సరాల్లో గృహ నిర్మాణానికి పెద్ద పెట్టుబడి వ్యయాలను తరలించ వలసివుంది. ఆ పెట్టుబడులను శక్తివంతంగా వినియోగించుకోడానికి గృహాల నమూనాల తయారీలోను, గృహ నిర్మాణాల్లోను జరుగుతున్న తీవ్ర లోపాలను తొలగించుకోవలసి వుంది.

గృహనిర్మాణంలో కాంట్రాక్టు పద్ధతిని నియమబద్ధంగా ప్రవేశపెట్టుటకు, ఎల్లప్పుడూ అధునాతన పద్ధతులను ఒక పద్ధతి ప్రకారం అనుసరించుటకు, శక్తివంతమైన నిర్మాణ పద్ధతులను అవలంబించుటకు, యిళ్ళుకట్టే స్థలాల సప్లయి పద్ధతిని అభివృద్ధి పరచుటకుగాను గృహ నిర్మాణ కృషిని మరింతగా పారిశ్రామికవంతం చేయడం, యాంత్రీకరణ మెరుగుపర్చడం అవసరం.

గృహ నిర్మాణ కృషి గుణాత్మకంగా అభివృద్ధి చెందడం తప్పనిసరి. కార్మికుల నైపుణ్యం, ప్రత్యేకించి మెరుగులుదిద్దేవారి నైపుణ్యం పెంచవలసి వుంది.

గృహ నిర్మాణ సామాగ్రి ఉత్పత్తిచేసే పరిశ్రమలు తేలికరకం, ఆర్థికంగా కలిసి వచ్చే గోడలను, ఆకర్షనీయమైన, మన్నికగల ప్రాంగణ సామాగ్రిని, అలంకరణకు ఉపయోగపడే సిమెంటు, ప్లేటు గాజులు, పింగాణీప్లేట్లు, నీటిపంపులు పెట్టుకొనుటకు అవసరమైన సామాగ్రిని విస్తృతంగా ఉత్పత్తి చెయ్యాలి. ఐదు సంవత్సరాల్లోను సిమెంటు ఉత్పత్తిని 72 మిలియన్ల టన్నులనుండి 100 – 105 మిలియన్ల టన్నులకు పెంచవలసి వుంది. రియిన్‌ఫోర్సుడు కాంక్రీటు ప్రీఫాబ్రికేటెడ్ సామాగ్రిని 40 శాతం; సిమెంటు పలకలు 60 శాతం, కిటికీల గాజు తలుపులు 60 శాతం ఉత్పత్తి అధికం చెయ్యాలి.

గృహ నిర్మాణ స్థలాలకు మంచి మన్నికగల పెయింట్లను, ఇతర వస్తువులను రసాయనిక పరిశ్రమ తయారు చేయాలి. స్థానిక గృహ నిర్మాణ పరికరాల ఉత్పత్తి అన్ని మార్గాల్లోను విస్తృతం కావాలి.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించడానికి చేస్తున్న పోరాటంలో మన నిర్మాణ వేత్తలు అగ్ర శ్రేణిని వున్నారు. నూతన పంచవర్ష ప్రణాళికా కాలంలో బృహత్తరమైన, బాధ్యతాయుతమైన కర్తవ్యాలు వారిపైన వుంచబడ్డాయి. ఆ కర్తవ్యాలను పూర్తిచెయ్యడం పైనే

మన ఆర్థిక వ్యవస్థలో జరిగే ఉన్నతస్థాయి అభివృద్ధి వేగం సోవియట్ ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలపై ఆధారపడి వుంటాయి. అనేక లక్షల మందిగావున్న సోవియట్ నిర్మాణ వేత్తలు పై కర్తవ్యాలను నిర్వహించి తీరుతారనే విశ్వాసం మనకు గలదు.

## 7. నూతన పంచవర్ష ప్రణాళికలో సోవియట్ ప్రజల భౌతిక సాంస్కృతిక ప్రమాణాల పెంపుదల

కామ్రేడ్స్, కమ్యూనిస్టు సమాజ నిర్మాణం, ప్రజల సంక్షేమాన్ని అభివృద్ధి పరచడం విడదీయరాని సమస్యలు. నూతన పంచవర్ష ప్రణాళికలో ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి మౌలిక ఆదేశాలను రూపొందించేటప్పుడు ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించే కృషిపట్ల సి. పి. యస్. యు. కేంద్రకమిటీ, యు. యస్. యస్. ఆర్. మంత్రి మండలి ప్రత్యేక శ్రద్ధ ప్రదర్శించాయి. పంచవర్ష ప్రణాళికకు ముసాయిదా ఆదేశాలను రూపొందించేటప్పుడు, పై అంశం అత్యంత మౌలిక సమస్యగా తీసుకోబడింది.

సోవియట్ ప్రజల సంక్షేమాభివృద్ధి వేగాన్ని త్వరిత పరచుటకు వచ్చే ఐదు సంవత్సరాల కాలంలో పార్టీ యీ విధానాన్ని స్థిరంగా అనుసరిస్తుంది. మార్చి, సెప్టెంబరు నెలల్లో జరిగిన సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశాల నిర్ణయాలను స్థిరంగా అమలు జరపడం ద్వారా ఆర్థిక వ్యవస్థలో ప్రాతిపదిక నిష్పత్తులలో ముఖ్యమైన అభివృద్ధిని తీసుకు రావడంవల్ల, సోవియట్ ప్రజలలో పెంపొందుతున్న భౌతిక, మానసిక అవసరాలను సంతృప్తి పరచుటకు జరిగే వస్తూత్పత్తి అభివృద్ధిలో సాధించిన విజయాలను పూర్తిగా ఉపయోగించుకోడానికి హామీ లభించ గలదు.

ముసాయిదా ఆదేశాల ప్రకారం, గత ఐదు సంవత్సరాల్లో కంటె, ప్రస్తుత ఐదు సంవత్సరాల కాలంలో మొత్తం వినిమయ నిధిలో అంటే ప్రజల వినియోగానికి సమకూర్చబడే మొత్తం వస్తుసంపదలలో 70 శాతం పెరుగుదల అధికంగా వుంటుంది. 1961-65 సంవత్సరాల్లో కంటె ప్రజల నిజమైన రాబడిలో పెరుగుదల చిల్లర వాణిజ్యం, ప్రభుత్వ హోటళ్ళలోను, సేవా సంస్థలలోను అమ్మకాల అభివృద్ధి వేగం చాలా ఎక్కువగా వుంటుంది.

వాటికి సంబంధించిన సంఖ్యలు దిగువ యివ్వబడ్డాయి :

| సూచిక | 1961-'65 లో అభివృద్ధి శాతం | 1966-'70 లో అభివృద్ధి శాతం |
|---|---|---|
| తలసరి ఆదాయం | 20 | సుమారు 30 |
| చిల్లర వాణిజ్యం టర్నోవరు | 34 | 43.5 |
| సౌకర్యాలు | 90 | సుమారు 150 |

ప్రణాళికా బద్ధమైన ప్రజల సంక్షేమాభివృద్ధి వేగానికి చెందిన ప్రధాన లక్ష్యాలు గత ఐదు సంవత్సరాలకంటే గణనీయంగా పెరిగినట్లు పై అంకెల్లో చూడవచ్చు.

వచ్చే ఐదు సంవత్సరాల్లో అధిక వేతనాలకు, పని పరిస్థితుల్లోను, జీవన పరిస్థితుల్లోను అభివృద్ధికి రెండు వనరులనుండి హామీ యివ్వబడుతూంది. ప్రభుత్వం వద్ద కేంద్రీకృతమవుతున్న ఆదాయ వనరులు, ప్రోత్సాహ నిధి రూపంలోను, సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాలకు, గృహనిర్మాణాల నిధిరూపంలో ఎప్పుడూ అభివృద్ధి చెందుతూ పారిశ్రామిక సంస్థలవద్ద వుండే లాభంలోని భాగం, ఆయా పరిశ్రమల కృషి ఫలితాలపైన, అమ్మిన వస్తువుల సంఖ్యపైన, నాణ్యాన్ని అభివృద్ధి పరచడంపైన, కార్మికుల ఉత్పాదక శక్తి పెంపుదల, లాభాలస్థాయి, మొత్తం లాభం పెరుగుదల వంటి వాటిపైన ఫ్యాక్టరీ కార్మికుల, ఆఫీసు కార్మికుల వేతనాల పెంపుదలకు ఎక్కువగా ఇప్పటినుండే ఆధారపడడం జరుగుతున్న ప్రతీ, పరిశ్రమలోని సిబ్బందికి విస్తృతమైన అవకాశాలు ఏర్పరచబడ్డాయి.

కార్మికుల జీతాల్లో హెచ్చింపు - ఫ్యాక్టరీల, ఆఫీసు కార్మికుల వేతనాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేసినపనికి సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ఆదాయాల్లోను - ప్రజల జీవన ప్రమాణాల్లో ప్రణాళికాబద్ధ అభివృద్ధితో నిర్ణయాత్మకంగా ముడిపడి వుంది. పై అంశం ఉత్పత్తి అభివృద్ధికి ప్రాథమిక ప్రోత్సాహంగాను, ప్రజలు ఎక్కువ ఆదాయాలు సంపాదించడానికి కీలకమైన వనరుగాను వుంటుంది.

ఐదు సంవత్సరాల కాలంలోను ఫ్యాక్టరీలలోని, ఆఫీసులలోని కార్మికుల నెలసరి సగటు వేతనాలు 20 శాతానికి తక్కువ కాకుండా పెరుగుతాయి; ఐదు సంవత్సరాల కాలం అంతమయేటప్పటికి సుమారు 115 రూబుళ్ళ మొత్తానికి చేరు

కుంటుంది; జీతాలు, ప్రభుత్వ వినియోగ నిధులనుండి లాభాలు చేర్చినట్లయితే, ఉద్యోగంలోవున్న ప్రతి వ్యక్తికి సుమారు 155 రూబుళ్ళు ముడతాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో పనిచేసిన సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు సంపాదించే ఆదాయాల్లో సగటు పెరుగుదల 35 శాతం నుండి 40 శాతం వరకు వుంటుంది. ఐదు సంవత్సరాల్లోను ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను పనిచేసే కార్మికుల, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల వేతనాల మొత్తం సుమారు 40 శాతం పెరుగుతుంది.

పంచవర్ష ప్రణాళిక కీలక కర్తవ్యాల పరిష్కారంలో వేతనాల ప్రోత్సాహ పాత్రను క్రమేణా అధికంచేయడం మన వేతనాల విధానంలో కీలకమైన అంశం.

క్రమబద్ధమైన వేతన అభివృద్ధిని, ఉత్పత్తిని విస్తృతపరచడానికి, అభివృద్ధి పరచడానికి తోడ్పడిన కార్మికులకు ప్రోత్సాహం యిచ్చే ప్రాధాన్యక్రమంతో సరిగా కలపడం అవసరం. దీనిని సాధించడానికి ఉత్పత్తి సూచీలో అభివృద్ధివల్ల, తన జీతం ఎంత పెరుగుతుందో, తన పరిశ్రమయొక్క అదనపు ఆదాయాన్నుండి ఎంత పెద్దభాగం తాను పొందుతాడో ప్రతి కార్మికుడు, ఇంజనీరు, సాంకేతిక నిపుణుడు తెలుసుకోవాలి.

ఐదుసంవత్సరాల్లోను కనీస వేతనం పెరుగుతుంది. దానితో పాటుగా మధ్య శ్రేణులకు చెందిన ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికుల రేట్లు, వేతనాలు పెంపొందుతాయి. అవి వివిధ తరగతుల ఉద్యోగుల శ్రమకు తగిన వేతనం యివ్వడానికి అత్యంత క్రమబద్ధమైన పరస్పర సంబంధాలు నెలకొల్పుటకు సాధ్యంమయ్యేలా చేస్తాయి. ఆ విధంగా చేయుటవల్ల, కఠినమైన, హానికరమైన పరిస్థితులలో పనిచేస్తున్న వారికి, భూగర్భ ఉద్యోగాల్లో పనిచేస్తున్న వారికి, అత్యంత భారమైన ఉద్యోగాల్లో పనిచేసే వారికి ఎక్కువ లాభాలు సమకూర్చబడతాయి.

కాని మనకు ఇంకా క్రింద శ్రేణులకుచెందిన కార్మికుల గ్రూపులు వున్నాయి. వారిని గురించి మనం మాట్లాడేటప్పుడు, నైపుణ్యంలేని ఫ్యాక్టరీలను గురించి, కార్మికులను గురించి, దిగువ సాయి ఉద్యోగ సిబ్బందిని గురించి మనం పేర్కొంటాం. పై తరగతి సంఖ్యా బలాన్ని తగ్గించడానికి సహాయ వృత్తులను, లెక్కలు కట్టే అన్నిరకాల వృత్తులను, మరింత విస్తృతంగా యాంత్రీకరణ చెయ్యాలి. ఉత్పత్తిని స్వయంచలిత యంత్రాల ద్వారా చెయ్యాలి. తిరిగి శిక్షణ యివ్వడం ద్వారా, ఈ కార్మికుల్లో ఎక్కువ మందిని నైపుణ్యంగల వృత్తుల్లోకి తీసుకోడం సాధ్య మవుతుంది. ఉత్పాదక శక్తిని పెంచడం విషయంలోను పార్టీ ప్రధాన

లక్ష్యమైన ప్రజల జీవనప్రమాణాలను అభివృద్ధి పరచడం విషయంలోను యిది సహజ క్రమం. వేతనాల పెరుగుదల తోబాటు కొన్ని రకాల ఫ్యాక్టరీల, ఆఫీసు కార్మికుల వేతనాల పైన పన్నుల తగ్గింపును, రద్దును కొనసాగించాలని ముసాయిదా ఆదేశాలు తెలియ జేస్తున్నాయి.

ప్రారిశ్రామిక సంస్థలలో ప్రోత్సాహ నిధులను ఏర్పరచడం వల్ల పారిశ్రామిక సంస్థ నిర్వహణ ఫలితాలను అభివృద్ధి పరచుటలో అందరు కార్మికులలోను సమిష్టిఉత్సాహాన్ని పెంపొందించడం సాధ్యమయేలాచేస్తుంది. అదేవిధంగా ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మిల సంపాదనలలో బోనసుల, మొత్తంగా యిచ్చే బహుమతుల వాటాను పెంపొందించడానికి నూతన పంచవర్ష ప్రణాళికలో అవకాశం కల్పించబడింది. ప్రతి వ్యక్తిగత కార్మికుని ప్రయోజనాలను సమిష్టి ప్రయోజనాలతోను, సమాజం యొక్క మొత్తం ప్రయోజనాలతోను జతపరచడం యిది సాధ్యమయేలా చేస్తుంది.

నూతన ప్రోత్సాహ పద్ధతిని ప్రవేశపెట్టడంతోబాటు, శ్రామిక ఉత్పాదక శక్తిని, నాణ్యాన్ని వ్యక్తిగత సమిష్టి ఉత్పత్తి ఫలితాలను పరిగణనలోకి తీసుకొని క్రమేణా బోనసు పద్ధతులు అన్ని తరగతుల కార్మికులకు విస్తరింప చేయబడతాయి.

వేతనాల విధానాన్ని రూపొందించడంలో, దేశంలోని వివిధ ప్రాంతాల ప్రత్యేక పద్ధతులను, వారి సహజ సిద్ధమైన, వాతావరణ పరిస్థితులను, ఆర్థికాభివృద్ధి స్థాయిలను, అక్కడవున్న చిల్లర ధరలను ఆలోచనలోకి తీసుకోవాలి. సైబీరియా, దూరప్రాచ్యం, దేశంలోని ఉత్తరఐరోపా ప్రాంతాల్లోని అందరు కార్మికులకు, ఉద్యోగులకు యింకా ప్రత్యేక అలవెన్సులు విస్తృతం చెయ్యబడలేదు. నూతన పంచవర్ష ప్రణాళికలో యీ అసమానతను సరిచెయ్యాలి. అదేసమయంలో సుమారమైన ఉత్తర ప్రాంతాల్లోను, యితర ప్రాంతాల్లోను ఒకే తరగతిలో నియమించబడి పనిచేస్తున్న ప్రజలకు పెద్ద అవకాశాలు కలగ చెయ్యాలి.

ఇటీవలి సంవత్సరాల్లో పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికవర్గం తీవ్రమైన వర్గ పోరాటం జరపడం ద్వారా వేతనాలలో కొంత పెరుగుదల సాధించిన విషయం గుర్తు చేసుకోవలసి వుంది. ప్రధానావసరాల ధరలు ఒక పద్ధతి ప్రకారం పెరిగిపోవుటవల్ల ఎక్కువ అద్దెలు, ప్రజావసరాల ధరలు, తదితర సౌకర్యాల ధరలు, పెరిగిపోవుటవల్ల, వైద్య సహాయం ధర ఎక్కువగా పెరగడం మూలంగా, యీ వేతనాల పెంపుదలలు వాటి ప్రాముఖ్యాన్ని పెద్దగా కోల్పోయాయి.

బాగా అభివృద్ధి పొందిన అధిక సంఖ్యాక పెట్టుబడి దారీ దేశాల్లో అధిక భాగం శ్రమజీవి ప్రజలు జీవితావసరాలుకూడా తీరక, బీదరికం అనుభవిస్తున్నారు. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి తగినంతగా జరగక పోవుటవల్ల కాక, పెట్టుబడి దారీ ఉత్పత్తి విధానంలో అంతర్భూత మైపున్న సంక్షోభాలు, నిరుద్యోగం, చిన్న ఉత్పత్తిదార్ల వినాశనం, రంగుజాతుల, జాతీయ అసమానతలు, స్త్రీలు చేసిన పనికి యిచ్చే జీతాలలో వివక్ష, కొన్ని ఆర్థిక ప్రాంతాలు నశించి పోవడం వంటిసాంఘిక అవలక్షణాల కారణంగా అక్కడిప్రజలు దరిద్రం అనుభవిస్తున్నారు.

ప్రజల సంక్షేమాభివృద్ధికి గాను పై అడ్డంకులను సోషలిస్టు విధానం తొల గించి వేసింది. చరిత్రలో మొట్ట మొదటిసారిగా ప్రజల జీవన ప్రమాణాలు భౌతిక ఉత్పత్తి శ్రమ ఉత్పాదక శక్తిపైన అభివృద్ధి పైన ప్రత్యక్షంగా ఆధారపడేటట్లు యీవిధానం చేసింది. ఫలితంగా ప్రతి పరిశ్రమజీవి తన భౌతిక, సాంస్కృతిక అవసరాలను ఎల్లప్పుడూ పూర్తిగా సంతృప్తి పరచుకొనుటకు అనువైన మార్గాన్ని తెరచింది.

ప్రజల సంక్షేమాన్ని పెంపొందించడంలో, చేసిన పనికి యిచ్చే వేతానాల ద్వారా ఆదాయాల పెరుగుదలతోపాటు, ప్రజా వినిమయ నిధులు ప్రముఖమైన పాత్రను నిర్వహిస్తాయి. ఆ నిధులు సోవియట్ పరిస్థితుల్లో పెద్ద కుటుంబాల జీవన ప్రమాణాలను త్వరితగతిని అభివృద్ధి పరచుట, ప్రజల సాంఘిక సాంస్కృతిక అవసరాలను మెరుగుపరచి, సంతృప్తి పరచుట సాధ్యమయేలా చేస్తాయి.

ప్రజా వినిమయ నిధులనుండి ప్రజలు తీసుకొనే వేతనాలు, లాభాల సాధారణ మొత్తం కనీసం 40 శాతం పెరిగేటట్లు ముసాయిదా ఆదేశాలు చూస్తాయి. పింఛను పథకాన్ని సమగ్రంగా రూపొందించుటకు, నర్సరీలలోని, కిండర్‌గార్టెన్ల లోని పిల్లల పెంపకానికి, పోషణకు, ప్రజల ఆరోగ్య వ్యవస్థ, పట్టణాలలోని, దేశంలోని సాంస్కృతిక, తదితర సౌకర్యాలను అభివృద్ధిపరచుటకు ఆ నిధులలోని పెరిగిన మొత్తాలు ముఖ్యంగా ఉపయోగించ బడతాయి. ఈ కార్యక్రమం కోసం 1970లో సుమారుగా 60,000 మిలియన్ల రూబుళ్లు ఖర్చు పెట్టబడతాయి.

ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికుల పింఛను పథకం విషయంలో క్రింది విధంగా పథకం తయారు చేయబడింది :

ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికుల, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల కనీస వృద్ధాప్య పింఛను 30 శాతం కంటే ఎక్కువగా పెంచుటకు పని భారం ఎక్కువగా వుండే

కొన్ని రకాల వృత్తులలో నియమించబడిన స్త్రీ కార్మికులకు యాభై వ ఏటనే వృద్ధాప్య పింఛన్లను ప్రవేశ పెట్టడానికి ;

పింఛను యిచ్చేవయస్సు, లెక్కగట్టే పద్ధతుల విషయంలో ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికులతో సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులను సమానం చేయడానికి;

శక్తిహీనులైన మొదటి తరగతికి సమిష్టి వ్యవసాయ క్షేత్రరైతులకు కనీసం పింఛన్లను పెంచుటకు, వృత్తిలోనే ప్రమాదానికి గురైశక్తి హీనులైన, వృత్తివ్యాధుల వల్ల శక్తిహీనులైన మూడవతరగతి సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకు పింఛన్లను ప్రవేశ పెట్టడానికి;

ప్రజా వినిమయ నిధుల వినియోగంతో ప్రభుత్వమే పిల్లలను పెంచడం, పోషించడం ప్రజావినిమయ నిధుల వినియోగంలోని మరొక ముఖ్యాంశం. పాఠశాలలకు పూర్వపు విద్యా సంస్థలలో చేర్చుకోబడే పిల్లలసంఖ్య 1970 నాటికి 12.2 మిలియన్లను 1965లో కంటె 60 శాతం ఎక్కువగా పెరుగుతుంది. ఆ సంస్థలలో పట్టణ ప్రజల అవసరాన్ని పై పెరుగుదల ముఖ్యంగా తీరుస్తుంది. గ్రామీణ ప్రాంతాలకు కూడా ఆ సంస్థలు తమ సేవలను గణనీయంగా విస్తృతపరుస్తాయి. ఎక్కువ కాలం నడిపే పగటి పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య రెట్టింపు కంటె మించి పోతాయి.

ప్రస్తుతం అమలులోవున్న పనివారపు మొత్తం కాలాన్ని అలాగే వుంచుతూనే, ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికులకు ఐదురోజుల పనివారాన్ని (ఐదు పని రోజులు, రెండు సెలవరోజులు) ప్రవేశ పెట్టడం నూతన ఐదు సంవత్సరాల కాలంలో ఒక ముఖ్యమయిన సాంఘిక – ఆర్థికచర్య. ఈ చర్య శ్రామిక ప్రజల వినోదానికి అధ్యయనానికి, నైపుణ్యాన్ని అభివృద్ధి పరచుకొనుటకు ఎక్కువ విశ్రాంతిని, గొప్పఅవకాశాలను కలగ జేస్తుంది, ఒకే సమయంలో శ్రామిక ఉత్పాదక శక్తిపెరగడానికి, పారిశ్రామిక సంస్థలు ఆర్థిక విజయాలను వృద్ధి పరచు కొనుటకు ఐదురోజుల వారానికి మార్చడం సహాయ పడుతుంది. మరింత శక్తి వంతంగా యంత్ర పరికరాలను మరమ్మతు చేయడానికి వృధాగా వెళ్లబుచ్చే సమయాన్ని తగ్గించడానికి, ఇంధనం, విద్యుచ్ఛక్తి వాడకం వగైరాలను తగ్గించ డానికి వారంలో రెండురోజులు సెలవు సాధ్యమయేలా చేస్తుంది. కొంత కాలం నుండి కొన్నిజౌళి మిల్లులు, ఇంజనీరింగు, రసాయనిక, ఉక్కుఫాక్టరీలు వారానికి

ఐదురోజులు పనిచేస్తున్నాయి. తత్ఫలితంగా కార్మిక ఉత్పాదకశక్తిలో పెరుగుదల, ఉత్పత్తి ఖర్చులలో తగ్గుదల సాధ్యమైంది.

గడచి పోయిన కొద్ది సంవత్సరాల్లోను వాణిజ్యాన్ని అభివృద్ధి పరచడానికి ఎంతో కృషి జరిగింది. పుష్టికరమైన ఆహార పదార్థాల, ముఖ్యంగా ఉత్పత్తి చేయబడిన వస్తువుల అమ్మకం గణనీయంగా పెరిగింది. గడచిపోయిన ఐదుసంవత్సరాల్లోను షాపుల నిర్మాణానికి, ఇతర వాణిజ్యాల సంస్థల నిర్మాణానికి సరుకులను నిల్వచేయు గోదాములు, కూరగాయలను భద్రపరచే గోదాములు నిర్మించడానికి నాలుగువేల మిలియన్ల రూబుళ్లు ఖర్చు పెట్టబడ్డాయి. సుమారు 65 వేల కొత్త షాపులు, 42 వేల క్యాంటీనులు, తదితర ప్రభుత్వ హోటళ్లు ప్రారంభించబడ్డాయి. గోదాములు, శీతలగోదాములుచాల ఎక్కువగా విస్తృతపరచ బడ్డాయి.

కాని ప్రభుత్వ, సహకార వాణిజ్యాభివృద్ధి కావలసిన దానికంటే తక్కువగానే వుండిపోయింది. కొన్నివస్తువుల డిమాండును పూర్తిగా సంతృప్తి పరచడం లేదు. కొన్ని ప్రదేశాల్లో పుష్కలంగా లభించే వస్తువుల అమ్మకాలుకూడా మధ్య మధ్య నిలచి పోతున్నాయి. ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాల్లో అమ్మకం సౌకర్యాలు వినిమయదార్ల యిళ్లకు వస్తువులను తీసుకుపోవడం తగినంతగా వృద్ధి పొందలేదు. సమిష్టి వ్యవసాయక్షేత్రాల రైతుల, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల కార్మికుల సౌకర్యాలను ఎక్కువగా అభివృద్ధి పరచగల సంచార దుకాణాలను పరిమితంగానే వినియోగించుకొనడం జరుగుతున్నది. వాటిని నిర్వహించడంలో ఎక్కువ వ్యయంకూడా అవదు.

సోవియట్ వాణిజ్యాన్ని అభివృద్ధి పరచడం ముఖ్య కర్తవం. ఐదుసంవత్సరాల్లోను ప్రభుత్వ సహకార చిల్లర వాణిజ్యం 45,000 మిలియన్ల రూబుళ్ళకు, అంటే సుమారు 43.5 శాతం పెరుగుతుంది.

ఆహార వస్తువుల, తేలికరకం ప్రారిశ్రామిక వస్తువుల అమ్మకాల్లో గణనీయమైన పెరుగుదల జరగాలని ప్రణాళిక నిర్దేశిస్తోంది. మాంసం, మాంసం, ఉత్పత్తుల అమ్మకాలు 21 శాతం పెరుగుతాయి; పాలు, పాల ఉత్పత్తులు 37 శాతం, చేపలు, చేపల ఉత్పత్తులు 71 శాతం; చక్కెర 22 శాతం; శాకతైలం 65 శాతం; మార్గరిన్ వెన్న 95 శాతం ; కూరగాయలు, కర్బూజాపళ్లు 44 శాతం ; పళ్ళు, ద్రాక్షపళ్ళు 3 శాతం ; బట్టలు, దుస్తులు, కుట్టబడిన వస్తువులు 38 శాతం, జోళ్ళు 26 శాతం పెరుగుతాయి.

మన్నికగల వినిమయ వస్తువుల, విద్యుత్ పరికరాల అమ్మకాలు మరింత త్వరితంగా పెంపొందుతాయి.

సరిపోల్చబడిన అంకెలు క్రింద యివ్వబడ్డాయి :

| | 1961-65 అమ్మకాలు | 1966-70 లో జరగవలసిన అమ్మకాలు |
|---|---|---|
| ఇళ్ళలో వినియోగించే రిఫ్రిజిరేటర్లు (మిలియన్లలో) | 4.7 | 18.5 |
| బట్టలు ఉతుకు యంత్రాలు ,, | 10.9 | 19.0 |
| రేడియో సెట్లు, రేడియోగ్రాములు ,, | 21.5 | 30.0 |
| టి. వి. సెట్లు ,, | 12.0 | 27.0 |
| ఫర్నిచరు (1000 మిలియన్ రూబుళ్ళు) | 8.0 | 11.6 |

ప్రజలలో వున్న తీవ్రమైన డిమాండుకు అనుగుణంగా వస్తువుల వనరులను పూర్తిగా సమకూర్చడం మన కర్తవ్యం. వినిమయవార్ల డిమాండును క్రమబద్ధంగా, నిర్మాణయుక్తంగా అధ్యయనం చేయడంలో వాణిజ్య రంగంలో పనిచేసే కార్మికులు యింకా విజయం సాధించలేదు. అందువల్ల వాణిజ్య సంస్థలలో జరిగే పనిలో లోపాలు జరగడానికి ప్రజలకు కొన్నివస్తువుల సరఫరా తగ్గిపోవడం, కొన్ని పరిస్థితులలో వస్తువులను ఎక్కువగా నిల్వ చెయ్యడం ఫలితంగా పెద్ద నష్టాలు సంభవించడం జరుగుతాయి. ఇటీవల వాణిజ్య సంస్థలు పరిశ్రమలకు ఆర్డర్లు పంపడం ప్రారంభించాయి. ఈ పద్ధతివల్ల అప్పుడే సత్ఫలితాలు సమకూరాయి. ప్రతిచోట యీపద్ధతినే అమలు జరపాలి. అందువల్ల వినిమయ వస్తువుల ఉత్పత్తిపైన వాణిజ్య రంగానికి పలుకుబడి పెంపొందుతుంది. వాటి వర్గీకరణ, నాణ్యం పెంపొందుతుంది.

వాణిజ్యసౌకర్యాలను అభివృద్ధి పరచడానికి అమ్మకాలను విస్తృత పరచడంలో సరఫరా కార్మికులను మరింత ఉత్సాహవంతంగా వుండేటట్లు చెయ్యడానికి నూతన ప్రణాళికావ్యవస్థ పరిశ్రమలలో అమలు జరిపినటువంటి ప్రోత్సాహాలను వాణిజ్యంలోకూడా ప్రవేశ పెడుతుంది.

ప్రభుత్వ హోటళ్లలో చాలా తీవ్రమయిన లోపాలు ఉన్నాయి. ఇప్పుడు

సరుకులు తక్కువగా వున్నాయనే కారణాన్ని క్యాంటీన్లు, రెస్టారెంట్లలోని సిబ్బంది ఎంతో కాలం చెప్పలేదు. అయినప్పటికీ అక్కడ సప్లయిచేసే ఆహారపదార్థాలు రుచిగా వుండడంలేదు; పెరగ వలసినంతగా సౌకర్యాలులేవు.

ప్రభుత్వ హోటళ్లను అభివృద్ధిపరచుటకు తీవ్ర ప్రయత్నం జరగాలి. ఐదు సంవత్సరాల్లోను ప్రభుత్వ హోటల్ పరిశ్రమల టర్నోవరు సుమారు 50 శాతం పెరగాలి. అనేక కేఫీలు, రెస్టొరెంట్లు, కాంటీన్లు తెరవబడతాయి. ఫ్యాక్టరీల్లోను, నిర్మాణ స్థలాల్లోను, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లోను వేడిభోజనాలు పెట్టబడతాయి.

వినిమయ సహకార సంస్థలు యిలోధికంగా అభివృద్ధి చెందుతాయి. బట్టల, జోళ్ల, ఇంధన, గృహనిర్మాణ సరకుల, గృహోపయోగ వస్తువుల, ఆటలవస్తువుల, స్టేషనరీ, మన్నికగల వినిమయ వస్తువులు అమ్మకాలను నిర్విరామంగా కొన సాగిస్తాయి. రొట్టెల బేకరీలను విస్తృత పరుస్తాయి. ప్రభుత్వ హోటళ్ళను, గ్రామీణ ప్రాంతాల్లో తదితర సౌకర్యాలను వృద్ధి పరుస్తాయి.

ఇప్పుడు గ్రామీణ, పట్టణ వాణిజ్యంలో ఒకే విధమైన ధరలు ఏర్పాటు చెయ్యబోతాయి. గ్రామీణ వినిమయ దారుకు అవసరమైన ప్రతివస్తువు స్థానిక షాపులలో కూడా లభ్యమయ్యేందుకు పరిస్థితులు సృష్టించ బడతాయి. ఇది వినిమయ సహకార సంస్థల కర్తవ్యం.

వినిమయ వస్తువుల ప్రభుత్వ చిల్లర ధరలలో తగ్గింపు, అన్నింటి కంటె పిల్లల వస్తువుల ధరల తగ్గింపు ప్రజల సంక్షేమాన్ని పెంపొందించడానికి ముఖ్య మైన పనులలో ఒకటి. వినిమయ వస్తువుల ఉత్పత్తి విస్తృతంకాగానే, అవసర వస్తువులు, ఆర్థిక వనర్లు సమకూరడంతో ధరల తగ్గింపు అమలు జరపబడుతుంది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాల మార్కెట్లలో వాణిజ్యాన్ని వృద్ధి పరచడం అవసరం. ఇది జీవన ప్రమాణాల అభివృద్ధికి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులరాబడి పెరుగుదలకు సహాయపడుతుంది.

సోవియట్ ప్రజల జీవన ప్రమాణాల్లో పెరుగుదల సేవాపరిశ్రమల అభివృద్ధిపైన విస్తారంగా ఆధారపడివుంది. మనంవాటిని ఆర్థికవ్యవస్థలో విస్తృత మైన, సాంకేతికంగా సౌష్టవమైన రంగంగా అభివృద్ధిపరచాలి. ఈ కర్తవ్య నిర్వ హణకోసం అనుకూలమైనపరిస్థితులుసృష్టించబడుతున్నాయి.పరిశ్రమల, యంత్రాల, సౌకర్యాలకు సంబంధించిన యంత్రాంగాల, ప్రత్యేకించి లాండ్రీ పరికరాల,

డ్రైక్లీనింగ్, జోళ్లబాగుచేత, హైర్‌డ్రెసింగు, పరికరాల ఉత్పత్తిలో గణనీయమైన అభివృద్ధి జరుగుతుంది. సేవా సంస్థలకు వస్తువుల రసాయనిక పదార్థాల పంపిణీ పూర్తిగా వృద్ధిచేయబడుతుంది. ఈ సంస్థల నిర్మాణానికి, పరికరాలను సమకూర్చడానికి గణనీయమైన మొత్తాలు కేటాయించ బడ్డాయి. బ్యాంకులు యిచ్చే అప్పులనుకూడా చాల విస్తృతంగా వినియోగించుకోవచ్చు.

ఐదు సంవత్సరాల్లోను సుమారు 150శాతం సౌకర్యాలు, గ్రామీణప్రాంతాల్లో 200 శాతంకంటే అధికంగాను వృద్ధి చెందుతాయి. సమీపంలోని పట్టణాలలోను, జిల్లాకేంద్రాలలోను ఉన్న సేవా సంస్థల బ్రాంచీలు, ఆతిధ్యకేంద్రాలు గ్రామాల్లో నెలకొల్పబడతాయి.

సౌకర్యాలను వృద్ధి పరచడంలో పెట్టుబడి వ్యయం త్వరితగతిని తిరిగి వచ్చేసినట్లు అనుభవం తెలియజేస్తోంది. సేవాసంస్థలను నూతన ప్రణాళికావ్యవస్థకు ఆర్థిక ప్రోత్సాహాలకు పరటాయించడం వాంఛనీయం. ఆ విధంగా చేయుటవల్ల సౌకర్యాల విస్తరణాభివృద్ధిపైన. అందజేయబడిన సౌకర్యాల నాణ్యత అభివృద్ధిపైన సేవాసంస్థల కార్మికుల వేతనాలు ఆధారపడేటట్లు చేయగలం.

కాని ఆ సౌకర్యాలనుసంఘటితపరచడానికిసాహసమంతుడైన దక్షతగలవారిని ఎంచుకోవడం ముఖ్య విషయం. వివిధ సౌకర్యాలను సమకూర్చడం ఎలాగో వారికి తెలిసి వుండాలి, ఒక యింటిని తొందరగా, బాగా కొత్త పద్ధతుల్లో నిర్మించాలి; కొత్త యింట్లోకి వెళ్లి స్థిరబడడానికి సహాయపడాలి; పౌర్సిళ్లను యిళ్లకు అందించాలి: జోళ్లను, బట్టలను, గృహోపయోగ పాత్రలను, త్వరితంగా, తక్కువ ధరకు మరమ్మతు చేయాలి. ఇళ్లను సమకూర్చడం ప్రధానమైన సాంఘిక సమస్యలలో ఒకటి. ప్రజలకు ఎంతవరకు యిళ్లు సమకూర్చ గలిగితే అంతవరకు వారి జీవన ప్రమాణానికి అదిఒక సూచిగా వుంటుంది. వర్తమాన జాతీయాదాయం పైన మాత్రమే ఆధార పడకుండా, నిలువ చేయబడిన సంపద స్థాయిపైన కూడా అది ఆధారపడి ఉంటుంది. ఎందుచేతనంటే గృహ వసతుల నిర్మాణానికి దశాబ్దాలకాలం పడుతుంది.

1966–70 సంవత్సరాల్లో మొత్తం 480 మిలియన్ల చదరపు మీటర్ల విస్తీర్ణం గల భవనాలు పట్టణాల్లోను, పట్టణాలవంటి గ్రామాల్లోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోను నిర్మించ బడతాయి. వీటికి తోడుగా 2 నుండి 2.5 మిలియన్ల నివాస గృహాలను ప్రజలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు గ్రామీణ ప్రాంతాల్లో నిర్మిస్తారు.

ప్రభుత్వం ఖర్చుపెట్టే బ్రహ్మాండమైన కేంద్రీకృత పెట్టుబడితో బాటు, పారిశ్రామిక సంస్థలు తమ నిధిని, సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలకు విస్తృతంగా ఉపయోగించడంతోబాటు, గృహ నిర్మాణానికికూడా వెచ్చిస్తాయి. సహకార గృహ నిర్మాణానికి అవసరమైన ప్రోత్సాహం యివ్వాలి. వాటి విస్తీర్ణం 200 – 300 శాతం పెంపొందాలి. ఫ్యాక్టరీ, ఆఫీసు కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు తమ స్వంత డబ్బుతోకాని, ఋణసహాయంతోకాని ఇళ్లుకట్టుకోడానికి సహాయ పడాలి.

1966–70 నిర్మాణ కార్యక్రమంలో పొందుపరచ బడిన ప్రకారం గృహ నిర్మాణాన్ని అభివృద్ధి పరచుట వల్ల 65 మిలియన్ల ప్రజలు నూతన గృహాల్లోకి వెడతారు. జరిగిపోయిన ఐదు సంవత్సరాల్లోను 54 మిలియన్ల ప్రజలకు గృహ సౌకర్యం కల్పించబడింది. ఇది ఒక బృహత్ కార్యక్రమం కాని యిదికూడా గృహ సమస్యను పూర్తిగా పరిష్కరించదు. అధిక సంఖ్యలోయిళ్ళు నిర్మించ డానికి నిధులను వృద్ధి పరచుటకు ఏకాగ్రతతో కృషిచెయ్యాలి. 1966–70 సంవత్సరాల్లో ప్రజో పయోగాల అభివృద్ధికి పెట్టుబడి వ్యయాల పరిమితి పెరుగుతుంది. అనేక పట్టణాల్లోను, పట్టణాలవంటి గ్రామాల్లోను కేంద్రికృత నీటిసప్లయి వ్యవస్థ నెలకొల్ప బడుతుంది. అనేక పట్టణాలకు సహజ వాయువు సప్లయి చెయ్యబడుతుంది. గ్రామీణ ప్రాంతాల్లో యిళ్ళకు సహజ వాయువు సరఫరా చెయ్యడం తోబాటు పని ప్రారభించ బడుతుంది. గృహావసరాలకు విద్యుచ్ఛక్తి మరింత విస్తృతంగా వినియోగింప బడుతుంది.

క్రామేడ్స్, ప్రజారోగ్య సౌకర్యాలకు కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నాయి. ఇటీవలి సంవత్సరాల్లో ప్రపంచంలో కల్లా సోవియట్ యూనియన్‌లోనే మరణాలసంఖ్య తక్కువగావుంది. మన వైద్య వృత్తులకు చెందినవారు అనేకవ్యాధులను, ప్రత్యేకించి అంటువ్యాధులను అరికట్ట డంలో ప్రముఖ విజయాలు సాధించారు. అది వారుచేసిన మహత్తరసేవ. 5,55,000 మంది డాక్టర్లతోసహా సుమారు నాలుగు మిలియన్ల మంది వైద్య వృత్తికి చెందిన వారు ఆరోగ్య రక్షణ కార్యక్రమాల్లో పనిచేస్తున్నారు. ప్రజారోగ్య సౌకర్యాల భౌతికప్రాతిపదిక గణనీయంగా పటిష్టవంతమొనర్చ బడింది.

కాని యీ రంగంలో యింకా చాలా లోపాలు వున్నాయి. వైద్య సౌకర్యాల ప్రమాణాలను పెంచడానికి చర్యలు తీసుకోవాలి. రోగులపట్ల ఎక్కువ జాగ్రత్త

శ్రద్ధ తీసుకోవాలి. పాలీక్లినిక్‌ల, ఔట్‌పేషెంటు, వార్డుల, పారిశుధ్య సౌకర్యాల సంఖ్యను, గృహవైద్య సహాయం, ప్రథమ చికిత్సకేంద్రాల సంఖ్యను విస్తృత పరచాలి. వాటి పనిని అభివృద్ధి పరచాలి.

నూతనపంచవర్ష ప్రణాళిక వైద్యసహాయంలో ఎక్కువ ప్రత్యేక పరిశోధన లకు, ప్రజారోగ్య సౌకర్యాలల్లో భౌతిక సాంకేతిక అవకాశాల విస్తరణకు అవ కాశాలు కల్పించింది. అధిక సంఖ్యలో పట్టణాల్లోను, గ్రామీణ ప్రాంతాల్లో జిల్లా ఆసుపత్రుల పాలీక్లినిక్‌లు నిర్మించబడతాయి. మరింత ఎక్కువగా మందులు ఉత్పత్తి చేయబడతాయి.

ఐదు సంవత్సరాల్లోను రోగ నిరోధక చర్యలు, పిల్లల ఆరోగ్య రక్షణ అభివృద్ధి పరచడానికి, శారీరక సౌష్టవాన్ని, ఆటలను పెంపొందించడానికి, ఇతోధిక ఆరోగ్య పరిసరాలను సృష్టించడానికి – గాలిని, నీటిని శుభ్రపరచడం – మంచిపని పరిస్థితులను, జీవన పరిస్థితులను కలుగ జేయడానికి చర్యలు తీసుకోబడతాయి. పారిశుధ్య, అంటువ్యాధి నిరోధక సేవాసంస్థలు పారిశ్రామిక సంస్థల మేనేజిమెంట్ల వద్దనుండి ఆర్థికవ్యవస్థ వద్దనుండి డిమాండ్ల రూపంలో గణనీయంగా పారిశుధ్య అవసరాలను పెంపొందించాలి. సూక్ష్మక్రిములవల్ల వ్యాపించే అంటువ్యాధులు, మొత్తంమీద ఇన్‌ఫ్లూయంజా హృదయ రక్తనాళాలకు సంబంధించిన (కార్డియో వాస్క్యులర్) వ్యాధులు, ప్రమాదకరమైన కంతులు (మాలిగ్నెంటు ట్యూమర్సు) విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. కొత్తమందులను, యాంటిబయోటిక్స్ వాక్సిన్‌లు, సీరంలను వృద్ధిపరచుటకు కొత్త వైద్య పరికరాలను, పనిముట్లను, తది తర అవసరాలను ఉత్పత్తి చేయటకు ఎక్కువగా కృషి చేయవలసివుంది. మన ప్రజచే ఎంతో గౌరవింప బడుతున్న మన వైద్య సిబ్బంది — శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, తదితర వైద్యసిబ్బంది - తమ కర్తవ్య నిర్వహణలోను, తమ రంగంలో నూతన విజయాలను సాధించడంలోను కృతకృత్యులవుతారనే అంశంలో మనకు ఏమాత్రం సందేహం లేదు.

సాంస్కృతికాభివృద్ధిలో గూడ పంచవర్ష ప్రణాళిక నూతన స్థాయిని నెలకొల్పాలి. భౌతిక ఉత్పత్తిలో ఏర్పడిన బ్రహ్మాండమైన పెరుగుదల, జీవన ప్రమాణాల్లో గణనీయమైన పెరుగుదల సోవియట్ సోషలిస్టు సంస్కృతి పురోగ మనానికి భౌతిక పరిస్థితుల్ని సృష్టిస్తాయి. భౌతిక సంపద ఉత్పత్తిని సోషలిస్టు నిర్మాణం నిరవధికంగా అనేకరెట్లు హెచ్చిస్తుంది. యావత్తు ప్రజలకు దాన్ని లభ్య

మయేటట్లు చేస్తుంది. ఫలితంగా సాంస్కృతికాభివృద్ధికి అవసరమైన ప్రాతిపదికలు సృష్టింప బడతాయి. ప్రజలలోని విస్తృత తరగతులకు అవి అందుబాటులో వుంటాయి. అన్ని అధికారాలు, అన్ని ప్రభుత్వ సంపదలు శ్రామిక ప్రజలకు చెందియుండుట వల్ల వారిలో సాంస్కృతికాభిలాష మన దేశంలోని సాంస్కృతికాభివృద్ధి అసామాన్యం; ఏ పెట్టుబడిదారీ దేశం ఈ విషయంలో మనతో దీటురాదు. సోవియట్ దేశం ఏర్పడిన కొద్ది సంవత్సరాలకి, లెనిన్ దానినే ఊహించి యిలా చెప్పారు: నిజమైన సంస్కృతిపట్ల మాదేశంలో ప్రజలు ప్రదర్శించిన ఆసక్తి మరొక చోట ఎక్కడా ప్రదర్శించలేదు. నిజమైన సంస్కృతి పట్ల మరొక చోట ఎక్కడా అటువంటి సమగ్రమైన, స్థిరమైన శ్రద్ధ ప్రదర్శింప బడలేదు; (కలక్టెడ్ వర్క్స్, సంపుటి 45, పుట 364, రష్యన్ ప్రచురణ). లెనిన్ ప్రకటన నేటికీ వర్తిస్తుంది. వచ్చే ఐదుసంవత్సరాల్లోను సోషలిస్టు సంస్కృతి త్వరగా అభివృద్ధి పొందాల్సి వుంది.

సోవియట్ యూనియన్‌లో ఎనిమిది సంవత్సరాల క్రితం పాఠశాల వయస్సు పిల్లలందరికీ ఎనిమిది సంవత్సరాల నిర్బంధ విద్య ప్రవేశ పెట్టబడింది. అది సోషలిజం సాధించిన ఘన విజయం. ఇప్పుడు ఆ విజయమును దేశంలోని ప్రజలను యింకెంతమాత్రం సంతృప్తి పరచలేదు. ఇప్పుడు మేం విద్యను యింకా ఎక్కువ స్థాయికి పెంపొందించాలి: నిర్బంధ సార్వజనీన సెకండరీ విద్యకు పరివర్తనను ప్రధానంగా పూర్తి చెయ్యాలి.

గత ఐదు సంవత్సరాల్లో కంటె రాబోయే ఐదు సంవత్సరాల్లోను పూర్తి సెకండరీ విద్య చదివే యువజనుల సంఖ్య నాల్గురెట్లు అధికంగా వుంటుంది. కాబట్టి నూతన పాఠశాలల నిర్మాణానికి పెద్ద మొత్తాలు కేటాయించ బడతాయి. నూతన పాఠశాలలను నిర్మించడంలోను, వాటిపనిని వ్యవస్థీకరించడంలోను పార్టీ, ప్రభుత్వం కార్మికసంస్థలు నిర్విరామంగా అజమాయిషీ చేయ్యాలి. నూతన పాఠశాలలను నిర్మించడంలోను, వాటికి అవసరమయిన పరికరాలను సమకూర్చడంలోను పారిశ్రామిక సంస్థలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు గొప్ప సహాయం అందజేస్తాయనడంలో సందేహం లేదు. సార్వజనీన సెకండరీ విద్యను జయప్రదంచేసే నిజమైన చరిత్రాత్మక కర్తవ్యాన్ని పరిష్కరించే ప్రధానమైన బాధ్యతను సాధారణంగా విద్యావేత్తలు చేపట్టాలి. మనసెకండరీ పాఠశాలకు ఎన్నో విజయాలను సాధించిన ఘనత దక్కింది. కాని వాటి పనిలో తీవ్రమైన

లోపాలుకూడా వున్నాయి. అద్యతన ఛాయిలో వాటిని అధిగమించాలి. అధిగమించ గలం. అధునాతన అత్యున్నత సాంకేతిక ఉత్పత్తిలోని విభిన్నావసరాలతో పోలిస్తే పాఠశాల బోధన యింకా వెనుకబడే వుంది. ప్రతి సంవత్సరం పాఠ్యపుస్తకాలు మారిపోతున్నాయి. ప్రశ్నలసంఖ్య పెరిగి పోతోంది. కాని వాటిని తొలగించవచ్చు. వాటి స్థానంలో ఆధునిక శాస్త్రీయ దృక్పథం నుండి అతి ముఖ్యమైన యితర ప్రశ్నలు వేయవచ్చు; అనేక విద్యాంశాలకు ప్రామాణిక పాఠ్య గ్రంథాలులేవు. విద్యార్థులందరిలో ఆత్మసంయమం, క్రమశిక్షణ, పట్టుదల అలవరచు కోవాలనే భావం పెంపొందించే కృషి యింకా ఎంతో మిగిలివుంది. శారీరక శిక్షణ, రసాస్వాదన విద్యపట్ల యింకా శ్రద్ధ తక్కువగా తీసుకో బడుతోంది.

నూతన ఐదుసంవత్సరాల కాలంలో సెకండరీ పాఠశాల పనిని ఎక్కువగా అభివృద్ధిపరచవలసివుంది. ఆ పాఠశాల వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుతుంది గాన, దాన్ని సాధించుటకు చేయవలసిన కృషిని గాని, సాధనాలనుగాని విడిచి పెట్టరాదు. మన పాఠశాలలు మంచి విజ్ఞానం కలగచేయ్యాలి. యువజనుల్లో పనిచేసే అలవాటును, పౌరవిధుల పట్ల దార్ఢ్యతను గుర్తించడం పెంపొందించాలి. కమ్యూనిస్టు నిర్మాతల నైతిక నిబంధనావళికి అనుగుణమైన ఆంతరంగిక లక్షణాలను యువకుల్లో అభివృద్ధి పరచాలి.

సర్వ సాధారణంగా, పాఠశాలల్లో విద్యాబోధన, శిక్షణల అభివృద్ధి విషయంలో ఒక విధమైన తొందరపాటు చర్యలుగాని, పునర్వ్యవస్థీకరణ పథకంగాని పనికిరావు; అది ఎంతో శ్రమతో కూడినపని; ఏమాత్రం తొందర పడకుండా శాస్త్రీయ పద్ధతులపైన దానిని కొనసాగించ వలసివుంది.

మన ఉపాధ్యాయులు ఎంతో ప్రధానమైన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నారు. అది నిజంగా ఒక ఘనకార్యమే. మన ఉపాధ్యాయుల పాత్రను, ప్రతిష్టను పెంపొందించాలి. వర్ధమాన తరాన్ని విద్యావంతులను చేయుటలో ఉపాధ్యాయులు నిర్వహించే మహత్తర కర్తవ్యానికి అనువైన ఫలప్రదమైన పరిస్థితులను పార్టీ, ప్రభుత్వం, కార్మిక సంఘాలు, పరిశ్రమలు, సంస్థలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు సృష్టించాలి. సహాయ పడాలి.

వచ్చే ఐదుసంవత్సరాల్లోను ప్రతి సంవత్సరం సెకండరీ, సాంకేతిక పాఠశాలలనుంచి నాలుగైదు మిలియన్లవిద్యార్థులు ఉత్తీర్ణులౌతారు. సాధారణంగా వారిలో ఒక భాగం మాత్రమే ఉన్నత విద్యా సంస్థలలో చేరగలుగుతారు. అత్యధిక సంఖ్యా

కులు జాతీయార్థిక వ్యవస్థలో వృత్తులు స్వీకరిస్తారు. వారంతా జీవితంలో తమ స్థానాన్ని ఎంచుకోడానికి పంచవర్ష ప్రణాళిక అవకాశం కల్పించాలి.

వృత్తిశిక్షణ ప్రాముఖ్యతకూడా పెరుగుతుంది. ఐదుసంవత్సరాల ఆఖరికి వృత్తి పాఠశాలల్లో చేరేవారి సంఖ్య సంవత్సరానికి 1.7 నుండి 1.8 మిలియన్ల వరకు పెరుగుతుంది. అందుకు అనుగుణంగా వృత్తిపాఠశాలల సంఖ్య విస్తృతం కావాలి; వాటి భౌతిక ప్రాతిపదిక పటిష్ట వంతం కావాలి.

సోవియట్ ఆర్థిక వ్యవస్థలో సెకండరీ విద్యలో ప్రత్యేక శిక్షణ పొందిన కార్మికులు చాలాతక్కువ. సెకండరీ సాంకేతిక పాఠశాలల్లో సుమారు 50 శాతం ప్రజలు ఎక్కువగా చేర్చుకోబడతాయి 1970 నాటికి ఆ విధంగా చేర్చుకోబడిన వారి సంఖ్య 1,600,000 కు పెరుగుతుంది. సెకండరీ సాంకేతిక పాఠశాలల్లో బోధనను అభివృద్ధి పరచడానికి, వర్తమాన అవసరాలకు అనుగుణంగా పెంపొందించడానికి కర్తవ్యాలను రూపొందించాలి.

1965-66 విద్యా సంవత్సరంలో 3,830,000 విద్యార్థులు సోవియట్ ఉన్నత విద్యాసంస్థల్లో చేర్చుకోబడ్డారు. నూతన పంచవర్ష ప్రణాళికాకాలం ఆఖరయ్యేటప్పటికి చేరే విద్యార్థుల సంఖ్య 9 40,000 కి చేరు కుంటుంది. మొత్తం చేరేవారి సంఖ్య సుమారు ఐదు మిలియన్లకు పెరుగు తుంది.

పరిశోధకుల శిక్షణా ప్రమాణాన్ని అభివృద్ధి పరచవలసిన అవసరం వుంది. ఇది ఉత్పత్తి అభివృద్ధి, శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధి జీవితంలో తప్పనిసరి.

ఉన్నత, ప్రత్యేక సెకండరీ పాఠశాలలు తమ విద్యార్థులకు మార్క్సిస్టు లెనినిస్టు ప్రపంచ దృక్పథాన్ని, లోతైన సిద్ధాంత ఆచరణ యుక్తమైన విజ్ఞానాన్ని బోధించాలి. పరిశోధకుల్ని మంచి అర్థశాస్త్రం, మేనేజిమెంటు పద్ధతులు, కార్మికుల్ని వ్యవస్థీకరించే శాస్త్రీయసూత్రాలు లోతుగా తెలిసిన నిపుణతగల ఉత్పత్తి కార్యకర్తలను ఉన్నత పాఠశాల తయారు చేస్తుందని దేశం భావిస్తోంది.

విద్యార్థుల, ఉపాధ్యాయుల పని సమయాన్ని, ఉపన్యాసాల సమయాన్ని, గోష్టులు, పరిశోధనలు, గ్రంథాలయాల్లోను, లేబొరేటరీల్లోను విద్యార్థులు స్వంతంగా చేసే పనిని హేతుబద్ధంగా పంపకం చేయాలి. అందుకు అనుగుణంగా ఉన్నత విద్యా సంస్థల పాఠ్య గ్రంథాల్ని అభివృద్ధి పరచాలి. సృజనాత్మక కృషిలో పరి

శోధనలలో ఉపాధ్యాయులకు, విద్యార్థులకు అన్ని అవకాశాలు లభ్యమయ్యేటట్లు చేయ్యాలి.

మనకు ప్రశస్తమైన ఉన్నత పాఠశాలలు, పరిశోధనా సంస్థలు ఉన్నాయి.

ప్రపంచ విజ్ఞాన శాస్త్రంలో గణుతికెక్కిన సుప్రసిద్ధ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, బుద్ధిమంతులైన యువక విజ్ఞాన శాస్త్రజ్ఞులు వున్నందుకు మన దేశం గర్వించడం యుక్తమే. ఇంత వున్నప్పటికీ, పరిశోధన సంస్థల్లో వ్యవస్థీకృత కృషి, వ్యక్తుల ఎన్నిక వాటి విభజన, ప్రస్తుతం వున్న ఆర్థిక, నైతిక ప్రోత్సాహాలు, మంచి పరిశోధనాకృషికి, నూతన పరిశోధనల వ్యవస్థీకరణకు, సాహసోపేతమైన శాస్త్రీయ అన్వేషణకు, ఉత్పత్తిలో సన్నిహిత సంబంధాలకు, శాస్త్రీయసాంకేతిక విజయాలను ఆర్థిక వ్యవస్థతో సమన్వయ పరుచుటకు తరచు తగినంతగా హామీ యివ్వడం లేదు. ప్రత్యేకించి ప్రకృతి శాస్త్ర సాంకేతిక రంగంలో పరిశోధనను, సామాజిక శ్రమలో ఉత్పత్తి రంగానికి తరలించాలి. ఇది కోరిక మాత్రమేకాదు, అంతకంటె ఎక్కువయినదే; ఇది ఆచరణ యుక్తమైన కోర్కె, దీన్ని పూర్తి చేసి తీరాలి.

మనపార్టీకి, సోవియట్ ప్రభుత్వానికి సాంకేతిక శాస్త్రాలు, వాటికి సంబంధించిన ప్రకృతి శాస్త్ర శాఖలలోను తప్ప మరే విషయంలోను ఆసక్తి లేదని మన పెట్టుబడిదారీ ప్రతికక్షులు యిటీవల చెబుతున్నారు. ఈ వివాదానికి ఆధారం లేదు, ఎందు చేతనంటే మన యావత్తు కార్యకలాపాలకు శాస్త్రీయ పునాదివుంది. అవి అత్యంత ప్రగతి శీలమైన సాంఘికాభివృద్ధి సిద్ధాంతంపైన ఆధారపడి వున్నాయి. సాంఘికాభివృద్ధి, వ్యక్తిని తీర్చిదిద్దడం, మార్క్సిస్టు లెనినిస్టు శాస్త్రంపై ఆధారపడి వున్నాయి. మార్క్సిస్టు – లెనినిస్టు తత్వ శాస్త్రం విద్యా రంగాలన్నింటిలోను ఎంతో కాలంనుంచి శాస్త్రీయ పరిశోధనలో అనుసరించే ప్రాతిపదికగా వుంది. భౌతిక వాద అవగాహనతో కూడిన చరిత్రపై ఆధారపడిన సాంఘిక శాస్త్రం పరిశోధన సోషలిస్టు సమాజ జీవితంలోని నిర్దిష్ట ఘటనలను సామాన్యీ కరిస్తుంది. ఉత్పత్తి, విద్య, రాజకీయాల్లో ఎదురయ్యే ఆచరణ పూర్వక సమస్యలను పరిష్కరించడంలో ఎల్లప్పుడూ మహత్తరమైన పాత్రను నిర్వహిస్తోంది.

సామ్యవాద సంస్కృతి యితోధికాభివృద్ధికి మన దేశంలో విస్తృతఅవకాశాలు వున్నాయి. కార్మిక, కర్షక వర్గాలకు చెందిన మన మేధావివర్గంలో సుమారు 25 మిలియన్ల ప్రజలు వున్నారు. మారుమూలలకు వ్యాపించిన సాంస్కృతిక వ్యవస్థ, కళాసంస్థలు అన్ని యూనియన్ రిపబ్లిక్కులలోను స్వయం పరిపాలనా రిపబ్లిక్కు-

లలోను నిర్మించ బడ్డాయి. అన్ని తరగతుల ప్రజలు కళాత్మక కృషిలో పాలు తీసుకోవడం, మన కాలంలో విశేషమైన అంశం. పట్టణ, గ్రామీణ ప్రాంతాల్లో సుమారు పదిమిలియన్లమంది ప్రజలు ప్రజాసాంస్కృతిక విశ్వవిద్యాలయాల్లోను, ప్రజా నాట్యశాలలు, ఫిల్ హార్మోనిక్ సంఘాలు, పాటలు, నృత్యం. సంగీత బృందాలు, తదితర ప్రోత్సాహిక కళా సమాజల్లోను పనిచేస్తున్నారు. గ్రంథప్రచురణ, సినిమా, రేడియో. టెలివిజన్ అపరిమితమైన నిష్పత్తులలో విస్తృతమైంది. సైద్ధాంతిక సాంస్కృతికాభివృద్ధికి అవి శక్తివంతమైన సాధనాలు. వాటిని మనం పూర్తిగా ఉపయోగించు కోవాలి.

వర్తమాన ఆర్థిక, సాంస్కృతికస్థాయి. వాటి యితోధికాభివృద్ధి కమ్యూనిస్టు నిర్మాణ ప్రధాన సమస్య పరిష్కారానికి మార్గాన్ని సుమగం చేస్తున్నాయి. శారీరక, మానసిక శ్రమలమధ్య, పట్టణ, గ్రామీణ ప్రాంతాలమధ్య అంతరాలను రూపుమాపు తున్నాయి. ఆ బ్రహ్మాండమైన సాంఘిక సమస్యల పరిష్కారంలో వచ్చే ఐదు సంవత్సరాలు ఒక పెద్ద ముందంజ వెయ్యాలి.

సోవియట్ సంస్కృతి కళల విజయ వంతమైన అభివృద్ధికి ముసాయిదా ఆదేశం భౌతిక ప్రాతిపదికను నిర్వచించాలి. శ్రామిక ప్రజలకు కమ్యూనిస్టు విద్య గరపడంలోను, వారి సాంస్కృతిక స్థాయిని పెంపొందించడంలోను, మన ప్రజలలో అంతర్నిహితమై వున్న అద్భుతమైన శక్తులను, ప్రతిభలను వృద్ధి పొందించుటకు తోడ్పడంలోను, పట్టణాల్లోను, గ్రామీణ ప్రాంతాల్లోను శాఖోప శాఖలుగా పెంపొందుతున్న నృత్యశాలల వ్యవస్థ, క్లబ్బులు, భవనాలు, సాంస్కృతిక గృహాలు, గ్రంధాలయాలు, పురాతన వస్తు ప్రదర్శన శాలలు, సాంస్కృతిక సంస్థలు పటిష్ట వంతంగా కృషి చేయ్యాలి. సోవియట్ ప్రజలలో పెంపొందుతున్న మానసిక వాంఛలను పూర్తిగా పరిష్కరించడానికి సోవియట్ వ్యవస్థ సృష్టించిన అనుకూల పరిస్థితులను, అవకాశాలను విద్యావేత్తలు, కళాకారులు, తదితర సంస్కృతీపరులు పూర్తిగా ఉపయోగించు కోవాలి.

ప్రజల జీవనప్రమాణాన్ని, సాంస్కృతిక స్థాయిని వృద్ధిపరచుటకు ఉద్దేశించి, ముసాయిదా ఆదేశాలలో నిర్దేశించిన కర్తవ్యాల అమలుకు యింతక్రితమే నేను చెప్పినట్లు బ్రహ్మాండమైన వ్యయం అవుతుంది. ఏమైనప్పటికి పార్టీ కేంద్ర కమిటీ వీటిని కనీస కర్తవ్యాలుగా పరిగణిస్తోంది. ఈ ఐదుసంవత్సరాల్లోను మనం ఎంత ముందుకు వెళ్ళ గలుగుతాం, ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధి పరచడంలో మనం

ఎంత ఎక్కువ చెయ్యగలుగుతాం అనే అంశం మన శ్రమ ఫలితాలపైన, మనం చాక చక్యంగా వ్యవహరించడం పైన ఆధారపడి వుంది. ఉత్పత్తిని అధికం చెయ్యడంలోను, ఖర్చులను తగ్గించడంలోను, అత్యధిక లాభాలను ఆర్జించడంలోను ప్రజాశికా లక్ష్యాలను అధిగమించే విధంగా వ్యవహరిస్తే, జీవన ప్రమాణాన్ని వృద్ధిపరచడంలో దేశం అదనపు చర్యలను వేసుకోగలదు.

## 8. విదేశాలతో సోవియట్ ఆర్థిక సంబంధాల అభివృద్ధి

కామ్రేడ్స్, గత ఏడు సంవత్సరాల్లో సోవియట్ యూనియన్ ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాల అభివృద్ధిని కొనసాగిస్తూ వుంది. మన దేశ కార్యకలాపాలు సోవియట్ ఆర్థిక వ్యవస్థను ఇతోధికంగా పెంపొందించడమే గాదు, ప్రపంచ సోషలిస్టు దేశాల మధ్య సన్నిహిత సంబంధాలను సైతం పెంపొందించాయి. వాని శక్తిని అభివృద్ధి పరచాయి. స్వతంత్ర అభివృద్ధి పథాన్ని చేపట్టిన తరున ఆసియా, ఆఫ్రికా దేశాలను పటిష్టం చేశాయి. శాంతి, సాంఘికాభ్యుదయాలకోసం సాగే పోరాటాన్ని ముందుకు కొనిపోవడంలో దేశాలలో సోవియట్ యూనియన్ ఆర్థిక సంబంధాలు ఎనలేని అంతర్జాతీయ ప్రాధాన్యం వహించాయి.

విదేశాలలో మన ఆర్థిక సంబంధాలలో సోదర సోషలిస్టు దేశాలు గర్వించ తగిన స్థానం వహిస్తున్నాయి. సోవియట్ యూనియన్ విదేశీ వాణిజ్యంలో నూటికి 70 వంతులు వీటితోనే జరుగుతున్నది. జాతీయ ఆర్థిక వ్యవస్థకు సామగ్రిని ముడి సరుకులను కూర్చడానికి జనాభాను, వినిమయ సరకులను హెచ్చించడానికి సోషలిస్టు దేశాల మధ్య శ్రమ విభజన యొక్క పాత్ర పెంపొందుతూ వుంది. సాంకేతిక ప్రగతిని పెంపొందించడానికీ, సాంఘికోత్పత్తి, సామర్థ్యాన్ని పెంచడానికీ, ఇది తోడ్పడుతున్నది. ఐచ్ఛిక పద్ధతిపై, పూర్తి సమానత్వ ప్రాతిపదికపై అనుసరిస్తున్న అంతర్జాతీయ సోషలిస్టు శ్రమ విభజన, మనకూ మన మిత్రులయిన సోదర సోషలిస్టు దేశాలకూ, కమ్యూనిజం నిర్మాణమనే మన ఉమ్మడి లక్ష్యం దిశగా శీఘ్రగతిని పురోగమించడానికి తోడ్పడుతున్నది.

సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు రానున్న ఐదు సంవత్సరాలలో ఇంకా ఇతోధికంగా విస్తరించబోతున్నాయి. శాస్త్రీయ సాంకేతిక రంగాల్లో మన సహకారం పెంపొందుతుంది. అలానే మన

వాణిజ్యంకూడా. ఒక గ్రూపు రాజ్యాలమధ్య సమన్వయం ద్వారా ఐదు సంవత్స రాల ముందుగానే పరస్పరం ఇచ్చిపుచ్చుకొనే ప్రాతిపదికపై ఇంత భారీ యెత్తున సరుకుల మార్పిడి జరగడం అంతర్దేశీయ ఆర్థిక సంబంధాలు చరిత్రలో యిదే మొదటిసారి. సోదర దేశాలతో దీర్ఘకాలిక వాణిజ్య ఒప్పందాలక్రింద పరస్పర ప్రాతిపదికపై సోవియట్ స్వీకరించిన బాధ్యతలను నూతన ప్రణాళికా మునాయిదా లక్ష్యాలను అమలుజరపడంద్వారా నెరవేర్చే అవకాశం వుంది.

నూతన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను నెరవేర్చడానికి సోషలిస్టు దేశాలతో సహకారం మనకు తోడ్పడుతుంది. రసాయనిక పరిశ్రమలోనూ, తేలిక పరిశ్రమ ల్లోనూ, ఆహారాది పరిశ్రమల్లోనూ గల సంస్థలకూ, షాపులకూ అవసరమైన సామగ్రిని వేయి సెట్లకు పైగా సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశాలనుండి కొనుగోలు చేయబోతున్నది. మన వాణిజ్య నౌకల అవసరాల్లో నూటికి 48 వంతులు, ప్రధాన రైల్వే మార్గాలనూ, పరిశ్రమలకు అవసరమైన విద్యుత్ రైల్వే ఇంజ నీర్లలో నూటికి 40 వంతులు ప్యాసెంజరు రైల్వే కార్లు మున్నగు అవసరాలలో నూటికి 36 వంతులు మనకు సోదర దేశాలనుండి దిగుమతులద్వారా తీరుతాయి. దుస్తులు, అల్లిక వస్తువులు, పాదరక్షలు, జౌళి సరుకులు, ఆహారం, రసాయనిక పదార్థాలవంటి సరుకులను భారీ మొత్తాల్లో మనం కొనుగోలు చేసుకుంటాము. మన జనాభా అవసరాలను ఇవి తీర్చగలవు. దీనికి ప్రతిగా సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలకు ప్రధాన అవసరాలను, అనేక తరహాలైన పరిశ్రమలనూ, యంత్ర సామగ్రినీ, ఇంధన సామగ్రినీ. లోహపు ఫ్యాక్టరీలకు అవసరమైన ముడి పదార్థాలనూ, లోహాలు, ప్రత్తి, కలప, సెల్యులోజ్, రాగితము తదితర కొన్ని యితర ముఖ్యమైన సరుకులనూ సరఫరా చేస్తుంది.

విస్తరిస్తున్న ఆర్థిక సహకారం సహజంగానే నూతన సమస్యలను సృష్టిస్తుంది. ప్రస్తుతం సోషలిస్టు దేశాలు తమకు అవసరమైన పరిశ్రమలు, యంత్రాల విషయంలో నూటికి 95 శాతానికి పైగా తమ స్వీయ ఉత్పత్తుల మీదా, పరస్పర మార్పిడి మీదా ఆధారపడి వున్నాయి. అందువల్ల నిర్దుష్టమైన సమయంలో వున్నత ప్రమాణం గలిగిన సరకులను పరస్పరం అందించడానికి పరిశ్రమలు, విదేశ వాణిజ్యసంస్థలు గురుతర బాధ్యత వహించాలి. మన దేశంలోని మన మిత్ర దేశాలలోని పరిశ్రమలు విదేశ వాణిజ్య సంస్థలు ఈ లక్ష్యాన్ని నెరవేర్చగలవనే విశ్వాసం పూర్తిగావుంది. వివిధ పరిశ్రమల్లో సహకారం, ప్రత్యేక ప్రావీణ్యత

వి స్తరణ సోషలిస్టుదేశాల ప్రయోజనాలకు అవసరమని ఈ ముసాయిదా ఆదేశాలు గుర్తించాయి. ఉత్పత్తిలో సోషలిస్టు సహకారం సహజంగానే ప్రజల భాగస్వామి ప్రయోజనాలను ఖచ్చితంగా ప్రాతిపదికగా తీసుకుంటుంది.

రానున్న ఐదు సంవత్సరాల్లో శాస్త్రీయ, సాంకేతిక సహకార విస్తరణకు మనం చేయ వలసిన కృషి ఎంతో వుంది. సైద్ధాంతిక, ప్రయోగాత్మక పరిశోధన రంగాలలోనూ, నమూనాల, ముసాయిదాల తయారీలను సోషలిస్టు దేశాల కృషిని సమన్వయం చేయడానికి ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ వనరులను సక్రమంగా వినియోగించడం ప్రధాన మైనది.

సోషలిస్టు దేశాల మధ్య సకలవిధాలైన ఆర్థికసంబంధాల అభివద్ధి మనకు అత్యంత ప్రధానమైనది. ఎందువల్ల నంటే ఇది ప్రత్యేక దేశాల ప్రయోజనాలతోను, ప్రపంచ, మొత్తం సోషలిస్టువ్యవస్థ ప్రయోజనాలతోనూ ముడిపడివుంది. కార్మికవర్గ అంతర్జాతీయతకు సంబంధించిన లెనినిస్టు సూత్రాలననుసరించి. సి.పి.యస్.యు. కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వము సోదర దేశాల మధ్య సహకార విస్తరణకూ, సోషలిస్టు కుటుంబం యొక్క ఆర్థికశక్తి పెరుగుదలకు సోషలిస్టుశిబిరం ఐక్యత పటిష్టం కావడానికీ శక్తి వంచన లేకుండా కృషి చేస్తాయి.

స్వతంత్ర ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలతో మన ఆర్థిక సంబంధాల విస్తరణకు మనం అధికతర ప్రాధాన్యంఇస్తాము. ప్రపంచజనాభామొత్తం సగం జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఈ దేశాలు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా తీవ్రపోరాటానికి నేడురంగస్థలాలయ్యాయి. ఈ తీరున జాతీయరాజ్యాలలో సోవియట్ ఆర్థిక సహకారం వాటి ఆర్థిక వ్యవస్థలను పటిష్టం చేస్తుంది. శాంతి సాధన ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల అభివృద్ధి సాధన కృషిలో ఇది ముఖ్యమైన అంశం.

ఆర్థికంగా సోవియట్ యూనియన్ వర్ధమాన దేశాల కిచ్చే సహకారం, ఆ దేశాల్లో కీలక పరిశ్రమల నిర్మాణం, సాంకేతికుల, శాస్త్రవేత్తల శిక్షణ, ప్రపంచమార్కెట్టులో ఆ దేశాల స్థానాన్ని పటిష్టంచేయడంలాంటి ప్రధానసమస్యలను పరిష్కరించడానికి ఉద్దేశించింది. ఈ సహకారం అంతర్జాతీయ శ్రమ విభజన ప్రయోజనాలను సక్రమంగా ఉపయోగించుకొనడానికి సోవియటు యూనియన్‌కు అదనపు అవకాశాలను ఇస్తుంది. మనం ఈ దేశాల్లో భారీ మొత్తాల్లో ఆ దేశాల సంప్రదాయిక ఎగుమతి సరకులైన ప్రత్తి, ఉన్ని, తోళ్లు, నాన్ ఫెర్రస్, లోహాలు



14

వనస్పతి నూనె, పండ్లు, కోకో, కాఫీ, చిక్కుళ్లు, టీ, తదితర ముడి పదార్థాలు, తయారుచేసిన సరకులతో సహా కొనుగోలు చేయగలము.

రానున్న ఐదు సంవత్సరాలలో వర్ధమాన దేశాలతో వాణిజ్యాన్ని గణనీయంగా విస్తరింపజేయవలసి వున్నది. వాణిజ్యం మొత్తాన్ని విస్తరింప జేయాలన్నది ఒక్కటే సమస్య కాదు. వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థలోని మార్పులకు అనుగుణ్యంగా ఈ వాణిజ్యాలలో వ్యవస్థాత్మక మార్పులు చేయవలసివున్నది. ఈ ముసాయిదా ఆదేశాలు, స్వతంత్ర జాతీయ ఆర్థిక వ్యవస్థను నిర్మించుకొనే దేశాలకు పరిశ్రమలను, పరికరాల ఎగుమతిని గణనీయంగా విస్తరింపచేయడానికి అవకాశం కల్పిస్తున్నవి. విడి భాగాలు, సామానులు, కొన్ని రకాల ముడి సరుకులు, తదితర సరుకుల ఎగుమతులతో తదనుగుణ్యమైన పెంపుదలను సాధించడం అత్యవసరం.

వర్ధమాన దేశాలలోని వారికి శిక్షణ ఇవ్వడం అత్యంత ప్రాధాన్యంగలది. ఇది జాతీయ పారిశ్రామికాభివృద్ధి కన్నా తక్కువ ప్రాధాన్యంగలదేమీ కాదు. జాతీయ నిపుణుల శిక్షణలో మన సహకారం ఇతోధికంగా పెంపొందించడానికి ఈ ముసాయిదా ఆదేశాలు పేర్కొంటున్నాయి.

సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్న జాతుల సృజనాత్మక శక్తులలోనూ, వారి న్యాయమైన లక్ష్యాలయొక్క విజయాల్లోనూ మనకు అచంచలమైన విశ్వాసం వున్నది వీరికి నిర్విరామంగా ఆర్థిక సహకారాన్ని అందించడానికి మన శాయశక్తులా కృషి చేస్తాము.

గత ఐదు సంవత్సరాలలో పెట్టుబడిదారీ దేశాలలో, ప్రధానంగా ఫిన్లండ్, ఫ్రాన్స్, ఇటలీ, జపాన్, బ్రిటన్, స్వీడన్ దేశాలలో సోవియట్ వాణిజ్యం మొత్తం 50 శాతానికి పైగా పెరిగింది. అయితే పశ్చిమ దేశాలలో యు. యస్. యస్. ఆర్. వాణిజ్య సంబంధాలు కృత్రిమమైన అవరోధాల మూలంగా దెబ్బతిన్నాయి. అనేక దేశాలు ఇప్పటికీ సోవియట్ సరుకులపైన హెచ్చు సుంకాలను విధిస్తున్నాయి. ఇతరదేశాలతో సోవియట్ వర్తకం పెంపొందకుండా నిరోధించడానికి అమెరికా ప్రయత్నిస్తున్నది. అయితే దాని ప్రయత్నాలు ఫలించలేదు. 20 వ శతాబ్దంలో సైతం విస్తృతమైన అంతర్జాతీయ వాణిజ్యానికి అడ్డుగోడలు కట్టడానికి ప్రయత్నించడం ద్వారా అమెరికా అప్రతిష్టను మాత్రమే పొందుతున్నది.

అంతర్జాతీయ శ్రమ విభజనయొక్క భౌతికావసరాలు, నిస్సందేహంగా సోవి

యట్ ఎగుమతులరూపాన్ని, ప్రస్తుత మన ఆర్థికవ్యవస్థకూ దాని శక్తిసామర్థ్యా అగునుణ్యంగా మలుస్తాయి. మన వాణిజ్యంలో భాగస్వాములు సోవియట్ ఆర్థిక వ్యవస్థలోని మార్పులను పరిగణనలోకి తీసుకుంటే పెట్టుబడి దారీ దేశాల్లో మన కొను గోలును విస్తారంగా పెంచుకోగలం. పెట్టుబడిదారీదేశాలలో ఇతోధికంగా వాణిజ్యాన్ని విస్తరింప జేయాలని ఈ ముసాయిదా ఆదేశాలు చెపుతున్నాయి. దీర్ఘకాలిక వాణిజ్యా లిణ ఒప్పందాల పరస్పర ప్రయోజనాత్మకమైన, స్థిరమైన వాణిజ్య సంబంధాలను పెంపొందించాలనే కాంక్షను ప్రతిబింబిస్తున్నాయి. అవి గతంలో మనం చేసిన వాణిజ్యం కంటే ఇతోధికంగా విదేశీ వాణిజ్యాన్ని పెంపొందిస్తాయని మనం విశ్వ సిస్తునాము.

వర్తమాన ప్రపంచంలో కొనసాగుతున్న శాస్త్రీయ సాంకేతిక విప్లవం, ఇంకా స్వతంత్రమైన అంతర్జాతీయ ఆర్థిక సంబంధాల అవసరాన్నీ, పెట్టుబడిదారీ–సోషలిస్టు దేశాలమధ్య విస్తృతమైన ఆర్థిక మార్పిడికి పరిస్థితులను కల్పిస్తున్నదనీ అంతకంతకూ స్పష్టమౌతున్నది. ఈ క్రమం ఆ మేరకు అంతర్జాతీయ పరిస్థితిపై సత్ప్రభావం కల్పిస్తుంది.

గత ఐదుసంవత్సరాల్లోనూ అనేక ప్రధానమైన ఆర్థిక సమస్యలను పరిష్కరించడానికి మనకు విదేశీ వాణిజ్యం తోడ్పడింది. అయితే ఈ విదేశ ఆర్థిక సంబంధాల అభివృద్ధి మనకు ఇచ్చిన అవకాశాలన్నింటిని మనం ఇప్పటికి ఉప యోగించు కోవడం లేదు.

విదేశీ వాణిజ్యంయొక్క పాత్రను మనం తిరిగి అంచనా వేయవలసిన సమయం ఆసన్నమైంది. మన విదేశీ వాణిజ్య సంస్థలలోని సిబ్బంది అంతా చాలా తరచుగా తమంతట తాము తమ స్వీయరంగానికి మాత్రమే పరిమితమైతే వారికార్య కలాపాల లక్ష్యం మొత్తంగా మన ఆర్థిక వ్యవస్థ సామర్థ్యాన్ని పెంపొందిచేలా వుండాలన్న దృష్టిని కోల్పోతారు. ప్రపంచ మార్కెట్టులో సంభవించిన మార్పులను, అవాంతరాలనన్నింటినీ దీర్ఘ కాలిక విదేశ వాణిజ్య ఒప్పందాలు దృష్టిలోకి తీసుకొనడానికి సాధ్యం కాదని వేరే చెప్పనవసరం లేదు. మన విదేశీ వాణిజ్య ప్రవీణులు మన ఆర్థిక వ్యవస్థ అవసరాలను తెలుసుకొని అత్యంత లాభసాటి అయిన కొనుగోలు అమ్మకం సరుకులను సూచించవలసిన ప్రాధాన్యం దీనిమూలంగా ద్విగుణీకృత మైంది. మరొక వైపున పరిశ్రమలలోని కార్యకర్తలు విదేశ వాణిజ్యానికి ద్వితీయ స్థాన మిస్తున్నారు. ఈ వైఖరి తప్పు. ఇది పూర్తిగా

మారాలి. పరిశ్రమలు, విదేశ వాణిజ్య సంస్థలూ తమ సంబంధాలు విస్తృత పరచుకోవాలి.

వాదకం వస్తువుల ఎగుమతి దిగుమతి సరళిని గణనీయంగా పెంపొందించడానికి, ఎగుమతి సరుకుల నాణ్యాన్ని పెంచడానికి, వాణిజ్య పద్ధతులను పెంపొందించడానికీ, దిగుమతి సరుకులను సక్రమంగా ఉపయోగించడానికీ అవసరమైన చర్యలు ఈ నూతన పంచవర్ష ప్రణాళికలో వుండి తీరాలి. అందువల్ల పరిశ్రమలు, పరికరాలు, తదితర ఉత్పత్తి సరుకుల ఎగుమతులకు ప్రాధాన్యం యివ్వడం, మనకు ఇనుమిక్కిలిగా విదేశ ద్రవ్య మారకాన్ని సంపాదించి పెట్టగల ముడి పదార్థాలను సగం తయారీ సరుకుల ఎగుమతులను పెంచడం అత్యవసరం. ఈ ప్రధానమైన ఆర్థిక లక్ష్య సాధనకు మన ప్రణాళిక నిపుణులు, పరిశ్రమలు, విదేశ వాణిజ్య సంస్థలు, రవాణా సంస్థలు చేయి చేయి కలిపి కృషి చేయాలి.

పారిశ్రామికాభివృద్ధి వచ్చే ఐదు సంవత్సరాల్లో విదేశ వాణిజ్యానికి అదనపు అవకాశాలను కల్పిస్తుంది. నేడు స్వతంత్ర ఇంజనీరింగు సాంకేతికంగా అభివృద్ధి చెందిన సరికొత్త యంత్ర పరికరాలను మన దేశంలో ఉత్పత్తి చేస్తున్నాము. మన ఇంజనీర్లు, కార్మికులు సృజనాత్మకశక్తికీ, నైపుణ్యానికీ చిహ్నమైన ఈ ప్రథమ శ్రేణి పరికరాలు కేవలం వాటికి అవసరమైన సాంకేతిక పత్రాలను రూపొందించడంలో అవసర జాగ్రత్తలు తీసుకొనక పోవడం సహించరాని విషయం. ఎందువల్ల నంటే అడ్వర్టయిజ్ మెంట్లు, మరమ్మతులకు యంత్రాంగం లేకపోవడం వల్ల అవి విదేశ మార్కెట్లకు చేరడం లేదు.

పేటెంట్లు, లైసెన్సుల వాణిజ్య ప్రాధాన్యత ఇటీవల వరకూ మనం తక్కువ అంచనా వేస్తూ వచ్చాము. ఇలాంటి వాణిజ్య ప్రాధాన్యత నేడు ప్రపంచంలో దిన దినము ఎక్కువగా వృద్ధి పొందుతూ వుంది. ఇది పారిశ్రామిక వస్తువుల వాణిజ్యం కంటే శీఘ్రగతిని పెంపొందుతున్నది. మన శాస్త్రవేత్తలు సాంకేతిక నిపుణులు అత్యాధునిక యంత్రాలను, పరికరాలను సృష్టించ గలరు. ఈ విషయం ఆచరణలో రుజువైందికూడా. అందువల్ల ప్రపంచ లైసెన్సు మార్కెట్టుల్లో మనం సముచితమైన స్థానాన్నిపొందాలి. పొందగలంకూడా. కొన్నివిషయాల్లో మనంతట మనం సమస్యా పరిష్కారానికి తలబద్దలు కొట్టుకొనడానికి బదులు లైసెన్సులను కొనుగోలు చేయడంద్వారా లాభపడవచ్చు. విదేశాలనుండి పెటెంట్లహక్కులను కొనుగోలు చేయటం ద్వారా రాగల ఐదు సంవత్సరాల్లో శాస్త్రీయ పరిశోధనలు కోట్లాది రూబుళ్ళను పొదుపు చేయ వీలౌతుంది.

నూతన పంచవర్ష ప్రణాళిక బృహత్ లక్ష్యాలలో ఒకటి ఎగుమతికి అవసరమైన అత్యంత సమర్థవంతమైన సరకుల ఉత్పత్తిని పెంపొందించడం. మంత్రివర్గాలు, ప్రణాళిక సంస్థలు ఈ లక్ష్యాన్ని సాధించడానికి తీవ్రంగా కృషిచేయాలి. తమ ఉత్పత్తులకు ఇంటా, బయటా మార్కెట్టు పరిస్థితులు ఎలా వున్నాయో కార్మికులు అధ్యయనం చేయాలి. దీనికి సంబంధించిన సమాచారాన్నంతటినీ విదేశీ వాణిజ్య మంత్రిత్వ శాఖవారికి అందించాలి.

మన కృషిలో విదేశీ ఆర్థిక సంబంధాలు ఒక ప్రధానమైన భాగం. ఈ రంగంలో పనిచేస్తున్న ఉద్యోగులు అత్యంత ప్రాధాన్యంగల కృషి చేస్తున్నారు. వారికి తోడ్పాటు ఇవ్వాలి, వారి చొరవను బలపరచాలి విదేశీ ఆర్థిక సంబంధాల అభివృద్ధి, వాటి అధికతర శక్తిసామర్థ్యాలు మన ఆర్థిక వ్యవస్థను ఇతోధికంగా పెంపుచేయడానికి తోడ్పడగలవు. లెనినిస్టు సోవియట్ విదేశాంగ విధానాన్ని అచంచలంగా ముందుకు తీసుకొనిపోవడానికి తోడ్పడగలవు.

## 9. పంచవర్ష ప్రణాళిక అంతర్జాతీయ ప్రాధాన్యత

కామ్రేడ్స్, మన పార్టీ కాంగ్రెస్‌లు ఎల్లప్పుడూ విదేశాల దృష్టిని ఆకర్షిస్తూనే ఉన్నాయి. సోవియట్ యూనియన్ గొప్ప ఆర్థిక సైనిక శక్తి గలిగిన మహత్తరమైన సోషలిస్టు రిపబ్లిక్, అంతర్జాతీయంగా అపారమైన పలుకుబడి కలిగి వుంది. ప్రపంచం నాలుగు చెరగులా మనకు మిత్రులున్నారు. మానవేతిహాసంలో ప్రప్రథమంగా సోషలిజాన్ని నిర్మించింది. ప్రస్తుతం కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి పూనుకొన్న మన దేశానికి ఈ నూతన పంచవర్ష ప్రణాళిక ఇతోధిక విజయాలను సాధించిపెట్టే ఒక హామీ అని మన విదేశీ మిత్రులు భావిస్తున్నారు. సోవియట్ దేశం సాధిస్తున్న విజయాలను మన వర్గశత్రువులు సైతం అధికాధికంగా గుర్తించక తప్పలేదు.

సోషలిజం, కమ్యూనిజం విధానాన్ని అనుసరిస్తున్న విజయవంతమైన కార్మిక వర్గంయొక్క బలీయమైన ఆదర్శం ప్రపంచ విప్లవక్రమాభివృద్ధిని పెంపొందించే కీలకాంశాలలో ఒకటి. మన ఆర్థిక పథకాలు, విజయాలు సకల దేశాలలోని కోట్లాది శ్రామిక ప్రజల మధ్య సోషలిజం, కమ్యూనిజాలకు ఉత్తమమైన ప్రచారమని మనం చెప్పుకోవడం న్యాయం. మన సోషలిస్టు దేశం తన ఆర్థిక

విధానాలద్వారా ప్రపంచ విప్లవంపై ప్రధానమైన ప్రభావాన్ని కలుగచేస్తుందన్న లెనిన్ ప్రకటనలోని వాస్తవాన్ని ఇంతకుముందుకంటే మనం నేడు ఇనుమిక్కిలిగా గ్రహిస్తున్నాము. పెట్టుబడిదారీ విధానం కంటే సోషలిజం ఉన్నతమైన శ్రామిక వుత్పాదక శక్తిని సృష్టించగలదని లెనిన్ చెప్పారు. రెండు వ్యవస్థల మధ్య ఆర్థిక పోటీ చారిత్రకంగా సహజక్రమమే నని ఆయన అభిప్రాయపడ్డారు.

సోవియట్ ప్రజానీకం పార్టీ నాయకత్వాన అంతరంగిక ప్రతీఘాత విప్లవాన్ని, విదేశీ జోక్యాన్ని అణచివేసి ఒక దేశంలో సోషలిస్టు నిర్మాణం అన్న లెనిన్ భావాలను అమలుజరపడం ప్రారంభించిన పిమ్మట, ఆచరణలో మనం పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థిక పోటీలో ప్రవేశించాము. నిజం చెప్పాలంటే ఆ రోజుల్లో మనం పెట్టుబడిదారీ ప్రపంచంలోని అతి సంపన్న దేశాలను అధిగమించే లక్ష్యాన్ని మనంతట మనం నిర్ణయించుకొనే దశలోనే లేము. అయితే మన ఆర్థిక పరిస్థితి బలంపుంజుకొన్నకొలదీ ఈ లక్ష్యం అంతకంతకూ వాస్తవం కాజొచ్చింది.

ఉదాహరణకు ఉక్కు వుత్పత్తి అంకెలు సోవియట్ పరిశ్రమ సత్వరాభివృద్ధిని విశదం చేస్తాయి. 1928 లో మనం ప్రపంచంలోని ఉక్కు ఉత్పత్తిలో 3.9 శాతం మాత్రమే ఉత్పత్తి చేసేవారం. నేడు మనం ప్రపంచంలోని ఉక్కు వుత్పత్తిలో దాదాపు 20 శాతం వరకూ వుత్పత్తి చేస్తున్నాము. 1928 లో సోవియట్ ఉక్కు వుత్పత్తి ఆనాటి అమెరికా ఉత్పత్తిలో 8 శాతానికి సమానం. అంతేగాదు. ఉక్కు వుత్పత్తిలో మనం బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీలకన్న చాలా వెనుకబడి వుండేవారం. 1965 లో సోవియట్ ఉక్కు వుత్పత్తి అమెరికా వుత్పత్తిలో 75 శాతానికి చేరింది. బ్రిటన్, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ మూడింటి మొత్తం ఉత్పత్తిని ఎంతగానో అధిగమించింది.

పెట్టుబడిదారీ వ్యవస్థను తొలగించ వీలులేని అంగవైకల్యమున్నది. బూర్జువా ఆర్థిక వేత్తలు ఆశలు పెట్టుకున్న ప్రభుత్వ సూత్రబద్ధ ఆర్థిక విధానాలు, తదితర అంశాలన్నీ ఆర్థికాభివృద్ధి సద్యోజాతిక ప్రకృతిని తాయిమాయి చేయలేకపోయాయి. సత్వర ఆర్థికాభివృద్ధిని సాధించలేక పోయాయి. ఆర్థికాభివృద్ధిలో అపకితపకలను తొలగించలేక పోయాయి. పెట్టుబడిదారీ విధానపు సహజ లక్షణమైన వర్గవైరుధ్యాలను తొలగించలేక పోయాయి. ఉదాహరణకు 1948 – 1961 మధ్యకాలంలో అమెరికాలో ఉత్పత్తి మరీ పెరిగినందువల్ల నాలుగుసార్లు ఆర్థికమాంద్యం వచ్చింది. పశ్చిమ యూరప్ దేశాలలో కొన్ని సంవత్సరాలపాటు 8 నుండి 10 శాతం వరకు

పారిశ్రామిక ఉత్పత్తి పెరిగింది. అలాగే జపానులో 15 శాతం అంతకుమించీ వృద్ధి చెందింది. కానీ, ఈ పెరుగుదల మధ్య మధ్య పడిపోతూ వచ్చింది. గత రెండు సంవత్సరాల్లో గణనీయంగా పడిపోయింది.

మొత్తంమీద పెట్టుబడిదారీ ప్రపంచంలోని ఆర్థిక అస్థిరత్వాన్ని, తత్ఫలితంగా రాజకీయ పరిస్థితినీ యుద్ధానంతరం అనుభవం బయటపెట్టింది. సోవియట్ ఆర్థి వ్యవస్థకు సంబంధించినంతవరకూ దాని సత్వర ఆర్థికాభివృద్ధిని మనం స్పష్టంగా గమనించవచ్చు. నూతన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను అమలు జరపడమంటే అర్థం మన దేశ ఆర్థిక శక్తిని ఇంకా ఇతోధికంగా పటిష్టం చేయడం; ప్రపంచ రంగంలో శాంతి సోషలిజాలకు అనుకూలంగా ఇతోధికంగా మార్పులను సాధించడం.

ఒక దేశం ఆర్థిక వ్యవస్థయొక్క ప్రభావం దాని రక్షణ పాటవంమీద కూడా పడుతుందన్న విషయం మనకు తెలుసు. ఆయుధాలు అంతకంతకు జటిలమూ, అధిక వ్యయమూ అవుతున్న మన కాలంలో వాటి ఉత్పత్తికి వున్నత స్థాయి శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధి అవసరమైన నేటికాలంలో ఈ విషయం మరింతగా ధృవపడింది. మన ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేయడంద్వారా మనం సోవియట్ యూనియన్ రక్షణ పాటవాన్ని, మొత్తం సోషలిస్టు శిబిరంయొక్క శక్తినే పటిష్టం చేశాము. సోషలిస్టు కుటుంబంలోని దేశాల అపారమైన సైనిక శక్తి, అన్నింటిని మించి సోవియట్ యూనియన్ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను రక్షణకు పూనుకొని వుండని పక్షంలో మన ప్రజల, ఇతరుల విప్లవ విజయాలు ప్రమాదంలో పడి వుండేవి. సామ్రాజ్యవాదులు తాము చేయాలని భావించినదంతా చేయకుండా వెనుకకు తగ్గుతున్నారంటే దానివల్ల వారికి రాగల నష్టాన్ని తెలుసుకొనడం మూలంగానే.

కేంద్ర కమిటి కాంగ్రెసుకు సమర్పించిన నివేదికలో ఎల్. ఐ. బ్రెజ్నెవ్ ప్రస్తుత పరిస్థితినిగురించి సమగ్ర పరిశీలన చేశారు. నేటి ప్రపంచంలో సోషలిస్టు అభ్యుదయకాముక శక్తులు మరింతగా పెంపొందడమే కాదు. ప్రపంచంలోని అభివృద్ధి నిరోధక శక్తులు సైతం తమ స్థానాలను సంఘటితం చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నాయి. సాధ్యమైనచోట్ల తిరుగుదాడి ప్రారంభించి, తమ నష్టాలను పూడ్చుకొనడానికి సైతం ప్రయత్నిస్తున్నాయి. నేటి ప్రపంచ పరిస్థితి ఇలా వుంది. సామ్రాజ్యవాదులు, ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్యవాదులు, వారి పశ్చిమ జర్మనీ మిత్రులు అనుసరిస్తున్న దురాక్రమణ పంథా, అనేక తక్షణ సమస్యల పరిష్కారానికి అవరోధం కల్పిస్తున్నది.

ఆగ్నేయాసియాలో అమెరికా నగ్నమైన దురాక్రమణను అనుసరిస్తున్నది. ఇది అంతర్జాతీయ పరిస్థితిపై మొత్తంమీద దుష్ట ఛాయలను ప్రసరిస్తున్నది. స్వాతంత్ర్య ప్రేమికులైన వియత్నాం ప్రజానీకానికి సోవియట్ యూనియన్ విస్తృతమైన తోడ్పాటు నిస్తున్నది. వియత్నాం ప్రజానీకం జోక్యందారులకు వ్యతిరేకంగా కొనసాగిస్తున్న వీరోచిత పోరాటంలో విజయం సాధించేవరకూ వారికి అవసరమైన మేరకు మనం సహాయం అందిస్తూనే వుంటాం.

ఆయుధ పోటీలో నూతన దశను ప్రారంభించడానికి అమెరికా వియత్నాం యుద్ధాన్ని ఉపయోగించుకొంటున్నది. అమెరికా తన సాయుధ బలగాలను అదనంగా పెంచడానికి పథకాలు వేస్తున్నది. వియత్నాంలో యుద్ధానికి అమెరికా ప్రజా ప్రతినిధుల సభ 1300 కోట్ల డాలర్ల అదనపు మొత్తాన్ని కేటాయించింది. దీనితో వచ్చే ఆర్థిక సంవత్సరానికి అమెరికా యుద్ధవ్యయం 6000 కోట్ల డాలర్లకు పైగా చేరింది.

ఈ పరిస్థితుల్లో మనం సహజంగానే మన రక్షణ కృషిని సడలించలేం. ఈ విషయమై లెనిన్ వాక్కులను మనం గుర్తుంచుకోవాలి. "మనం శాంతియుత నిర్మాణాన్ని పూర్తిచేసి, ఎలాంటి అంతరాయం కలగకుండా దానిని కొనసాగించడానికి మన శక్తినంతా వినియోగించాలి. అదే సమయంలో, అప్రమత్తతతో వుండి, మన దేశరక్షణ శక్తినీ, మన ఎర్ర సైన్యాన్నీ కంటిపాపలా కాపాడాలి. మన కార్మికులనూ, రైతాంగాన్నీ వారి విజయాలను రక్షించడంలో ఒక్క క్షణం తాత్సారం వహించడానికైనా మనకు హక్కు లేదనే విషయం గుర్తుంచుకోవాలి" అని ఆయన చెప్పారు. సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ పూర్వంవలెనే నేడుకూడా సోషలిజాన్ని, సోవియట్ ప్రజల శాంతియుత కృషినీ సంరక్షించేందుకై వున్న మన సాయుధబలగాలను ఇతోధికంగా పటిష్టవంతం చేయడమే మన ప్రధాన కర్తవ్యంగా భావిస్తున్నది.

మన ఆర్థికాభివృద్ధి సోవియట్ యూనియన్ అంతర్జాతీయ స్థానం పైన, ప్రపంచ పరిస్థితి పైన ఇతోధికంగా ప్రభావాన్ని కలిగిస్తున్న విధంగానే ప్రపంచ పరిస్థితి సైతం మన ప్రణాళికల పైనా, మన ఆర్థికాభివృద్ధి క్రమమూ, రేటు, భవిష్యత్తుల పైనా ప్రభావం కలిగిస్తున్న విషయం యథార్థం. పరిస్థితి పూర్తిగా మన మీదనే ఆధారపడి వుంటే మనం తప్పనిసరిగా మన సైనిక వ్యయాన్ని గణనీయం తగ్గించుకొని, ఆ మేరకు ఆర్థిక వ్యవస్థ శాంతియుత శాఖల్లో పెట్టుబడులు

పెంచి వుండేవాళ్ళం : జాతీయఆదాయంలో వినిమయం వాటాను ఇతోధికంగా పెంచి వుండేవాళ్ళం. సామ్రాజ్యవాదదేశాలు, ప్రధానంగా అమెరికా మానవజాతిపై రుద్దిన ఆయుధ పోటీ విపత్కరమైనది, ప్రమాదకరమైనదిగా మనం పరిగణిస్తున్నామని అనేకసార్లు చెప్పాం. తిరిగి మరొక పర్యాయం చెప్తున్నాం. ఈ మానవశ్రమ, శక్తి, వనరుల అనాలోచితమైన దుర్వ్యయాన్ని అంతమొందించడానికి సోవియట్ యూనియన్ తనకు సాధ్యమైనదంతా చేసింది. ఇకముందు కూడా చేస్తుంది.

శాంతిని పరిరక్షించడానికీ, ప్రపంచాన్ని యుద్ధ గుండంలోకి ఈడ్చే శక్తులన్నింటికి వ్యతిరేకంగా పోరాటాన్ని పెంపొందించడానికి సోవియట్ యూనియన్ విధానం రూపొందించ బడింది. మనం మరొకసారి పునరుద్ఘాటిస్తున్నాం. నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని నిరోధించాలనేది మన ప్రధానోద్దేశం. శాంతిని పరిరక్షించడానికీ, పటిష్టం చేయడానికి చిత్తశుద్ధితో ఎలాంటి ప్రయత్నం జరిగినా దీనిని మనం బలపరుస్తాం.

అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించి ప్రజా భద్రతను పటిష్టం చేయాలని కోరుతున్న లేదా కోరే సకల ప్రభుత్వాలతోను సహకరించడానికి సోవియట్ యూనియన్ సిద్ధంగా వున్నదని ప్రకటిస్తున్నాం."

శాంతియుత సహజీవన సూత్రాలు, విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాల మధ్య సంబంధాలను తీర్చిదిద్దేవిగా చేయడానికి సోవియట్ ఇంతకు ముందులాగానే ఇకమీదటకూడా కృషి సాగిస్తూనే వుంటుంది. అంతర్జాతీయ పరిస్థితి మెరుగుపర్చడానికి సి.పి.యస్.యు. కేంద్ర కమిటీ నివేదికలో నిర్దేశించిన కార్యక్రమం ఈ లక్ష్య సాధనకు ఘనంగా తోడ్పడుతుంది.

అంతర్జాతీయ పరిస్థితి జటిలంగా వున్నప్పటికీ కమ్యూనిస్టులమైన మనం భవిష్యత్తును ఆశావహంగానే చూస్తాము. మన రాజ్యం పూర్ణ వికాసం పొందిన నేడు, అనేక దేశాల్లో సోషలిజం విజయం గాంచిన నేడు, మనకు అనేకమంది మిత్రులూ, సహచరులూ ఉన్న నేడు, కమ్యూనిస్టు ఉద్యమం సకల ఖండాలకూ విస్తరించిన నేడు "దురాక్రమణదారులను నిరోధించగలం, నిరోధిస్తాం, నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారించగలం, నివారిస్తా" మని చెప్పడానికి పూర్తి ఆధారం వుంది.

ఈ అవకాశాన్ని వాస్తవంగా మార్చడానికి యుద్ధవ్యతిరేక శక్తుల పటిష్టమైన

సంఘటన ఏర్పడడానికి సి.పి.యస్.యు. కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ కృషి చేస్తున్నవి. ఈ సంఘటన విస్తరించినకొద్దీ శాంతి శత్రువులకు తమ పథకాలను నెరవేర్చు కొనడం కష్టమౌతుంది. సకల దేశాలలో అత్యధిక సంఖ్యాకులుగావున్న చిత్తశుద్ధి గలిగిన శాంతికాముకులు, సోవియట్ యూనియన్ కలసి చివర వరకూ ప్రపంచ శాంతి ప్రయోజనాలను, దేశాలభద్రతను కాపాడుతారు.

సోవియట్ కమ్యూనిస్టులం ఎల్లప్పుడూ అంతర్జాతీయ వాదులం. ఇక ముందు కూడా అంతర్జాతీయ వాదులుగానే వుంటాము. అందువల్ల మనం మన ఆంతరంగిక సమస్యలను పరిష్కరించు కొనేటప్పుడు, మన పథకాలూ, కార్యక్రమాలూ కూడా, సోషలిస్టు కుటుంబానికీ, అంతర్జాతీయ కార్మిక వర్గానికీ, జాతీయ విముక్తి ఉద్యమా లకూ అదనంగా నూతన విజయాలు సాధించేవిగా ఉండాలని మనం గుర్తించు కోవాలి. సోవియట్ ఆర్థిక వ్యవస్థను ఇతోధికంగా పెంచవానికి అధికతర సాము ర్థ్యాన్ని కూర్చడానికి ఈ మహాసభలో బృహత్ కార్యక్రమ సాఫల్యాన్ని గురించి మనం చర్చిస్తున్నాం. ఇది ప్రపంచ పరిస్థితిపై నిస్సందేహంగా విస్తృతమైన ప్రభావాన్ని కల్గిస్తుంది.

సోవియట్ ఆర్థిక వ్యవస్థ ఇతోధికాభివృద్ధికి సంబంధించిన సమస్యలపై ఇక్కడ అనేక సౌహార్ద ప్రతినిధివర్గాలు తమ ఉపన్యాసాల్లో అత్యంత ఆసక్తిని ప్రదర్శించడాన్ని మనం మిక్కిలి సంతృప్తితో గమనించాం. మన పంచవర్ష ప్రణాళిక గురించిన చర్చలో వారు ముఖ్యమైన పాత్ర వహిస్తున్నారని చెప్పడానికి పూర్తి ఆధారం వుంది. మన నూతన ఆర్థిక ప్రణాళిక కేవలం సోవియట్ ప్రజలకు మాత్రమే పరిమితమైనది గాదని ఈ విషయం స్పష్టం చేస్తున్నది. సకల సోదర పార్టీల కమ్యూనిస్టులూ, సోవియట్ యూనియన్ మిత్రులందరూ, నిఖిల ప్రపంచంలోని అభ్యుదయకాముకు లెల్లరూ దీనిని తమ స్వంత విషయంగా పరిగ్రహిస్తున్నారు. ఈ హాలులో హాజరైన అతిథులకూ, సోదర పార్టీల ప్రతినిధు లకూ, మన ఆర్థికాభివృద్ధి కార్యక్రమంపట్ల వారు చూపుతున్న ఆసక్తికీ, దీనిని అమలుపరచడానికి వారు అందజేసిన అభివందనలకూ నేను సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ తరఫునా, సోవియట్ ప్రభుత్వం తరఫునా వారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాను.

* * *

కామ్రేడ్స్! నూతన పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలు చాలా గొప్పవిగానూ, అద్భుతమైనవిగానూ వున్నవి. గత అయిదు సంవత్సరాలలో సాధించిన దానికన్నా రాబోయే కాలంలో సాధించవలసినది ఎంతో ఎక్కువ. ఈ లక్ష్యాల సాధన శ్రామిక ప్రజల, మొత్తం సోవియట్ ప్రజల మహత్తర లక్ష్యమైన కమ్యూనిజం నిర్మాణాన్ని త్వరితం చేస్తుంది. కమ్యూనిజం నిర్మాతలకు అగ్రగామి అయిన మన పార్టీ బహుముఖ కార్యక్రమం రూపొస్తూ ఈ లక్ష్యంపైనే కేంద్రీకరించబడింది. మనకు కమ్యూనిజం ఊహాజనితమైన ఆదర్శం కాదు. అది భౌతిక, చారిత్రక అవసరం. ఇది మానవ సౌఖ్యంకోసం, సంక్షేమంకోసం, పరిపూర్ణ వికాసం కోసం, లక్షలాది శ్రామిక ప్రజల నిర్మాణ కార్యక్రమం.

ఈ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు అవాస్తవికంగా నిర్ణయించినవి కావు. నవ సమాజ నిర్మాణానికి సంబంధించిన సాధారణ సూత్రీకరణల ఆధారంగానూ, వర్ధమాన దశలో సాంఘిక, ఆర్థికాభివృద్ధి, ధోరణుల శాస్త్రీయ, విశ్లేషణ ప్రాతిపదికపైన నిర్ణయించబడినవి. ఈ లక్ష్యాల అమలులోనూ, పథకాల ఎన్నికలోనూ, వాటి నిష్పత్తులను ఏర్పరచడంలోనూ ఎలాంటి స్వేచ్ఛాయుత్మిక ధోరణికి తావులేదు. వుండరాదు. ఏ ఒక్కరూ తన ఊహనే యథార్థమని భ్రమ పడరాదు. మన అభివృద్ధి క్రమంలో పేరుకు పోయిన సమస్య లన్నింటిని సాధ్యమైనంత త్వరలో పరిష్కరించుకోవాలని సహజంగానే మనం కోరుకుంటాం. అయితే వాటి పరిష్కారానికి తీసుకునే ప్రతి చర్య సహేతుకమైనదిగానూ, మనం సాధించిన దాని నుండీ మన ఉమ్మడి శ్రమ సృష్టించిన వాస్తవ అవకాశాలనుంచి ముందుకు పోయేదిగా వుండాలి.

సాంఘిక ఉత్పత్తులు అత్యంత ప్రధానమైన వ్యవసాయాభివృద్ధి వేట్ల స్థిరీకరణ పరిశ్రమల, వ్యవసాయ క్షేత్రాల అభివృద్ధి మధ్య సమన్వయమూ, సాధించడానికి ఈ పంచవర్ష ప్రణాళిక స్థిరమైన పునాదులపై రూపొందించబడింది. దీని ఫలితంగా మనం పట్టణాలలోని, గ్రామీణ ప్రాంతాలలోని పని పరిస్థితులను, జీవన పరిస్థితులను గణనీయంగా సన్నిహితం చేయగలం. ఇందులోనే నూతన పంచవర్ష ప్రణాళిక ప్రత్యేక ప్రాధాన్యం యిమిడివుంది.

శాస్త్రీయ, సాంకేతికాభివృద్ధికి సృజనాత్మకంగా పనిచేయగలిగిన శక్తివంతులైన, విజ్ఞాన వంతులైన కార్యకర్తలు అవసరం. ఇలాంటి కార్యకర్తల అభివృద్ధికి మన సాంఘిక వ్యవస్థ అత్యంత అనుకూలమైన పరిస్థితులను సమకూర్చుతుంది.

సాంఘిక అవకాశాలతో ఆర్థిక అవసరాలను సమన్వయం చేయడానికీ శారీరక శ్రమకూ, మేధోశ్రమకూ మధ్యగల వ్యత్యాసాలను మరింతగా తొలగించేందుకు మార్గం సుగమం చేస్తుంది.

ఈ చారిత్రక సమస్య పరిష్కారానికి నూతన పంచవర్ష ప్రణాళిక ఒక పెద్ద ముందడుగుగా వుండబోతున్నది. ఈ పంచవర్ష ప్రణాళిక మహత్తరమైన ప్రాధాన్యం ఇందులో సైతం యిమిడివుంది.

కమ్యూనిజంపైపు జయప్రదంగా పురోగమించడానికి అవసరమైన ఒక షరతు మన వ్యవస్థ సాంఘిక అఖండత్వం. ఇది ప్రధాన సమస్యల పరిష్కార క్రమంలో ఇతోధికంగా బలపడుతుంది.

ఏ ఒక్క పథకము ఎంత పటిష్టవంతంగా రూపొందించినప్పటికీ, దానిని ప్రజానీకం తమ హృదయపూర్వకంగా అమలు జరపనిదే అదిజయప్రదం కాదు.

ప్రజల సృజనాత్మక శక్తులను కదలించి, సక్రమమైన నాయకత్వాన్ని ప్రసాదించడం, వారిని కార్యోన్ముఖులను చేయడానికి చొరవను పెంపొందించడం, ఆర్థిక వ్యవస్థ సకల రంగాలలోను ప్రతి కమ్యూనిస్టు, ప్రతి కార్మికుని గురుతర బాధ్యతలను గుర్తింపచేయడం ప్రధానమైన ఆర్థిక, రాజకీయ లక్ష్యం.

కామ్రేడ్స్! మన దేశం సోషలిస్టు అభివృద్ధి పథంపై ప్రవేశించి దాదాపు అర్థ శతాబ్దం గడచింది. మనం అత్యంత క్లిష్టమైన, ఇదివరకెన్నడూ ఎవరూ పయనించి వుండని కొత్తమార్గాన పయనించాం. ఈరోజున సోవియట్ యూనియన్ ఒక మహత్తరమైన సోషలిస్టు రాజ్యం; ఇతర సోషలిస్టు దేశాలతో కలసి మహత్తరమైన మన ఉమ్మడి లక్ష్యం దిశగా పురోగమిస్తున్నది.

లెనిన్ చెప్పినట్లు మన దేశం సాధించిన విజయాలన్నీ విజ్ఞత గలిగిన లెనినిస్టు పార్టీ నాయకత్వం ఫలితం. మార్క్సిజం, లెనినిజంపట్ల గల అచంచల విశ్వాసం ఫలితం. సర్వకాలాల్లోనూ, అద్భుతమైన కార్మిక, కర్షక శక్తిసామర్థ్యాలపై ఆధార పడిన ఫలితం.

చిరస్థాయి అయిన, ఎల్లప్పుడు సృజనాత్మకమైన మార్క్సిజం, లెనినిజం విప్లవ బోధనల మార్గదర్శకత్వం ద్వారా పార్టీ నాయకత్వం క్రింద మన ప్రజానీకం కమ్యూనిస్టు నిర్మాణంలో నూతన విజయాలను సాధించ గలరు.

మన ఘనమైన లెనినిస్టు పార్టీ చిరకాలం వర్ధిల్లుగాక? కమ్యూనిజం నిర్మాతలైన మహత్తరమైన సోవియట్ ప్రజానీకం చిరకాలం వర్ధిల్లుగాక.

# అలెగ్జీ కొసిగిన్ ముగింపు ఉపన్యాసం

కామ్రేడ్ డెలిగేట్స్! 1966–70 సంవత్సరాలకు యు. యస్. యస్. ఆర్. ఆర్థికాభివృద్ధికి సంబంధించిన పంచవర్ష ప్రణాళిక ఆదేశాల ముసాయిదాపై జరిగిన చర్చ, దేశ ఆర్థికాభివృద్ధి కార్యక్రమాన్ని కాంగ్రెస్ ప్రతినిధులు ఏకగ్రీవంగా ఆమోదించారని స్పష్టంచేసింది. సోవియటు ప్రజలు దీనిని హృదయపూర్తిగా స్వీకరించారని స్పష్టమైంది. ఈ కార్యక్రమం సోవియట్ ప్రజల ప్రధాన అవసరాలను, ప్రయోజనాలను నెరవేరుస్తుంది.

కాంగ్రెస్‌లో ప్రతినిధుల ఉపన్యాసాలు, దేశవ్యాపితంగా ముసాయిదా ఆదేశాలపై జరిగిన చర్చల్లో ఉత్పన్నమైన సూచనల్లో ఆర్థికాభివృద్ధియొక్క పరిపక్వం చెందిన సమస్యలకు ఉత్తమ పరిష్కారమార్గం కనుగొనాలన్న ఆకాంక్షను, మన మాతృదేశ శక్తిసామర్థ్యాలను ఇతోధికంగా పెంచాలనీ, సోవియటు ప్రజల జీవిత ప్రమాణాలను పెంపొందించాలనే ఆకాంక్ష ముమ్మరంగా వ్యక్తమైంది.

కాంగ్రెస్ ప్రతినిధులు సమర్పించిన ప్రతిపాదనలు మనదేశ ఆర్థిక జీవనానికి సంబంధించిన అనేక సమస్యల పరిష్కారానికి గొప్పగా తోడ్పడ్డాయి. కాంగ్రెస్ నియమించిన కమిషన్ ఈ సూచన లన్నింటినీ పరిశీలించింది. వాటిలో కొన్నింటిని ఆదేశాల్లో చేర్చుకున్నది. వాటికి సంబంధించిన ముసాయిదాను ఆమోదం కొరకు మీముందుచడం జరుగుతోంది. ఇంకా పరిశీలన అవసరమైన ఇతర ప్రతిపాదనలను జాగ్రత్తగా పరిశీలించి పంచవర్ష ప్రణాళిక రచనలో చేర్చే నిమిత్తం యు. యస్. యస్. ఆర్. మంత్రి మండలికీ, యు. యస్. యస్. ఆర్. ప్రణాళిక కమిటీ, మంత్రిత్వ శాఖలకూ అప్పగించడం జరుగుతుంది.

ముసాయిదా ఆదేశాలు ఏకగ్రీవ ఆమోదం, మన పార్టీ కేంద్రకమిటీ కమ్యూనిజం నిర్మాణానికి నిర్వచించిన సాధారణ పంథాను అంచనా కట్టడంలో పార్టీ ఐక్యతను, ప్రజల ఏకీభవాన్ని స్పష్టంగా వ్యక్తీకరిస్తున్నది.

ఈ ఆదేశాల ప్రాతిపదికపై ఐదు సంవత్సరాలకు ఒక రాజ్యానికి సంబంధించిన జాతీయ ఆర్థిక ప్రణాళికను కూర్చే మహత్తరమైన ప్రాధాన్యంగల కర్తవ్యాన్ని మనం ఎదుర్కొంటున్నాం. ఇది గొప్ప బాధ్యతాయుతమైన పని. యు.ఎస్.ఎస్.ఆర్. ప్రణాళికా కమిటీ, మంత్రిత్వ శాఖలు, యూనియన్ రిపబ్లిక్కుల మంత్రిమండలులు ప్రతి పరిశ్రమకు ఎంత ప్రత్యేక ప్రాధాన్యంగలదో తెలుపుతూ సాంవత్సరిక లక్ష్యాలతో పంచవర్ష ప్రణాళికను తప్పని సరిగా రూపొందించాలి. నాలుగైదు మాసాల్లోనే ఈ నూతన పంచవర్ష ప్రణాళిక సిద్ధమౌతుంది. పిమ్మట పరిశీలన నిమిత్తం యు. యస్. యస్. ఆర్. సుప్రీం సోవియట్‌కు సమర్పించ బడుతుంది.

ఈ ఐదు సంవత్సరాల ప్రణాళిక కార్యక్రమాన్ని రూపొందించడం ఖచ్చితంగా శాస్త్రీయ సూత్రాల పైనా, ఆర్థిక నిర్వహణ నూతన పరిస్థితుల సమగ్ర పరిశీలన పైనా ఆధారపడి వుంటుంది. ఆర్థిక సమస్యల పరిష్కారానికి స్వేచ్ఛాత్మక ధోరణి అనుమతించబడదు. ఈ కృషికి సృజనాత్మక వైఖరీ, ప్రణాళికా లక్ష్యాల ఆర్థిక సమర్థనీయత, శాస్త్రీయ, ఇంజనీరింగ్ రంగాల ఆధునిక విజయాల ప్రాతిపదికపై ఉత్పత్తి ని పెంచడానికి అత్యంత సమర్థ వంతమైన మార్గాలు అవసరం.

శాస్త్రీయ పరిశోధనమా, డిజైనింగ్ సంస్థలనూ, జాతీయ ఆర్థికవ్యవస్థ సకల రంగాలలోని శాస్త్రవేత్తలనూ, ప్రవీణులనూ పంచవర్ష ప్రణాళికా రచనకు సమీకరించాలి. అగ్రశ్రేణి కార్యకర్తలయొక్క నూతన విషయాలను కనుగొన్నవారి యొక్క అనుభవాలను చాలా హెచ్చుగా ఉపయోగించుకోవాలి. జాతీయ అర్థికాభివృద్ధి కార్యక్రమాన్ని జయప్రదంగా అమలుజరపడం, ప్రజల పాదార్థిక ప్రమాణాలను హెచ్చించడం, సామాజిక శ్రమఉత్పాదకశక్తి పెరుగుదలమీద ఉత్పత్తి నిధులను, భౌతిక వనరులనూ సమర్థవంతంగా ఉపయోగించుకొనడంపైనా, ప్రతి పరిశ్రమ యొక్క ఆర్థిక కార్యక్రమ ఫలితాలపైనా పూర్తిగా ఆధారపడి వుంటుందని గుర్తుంచుకోవాలి. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తిచేసేందుకు అవసరమైన నిధులను కల్పించడానికీ, భౌతిక, ఆర్థిక వనరుల వినిమయంపై ఖచ్చితమైన కంట్రోలు నెలకొల్పడానికీ జాతయ ఆర్థిక వ్యవస్థ సకల రంగాలలోనూ ఖచ్చితమైన పొదుపును ప్రవేశపెట్టడం అవసరం.

ఆర్థిక నిర్వహణకు సంబంధించిన లెనినిస్టు సూత్రాలను పటిష్ఠం చేయడం పరిశ్రమల ప్రయోజనాలకూ, వాటిలోని కార్మికుల ప్రయోజనాలకు మధ్య సన్నిహిత సంబంధాలను ఏర్పరచడానికి అవకాశం కలిగిస్తుంది. ఉత్పత్తి అభివృద్ధి కృషిని ఉధృతం చేయడానికీ, పని ఫలితాలను మెరుగు పర్చడానికి ఇదిఅత్యంత ప్రాధాన్యం గలది. ఈ పరిస్థితుల్లో మాత్రమే మనం ప్రజల భౌతిక ప్రమాణాలను వృద్ధి చేయడానికీ, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాలను ఇతోధికంగా పెంచేందుకై పునాదులు వేయడానికి రూపొందించిన కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తి చేయగలం. ఈ నూతన ప్రణాళిక, దాని లక్ష్యాలు, కర్తవ్యాలు ప్రతి శ్రమ జీవికి స్పష్టంగా తెలిసి వుండాలి. మన నూతన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాల మహత్యాన్ని దానిని సాధించే నిర్దిష్టమైన మార్గాలనూ, పద్ధతులనూ ప్రతి సోవియటు పౌరునికి విశదం చేయడం పార్టీ సంస్థల విధ్యుక్త ధర్మం.

సోవియట్ ప్రజానీకం తమపని పట్ల ఉదాత్తమైన ఉత్సాహ వాతావరణంలో పంచవర్షప్రణాళిక తొలిసంవత్సర కర్తవ్యాలను అమలు జరపడం ప్రారంభించారు. పంచవర్ష ప్రణాళికను అమలు పరిచేందుకు, రూపొందించిన కార్యక్రమాన్ని నిర్వర్తించేందుకు శ్రామికప్రజల సంసిద్ధతను సంకల్పబలాన్ని పటిష్ఠ వంతం చేసేందుకై పార్టీ సంస్థలు దేశ వ్యాపిత ఉద్యమాన్ని నడపాలి. నూతన శక్తితోను, అంతకంటే మిక్కుటమైన పనిపట్ల ఉత్సాహంతోనూ సోవియట్ ప్రజానీకం మనపార్టీ నాయకత్వాన జాతీయార్థికవ్యవస్థ ఇతోధికాభివృద్ధికి సంబంధించిన కార్యక్రమ సాఫల్యానికి, మనదేశంలో కమ్యూనిజం నిర్మాణంలో నూతన విజయాలను సాధించేందుకు 23 వ పార్టీ కాంగ్రెస్ రూపొందించిన కార్యక్రమ సాఫల్యానికి జరిపే పోరాటాన్ని ముందుకు కొనిపోతారు.

భారత కమ్యూనిస్టుపార్టీ తరఫున హాజరైన సౌహార్ద ప్రతినిధులు శ్రీ పి. టి. పున్నూస్ (కేరళ), శ్రీ సిన్హా (బీహారు).





23 వ మహాసభలో ఒక తీర్మానంపై ప్రతినిధులు ఓటువేస్తున్న దృశ్యం.

1966 ఏప్రిల్ 4 వ తేదీన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభకు అధ్యక్షతవహిస్తున్న షరాఫ్ రషిదోవ్.





సూడాన్ యూనియన్‌పార్టీ జాతీయ పొలిట్‌బ్యూరో సభ్యులు, మదీరా కేటా, సి.పి.ఎస్.యు. 23వ మహాసభ ప్రతినిధులతో ముచ్చటిస్తున్న దృశ్యం.

## సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ నివేదికపై

# సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ

# తీర్మానం

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రథమ కార్యదర్శి కామ్రేడ్ యల్. ఐ. బ్రెజ్నెవ్ సమర్పించిన నివేదికను విని, చర్చించిన పిమ్మట సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ :

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ రాజకీయ విధానాన్ని, ప్రత్యక్ష కార్యకలాపాలనూ సంపూర్ణంగా ఆమోదించడానికీ ;

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నివేదికలో యిమిడియున్న సూచనలను, నిర్ణయాలను ఆమోదించడానికీ తీర్మానించింది.

సమీక్షింప బడుతున్న యీదశలో పార్టీ కార్యకలాపాలు 20 వ - 22 వ మహాసభలలో నిర్దేశింప బడిన విధానంపై ఆధారపడి, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమ పరిపూర్తికిని, కమ్యూనిజానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణానికినీ, సోషలిస్టు సామాజిక సంబంధాలను నిర్దుష్టం చేయడానికినీ, కార్మిక జనావళిలో కమ్యూనిస్టు విద్యావ్యాప్తిని వృద్ధి చేయడానికిని, మళ్లించబడింది.

ఈ దశలో, ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధిలోను, ప్రజల జీవనవ్యయ ప్రమాణాన్ని అభివృద్ధి పరచడంలోను పెద్ద ముందడుగు వేయడం జరిగింది. సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతాంగ, కార్మిక వర్గాల మధ్య సంఘటన సోవియట్ యూనియన్‌లోవున్న అనేక జాతులకు చెందిన ప్రజలమధ్య స్నేహము, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీతో సమస్త కార్మిక జనుల సౌహార్దము అనే సోవియట్ సమాజ రాజకీయ పునాదులు మరింత బలపడ్డాయి. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం పెరగడం, సోవియట్ సమాజంలో దాని రాజకీయ నిర్మాణాత్మక పాత్ర వృద్ధి చెందడం జరిగింది. పార్టీ ఆంతరంగిక జీవితానికి సంబంధించిన లెనినిస్టు సూత్రాలు పార్టీలో దృఢంగా వేళ్లూన్నాయి.

లెనిన్ బోధనల మార్గ దర్శకత్వంలో, ఆచరణ రీత్యా పరీక్షకు నిల్చుకోలేక విఫలమై, మన పురోగమనానికి ఆటంకంగా తయారైనవాటన్నింటినీ ప్రక్కకునెట్టి వేసి, ఆర్థిక యాజమాన్య రూపాలను, విధానాలను పార్టీ మెరుగుపరచింది. 1964 అక్టోబరు నాటి సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనం సమావేశం - పార్టీ కార్యకలాపాల విషయంలోను, మన సమాజం కమ్యూనిజం వైపుకు వేస్తున్న విశేష ముందంజ విషయంలోను అత్యంత ప్రాముఖ్యత వహిస్తుంది.

సోవియట్ యూనియన్ యొక్క ఆర్థిక, రాజకీయ, సైనిక శక్తిసామర్థ్యాలు దాని అంతర్జాతీయ స్థానానికి మరింత విలువ నొసగాయి. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సోవియట్ ప్రజల శాంతియుత శ్రమను పరిరక్షించడానికి తనశాయ శక్తులా సదాకృషిచేసింది, ఇప్పుడూ చేస్తూవుంది. ప్రపంచ శాంతిని పోషించడానికీ, సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా దృఢ సంకల్పంతో పోరాడడానికీ అది ఉత్సాహంగా కృషి చేస్తున్నది. ఆయా జాతులకు చెందిన ప్రజలు సామ్రాజ్య వాదానికి, వలసవాదానికీ, నయావలసవాదానికీ, వ్యతిరేకంగాచేసే విమోచనపోరాటాలకు సోవియట్ యూనియన్ నిరంతరం సహాయం అందజేస్తూవుంది. దేశాలన్నింటిలోను శాంతికోసం జాతీయ స్వాతంత్ర్యంకోసం, ప్రజా స్వామికంకోసం, సోషలిజంకోసం కార్మిక జనం సాగిస్తున్న పోరాటానికి చేసే సహాయాన్ని అంతకంతకు అధికం చేస్తూంది.

# I

1. మన యుగంలో చారిత్రక క్రమపు ముఖ్య ధోరణిని ప్రపంచ సోషలిస్టు విధానము, సమాజాన్ని సోషలిస్టు పద్ధతిలో పునర్నిర్మించ డానికై సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాటం జరిపేశక్తులు నిర్ణయిస్తాయని మన పార్టీ, మొత్తం కమ్యూనిస్టు ఉద్యమం చేసిన నిర్ణయాలను ప్రపంచ ఘటనలు ధృవపరచాయి.

మనం సమీక్షిస్తున్న దశలో, ప్రపంచ సోషలిస్టు ఉద్యమం చెప్పుకోతగినంతగా బలవడింది. దాని అంతర్జాతీయ ప్రతిష్ఠ పెరిగింది. అదే విధంగా మానవ జాతి భవితవ్యంపై దాని ప్రభావంకూడా వృద్ధి చెందింది. సోషలిస్టు రాజ్యాల మధ్య సంబంధాలు, యీ దేశాలకు చెందిన సోదర పార్టీలు మార్క్సిజం — లెనినిజం. సోషలిస్టు అంతర్జాతీయవాదం, సమానత్వం, ఒక దేశపు ఆంతరంగిక వ్యవహారాలలో మరొక దేశం జోక్యం కల్పించుకోక పోవడం. పరస్పర గౌరవం, పార్టీల, ప్రభుత్వాల స్వాతంత్ర్య సూత్రాలనబడేవి యీ దశకు చెందిన ఉజ్వల విశేషాలు. గత కొద్ది సంవత్సరాలలో సోవియటు యూనియన్‌కు, యితర సోషలిస్టు దేశాలకు మధ్య సంబంధ బాంధవ్యాలు మరింత విస్తృతంగా, మరింత సన్నిహితంగా, మరింత సౌజన్య పూరితంగా తయారయాయి. సోదర సోషలిస్టు దేశాల నాయకుల మధ్య రాజకీయ సంప్రతింపులు, అభిప్రాయాల మార్పిడీ క్రమ పద్ధతిలో జరుగుతున్నాయి.

సోషలిస్టు దేశాల ఆర్థిక సహకారం విస్తృతమైంది. పరస్పర ఆర్థిక సహాయ సమితి పాత్ర అంతకంతకు పెరుగుతుంది.

సోవియట్ యూనియన్‌కు, యితర సోషలిస్టు దేశాలకు మధ్య ఒడంబడిక సంబంధాల విధానం విస్తృతమైంది. మన ప్రజల మధ్య సౌభ్రాతృత్వ సంబంధాలకు అది ప్రతిరూపం. సోషలిస్టు దేశాల సైనిక సహకారం విస్తృతమైంది. వార్సా ఒడంబడిక యంత్రాంగం మరింత మెరుగొనర్చబడి, బలపరచ బడుతోంది.

మార్క్సిజం — లెనినిజం సూత్రాలకు అనుగుణ్యంగా సమస్త సోషలిస్టు దేశాల కమ్యూనిస్టు, కార్మిక పార్టీలతోను, రాజకీయ — సిద్ధాంత సంబంధాలను వృద్ధి పరచుకోవాలనీ, బలపరచుకోవాలనీ, సోషలిస్టు కూటమి ఘనిష్ఠతను సర్వ

విధాలా పెంపొందించాలనీ, దాని మహత్తర శక్తినీ, ప్రభావాన్నీ నిలబెట్టాలనీ, ఆర్థిక, సాంకేతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక సహకారాన్ని వ్యాపింప చెయ్యాలనీ, సోదర దేశాల ప్రజలపట్ల సోవియట్ ప్రజలలో స్నేహభావాన్నీ, అంతర్జాతీయ సౌభ్రాతృత్వభావాన్నీ అలవరచడం, అభివృద్ధిచేయడం కొనసాగించాలనీ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీని మహాసభ నిర్దేశిస్తోంది.

పెట్టుబడిదారీ దేశాలలోని గుత్తవ్యాపార పద్ధతిపై కార్మిక వర్గోద్యమం బృహత్తర వర్గ పోరాటాలను జరుపుతోంది. అనేక దేశాలలో శ్రామికవర్గం పీడన విధానంపై మరిన్ని దాడులను జరపడానికి అనువైన నూతన స్థానాలను సాధించుకుంది. గత కొద్ది సంవత్సరాలలో కొన్ని దేశాలలో శ్రామికోద్యమ విభాగాలమధ్య సమైక్య కార్యాచరణ సదవకాశాలు పొడ సూపాయి. గుత్త వ్యాపార సంస్థల పీడనకు వ్యతిరేకంగా పోరాడుతున్న యితర సామాజిక శ్రేణులు కూడా అంతకంతకు అధికంగా కార్మిక వర్గము వెనుక సమీకృతమవు తున్నాయి.

పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గంతోను, తదితర శ్రామిక జను లందరి తోను, వారి ప్రజాస్వామిక సంఘాలతోను, సోవియటు ప్రజలు, సోవియటు కమ్యూనిస్టులు స్నేహసౌభ్రాతృత్వాలను, విప్లవకర సమైక్యతనూ విస్తృతపర్చుతూ బలపర్చుతూ వుండటం అవసరమని మహాసభ పరిగణిస్తోంది.

మనం సమీక్షిస్తున్న యీ దశలో జాతీయ విమోచనోద్యమం వృద్ధి చెందుతూనే వుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంద్వారా మరో 17 దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నాయి. క్రొత్తగా స్వాతంత్ర్యం సంపాదించు కున్న అనేక దేశాలు ఒక క్రొత్త దశలో — సామ్రాజ్యవాదులు తాము పోగొట్టు కున్న స్థావరాలను తిరిగి సంపాదించుకోడానికీ, ఆ దేశాల సామాజిక ప్రగతిని ఆటంకపర్చడానికీ చేసే నూతవలస ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఆర్థికస్వాతంత్ర్య పోరాటం జరిపే దశలో ప్రవేశించాయి.

సామ్రాజ్యవాదానికి వెరపు ఏమీ లేదు. తరుణదేశాల అంతరంగిక వ్యవహా రాలలో జోక్యం కల్పించుకునే సందర్భంలో అది తరచుగా సాయుధబలాన్ని ఉపయోగించేటంత వరకు వెడుతున్నది. ఈమధ్య కాలంలో, సామ్రాజ్యవాదులు ప్రత్యేకించి సామాజిక పునర్నిర్మాణ కార్యక్రమాలు ముమ్మరంగా జరుగుతున్న దేశాలలోని ప్రభుత్వాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు చర్యలను వృద్ధి చేశారు.

ద్రోహ పూరితమైన సామ్రాజ్యవాద శత్రువుతోను, తరుణ దేశాలను

పెట్టుబడిదారీ పథంలో నడిపించడానికై చేసే ప్రయత్నాల్లో సామ్రాజ్యవాద సహాయంపై ఆధారపడే ఆంతరంగిక అభివృద్ధి నిరోధక శక్తులతోను, వలస దాస్య శృంఖలాలను విదిలించుకొన్న దేశాలలోని నూత్న సరళి జీవితం, భయంకర కలహాలరూపం ధరిస్తోంది. ఏమైనప్పటికీ ఆయా జాతుల ప్రజలు జాతీయ విముక్తి విప్లవ పరిపూర్తిని, తమ యుగయుగాల వెనుకబడిన తనం నిర్మూలనాన్ని తమ జీవన స్థితిగతులలో అభివృద్ధిని, అంతకంతకు అధికంగా పెట్టుబడిదారీ యేతర అభివృద్ధి పథంతో అంతకంతకు యెక్కువ నిశ్చిత రూపంలో జుమలాయిస్తున్నారు. కొన్ని తరుణ రాజ్యా లప్పుడే యీ పథంలో అడుగుపెట్టాయి. వాటితో సోవియట్ యూనియను సంబంధాలు సంపూర్ణ సమానత్వం, మైత్రి, పరస్పర సహాయమనే పునాదులపై ఆధారపడివుంటాయి.

వలసపీడనకు, నయావలస వాదానికీ వ్యతిరేకంగా పోరాడే ప్రజలకు సహాయం చెయ్యడాన్ని కొనసాగించ వలసిందిగాను, క్రొత్తగా స్వతంత్రమైన దేశాలతో సర్వతోముఖ సహకారాన్ని అభివృద్ధి పరచాలనీ, అన్ని ఖండాలకు చెందిన ప్రజల సామ్రాజ్య వ్యతిరేక సంఘటనను అన్ని పద్ధతులలోను పెంపొందించాలనీ, తరుణ జాతీయ రాజ్యాలలో కమ్యూనిస్టు విప్లవాత్మక ప్రజాస్వామిక పార్టీలతో తన సంబంధాలను విస్తృత పరచాలనీ ఈ మహాసభ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీని ఆదేశిస్తోంది.

2. 1957, 1960 నాటి సమావేశాలలో జరిగిన సంయుక్త కృషిద్వారా మార్క్సిస్టు – లెనినిస్టు సాధారణ పంథాను మార్గదర్శకంగా గ్రహించి మనం సమీక్షిస్తున్న దశలో, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, మన కాలపు అత్యంత ప్రభావ శీలియైన రాజకీయ శక్తిగా తన స్థానాన్ని సుసంఘటితం మొనర్చుకుని, విస్తృత పరచింది.

మనం సమీక్షిస్తున్న దశలో, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీయొక్క అంతర్జాతీయ కార్యకలాపాలలో మ్యూనిస్టు, కార్మిక పార్టీలతో సన్నిహిత సౌహార్ద సౌభ్రాతృత్వాలను పెంచే నిరంతర ప్రయత్నము, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సామాన్యకార్యాచరణను అమలు పరచడం, ప్రపంచ పరివ్యాప్తమైవున్న కమ్యూనిస్టు మహాసైన్యంమధ్య సమైక్యతను పెంపొందించడం ముఖ్యమైనవిగా వుంటాయి.

శాంతి, ప్రజాస్వామికం, జాతీయ విమోచనం, సోషలిజంల విజయంకోసం,

తమ ఉమ్మడి శత్రువైన సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో సోదర పార్టీలన్నింటి మధ్య ఐక్యకార్యచరణను పెంపొందించడం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సమైక్యతను సుదృఢ మొనర్చే విధానాన్ని కొనసాగించడం అవసరమని మహాసభ పరిగణిస్తున్నది.

సోదర పార్టీల మధ్య బహుపాక్షిక, ద్వైపాక్షిక సమావేశాలు, విడువకుండా అభిప్రాయల మార్పిడి, సమకాలీన సమస్యలపై సౌహార్దపూరితమైన చర్చలు జరగడం మంచిపద్దతి అనీ, అది కమ్యూనిస్టు ఉద్యమైక్యతను సుదృఢ మొనర్చే మంచి మార్గంగా ఋజువైందనీ మహాసభ విశ్వసిస్తోంది. బహు సంఖ్యాక సోదర పార్టీల వలెనే సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కూడా పరిస్థితులు పక్వం కాగానే కమ్యూనిస్టు, కార్మికపార్టీల అంతర్జాతీయ సమావేశాన్ని యేర్పాటుచేయ్యడం అవసరమని తలుస్తోంది.

మార్క్సిజం–లెనినిజం సిద్ధాంత ప్రాతిపదికపైనను, 1957, 1960 ప్రకటనల ప్రాతిపదికపైనను ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని విభేదాలను పరిష్కరించేందుకై సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అవలంబించిన విధానాన్నీ, ప్రత్యక్ష చర్యలనూ మహాసభ ఆమోదిస్తోంది.

మార్క్సిజం లెనినిజం సిద్ధాంత ప్రాతిపదికపై చైనా కమ్యూనిస్టుపార్టీతో తనకు గల విభేదాలను పరిష్కరించేందుగాను సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ చేస్తున్న కార్యకలాపాలను, తీసుకుంటున్న ప్రత్యక్ష చర్యలను మహాసభ ఆమోదిస్తోంది. మన పార్టీలు, మన దేశాల ప్రజలు కాలక్రమేణా కష్టాలను గడచి, ఉమ్మడి విప్లవ మహదాశయం కోసం భుజం భుజం కలిపి ముందడుగేస్తారని మహాసభ తన విశ్వాసాన్ని ప్రకటిస్తోంది.

1960 నాటి ప్రకటనలో నిర్వచింప బడినట్టు పార్టీల మధ్య సంబంధాల ప్రమాణాలను సమానత్వ, స్వాతంత్ర్య సూత్రాలను విధిగా పాటించడం. ఒకదేశం మరొక దేశపు ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించు కొనకపోవడం. కమ్యూనిస్టు శ్రేణుల మధ్య ప్రగాఢ సాన్నిహిత్యాన్ని, సమైక్యతను సాధించడానికి ముఖ్యావసరం. కమ్యూనిస్టు ఉద్యమంలో పెత్తందారీ ధోరణులను సోవియట్ యూనియను కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకిస్తుంది. పార్టీ లన్నింటి మధ్య నిజమైన సమానత్వాన్ని. శ్రామిక అంతర్జాతీయ సూత్రాను గుణ్యమైన సుహృద్భావ పూర్వక సంబంధాలను ప్రబోధిస్తుంది.

కమ్యూనిస్టు శ్రేణుల మధ్య రాజకీయ సైద్ధాంతిక సమైక్యత కోసం మిత వాద, "అతివాద" రివిజనిజమ్‌లకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం జరగటం అవసరం. అందుకై సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ పట్టుదలతో జరిపే పోరాటాన్ని కొనసాగిస్తుంది. మార్క్సిస్టు - లెనినిస్టు మార్గమునుండి దక్షిణపక్ష, లేక "వామపక్ష" పెడమార్గాన్ని చేపట్టడం, దానికి జాతీయవాదం, పెత్తందారీ కోర్కెలుజోడై సనాడు యినుమిక్కిలిగా ప్రమాదకరమవుతుంది.

ప్రపంచాభివృద్ధి క్రమంలోను, ప్రత్యక్ష విప్లవోద్యమ క్రమంలోను తల ఎత్తే క్రొత్త సమస్యలు సృజనాత్మకంగా, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత ప్రాతి పదికపై పరిష్కరింపబడటం ప్రపంచ కమ్యూనిజం విజయానికి ముఖ్యావసరం.

3 ప్రపంచంలో బలాబలాలు సోషలిజం, కార్మికవర్గం, జాతీయోద్యమాలకే అనుకూలంగా మారుతున్నాయి. అదే సమయంలో, మనం సమీక్షిస్తున్న దశలో, సామ్రాజ్యవాద దురాక్రమణ విస్తరణ, అభివృద్ధి నిరోధకుల కార్యకలాపాల విస్తృతి కొట్టవచ్చినట్టు కనబడుతోంది. పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభం తీవ్రతర మవడం, దాని వైరుధ్యాల అధికతర ప్రకోపం సామ్రాజ్యవాదాన్ని మరింత దుస్సాహసికకృత్యాలవైపు తరిమి, ఆ యా దేశాల ప్రజలకు, శాంతికి, సామాజిక ప్రగతికి మరింత ప్రమాదాన్ని తెచ్చిపెడుతున్నాయి. అంతకంతకు మరింత తరచుగా సాయుధ కవ్వింపు చర్యలకు, అన్నిరకాల కుట్రలకు, ప్రత్యక్ష సాయుధ జోక్యాలకు పూనుకుంటున్నది.

1957 లోను, 1960 లోను, మాస్కోలో జరిగిన సమావేశాలు సామ్రాజ్య వాదపు దురాక్రమణ ప్రవృత్తిమారలేదని చేసిన నిర్ణయాలను మనం సమీక్షిస్తున్న దశ ధృవ పరిచింది. సామాజిక ప్రగతి పథాన్ని చేపట్టిన దేశాలకు వ్యతిరేకంగా సామ్రాజ్య వాదులు ఆయాదేశాల ప్రభుత్వాలను కూలద్రోయడానికై తమ ప్రయ త్నాలను పెంచారని యిటీవల జరిగిన ఘటనలు చూపుతున్నాయి. మన కాలంలో అత్యంత అభివృద్ధి నిరోధక శక్తియైన అమెరికను సామ్రాజ్యవాదం ప్రపంచ రక్షక భట పాత్రను తానై వహించింది. ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికాలకు చెందిన అనేక దేశాల, జాతుల అంతరంగిక వ్యవహారాలలో, అది సిగ్గుమాలిన జోక్యం కల్పించుకుంటూ, వారి సార్వభౌమాధిపత్యాన్ని తిరస్కార భావంతో చూస్తూ, జాతీయ విమోచనోద్యమాన్ని సాయుధ బలప్రయోగం ద్వారా అణచివేసి, వలస విధానాన్ని తిరిగినెలకొల్పటానికీ, విప్లవాత్మకమార్పులను వెనక్కునెట్టటానికీ

పూనుకుంది. అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ ప్రవృత్తిని అది వియత్నాం ప్రజలకు వ్యతిరేకంగా చేస్తున్న దుష్టయుద్ధం మిక్కిలి స్పష్టంగా ప్రదర్శిస్తోంది. అమెరికా దురాక్రమణపరులు వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్కులోని శాంతియుతమైన పట్టణాల పైనను, పల్లెపట్టుల పైనను, నిర్దాక్షిణ్యంగా బాంబులను వేస్తున్నారు. దక్షిణ వియత్నాం జనాభాను నాపాం (మంటల) బాంబులతో, విషవాయు ప్రయోగంతో తుడిచిపెట్టి వేసే అమానుష ప్రయత్నాలు చేస్తున్నారు.

అమెరికను సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో. జాత్యహంకార పూరిత సైనిక శక్తులను వృద్ధిచేసుకొంటున్న పశ్చిమ జర్మనీ అంతర్జాతీయ ఉద్రిక్తతకు ఒక ప్రమాదకర స్థావరంగా తయారవుతోంది. ఈ శక్తులు పగసాధనకు, హింసాత్మక ప్రయోజనాల సాధనకుగాను అణ్వాయుధాలను, మిసిలీలను సంపాదించాలని పట్టుదలగా ప్రయత్నిస్తున్నాయి.

అంతర్జాతీయ పరిస్థితి. సమస్త యుద్ధవ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల ఐక్యత కోసం, అందులోనూ ముఖ్యంగా ప్రపంచ సోషలిస్టు శిబిరంలో ఐక్యతకోసం. ప్రపంచ కమ్యూనిస్టు, కార్మికవర్గ, జాతీయ విమోచనోద్యమం, శాంతి కాముకజాతులు. రాజ్యాలతో ఐక్యత కోసం. వారివారి రాజకీయ, ప్రపంచ దృక్పథా లేమైనప్పటికీ శాంతి కాముకులందరి సమైక్యత కోసం విరామం లేకుండా పిలుపు నిస్తోంది. అంతర్జాతీయ ఉద్రిక్తత మరింత పెరుగకుండా వుండేందుకూ. శాశ్వత శాంతినీ, ఆయా ప్రజల స్వేచ్ఛాయుత అభివృద్ధి నీ సాధించేందుకూ, శాంతి కాముక దేశాలలోని అధిక సంఖ్యాక ప్రజలు, అన్ని రాజకీయపార్టీలు, ప్రజాఉద్యామాలూ దురాక్రమణ పరులను దృఢంగా యెదిరించి పోరాడవలసి వుంటుంది.

4. సోవియటు ప్రజల మూల ప్రయోజనాలపైనను, సోదర సోషలిస్టుదేశాల పట్లను, అన్ని దేశాల కార్మికజనావళి పట్లను తనకుగల విప్లవకర విధులపైనను ఆధారపడి సోవియటు యూనియను కమ్యూనిస్టుపార్టీ తన విదేశాంగ విధానాన్ని రూపొందించుకుంది. ఇతర సోషలిస్టు దేశాల విదేశాంగ విధానంతోపాటు సోవియటు యూనియను విదేశాంగ విధానాశయం, సోషలిజం, కమ్యూనిజముల నిర్మాణానికై అనుకూల అంతర్జాతీయ పరిస్థితులను సాధించడానికి ; సోషలిస్టు దేశాల మధ్య ఐక్యతను, ఘనిష్ఠతను, స్నేహ సౌభ్రాతృత్వాలను పటిష్ఠమొనర్చడం ; జాతీయ విమోచనోద్యమాలను బలపరచడం ; అభివృద్ధి చెందుతున్న తరుణ దేశాలకు సర్వతోముఖ సహకారాన్ని కొనసాగించడం ; విభిన్న సామాజిక విధానాలు

అమల్లోవున్న వివిధ రాజ్యాల శాంతియుత సహజీవనావశ్యకతను విడువకుండా ఉద్ఘాటించడం: సామ్రాజ్యవాద దురాక్రమణపూరిత శక్తులను దృఢంగా త్రిప్పి కొట్టడం; ఒక నూతన ప్రపంచ యుద్ధంనుండి మానవాళిని తప్పించడం అయి వుంది.

శాంతిని సుస్థిర మొనర్చి, రక్షించడానికి గాను శాంతి ప్రియశక్తుల బలాన్ని అవిరామంగా నిర్మించడం, ఆ శక్తుల కార్యకలాపాలను పెంచడం, శాంతికై జరిగే పోరాటంలో అశేష ప్రజానీకం పాల్గొనేలా చేయడం అవసరం. శాంతి పరిరక్షణలో సోషలిస్టు దేశాలు ప్రత్యేక పాత్రను వహిస్తాయి. దురాక్రమణ పరునికి ముక్కుకు త్రాడువేసి, మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించడం సాధ్యమని ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం చేసిన నిర్ణయం సరియైనదని మనపార్టీ విశ్వసిస్తుంది.

సమస్త దేశాలతోనూ సత్సంబంధాలు కలిగి యుండటాన్నీ, అంర్జాతీయ సమస్యలను యుద్ధంద్వారా కాక సంప్రదింపులద్వారా పరిష్కరించు కోవడాన్నీ. సోవియటు యూనియన్ పూర్వంపరెనే, యికముందుకూడ బలపరుస్తుంది. అయితే యీసందర్భంలో, శాంతియుత సహజీవన సిద్ధాంతం పీడకులకు. పీడుతులకు మధ్యను, వలస వాదులకు, వలసవాదన పీడనకు గురియైన వారికీమధ్య పొసగదన్న విషయాన్ని ముఖ్యంగా గుర్తించు కోవాలి.

వియత్నాం వీర ప్రజల న్యాయబద్ధమైన విముక్తి పోరాటానికి సోవియటు యూనియను కమ్యూనిస్టుపార్టీ సంపూర్ణసహకార మిచ్చింది, సహకారమిస్తోంది. యిక ముందుకూడ యిస్తూవుంటుంది. వియత్నాం ప్రజలకది రాజకీయ, భౌతిక, నైతిక సహకారాన్నిస్తూ వుంటుంది. వియత్నాంలో అమెరికా దురాక్రమణ అంత మొందాలనీ, దక్షిణ వియత్నాంనుండి అమెరికను సేనలు ఉపసంహరింప బడాలనీ, వియత్నాం ప్రజలకు తమఅంతరంగిక విషయాలను తామేస్వయంగా పరిష్కరించు కునే అవకాశం యివ్వబడాలనీ, సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ, మొత్తం సోవియటు ప్రజల దృఢాభిప్రాయం.

సామ్రాజ్యవాద దురాక్రమణపర శక్తులు అంతర్జాతీయ ఉద్రిక్తతను, యుద్ధ స్థావరాలను సృష్టిస్తున్నారని పరిగణించి, సోవియటు యూనియను కమ్యూనిస్టుపార్టీ సోవియటు ప్రజల అప్రమత్త దృష్టిని సునిశిత మొనర్చడానికీ, సోవియటు యూనియను రక్షణ పాటవాన్ని పెంపొందించడానికీ, సోవియటు సాయుధ దళాలు సోషలిస్టు విజయాలను అహరహం కాపాడ సంసిద్ధంగా వుంటూ, ఏ సామ్రాజ్య

వాద శక్తియైనా దురాక్రమణకు పూనుకున్నట్లయితే, ప్రళయ సదృశశక్తితో దాన్ని అణచివెయ్యడానికి సర్వసంసిద్ధంగా వుంటుంది.

విదేశాంగ విధాన రంగంలో సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, సోవియటు ప్రభుత్వాలు అవలంబిస్తున్న కార్యవిధానాలను మహాసభ సంపూర్ణంగా ఆమోదిస్తూంది. ప్రపంచ శాంతిని, అంతర్జాతీయ భద్రతను బలపరచ డానికీ, వివిధ దేశాల ప్రజల ప్రయోజనాల దృష్ట్యా ప్రపంచ రాజకీయ కీలక సమస్యలను పరిష్కరించడానికీ అనువుగా కేంద్ర కమిటీ నివేదికలో రూపొందించ బడిన కార్యక్రమాన్ని మహాసభ బలపరుస్తోంది.

## II

1. మనం సమీక్షిస్తున్న దశలో కార్మికవర్గము, సమిష్టి క్షేత్రాల రైతులు, మేధావులు సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలో నిర్ణయించిన చారిత్రాత్మక లక్ష్యాలను అమలుపరచే క్రమంలో ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధిని సాధించడంలోను, ప్రజల జీవన ప్రమాణాలను పెంచడంలోను ఘన విజయాలను సాధించడాన్ని మహాసభ తృప్తితో తిలకిస్తున్నది.

సప్తవర్ష ప్రణాళికాలక్ష్యాలను పూర్తిచేసి, కమ్యూనిజానికి భౌతిక, సాంకే తిక పునాదిని నిర్మించడంలో దేశం ముఖ్యమైన ముందడుగు వేసింది.

పారిశ్రామికోత్పత్తి చెప్పుకోతగినంతగా వృద్ధిచెందింది. కీలక ఆర్థిక శాఖలు సాంకేతికంగా పటిష్ఠమొనర్చబడ్డాయి. విద్యుత్, యింజనీరింగు, రసాయ నిక, తైల, ఖనిజవాయు పరిశ్రమలు, యింజనీరింగు, పరికరాలతయారీ పరిశ్రమలు ప్రాధాన్యత క్రమంలో అభివృద్ధి చెందుతున్నాయి. ఆహార పదార్థాల, వాడకం వస్తువులు, గృహోపకరణాలు, కళాత్మక వస్తువుల ఉత్పత్తి చెప్పుకోతగిన నంతగా వృద్ధిచెందింది. ఉత్పత్తిలో కార్మిక ప్రజలు తీసుకునే అధికతర ఆసక్తి, క్రొత్త యంత్రాలు, పరికరాలు, ఉత్పత్తి శాఖలన్నింటిలోను యాంత్రికీకరణ, స్వయంచలన యంత్రాల ప్రవేశం శ్రమోత్పాదకతను చెప్పుకోతగినంతగా పెంచ డాన్ని సుసాధ్యమొనర్చాయి. శాస్త్రీయ, ఉత్పత్తి రంగాలలో సాధింపబడిన మహత్తర విజయాల ధర్మమా అని సోవియటు సాయుధ బలగాలకు అత్యంత ఆధునిక ఆయుధాలు లభ్యమయ్యాయి. సోవియటు సైన్యం అత్యంతాధునికము,

భయంకరమైన ఆయుధాలను కలిగి యుండేందుకు గాను రక్షణాయుధోత్పత్తిని వృద్ధిచేస్తూవుండటం అత్యంత అవసరం.

ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో సోవియటు యూనియను భాగం పెరిగింది. ప్రముఖ పెట్టుబడిదారీ దేశాలతో జరిగే ఆర్థిక పోటీలో సోవియటు యూనియను తన స్థానాలను పటిష్ఠం చేసుకోవడమే కాక, క్రొత్త విజయాలనుకూడ సాధించింది. మన దేశంలో యీ మధ్యకాలంలో స్థిరమూ, ఉన్నతమైన స్థాయిలలో విస్తృతంగా జరిగే వస్తూత్పత్తి సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన బాహ్యాత్మక సూత్రాన్ని ధృవపరుస్తోంది.

కార్మిక ప్రజల జీవనప్రమాణం మెరుగైంది. ఆర్థికశాఖ లన్నింటిలోనూ జీతాలను, వేతనాలను సరిచూచి పెంచడానికి ముఖ్యచర్యలు తీసుకోబడ్డాయి. కార్మిక ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులకు పన్నులు తగ్గించడంగాని, పూర్తిగా రద్దుచెయ్యడంగాని జరిగింది. జనాభాలో కొన్ని శ్రేణులకు సౌకర్యాలు, పెన్షన్లు అధికం చెయ్యబడ్డాయి. సముష్టిక్షేత్ర రైతులకు పెన్షన్లు ప్రవేశపెట్టబడ్డాయి. శ్రామికజనంలో కొన్ని కొన్ని రకాలవారికి రోజుకు ఏడు గంటల పని, ఆరు గంటల పని అమల్లోనికి వచ్చింది.

విప్లవం జరిగిననాటినుంచి 1958 వరకు ఎన్ని నివాస గృహాలు తయారయ్యాయో, దేశం యీఏడేళ్లలో అన్నికొత్తనివాస గృహాలను నిర్మించడం జరిగింది.

సాంస్కృతిక, విద్యా, ఆరోగ్య రంగాలలో బ్రహ్మాండమైన పురోగతి సాగింపబడింది. ఈ ఏడేండ్లలో ఉన్నత, లేక మాధ్యమిక విద్యావంతుల సంఖ్య దాదాపు 50 శాతం పెరిగింది. శాస్త్ర కారుల సంఖ్య రెండురెట్లు కన్న పెరిగింది.

పార్టీ తీసుకున్న చర్యల ఫలితంగా, అందులోనూ ముఖ్యంగా 1964 అక్టోబరు తర్వాతను, తదుపరి జరిగిన సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనం సమావేశాల తర్వాతను తీసుకున్న చర్యల ఫలితంగా యూనియన్ రిపబ్లికు లన్నింటిలోను సత్వర ఆర్థిక, సాంస్కృతి కాభివృద్ధి జరుగు రోంది. వాటిమధ్య ఆర్థిక సంబంధ బాంధవ్యాలు, పరస్పర సహాయ సహకారాలు, సోవియటు యూనియన్‌లోని వివిధ జాతులమధ్య స్నేహ సౌభ్రాతృత్వాలు బల పడుతున్నాయి.

వివిధ జాతులకు చెందిన ప్రజలు సర్వతో ముఖాభివృద్ధి పొందుటకు విశ్వాస

నీయమైన అవకాశాలను చూపేది ఒక్క సోషలిజం మాత్రమేనన్న విషయాన్ని ఇదంతా మరొకమారు స్పష్టంగా ప్రపంచానికి ప్రదర్శిస్తున్నది.

సోషలిస్టు ఆర్థిక విధానాభివృద్ధిలో గణనీయమైన విజయాలు సాధింపబడి నప్పటికీ, సప్తవర్ష ప్రణాళికా లక్ష్యాలలో కొన్ని సాధింప బడలేదన్న విషయాన్ని మహాసభ గుర్తిస్తున్నది. రసాయనిక, యింజనీరింగు, యింధన పరిశ్రమల్లోకొన్ని అంశాలలో లక్ష్యాన్ని చేరుకోవడం జరుగలేదు. వ్యవసాయకోత్పత్తిలో కొంత తరుగు వుంది. ఆ కారణంగా తేలిక పరిశ్రమల్లోను, ఆహార పరిశ్రమలోను పెరుగుదల కుంటుపడి ప్రజల జీవన ప్రమాణాలను పెంచడానికై ఉద్దేంపబడిన ప్రణాళికలోని చర్యలు పూర్తిగా అమలులోకి రాకుండా నిరోధింప బడ్డాయి.

ఇటీవలి సంవత్సరాల్లో ఉత్పత్తి పెరుగుదల వేగము, శ్రామికోత్పాదకత కొంత మందగించాయి. ఉత్పత్తి శక్తి సామర్థ్యాలు, పెట్టుబడి ప్రభావము పడి పోయాయి. కొన్ని ఉత్పత్తి శాఖలకు సంబంధించిన పారిశ్రామిక సంస్థల స్థాపనలో ఆలస్యాలు జరుగుతున్నాయి. క్రొత్తగా ప్రారంభింపబడిన ఫ్యాక్టరీలలో చాలవరకు వాటి పూర్తి శక్త్యానుసారంగా పనిలక్ష్యాలను సాధించ లేకపోయాయి. తత్ఫలితంగా జాతీయాదాయపు పెరుగుదలవేగం సప్తవర్ష ప్రణాళికాలక్ష్యానికితగ్గింది. ఆర్థిక అజమాయిషీ లోపాలు, అజమాయిషీలోనూ ఆర్థికంగా సమర్థవంతమైన ఉత్పత్తిలోనూ, శాస్త్రీయ పద్ధతులలో అజమాయిషీ చెయ్యడాన్ని తక్కువ అంచనా వెయ్యడం; భౌతిక, నైతిక, ప్రేరక శక్తుల సమగ్రోప యోగం, ప్రణాళికా రచనలో కొన్ని తప్పుడు అంచనాలు, కొన్ని ఆర్థిక సమస్యల పరిష్కారంలో వ్యక్తిగత దృక్పధం అవలంభించడం యీ వ్యతిరేక ఫలితాలకు కారణాలు. 1963 1965 సంవత్సరాలలోని నాసిపంటలు మన ఆర్థికాభివృద్ధిపై ప్రతికూల ప్రభావాన్ని కల్గించాయి. అంతర్జాతీయ విషమ పరిస్థితుల దృష్ట్యా దేశరక్షణ సౌష్టవాన్ని పెంచ డానికై అదనపు మొత్తాలను కేటాయించడం అవసర మైందన్న విషయాన్నికూడా మనం గుర్తించాలి.

1965 మార్చి, సెప్టెంబరుల నాటి సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్లీనం సమావేశాల నిర్ణయాలను మహా సభ పూర్తిగా అంగీకరిస్తోంది. ఆర్థికాభివృద్ధిలోని లోటుపాట్లకు కారణాలను, ఆర్థిక అజమాయిషీ పట్ల ఒక క్రొత్త దృక్పధాన్ని ఆ నిర్ణయాలు వెల్లడించాయి. దేశం యొక్క బ్రహ్మాండమైన ఉత్పత్తి శక్తుల సక్రమోపయోగానికీ, జాతీయ సుస్థిరత సత్వరంగా పెరగడానికీ, సోషలిస్టు

విధానం స్తోమత పూర్తిగా వినియోగం కావడానికీ నూతన యాజమాన్య విధానం మరింత అనుకూల పరిస్థితులను కల్పిస్తుంది.

పార్టీయొక్క ఆర్థిక విధాన సూత్రాలను పట్టుదలతో అవిరామంగా అమలు జరపాలనీ, వివిధ యూనియను రిపబ్లిక్కుల అధికారాలను ఒకవంక విస్తృత మొనర్చుతూనే, ప్రతి ఒక పరిశ్రమకూ కేంద్రీకృత యాజమాన్యాన్ని జోడించా లనీ, ఆర్థికంగా లాభసాటియైన, సమర్థవంతమైన యాజమాన్య పద్ధతులను వృద్ధి చెయ్యాలనీ, ప్లానింగులో విశేషాభివృద్ధిని సాధించాలనీ, వ్యాపార సంస్థలయొక్క, అందరి ఉద్యోగులయొక్క స్వేచ్ఛను, చొరవను పెంచి, తమ కృషిఫలితానుభవం విషయంలో వారి భౌతికాసక్తిని రగుల్కొల్పాలనీ మహాసభ పార్టీనీ, ప్రభుత్వాన్నీ ఆదేశిస్తూంది. నూతన ప్లానింగు విధానాన్నీ, ఆర్థిక ప్రోత్సాహపద్ధతినీ సాధించడం అద్యతనసభావిలో సాధించవలసిన అతి ముఖ్య లక్ష్యాల్లో ఒకటి.

నూతన పరిస్థితుల్లో, ఉత్పత్తికిసంబంధించిన నైతికప్రోత్సాహాలు కార్మికుల్లో క్రమశిక్షణను బలపరచేటందుకు, శ్రమ చేయ్యడమన్నది దేశభక్తిపూరిత కార్య మన్న భావాన్ని కల్పించేందుకు, తన ఫ్యాక్టరీలోనూ గృహ నిర్మాణ పథకంలోని ఆఫీసులోని పరిస్థితుల పట్లప్రతి ఉద్యోగి వ్యక్తిగత బాధ్యాతా భావాన్ని కలిగి యుండేందుకు, యిందుకు గాను, ఉత్పత్తిలో ఆర్థిక ప్రోత్సాహాల నూతన పద్ధతి ద్వారా లభించిన విస్తృతమైన అవకాశాలకు విశేష ప్రాధాన్యతనివ్వాలి.

ఉత్పత్తిలో మరింత శీఘ్రగతిని వైజ్ఞానిక సాంకేతిక విజయాలను అమలు పరచాలనీ, ఫాక్టరీలకు, పరిశోధన, డిజైనింగు శాఖలమధ్య పటుతరమైన సంబంధ బాంధవ్యాలను పెంపొందించాలనీ, ఉత్పత్తిలో స్పెషలైజేషనునూ, సహకారాన్ని విస్తారంగా పెంచాలనీ మహాసభ పారిశ్రామిక మంత్రిత్వ శాఖలను ఆదేశిస్తూంది. పార్టీ, ప్రభుత్వ ఆర్థిక శాఖలు రాజ్యాంగ క్రమశిక్షణను బలపరచడానికీ, యాజమా న్యంలో పెత్తందారీ పద్ధతులనూ, సంకుచిత ప్రాంతీయ, శాఖా దురభిమానాలకు సమూలంగా నిర్మూలించడానికి అవిరామమైన గట్టి కృషిని జరపాలి.

3. పార్టీ, సోవియటు ప్రజలు కమ్యూనిజం నిర్మాణానికై వేసుకున్న భౌతిక సాంకేతిక ప్రాతిపదికలో సోవియటు యూనియను 1966-70 దశకు వేసుకున్న పంచవర్ష ఆర్థిక ప్రణాళిక, ఒక ముఖ్యఘట్టం. ఈ పంచవర్ష ప్రణాళికా కాలంలో, వైజ్ఞానిక సాంకేతిక విజయాలను ఆధారంచేసుకుని పరిశ్రమలను చెప్పుకో తగినంత అధికంగా పెంపొందించడం, సుస్థిరము, ఉన్నతమైన ప్రమాణాలలో వ్యవసాయాభి

వృద్ధిని సాధించడం. సామాజికోత్పత్తి శాఖలన్నింటిలో పారిశ్రామికాభివృద్ధిని సాధించడం, దాని సమర్థతను, శ్రామికోత్పాదకతనూ పెంపొందించడం. తద్వారా జీవన ప్రమాణాలలోను, ప్రజల సాంస్కృతిక స్థాయిలోను చెప్పుకోతగినంత యెక్కువ పెరుగుదలను సాధించడం, ప్రధాన బాధ్యతలుగా మహాసభ పరిగణిస్తుంది.

ఈ నూతన పంచవర్ష దశలో ఉన్నత ఆర్థికాభివృద్ధి స్థాయిని సాధించడానికై అందుబాటులో వున్న అవకాశాలన్నింటినీ మరింత బాగా వినియోగించుకోవడం అవసరం. సోవియట్ ప్రజల వీరోచిత శ్రమఫలితంగా నిర్మింపబడిన ఉత్పత్తి శక్తులు ఒకవంక భారీ పరిశ్రమలను అభివృద్ధిపరచుతూనే మరోవంక ప్రజల భౌతిక, సాంస్కృతికావసరాలకు సంబంధించిన సామాజికోత్పత్తి శాఖలను మరింత త్వరితంగా విస్తృత మొనరుస్తుంది.

నూతన పంచవర్ష ప్రణాళిక కాలంలో యీ క్రింది వాటిని సాధించడం అవసరమని మహాసభ పరిగణిస్తోంది.

త్వరితగతిని సామాజికోత్పత్తిని పెంచడం, గత అయిదేండ్లలో కన్న యీ దశలో గ్రామీణ, పట్టణ ప్రాంతాలకు చెందిన ప్రజల జాతీయ నిజాదాయాలను పెంచడం ;

ఉత్పత్తి సాధనాల ఉత్పత్తిని నిత్యజీవితావసర వస్తూత్పత్తిని దాదాపుగా సరిసమాన మొనర్చడం ;

ఎలెక్ట్రి ఎనర్జెటిక్స్, లోహ, యింజనీరింగు, రసాయనిక, రేడియో (ఎలక్ట్రానిక్) పరికరాల ఉత్పత్తికి ప్రథమ ప్రాధాన్యతనిస్తూ పరిశ్రమలను మరింత వేగంగా పెంచడం ;

వ్యవసాయక వస్తూత్పత్తిని చెప్పుకో తగినంతగా పెంచడం.

వైజ్ఞానిక, సాంకేతిక ప్రగతివేగాన్ని, సామాజికోత్పత్తి సామర్థ్యాన్ని పెంపొందించడం ;

ప్రయాణ, రవాణా సౌకర్యాలను సాంకేతికంగా పునర్వ్యవస్థీకరించడం ;

వ్యవసాయంలో ప్రభుత్వ పెట్టుబడిలో నూరు శాతం పెరుగుదలతోపాటు, గత పంచవర్ష దశలో పోలిస్తే యీ పంచవర్ష దశలో ఆర్థిక పెట్టుబడులలో 50 శాతం అభివృద్ధి, పెట్టుబడి పెట్టబడిన ప్రతిరూపాయికూ అధిక ప్రతిఫలం ఆర్థికాభివృద్ధి

కోసం కేటాయింప బడిన వస్తువులను, ధనాన్నీ మరింత సమర్థంగా వినియోగించడంద్వారా ఆర్థిక విధానంలోని ప్రాతిపదిక పరిమాణాలను వృద్ధి చెయ్యడం ;

గృహనిర్మాణ కార్యక్రమాన్ని విస్తృత మొనర్చడం, గృహనిర్మాణ పారిశ్రామిక శక్తిని పెంపొందించడం, గృహభాగాలను కూర్చే కార్యక్రమాన్ని తగ్గించడం, గృహనిర్మాణ వ్యయాన్ని తగ్గించడం,

ఉత్పత్తి శక్తుల విభజనను మెరుగు పరచడం, యూనియన్ రిపబ్లిక్కుల, ఆర్థిక ప్రాంతాల సర్వతో ముఖాభివృద్ధిని ఒక్కొక్క ఆర్థిక రంగంలో ఒక్కొక్క ప్రాంతం ప్రత్యేక కృషిజరపడాన్నీ అభివృద్ధి చెయ్యడం ; దేశంలోని తూర్పు భాగాల ఆర్థిక కార్యకలాపాల అభివృద్ధి వేగాన్ని పెంచడం ;

సోదర సోషలిస్టు రాజ్యాలతోను, అభివృద్ధి పథంలో ముందుకు సాగుతున్న దేశాలతోను ఆర్థిక సంబంధాలను దృఢతర మొనర్చుకోవడం; పెట్టుబడిదారీ దేశాలతో పరస్పరానుకూలమైన వ్యాపారాన్ని వృద్ధి చేసుకోవడం.

4. మార్చి 1965 లో జరిగిన సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనం సమావేశం చర్చించి, నిర్ణయించిన ఆర్థిక చర్యల ప్రాతిపదికపై వ్యవసాయాభివృద్ధి జరగడానికి మహాసభ అత్యంత ప్రముఖ ప్రాధాన్యతను ఆపాదిస్తోంది.

వ్యవసాయ క్షేత్రోత్పత్తుల తయారీని పెంచడానికి, వ్యవసాయ కృషిలో యంత్రాల ఉపయోగాన్ని పెంచడం, విద్యుదీకరణ, రసాయనీకరణల ప్రాతిపదికను విస్తృతమొనర్చడం, దానికితోడు వాతావరణం అనుకూలంగావుండే ప్రాంతాలలో దీర్ఘకాలిక అభివృద్ధి కార్యక్రమాలను అమలుజరపడం ముఖ్య సాధనాలు.

గతంలోవలె, ధాన్యోత్పత్తిని పెంచడమే ఇప్పుడుకూడ ప్రధాన లక్ష్యం మొత్తంమీద వ్యవసాయరంగంలో అభివృద్ధి వేగాన్ని పెంచడానికీ, ప్రత్యేకంగా ధాన్యోత్పత్తిని పెంచడానికీ కూడ హెక్టారు భూమిలో ఉత్పత్తిని ఎంత పెంచామన్నదే నిర్ణాయక కొలమానం.

ఇందుకుగాను, భూసారాన్ని పెంచే పనులకు పూనుకోవడం దేశం మొత్తం మీదను, ప్రతి ఒక సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోను ప్రభుత్వ క్షేత్రంలోను కూడ వ్యవసాయపు పద్ధతులను మెరుగుపరచడం అవసరం.

వ్యవసాయ కోత్పత్తిని పెంచడం, సహజసిద్ధమైన పచ్చికబీడుల ఉత్పాద

కతను వృద్ధిచేయడమే సోషలిస్టు పద్ధతి. పశుపోషణాభివృద్ధికివి చెప్పుకో తగినంత దోహదం చేస్తాయి.

పెంచబడిన వ్యావసాయకోత్పత్తి లక్ష్యాల సాధనకు జాతీయ మొనర్చబడిన వ్యవసాయ, ప్రభుత్వ క్షేత్రాల ఆర్థిక విధాన నిర్మాణం మరింత పటిష్ఠ మొనర్చబడాలని మహాసభ పరిగణిస్తోంది. పల్లెపట్టులలో గల ప్రభుత్వ క్షేత్రాలను ఆదర్శప్రాయమైన సోషలిస్టు సంస్థలుగా వృద్ధిచేసే పనికి అధికతర ప్రాముఖ్యత యివ్వబడాలి. జిల్లాలలోను, ప్రాంతాలలోను, రిపబ్లిక్కులలోను, కేంద్రంలోను కూడా సమష్టి క్షేత్ర సహకార సంస్థలను నెలకొల్పే విషయాన్ని పరిశీలించవలసిందిగా సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీని మహాసభ ఆదేశిస్తోంది.

5. రాబోయే ఐదేండ్లలో పారిశ్రామిక కార్మికుల వేతనాలను, ఆఫీసు పని వారల జీతాలను పెంచడంద్వారాను, జాతీయ మొనర్చబడిన ఆర్థిక విధానం ద్వారా సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతుల ఆదాయాన్ని పెంచడం, సమిష్టి క్షేత్రాలన్నింటిలోనూ శ్రమ అంచనా విధిగా ప్రతిఫలం ముట్టేచేయడం నెలకొల్పడం, ప్రజా ప్రభుత్వ ద్రవ్యమునుండి రొఖ రూపేణా, సౌకర్యాల రూపేణా ప్రజలకు ప్రతిఫలాలు ముట్టచెప్పడం, పారిశ్రామిక కార్మికులకు, ఆఫీసుల్లో పని చేసేవారికి సమిష్టి రైతులకు అమల్లోవున్న పెన్షను పథకాన్ని మరింత మెరుగు పరచడం, సాముదాయిక, దైనందిన సాంస్కృతిక సేవలను పట్నప్రాంత, గ్రామీణ జనాభాలకు అందజేయడంద్వారా జీవన ప్రమాణంలో మరింత పెరుగుదలను తప్పని సరిగా సాధించాలని మహాసభ పరిగణిస్తోంది.

నిత్య వాడకం వస్తువులఉత్పత్తిలో పెరుగుదల, సరుకుల, ఆర్థిక వనరుల సమీకరణల ఫలితంగా వివిధ ఆహార పదార్థాలకు, ఉత్పాదిత వస్తువులకు, ముఖ్యంగా బాల బాలికల వస్తువులకు ప్రభుత్వం చిల్లర ధరలను తగ్గించడం జరగాలి.

గృహ నిర్మాణ కార్యక్రమాన్ని విస్తృత మొనర్చడాన్నీ, పట్నాల్లోను, గ్రామాల్లోను సాంస్కృతిక, నిత్యావసర సేవాగృహ నిర్మాణాలను ప్రధాన లక్ష్యాలుగా మహాసభ ఆదేశిస్తూంది.

ప్రజలకు పనిచేయ్యడానికి మంచి పరిస్థితులనూ, విరామ సమయాన్నీ కల్పించడం, ప్రస్తుతం వారానికేర్పాటైయున్న పనిగంటలను తగ్గించకుండానే వారానికి రెండు రోజులు సెలవులు, సంస్థల నూత్న విధానంలో పనిచేయ్యడానికి సంసిద్ధం కాగానే క్రమంగా ప్రవేశ పెట్టబడతాయి.

6. జాతీయార్థిక శాఖలన్నింటినీ సాంకేతికంగా పునస్సజ్జితం చెయ్యడం ద్వారాను, ముందడుగు వేసిన కార్య విధానాల విస్తృత వినియోగం ద్వారాను, అందు బాటులోవున్న సాధనసంపత్తులన్నింటినీ పూర్తిగా వినియోంచుకోడంద్వారాను ఉన్నత శ్రామిక ఉత్పాదకతా వేగాన్ని సుసాధ్య మొనర్చడం పార్టీయొక్క, ఆర్థిక సంఘాల యొక్క, పరిశ్రమలు, రవాణా, వ్యవసాయం, నిర్మాణ రంగాలలోని కార్మికుల యొక్క అత్యంత ప్రముఖ బాధ్యత. శాస్త్రీయంగా జరిగే ఉత్పత్తి కార్యక్రమం, అత్యంత ఆధునిక శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్ని జాతీయార్థిక జీవితానికి అన్వయించడం కార్మికులందరి పనిలోనూ అత్యధిక ఉత్పాకదతను సాధించడానికై అనువైన పరిస్థితులను నానాటికీ యెక్కువగా కల్పించాలి. పారిశ్రామిక సంస్థలలోని ఆర్థిక సమితులు, పార్టీ సంఘాలు ఉత్పత్తి క్రమాలలో సర్వతోముఖ యాంత్రికీ కరణను ప్రవేశ పెట్టడానికీ, మానవ శ్రమను క్రమంగా తగ్గించివేయడానికీ, మానవ శక్తిని మరింత విచక్షణతో వినియోగించడానికీ, శారీరక శ్రమలో శాస్త్రీయ నిర్మాణాన్ని ప్రవేశ పెట్టడానికీ పూను కోవాలి.

పార్టీ, స్థానిక ప్రభుత్వం, ఆర్థిక, కార్మిక, కామ్సొమాల్ సంఘాలు తమ దృష్టిని, ఉత్పాదక సామర్థ్యాన్ని పెంచడంమీదను, ప్రత్యేకించి ఉత్పత్తి సావకాశాలను పెంపొందించడంమీదను, క్రొత్తగా ఉత్పత్తిలోకి వచ్చిన ఫ్యాక్టరీలను, కర్మాగారాలను పూర్తి ఉత్పత్తిలోనికి మరింత త్వరగా తీసుకొనిరావడం మీదను కేంద్రీకరించడం అవసరమని మహాసభ పరిగణిస్తోంది.

మన పారిశ్రామికరంగం సాంకేతిక పరిణతిని యింతకుముందే సాధించి, యంత్రాలను, పరికరాలను, సున్నితమైన యాపరేటసును, యితర వస్తువులను తయారుచేస్తూ, వాటి సాంకేతిక, ఆర్థిక ప్రమాణాలు నానాటికి పెరుగుతున్న జాతీయార్థిక విధానావసరాలకు, ప్రపంచ మార్కెట్టు అవసరాలకూ అనుగుణంగా వుండే పరిశ్రమల విషయంలో సరుకుల నాణ్యాన్ని మరింత వృద్ధిచెయ్యడాన్ని, యంత్రాలపని జీవితాన్ని పొడిగించడాన్ని, వాటిపై ఆధారపడవచ్చు నన్న విశ్వాసాన్ని పెంచడాన్ని అత్యంత ముఖ్యమైన బాధ్యతలుగా మహాసభ పరిగణిస్తోంది.

7. మన దేశం విస్తృత ప్రాతిపదికపై కమ్యూనిజాన్ని నిర్మిస్తున్న తరుణంలో, నూతన మానవుని సర్వతోముఖ విద్యావంతుని చెయ్యడానికీ, ప్రజలను విద్యావంతులను, సాంస్కృతీ పరులను చెయ్యడానికీ మరింత ప్రాముఖ్యత నివ్వాలని మహాసభ నొక్కి వక్కాణించింది.

సంస్కృతికిగల భౌతిక ప్రాతిపదికను విశేషంగా విస్తృత మొనర్చడానికీ, సాంస్కృతిక కార్యక్రమ రూపాలన్నింట అభివృద్ధిని సుస్థిర మొనర్చడానికీ, క్లబ్బులు, సంస్కృతి కేంద్రాలు, గ్రంథాలయాల కార్యకలపాలను మెరుగొనర్చ డానికీ చర్యలు తీసుకోవటం జరగాలి. మరిన్ని స్టేడియంలు, క్రీడావసతులు, తదితర సౌకర్యాల నిర్మాణం, అందులోనూ ముఖ్యంగా సమిష్టిక్షేత్రాలు, ప్రభుత్వ క్షేత్రాలలో జరగాలి. ఈ బాధ్యతను యావత్తు పార్టీ, దాని సంస్థలు, సోవియట్లు, కార్మిక సంఘాలు, కాంసొమాల్ సంఘాలు పట్నాలలోను. పల్లెలలోను కార్మిక ప్రజలందరు, తమదిగా పరిగణించాలి.

రాబోయే అయిదు సంవత్సరాల కాలంలో, ముఖ్యంగా యువజనులకు సార్వజనికమాధ్యమిక విద్యాబోధన పథకాన్ని అమలుజరపడం పూర్తికావాలి. సామాన్యము, వృత్తిపరము, పోలిటెక్నికల్ విద్యాబోధన గుణపరిమాణాలు ఆధునిక ప్రమాణాలకు అనుగుణంగా వుండాలి. కమ్యూనిస్టు నైతిక సూత్రాలను విద్యాలయాలు బాలబాలికలకు బోధించాలి. వర్తమానతరంలో రసదర్శన విద్యాబోధనను, వ్యాయామ విద్యాబోధనను మెరుగొనర్చాలి. విద్యాబోధన శాస్త్రాన్ని మరింత ముందుకు కొనిపోవాలి. విద్యాలయాల భౌతిక ప్రాతిపదికను బలపరచడం, వాటికి ఆధునిక పరికరాలను సమకూర్చడం, ప్రజా విద్యాబోధనకై కేటాయింప బడిన మొత్తాలను మరింత సముచితంగా సంపూర్ణంగా వినియోగించడం అవసరం.

ప్రజల సాధారణ సాంస్కృతిక సాంకేతిక స్థాయి ఉన్నత ప్రత్యేక మాధ్యమిక విద్యాలయాల అభివృద్ధి స్థాయితో విడదీయరాని విధంగా ముడిపడి వుంది. ప్రస్తుత దశలో స్పెషలిస్టుల శిక్షణను మెరుగొనర్చడమే వాటిముఖ్య బాధ్యత. సోవియటు స్పెషలిస్టులు మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞాన మనే ఆయుధాన్ని సమకూర్చుకోవాలి. అత్యాధునిక వైజ్ఞానిక సాంకేతిక విజయాల స్థాయికి సరితూగే జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. తగు ఆర్థిక శిక్షణను పొందాలి. వైజ్ఞానిక సాంకేతిక ప్రగతికి, శాస్త్రీయ శ్రామిక నిర్మాణానికి, ఉత్పత్తి యాజమాన్యానికీ సంబంధించిన సమస్యలను సమర్థవంతంగా పరిష్కరించ గలగాలి.

మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథాన్ని రూపొందించడానికీ, సోవియటు ప్రజలందరి రాజకీయ సాంస్కృతిక అభివృద్ధిని మెరుగు పరచడానికీ పత్రికలను, రేడియోను, టెలివిజనునూ, సినిమాను మరింత సంపూర్ణంగా వినియోగించు కోవాలి.

కేంద్ర, స్థానిక వార్తాపత్రికలు, వార మాసపత్రికలు, దేశమంతటావున్న ప్రచురణాలయాలు మరింతగా మెరుగొనర్చబడాలి.

8. సమాజం యొక్క ప్రత్యక్ష ఉత్పత్తి శక్తిగా అంతకంతకు అధికంగా ముందుకు వస్తున్న సోవియటు విజ్ఞానాభివృద్ధికి మహాసభ గొప్ప ప్రాముఖ్యత నిస్తోంది. ఆధునిక కాలానికి సంబంధించిన బలీయమైన సమస్యల పరిష్కారం దిశగా శీఘ్రతరమైన వైజ్ఞానిక, సాంకేతిక ప్రగతిదిశగా, జాతీయార్థిక జీవితం లోను, శ్రామిక ఉత్పాదకతా పెరుగుదల స్థాయిలోను పరిశోధనా ఫలితాలను త్వరగా ప్రవేశపెట్టే దిశగా మన శాస్త్రజ్ఞుల కార్యాకలాపాలు మళ్ళించబడాలి.

సామాజిక శాస్త్రీయ రంగపరిధిలో ఆర్థికశాస్త్రం, తత్వశాస్త్రం, సామాజిక శాస్త్రం చరిత్ర, చట్టము కమ్యూనిజానికి సంబంధించిన ప్రత్యక్ష సమస్యల పరిశీలనమే సోవియటు శాస్త్రజ్ఞుల అత్యంత ముఖ్యమైన బాధ్యత.

9. ప్రపంచవిప్లవ క్రమం కోసం సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగాను, శాంతికోసం, జాతీయ స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామ్యంకోసం, సోషలిజంకోసం ప్రపంచ ప్రజలందరు జరిపే పోరాటం దిశగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రజలందరు సమర్పించిన రెండు మూలవిషయా లేమిటంటే సోవియట్ యూనియనులో కమ్యూనిజం నిర్మాణం, సోవియటు సోషలిస్టు సమాజ సర్వతో ముఖాభివృద్ధిను.

మొత్తం సోషలిస్టువిధానం యొక్క, ఆర్థిక, రాజకీయ, రక్షణ పటిమను పెంచడం, ప్రపంచ మంతటా సోషలిస్టు భావాలను వ్యాపింపజేసి, సువ్యవస్థిత మొనర్చడమే సోవియటు యూనియనులో కమ్యూనిజం స్థాపనకు గల అంతర్జాతీయ ప్రాముఖ్యత.

# III

1. సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సమైక్యంగాను, కమ్యూనిస్టు నిర్మాణ దర్శకత్వం వహించడంలోను, మన దేశీయ, విదేశీ విధానాలను నిర్ణయించడంలోను అనుభవంతో సుసజ్జితంగాను తన 23వ మహాసభ ముందుకు వచ్చింది. సోవియటు సమాజానికి మార్గ దర్శకత్వం వహించే నాయకశక్తి సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీయే. మార్క్సిస్టు – లెనినిస్టు ఉపదేశంతో

సునజ్జితమై అది కమ్యూనిస్టు నిర్మాణ మార్గంలో సోవియటు ప్రజలను ముందుకు నడుపుతూ, ప్రజలందరి రాజకీయ నాయకులుగాను, ఆర్గనైజరుగాను తనపాత్రను విజయవంతంగా నిర్వహిస్తున్నది. సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీకి, సోదర మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీలకు, విప్లవాత్మక ప్రజాస్వామిక శక్తులకు మధ్య సన్నిహిత అంతర్జాతీయ సౌభ్రాతృత్వముంది.

పార్టీ అభీష్టాన్ని వ్యక్తీకరిస్తూ, పార్టీ జీవితానికి, సాముదాయిక నాయకత్వ సూత్రాలకు లెనినిస్టు ప్రమాణాలను తు. చ. తప్పకుండా అమలు జరపడంలో కేంద్రకమిటీ నిబ్బరమైన విధానాన్ని అమలుజరిపింది. ఈ సందర్భంలో 1964 అక్టోబరు, నవంబరు ప్లీనం సమావేశాలు అత్యంత ప్రాముఖ్యతను వహిస్తాయి. ప్రముఖ ఆర్థిక రాజకీయ సమస్యలపట్ల వ్యక్తిగత దృక్పథం అవలంబించడంద్వారా జనించే పొరపాట్లను పార్టీ, ప్రభుత్వం, ఆర్థిక యంత్రాంగాల అనుచిత పునర్ని ర్మాణాలను పార్టీ సరిదిద్దింది.

2. పార్టీ నిర్మాణాత్మక కార్యక్రమాన్ని మరింత మెరుగొనర్చ డానికి, కమ్యూనిస్టులలోను, యితర కార్మిక జనులలోను సిద్ధాంత పరమైన కార్యక్రమాన్ని తీవ్రతరమొనర్చడానికి, పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామికాన్ని పెంపొందించ డానికీ కేంద్రకమిటీ నిర్ణయించిన చర్యలను మహాసభ అంగీకరిస్తోంది. ఈ చర్యలను అవిరామంగా, సక్రమంగా అమలు జరపబడాలని తలుస్తోంది. విమర్శను, ఆత్మ విమర్శను, మరింగాత పెంపొందించాలి. పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాభివద్ధి అమలుల్లోనికి రావాలంటే దానికి ప్రాతిపదికగా అదే సమయంలో పార్టీ క్రమ శిక్షణను పటిష్ఠ మొనర్చడం, తమ సంస్థలోను, మొత్తంమీద పార్టీలోను వున్నట్టి పరిస్థితులకు కమ్యూనిస్టులు వహించవలసిన బాధ్యతను పెంచడం అవసరం.

కమ్యూనిజాన్ని నిర్మించేటపుడు నేతృత్వం వహించడంలో శాస్త్రీయ దృక్పథం, సముష్టికృషి, సామర్థ్యం ప్రదర్శించడం కేంద్రకమిటీ ఆచరణగావుంటూ వచ్చింది. కేంద్ర కమిటీ తన కార్యకలాపాలను నిర్వర్తించేటప్పుడు ఈ విషయాన్ని నొక్కి చెప్పడం కొనసాగించుతూనే వుండాలని మహాసభ భావించుతుంది.

3. సైద్ధాంతికంగానూ, నిర్మాణరీత్యానూ, తమ జీవితాలను పార్టీతో ముడి వడచేసి పార్టీ సభ్యులయేందుకు సోవియట్ ప్రజలు చేసే ప్రయత్నాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పెరుగుతున్న ప్రతిష్ఠ, పెంపొంద చేస్తుంది. సభ్యుల్ని వ్యక్తి గతంగా పరిశీలించి ఎన్నుకోవాలనే సూత్రాన్ని కొన్ని పార్టీ సంఘాలు ఉల్లంఘిం

చాయి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో చేరే ప్రజలపై చిన్నచిన్న షరతులను విధించాయి. పార్టీలో సభ్యత్వం చేర్పించడాన్ని ఇంకా ఎక్కువ జాగరూకతతో చేయడం పార్టీ సంస్థలన్నింటి యొక్క విధాయికమని మహాసభ నిర్ణయించింది. బాగా అభివృద్ధిచెందిన రాజకీయ చైతన్యం కల్గిన కార్మికులను, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులను, మేధావులను కమ్యూనిజం నిర్మించుటలో ఉత్సాహంగా పనిచేసే వీరందరినీ — పార్టీ నిబంధనలను ఖచ్చితంగా పాటించుతూ ఆమేరకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో తప్పక చేర్చుకోవాలి. పార్టీసామాజిక నిర్మాణంలో కార్మికులు ప్రధాన స్థానం వహించాలి. పార్టీ అనుయాయుల నిర్మలత్వం గురించి ఆందోళన— అంటే లెనినిస్టుపార్టీ సభ్యుడన్న పేరును సార్థకంచేసి న్యాయం సమకూర్చడానికి ప్రతి కమ్యూనిస్టు కృషి చేయడం పార్టీయొక్క, పార్టీసంఘాలయొక్క జీవిత సూత్రం. పార్టీ కార్యక్రమాన్ని నిబంధనలను ఉల్లంఘించిన వారిని, తమ ప్రవర్తన ద్వారా కమ్యూనిస్టుపార్టీ పేరును నీరుకార్చే పనికిమాలిన వారిని పార్టీ నుండి తొలగించుతూ, పార్టీ శుద్ధి చేస్తూనే ఉంటుంది.

4. ఆర్థికాభివృద్ధి యొక్క నూతన పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా పూర్తిచేసే ఉద్యమం పై పార్టీ సంఘాలన్నీ తమ దృష్టిని ప్రసరింప చేయాలని మహాసభ భావించుతోంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ మార్చి, సెప్టెంబర్ నెలలలో జరిపిన ప్లీనం సమావేశాలు రూపొందించిన సోషలిస్టు ఆర్థిక మేనేజిమెంటు సూత్రాలను, ప్రణాళిక — ఉత్పత్తికి ఆర్థిక ప్రోత్సాహం అనే కొత్త సూత్రాలను, పార్టీ సంఘాలన్నీ నిరంతరం అమలు పరచేటట్లు చూడాలి. అదేసమయాన, అవి మామూలు సంఘ నిర్మాణ కార్యకలాపాలను, బోధనా కార్యకలాపాలను కొనసాగించుతూ. స్థానిక ప్రభుత్వం ఆర్థిక శాఖలస్థానే తామే పని చేయడం. వాటిని అభిమానంచి పోషిస్తున్నామనే అల్పవైఖరిని ప్రదర్శించడం లేకుండా చూడాలి.

గ్రామీణజిల్లా పార్టీ కమిటీలు రాజకీయ హక్కులన్నీకల్గిన రాజకీయ సంస్థలుగా తిరిగి నెలకొల్ప బడ్డాయి. గ్రామసీమల్లో పార్టీవిధానాన్ని సాధికారంగా దృఢంగా (మిలిటెంట్‌గా) నిర్వహించే సంస్థలుగా అవి గట్టిగా తిరిగి నెలకొల్ప బడ్డాయి. — ఈ విషయాన్ని పార్టీ మహాసభ సంతృప్తితో గమనించుతోంది.

ప్రాథమిక పార్టీ సంఘా లన్నిటి పటిమను (మిలిటెన్సీ) విస్తృతం చేయటానికి ప్రత్యేక ప్రాముఖ్యం వున్నది. ఈ సంఘా లన్నిటిపైన పార్టీ కమిటీలు గట్టిగా ఆధారపడాలి. పార్టీ ఆంతరంగిక కార్యకలాపాలను సమన్వయం చేయటం

లోనూ, ప్రజలలో ప్రజా రాజకీయ కృషిని కొనసాగించుటలోనూ వాటికి సహాయ పడాలి.

5. కమ్యూనిజాన్ని నిర్మించే కర్తవ్యాలు క్లిష్టమైనవి, వాటి పరిమాణం పెంపొందుతోంది. అందుచే పార్టీ సభ్యులను ఎన్నికచేయుటలో, పై పదవులకు పంపడంలో, చైతన్యం కలిగించడంలో ఖచ్చితమైన ధోరణి ఈ కర్తవ్యాల నిర్వ హణకు అవసరమని మహాసభ నొక్కిచెబుతూంది. కమ్యూనిస్టు అభిప్రాయాలకు అంకితమైన వ్యక్తులకు, తమ తమ రంగాలలో నిష్ణాతులయినవారికి, ప్రజలతో నిత్యం సంబంధం ఉన్నవారికి, కర్తవ్యాలను పూర్తిచేయడంలో ప్రజలను సంఘ టితపరచ గల్గేవారికి, ఆదేశమిచ్చే అధికారంగల పదవులను ఇవ్వాలి. యువకులూ శక్తిమంతులూ అయిన వారిని ధైర్యంగా పై పదవులకు పంపాలి. వారి శక్తీ, పాతవారి అనుభవమూ కలిపివేయాలి. నూతన ఆర్థిక పరిపాలనా విధానానికి పరివర్తన, ఉద్యోగులు ఆర్థిక నాయకత్వ పద్ధతులలో తప్పనిసరిగా సిద్ధహస్తులు కావాలని కోరుతుంది.

6. పార్టీ చేసిన నిర్ణయాలు, ప్రభుత్వ నిర్ణయాలు పూర్తిచేశారో లేదో తనిఖీచేయడం, కంట్రోలుచేయడం మొదలైన వాటిపై సరియైన నిర్మాణం అవసర మనే విషయానికి కాంగ్రెస్ చాలా ప్రాముఖ్యతను యిస్తుంది. ప్రజల అదుపులో పనిచేసే సంస్థల పనిని పార్టీ సంఘాలు నడిపించాలి. వాటికి అవసరమైన సహాయా న్నంతా అందచేయాలి. పార్టీ విధానాన్ని అమలుపరచేందుకు కమ్యూనిస్టులు ఎక్కువ బాధ్యులయేటట్లు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ యొక్క కంట్రోల్ కమిటీ, స్థానిక పార్టీ సంస్థల పార్టీ కమిషన్ల పాత్రను ఎక్కువచేయాలి.

7. సోవియట్ ప్రభుత్వాన్ని యింకా బలపరచడానికీ, సోషలిస్టు ప్రజా తంత్రాన్ని, యావచ్ఛక్తినీ ఉపయోగించి అభివృద్ధిచేయడానికీ, కాంగ్రెస్ విశేషంగా ప్రాముఖ్యాన్నిస్తోంది. శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్ల పాత్రను పెంపొంద చేయడానికి కాంగ్రెస్ ప్రత్యేక శ్రద్ధ వహించుతుంది. దీనిఫలితంగా ఆర్థిక సాంస్కృతికాభివృద్ధిలో అవి తమ అధికారాలను పూర్తిగా ఉపయోగించడానికీ, నిర్ణయాలు పూర్తిచేసే విషయంపై తనిఖీచేసి చూడడానికీ, ప్రణాళికావిధానాన్ని నిర్ణయించడంలో, ఆర్థిక, భూసమస్యలను పరిష్కరించుటలో, స్థానిక పరిశ్రమలను నడుపుటలో, ప్రజానీకానికి అవసరమైన దైనందిన సామాజిక సాంస్కృతిక సేవా కార్యకలాపాలను నడపడంలో, మరింత చొరవ ప్రదర్శించడానికీ సాధ్య

మౌతుంది. పరిపాలనాశాఖల, సోవియట్ ప్రతినిధుల, కార్యకర్తల బాధ్యతను సోవియట్ హెచ్చించి, ప్రజలకు అప్పగించాలి. వారి సమావేశాల కృషిని తీవ్రతరం చేయాలి. వారికి విస్తృత ప్రశ్న పరంపరను అందచేయాలి.

ఆర్థికాభివృద్ధి సమస్యలను నిర్ణయించడంలో ట్రేడ్ యూనియన్లు ఇంకా పెద్దపాత్ర వహించాలనీ, ప్రభుత్వ ప్రణాళికలను రూపొందించడంలో ఉత్పత్తి మేనేజిమెంటులో ఇంకా చురుకుగా పాల్గొనాలనీ మహాసభ భావించుతోంది. ఇంకా పెద్దఎత్తున సోషలిస్టు పోటీని ప్రోత్సహించడం, ప్రజలలో చైతన్యవంతం చేసే పనిని అభివృద్ధి చేయడం, కార్మికుల నిర్మాణం గురించీ పారిశ్రామిక, కార్యాలయ ఉద్యోగుల జీవన పరిస్థితుల గురించీ నిరంతర ఆందోళన వ్యక్తం చేయడం ట్రేడ్ యూనియన్ల విధి.

కొమ్సొమాల్ సభ్యుల, సోవియట్ యువజనులందరి కమ్యూనిస్టు పెంపకం గురించి పార్టీ సంఘాలు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. కొమ్సొమాల్ సభ్యులను ఇతర యువజనులను సోవియటు ప్రజల, కమ్యూనిస్టుపార్టీల విప్లవ శ్రామిక సమరశీల సంప్రదాయాలలో చైతన్యులను చేయడం కీలక కర్తవ్యాలలో ఒకటి. ఉన్నత సిద్ధాంతంపట్ల నమ్మకం, పార్టీ ఆశయంపట్ల విధేయత సోషలిస్టు మాతృభూమిపట్ల ప్రేమ, దానిని సంరక్షించడానికి సంసిద్ధత, సోషలిస్టు దేశాల శ్రమజీవులతో సౌభ్రాతృత్వ స్నేహం, దోపిడి చేయబడిన పీడిత ప్రజలతో అంతర్జాతీయ సంఘీభావం — అనే ఈ భావంతో యువజన స్త్రీ పురుషులను చైతన్యవంతం చేసే పనిని కొనసాగించడం అవసరం. ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధిలో, దేశరాజకీయ జీవితంలో కొమ్సొమాల్ పెద్దపాత్ర వహించాలి. కొమ్సొమాల్ సంఘాలలో పార్టీ కణాలను బలపరచాలి. కొమ్సొమాల్ వయస్సు గల ఎక్కువమంది కమ్యూనిస్టులు అక్కడ పనిచేయాలి; వారిపనులు అత్యంత ప్రాముఖ్యమైన పార్టీ కర్తవ్యంగా భావించాలి.

8. ప్రజలలో పార్టీ సిద్ధాంత, రాజకీయ కృషిస్థాయి, ప్రమాణాలను అనుసరించి కమ్యూనిజం నిర్మించుటలో తర్వాతి విజయాలు అనేకవిధాల ఆధారపడతాయని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ భావించుతున్నది. సోవియటు సమాజానికి నాయకశక్తిగా పార్టీ చేసే యావత్ కృషితో పార్టీ సిద్ధాంత పలుకుబడియొక్క విలువ విడదీయరానిదిగా ముడిపడి యుంది. ఉన్నత రాజకీయ చైతన్యం, పనియెడల కమ్యూనిస్టు వైఖరి — అనే భావనలో ప్రజలను చైతన్యవంతులుగా చేయుటలో

సిద్ధాంత కృషి కేంద్రీకరింపబడాలి. ఆర్థికాభివృద్ధి యొక్క పంచవర్ష ప్రణాళికను పూర్తిచేయడానికి, మన దేశంలో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడానికి ఉత్సాహంతో పనిచేయడానికై కార్మికవర్గాన్ని, రైతులను, మేధావులను సమీకరించడం సిద్ధాంత కృషియొక్క ముఖ్య కర్తవ్యాలలో ఒకటి.

ఒకే సోదర కుటుంబంగా సోవియట్ ప్రజల సంఘీభావం కమ్యూనిస్టుపార్టీ యొక్క, సోవియట్ ప్రభుత్వం యొక్క, గొప్ప విజయం. లెనినిస్టు జాతీయ పంథాను పట్టుదలతో అమలు పరచడం, సోవియట్ దేశభక్తి భావంతో సోవియట్ ప్రజలకు చైతన్యం సమకూర్చడం సమస్త సోదర సోషలిస్టు దేశాల ప్రజల పట్ల స్నేహభావమూ, యావత్ ప్రపంచ ప్రజల పట్ల స్నేహభావమూ కలిగియుండాలని సోవియట్ ప్రజలందరినీ ప్రబోధించడం, సోవియట్ యూనియన్ ప్రజల అభ్యుదయ, జాతియ, సాంప్రదాయాలను గౌరవించడం, సంకుచిత జాతీయతను జాతీయ దురహంకారాన్ని వ్యక్తం చేసే ధోరణులను నిర్విరామంగా ఎదుర్కొనడం పార్టీ కమిటీ లన్నిటికీ శిరోధార్యమని మహాసభ స్పష్టంచేస్తోంది.

9 పార్టీసభ్యుల మార్క్సిస్టు లెనినిస్టు చైతన్యాన్ని తీవ్రంగా అభివృద్ధి చేయడం, పార్టీ సభ్యుల - ముఖ్యంగా యువ కమ్యూనిస్టుల సిద్ధాంత పటిమను పెంపొందించడం పార్టీ సభల ముఖ్య కర్తవ్యంగా మహాసభ భావించుతున్నది. ఉన్నత పదవులలో వున్న పార్టీ ఉద్యోగుల విషయంలో సిద్ధాంత రాజకీయ తర్ఫీదు విషయమై ఎక్కువ డిమాండ్ చేయాలి.

కమ్యూనిస్టు నిర్మాణ ప్రస్తుతదశ కర్తవ్యాల స్థాయికి తగినట్లు పార్టీచైతన్య (ఎడ్యుకేషన్) విధానం యావత్తూ అభివృద్ధిచేయాలి. ఉన్నత విద్యాసంస్థలలో ఇతర విద్యాసంస్థలలో మార్క్సిజం-లెనినిజం బోధనను అభివృద్ధిచేసేందుకు పార్టీ సిద్ధాంత సంస్థలు అందుకు సంబంధించిన ప్రభుత్వ కార్యాలయాలు దృఢమైన చర్యలు తీసుకోవాలనీ, విద్యార్థుల సైద్ధాంతిక (ఐడియాలిజికల్) తర్ఫీదు స్థాయిని అభివృద్ధిచేయాలనీ, ఈ తర్ఫీదును సామాజికాభివృద్ధి యొక్క ప్రస్తుతకాల సమస్యలతో, సైన్సు సాంకేతిక శాస్త్రాలలో అధునాతన విజయాలతో సన్నిహితంగా కలపాలనీ - ఇది పార్టీ సిద్ధాంత సంస్థలకు తదనుగుణమైన ప్రభుత్వ కార్యాలయాలకు శిరోధార్యమని కాంగ్రెస్ ఆదేశించుతోంది.

సిద్ధాంత రంగంలో పార్టీ యావత్ కృషికీ పునాది మార్క్సిజం - లెనినిజం అభిప్రాయాలను వెదజల్లడమే. కమ్యూనిజాన్ని నిర్మించుటద్వారా కలిగిన అనుభవ

ప్రాతిపదికపైన, ప్రపంచవిప్లవోద్యమ అభివృద్ధివల్ల కలిగిన అనుభవప్రాతిపదికపైన బూర్జువా సిద్ధాంత ధోరణులకు వ్యతిరేకంగా పోరాటంలో కలిగిన అనుభవ ప్రాతిపదికపైన మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంత సృజనాత్మక అభివృద్ధి జరగాలి. దీనికి పార్టీ కార్యకలాపాలన్నింటిలో ఎక్కువ ప్రాముఖ్యంవుంది.

10. సోషలిస్టు వాస్తవికతపై ఆధారపడిన సాహిత్యం కళల అభివృద్ధికి కాంగ్రెస్ ఎక్కువ ప్రాముఖ్యత నిస్తుంది. సాహిత్య కళారంగాలలో పనిచేసేవారు నూతన విశిష్ట రచనలను, కళాఖండాలను సృష్టించాలి. అవి జీవితాన్ని లోతుగా తరచే వాస్తవికతతో కూడి ముగ్ధుల్నిచేయాలి. సైద్ధాంతిక ఉత్సాహమూ, ఉన్నత సాంకేతిక నైపుణ్యం కలిగియుండాలి. కమ్యూనిజాన్ని నిర్మించేవారల భావనా మూర్తిని (స్పిరిట్యుయల్ మేకప్) రూపొందించుటలో సహాయపడాలి. ఉన్నత నైతిక గుణాలను, కమ్యూనిస్టు ఆశయాలకు అంకితమవడం, పౌరవిధి, సోవియటు దేశభక్తి, సోషలిస్టు అంతర్జాతీయత అనే భావాల్ని ప్రబోధించాలి – ఇవీ రచయితల నుండీ, కళాకారుల నుండీ పార్టీ ఆశించేది.

కళకూ, ప్రజాజీవితానికీ మధ్య సంబంధాన్ని బలపరచడంలో సమాజంపట్ల సోవియట్ కళాకారుల బాధ్యతను తమ రచనలద్వారా పెంచడంలో. ప్రజల ఆశయం కోసం సేవ చేయడంలో, పాక్షికతత్వం (ప్రజల తరపున – అను)అనే లెనినిస్టు సూత్రాలకు విశ్వాస వంతంగా వుండటం అనే భావంతో కళాకారులను చైతన్య వంతులను చేయడంలో, సృజనాకారుల సంఘాలు పెద్ద పాత్రను వహించాలి.

11. ప్రజా రాజకీయకృషిలో తీవ్రమైన అభివృద్ధిని సాధించడం పార్టీ సంఘాల విధి యని మహాసభ ఆదేశించుతోంది. పార్టీ విధానం గురించి సుబోధకంగా, క్షుణ్ణంగా విశదీకరించాలి. అత్యవసరంగా ఒత్తిడి తెస్తున్న సమస్యలను దేనినీ పరిష్కరించడాన్ని వాయిదా వేయరాదు. ప్రజల సాంస్కృతికావసరాలను, కాంక్షలను తీర్చాలి. సోవియట్ ప్రజల ఉన్నత సాంస్కృతిక విద్యా స్థాయిని పరిగణనలోకి తీసుకోవాలి. విశాల ప్రాతిపదికపై రాజకీయ ఆందోళన సాగించాలి. దేశ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక జీవితం గురించి, అంతర్జాతీయ పరిస్థితి గురించి నిరంతర భోగట్టాపై ఆధారపడి ఈ ఆందోళన సాగించాలి. పార్టీ నాయకులు, ప్రభుత్వ నాయకులు, ఆర్థికవేత్తలు, ప్రజా నాయకులు, దేశ, విదేశ విధాన సమస్యలపై, పార్టీకృషిపై, ప్రభుత్వ ప్రజా సంస్థలపై ప్రజలలో నిత్యం మాటాడుతూ వుండాలి. స్థానిక సోవియట్ల నాయకులు విద్య, ఆరోగ్యశాఖలకు

చెందిన ప్రభుత్వోద్యోగులు, వ్యాపార సంస్థల నిర్వాహకులు, మునిసిపల్ ఆర్థిక వ్యవస్థ, దైనందిన సేవా శాఖల ఉద్యోగులు ప్రజలముందు నిత్యం కన్పించుతూ వుండాలి.

రాజకీయాలపట్ల విముఖత్వానికి వ్యతిరేకంగా, ప్రయివేటు యాజమాన్య మనస్తత్వ అవశేషాలకు వ్యతిరేకంగా, సోషలిస్టు ఆశయాలపట్ల, విజయాలపట్ల 'నిహిలిస్ట్' ధోరణికి వ్యతిరేకంగా నిరంతర పోరాటం సాగించాలి.

ప్రపంచంలో రెండు పరస్పర విరుద్ధ సామాజిక రాజకీయ విధానాల మధ్య తీవ్ర వర్గపోరాటం జరుగుతున్న పరిస్థితులలో సిద్ధాంత కృషి జరుగుతున్నదనే విషయాన్ని పార్టీ సంఘాలదృష్టికి మహాసభ తెస్తోంది. కమ్యూనిస్టులు, సోవియటు ప్రజలు ఎక్కువ విప్లవ జాగరూకత వహించడం, సోవియటు యూనియన్ పైన, సోషలిస్టు దేశాలపైన సామ్రాజ్యవాదుల సైద్ధాంతిక విద్రోహక చర్యలను బట్ట బయలు చేయడం, సోషలిజం, కమ్యూనిజంల ప్రయోజనాలకు అవసరం.

* * *

పార్టీలో ఏకశిలా ఖండసదృశమైన ఐక్యతను, ఉన్నత సమరశీల భావాన్ని, బోల్షివిక్ సూత్రబద్ధ శ్రేణీ సామర్థ్యాలనూ, లోపాలను సహించకపోవడాన్ని, నూతనంగా పైబడుతున్న కర్తవ్యాలను జయప్రదంగా నిర్వహించడానికి సర్వసన్నద్ధంగా చేయడానికీ సంసిద్ధత – వీటన్నిటినీ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23వ మహాసభ ప్రదర్శించింది. అక్టోబర్ సోషలిస్టు మహావిప్లవ 50 వార్షికోత్సవాన్ని, వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ శతజయంతి ఉత్సవాన్ని దేశవ్యాపిత సోషలిస్టు పోటీ ఉద్యమంతో, కమ్యూనిస్టు కృషి ఉద్యమంతో, కమ్యూనిజం నిర్మించుటలో మరికొన్ని విజయాలతో, ప్రపంచ సోషలిస్టు బలాన్ని బలపరచుటలో, ప్రపంచ విప్లవోద్యమం విజయవంతంగా అభివృద్ధిచెందే ఆశయంకోసం పనిచేయుటలో మన దేశం చెప్పదగిన సేవ చేయడంతో ప్రారంభించాలని కమ్యూనిస్టులను, కార్మికులను సమష్టి వ్యవసాయదారులను, సోవియట్ మేధావులను మహాసభ కోరుతోంది.

23వ కాంగ్రెస్ రూపొందించిన నూతన ప్రణాళికలు జయప్రదంగా పూర్తి చేయబడతాయనీ, మనదేశం కమ్యూనిజం పథంలో మరో బ్రహ్మాండమైన ముందంజ వేస్తుందనీ కాంగ్రెస్ విశ్వాసం ప్రకటించుతోంది.

అజేయమైన మార్క్సిజం – లెనినిజం పతాకక్రింద కమ్యూనిస్టు విజయానికి ముందుకు పదండి!

# సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనలలో పాక్షిక మార్పులపై సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ

# తీర్మానం

సోవియటు కమ్యూనిస్టుపార్టీ నిబంధనలలో ఈ క్రింది మార్పులను ప్రవేశ పెట్టడానికి సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ నిశ్చయించు తున్నది :

1. సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీలో చేర్చుకోబడిన సభ్యుల గుణాత్మక మేళనను (కంపోజిషన్) మరింత అభివృద్ధి చేయడానికీ నూతన సభ్యులను పార్టీలో చేర్చుకొనే విషయంలో పార్టీ సంఘాల బాధ్యతను ఎక్కువ చేయడానికీ, ఈ క్రింది సూత్రాలను పాటించాలి.

ఎ. 23 ఏండ్ల వయస్సు లోపలి (ఆ సంవత్సరంకూడా కలుపుకొని) యువజనులు లెనినిస్టు యంగ్ కమ్యూనిస్టు లీగ్‌ద్వారా మాత్రమే పార్టీలో చేరాలి. సో. యూ. క. పార్టీలో చేరే లె. యం. క. లీగ్ సభ్యులు, లె. యం. క. లీగ్ జిల్లా కమిటీ లేక పట్టణ కమిటీ రికమెండేషన్‌ను అనగా ఒక పార్టీ సభ్యునితో సమానమైన రికమెండేషన్ సమర్పించాలి.

బి. పార్టీకి రికమెండ్ చేసేవారికి అయిదు సంవత్సరాలకు తక్కువ గాకుండా పార్టీ జీవితం ఉండాలి.

సి. పార్టీ శిక్షణా చర్యగా పార్టీ సభ్యుల్ని కేండిడేటు సభ్యుల స్థాయికి బదిలీ చేసే పద్ధతిని రద్దు చేయాలి.

2. అనేక పార్టీ సంఘాలు, కమ్యూనిస్టులు చేసిన సూచనలు మనస్సులో

పెట్టుకొని, నిర్దిష్టమైన స్థానిక పరిస్థితులకు సభ్యుల ఖచ్చిత వ్యవహారసరళి రాజకీయగుణాలకూ సముచిత గౌరవమిస్తూ ఎన్నికల సమయంలో పార్టీ కమిటీల మేళనం (కంపోజిషన్) క్రమబద్ధంగా తిరిగి మార్చబడుతూంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో, పార్టీ సంఘాల, పార్టీ సంఘాల కార్యదర్శుల మేళనాన్ని తిరిగి కొనసాగించడం, మార్చడంలో పద్ధతులను నిర్ణయించే సూత్రాన్ని సోవియట్ కమ్యూనిస్టు నిబంధనలలో యింకా అట్టిపెట్టడం తగదని భావించడం వల్ల ఆచరణలో ఈ సమస్యలపై నిబంధనలు సమర్థనీయం కావని తేలింది. ఈ సందర్భంలో నిబంధనావళినుంచి 25 వ పేరాను తొలగించాలి. 24 వ పేరాకు ఒక విషయాన్ని కలపాలి. అది : ప్రాథమిక సంఘాలనుండి కేంద్ర కమిటీ వరకూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సంఘాల ఎన్నిక సమయంలో ఆ సంఘాల మేళనను పునఃప్రారంభించాలి ; నాయకత్వాన్ని కొనసాగించాలి.

3 ప్రాథమిక పార్టీ సంఘాలకు సంబంధించిన నియమావళి భాగానికి కొత్త పేరా ఒకటి చేర్చాలి ఆ పేరా ఇలా ఉండాలి : 1000 మంది కమ్యూనిస్టు సభ్యులకు పైగా గల ప్రాథమిక పార్టీ కమిటీలు, యూనియన్ రిపబ్లిక్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అనుమతితో - సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో చేర్చుకొనడం పార్టీ సభ్యుల కేండిడేట్ సభ్యుల రిజిస్ట్రేషన్, పార్టీ క్రమశిక్షణను కమ్యూనిస్టులు ఉల్లంఘించిన సందర్భాలను విచారించడం లాంటి సమస్యలలో - జిల్లా పార్టీ కమిటీలకు ఉండే హక్కులను ఇవ్వాలి. ఈ సంఘాలలో పార్టీ అవసరమైతే షాపులలో పార్టీ కమిటీలను ఏర్పరచాలి. ఉత్పత్తి విభాగాలకు సంబంధించిన పార్టీ సంఘాలకు ప్రాథమిక పార్టీ సంఘ హక్కులను ఇవ్వవచ్చు. జిల్లాపార్టీ కమిటీ హక్కులను కలిగియుండే పార్టీ కమిటీలను రెండేళ్ళ కొకసారి ఎన్నుకొనవలసి ఉంటుంది.

4. నిబంధనావళిలోని 57 వ పేరాకు 50 మంది కమ్యూనిస్టులున్నచోట వ్యవసాయ క్షేత్రాలలో పార్టీ కమిటీలను ఏర్పరచాలనే క్లాజును చేర్చాలి.

5. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిని వేరువేరు విధాలుగా రూపొందించాలని పార్టీ సంఘాలు చేసిన సూచనను దృష్టిలో పెట్టుకొని ప్రాథమిక సంఘాల మీటింగులను సమావేశపరచే నిబంధనలను ఏర్పరచాలి. పార్టీసంఘాల కృషి, నిర్మాణం, బలాలను ఆధారం చేసుకొని, 300 మంది వరకు సభ్యులుగల

పార్టీ సంఘాలు, షాప్ సంఘాలు జనరల్‌బాడీ మీటింగులను ప్రతి రెండు నెలల కొకసారి జరపాలి.

6. యూనియన్ రిపబ్లిక్కు లన్నిటిలోనూ కమ్యూనిస్టుపార్టీ మహాసభ కనీసం నాల్గేండ్ల కొకసారి జరపాలి — అని నిబంధనలను ఏర్పరచాలి.

7. పార్టీ మహాసభ సమావేశమయ్యే కాలాల మధ్య కేంద్ర కమిటీ, అవసరమని భావించినపుడు పార్టీ విధానానికి సంబంధించిన అత్యవసర సమస్యలను చర్చించడానికి అఖిల యూనియన్ పార్టీ కాన్ఫరెన్సును సమావేశ పరచవచ్చు. యూనియన్ రిపబ్లిక్‌లలోని కమ్యూనిస్టుపార్టీల కేంద్ర కమిటీలు రిపబ్లిక్‌పార్టీ కాన్ఫరెన్సులను సమావేశ పరచవచ్చు.

అఖిల యూనియన్ పార్టీ కాన్ఫరెన్సును జరపడానికి ఎజెండాను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ నిర్ణయించుతుంది. రిపబ్లిక్‌పార్టీ కాన్ఫరెన్సుల విషయంలో ఎజెండాను యూనియన్ రిపబ్లిక్‌ల కమ్యూనిస్టుపార్టీల కేంద్రకమిటీలు నిర్ణయించుతాయి.

8. కేంద్ర కమిటీ ప్లీనం సమావేశాలమధ్య పార్టీ పనిని నడిపించడానికి పొలిట్ బ్యూరోను, పార్టీ తీర్మానాలను నిర్వర్తించుటలో అజమాయిషీ చేయడానికి వ్యక్తుల విషయంలోను ప్రధానంగా ప్రస్తుత కృషిని తనిఖీ చేసేందుకుగాను కార్యదర్శి వర్గాన్ని, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ఎన్నుకొంటుంది అని నిబంధనలలో పొందుపరచుట. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శిని కేంద్రకమిటీ ఎన్నుకొంటుంది.

ఆర్. యస్. యఫ్. యస్. ఆర్. కు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ బ్యూరోను ఏర్పరచే క్లాజును నిబంధనావళి 39 వ పేరానుండి తొలగించి వేయాలి.

9. నిబంధనావళిలోని 59 వ పేరాలో ఆడిట్ కౌన్సిల్స్‌కు సంబంధించిన ప్రస్తావన తొలగించాలి.

# వియత్నామ్‌లో అమెరికా దురాక్రమణ గురించి సోవియటు యూనియన్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ

# ప్రకటన

సోవియట్ కమ్యూనిస్టుల, యావత్తు సోవియట్ ప్రజల భావాలను, సంకల్పాన్ని ప్రతిబింబించుతూ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ వియత్నామ్ సోదర ప్రజలపై అమెరికా సాగించుతున్న పాశవిక దురాక్రమణను అత్యంత క్రోధంతో, ఏవగింపుతో ఖండించుతూంది.

వియత్నామ్‌లో క్రూరమైన యుద్ధంద్వారా అమెరికా సామ్రాజ్యవాదులు దక్షిణవియత్నామ్ ప్రజల ఆగ్నేయాసియాలోని ఇతర ప్రజల జాతీయ స్వాతంత్ర్య పోరాటాలను, అణచివేయాలని ప్రయత్నించుతోంది. సోషలిస్టు దేశమైన వియత్నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్ సార్వభౌమాధికారాన్ని బహిరంగంగా వారు అతిక్రమించుతున్నారు. అంతర్జాతీయ న్యాయచట్టాల ప్రాథమిక సూత్రాలనుకూడా ఉల్లంఘించుతూ అమెరికా సైనికతత్వవాదులు అత్యంత కిరాతక, అమానుష యుద్ధసాధనాలను ఉపయోగించుతున్నారు. అమెరికా విమానాలు ఉత్తరవియత్నాం పట్టణాలపైన పల్లెలపైన బాంబులు కురిపించుతూ ఫ్యాక్టరీలను, నివాస గృహాలను, స్కూళ్లను, ఆస్పత్రులను నాశనం చేస్తున్నాయి; పౌర జనాభాను మృత్యువుకెర చేస్తున్నాయి.

దక్షిణ వియత్నామ్ దేశ భక్తులకు వ్యతిరేకంగా, దాదాపు $2\frac{1}{2}$ లక్షల మంది అమెరికా సైనికులు ఈ తుచ్ఛయుద్ధంలో పాల్గొంటున్నారు. తమ సైనిక కూటములలోని భాగస్థులను కూడా తమ దురాక్రమణలో జొప్పించుట ద్వారా అమెరికా సామ్రాజ్యవాదులు, ఇతర దేశాల భద్రతకు, సార్వభౌమాధికారానికి తక్షణ తీవ్ర ప్రమాదాన్ని కల్పించు తున్నారు. లావోస్ వ్యవహారాలలో సిగ్గులేకుండా కలుగ

చేసుకొంటున్నారు ; కాంబోడియాపై రాజకీయ సైనికవత్తిడి తేవడానికి ప్రయత్నిస్తున్నారు. తద్వారా అంతర్జాతీయ ఉద్రిక్త పరిస్థితిలో మరింత వేడిని కల్గించుతున్నారు.

"స్వాతంత్ర్యాన్ని" సంరక్షించుతున్నామనీ, "కమ్యూనిస్టు విస్తరణ"ను ప్రతిఘటించుతున్నామనీ వంచనా పూర్వకమైన మాటలతో తమ చర్యల నిజ స్వభావాన్ని కప్పిపుచ్చుకోడానికి అమెరికా పాలకవర్గాలు ప్రయత్నించు తున్నాయి. ఐతే ఈ అబద్ధాన్ని ఎవరూ నమ్మజాలరు. వియత్నామ్‌లో దురాక్రమణ ద్వారా అమెరికా అవమానం పాలయ్యింది. దానినది ఎన్నడూ తొలగించుకోలేదు. అమెరికా సామ్రాజ్యవాదం వియత్నామ్‌లో సాగించే దుస్సాహస చర్యను ప్రపంచంలోని అభ్యుదయ కాముకులంతా, ప్రజా తంత్ర శక్తులన్నీ, నిశితంగా ఖండించాయి.

ప్రపంచ ప్రజలలో అధిక సంఖ్యాకులు వియత్‌నామ్ ప్రజల న్యాయమైన ఆశయాన్ని బలపరచే ఉద్యమంలో చేరడం పెంపొందుతోంది. వియత్‌నామ్‌లో దురాక్రమణ యుద్ధానికి అసమ్మతి ప్రదర్శనలు అమెరికాలో కూడా ఎక్కువవుతున్నాయి.

దురాక్రమణదారులు నైతికంగా, రాజకీయంగా వేరుపడటం మరింత స్పష్టమౌతున్నది.

వియత్‌నామ్ దేశభక్తుల ధైర్యాన్ని, మనోనిబ్బరాన్ని సోవియట్ కమ్యూనిస్టులూ, మా యావత్ ప్రజలూ హర్షిస్తున్నారు. స్వాతంత్ర్యం, స్వేచ్ఛ, ఐక్యత కోసం, తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొనే హక్కు కోసం పవిత్రమైన న్యాయమైన పోరాటం సాగించుతున్న వియత్నామ్ ప్రజల మనోనిబ్బరాన్ని దురాక్రమణ దారులు సాగించే దురాంతాలేవీ భగ్నం చేయలేవు. అచంచలమైన ధైర్యం, పట్టుదల, విజయం పొందాలనే కృతనిశ్చయాలకు అద్భుతమైన ఉదాహరణగా వారి వీరోచిత న్యాయ పోరాటం చరిత్రలో నిలుస్తుంది.

సోవియట్ యూనియన్, ఇతర సోషలిస్టుదేశాలూ, అంతర్జాతీయ కార్మిక వర్గమూ, కమ్యూనిస్టు ఉద్యమమూ వియత్‌నామ్ ప్రజలకు విస్తృతంగా బహుముఖంగా సహాయాన్ని, సపోర్టునూ ఎల్లవుడూ చేస్తూవచ్చింది. ఇప్పుడుకూడా చేస్తూ ఉంది. యావత్ పార్టీ తరపున, సోవియట్ ప్రజల తరఫున సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ కాంగ్రెస్, వియత్‌నామ్‌లో అమెరికా దురాక్రమణను ఆపివేయాలనీ, ఆ దేశంనుండి దురాక్రమణ సైన్యాలన్నీ ఉపసంహరించబడాలనీ, గట్టిగా కోరుతోంది. ఇతర ఆగ్నేయాసియా దేశాలకు కూడా అమెరికా సైనిక

తత్వముఠాలు వ్యాపింపచేయాలని చూస్తున్న ఈ దురాక్రమణను కొనసాగించడం, ప్రపంచ శాంతికి అత్యంత ప్రమాదకరం.

వియత్నామ్ ప్రజలకు వ్యతిరేకంగా అవమానకర యుద్ధాన్ని "విస్తరింప చేయడం" ద్వారా దురాక్రమణదారులు ఎదుర్కోవలసివచ్చే స్థితి ఏమంటే-వియత్నామ్‌కు సోవియట్ యూనియన్ దాని ఇతర సోషలిష్ట స్నేహితులు, సోదరులు నిరతరం పెంపొందే సపోర్టు నివ్వడం. వియత్నామ్ ప్రజలు తమ యూపత్ భూమికి యజమానులౌతారు. వియత్నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్ ఉన్నతంగా పట్టుకొని ఉన్న సోషలిస్టు జ్యోతిని ఆర్పివేయడంలో ఎవరూ జయప్రదం కాలేరు.

వియత్నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్, దక్షిణ వియత్నామ్ జాతీయ విమోచన సంఘటనల న్యాయమైన కోర్కెలను గుర్తించడం ద్వారానే వియత్నామ్ సమస్య పరిష్కరింప బడగలదని సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ కాంగ్రెస్ భావించుతూంది.

వియత్నామ్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌పై బాంబులువేడాన్ని, దానిపై ఇతర దురాక్రమణ చర్యలను వెన్వెంటనే ఆపివేయాలి.

దక్షిణవియత్నామ్ ప్రాంతంనుండి అమెరికా సాయుధసేనలు, దాని సహచరులూ ఉపసంహరించుకోవాలి.

దక్షిణ వియత్నామ్ జాతీయ విమోచన సంఘటనను దక్షిణ వియత్నామ్ ప్రజల న్యాయమైన ప్రతినిధిగా గుర్తింపబడాలి.

వియత్నామ్ ఆంతరంగిక వ్యవహారాల్లో అమెరికా ప్రభుత్వం అన్నిరకాల జోక్యాన్ని మానాలి. ఎలాంటిజోక్యం లేకుండా ఉండాలి. 1954 జెనీవా ఒడంబడికను అచంచలంగా గౌరవించాలి.

వియత్నామ్ వీర ప్రజలకు, వియత్నామ్ శ్రామిక ప్రజల పార్టీకి దక్షిణ వియత్నామ్ జాతీయ విమోచన సంఘటనకు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ కాంగ్రెస్ తన సోదర సంఘీభావాన్ని తెలియచేస్తోంది. వియత్నామ్‌లో అమెరికా దురాక్రమణకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ఐక్య కార్యాచరణకు, పోరాడుతున్న వియత్నామ్ ప్రజలకు ఫలప్రదమైన సహాయమూ సపోర్టు ఇవ్వడానికీ, కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలు మరింత పట్టుదలతో పనిచేయాలని విజ్ఞప్తి చేస్తోంది.

లావోస, కాంబోడియా ప్రజలతో తమ సంఘీభావాన్ని సోవియట్ ప్రజలు ప్రకటించుతున్నారు. 1954, 1962 జెనీవా ఒడంబడికలను అమెరికా ఖచ్చితంగా పాటించాలని సోవియట్ ప్రజలు కోరుతున్నారు.

సంపూర్తిగా అంతర్జాతీయతా భావాన్ని, బాధ్యతను ప్రదర్శించడం, సామ్రాజ్య వాద దురాక్రమణను ఆపడానికి తమ పక్షానికి సమస్త అభ్యుదయ ప్రజాతంత్ర శాంతికాముక శక్తులను సమీకరించుతూ ఐక్యపోరాటాలలో ఉమ్మడిగా కలియడం, సోషలిస్టు దేశాలకూ, కమ్యూనిస్టుపార్టీలకు ఇదివరకెన్నడూ లేనంత ప్రాముఖ్యమైన విషయం.

ప్రజలకు శాంతి, న్యాయం, స్వాతంత్ర్యం, స్వేచ్ఛనుకోరే చిత్తశుద్ధిగల స్త్రీ, పురుషులంతా, ప్రపంచ కమ్యూనిస్టులంతా, అభివృద్ధి ప్రజాతంత్రాల పక్షాన పోరాడే వారంతా, వియత్నామ్‌లో అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ చర్యలకు వ్యతిరేకంగా మరింత పట్టుదలతో తమ అసమ్మతిని ఎలుగెత్తి చాటెదరుగాక! అమెరికా దురాక్రమణకు వ్యతిరేకంగా అసమ్మతి ఉద్యమం, స్వాతంత్ర్యం, స్వేచ్ఛలకోసం తమదేశ విముక్తికోసం సాగించుతున్న వియత్‌నామ్ ప్రజల పోరాటాన్ని బలపరచే ఉద్యమం ప్రపచంలో నలుమూలలా మరింత విస్తృతంగా ఇంకా వ్యాపించు గాక !

శాంతి, అభ్యుదయ శక్తులు ఒకే సంఘటనలో ఐక్యమై వియత్‌నామ్‌లో అమెరికా దురాక్రమణను అరికట్టాలి, అరికట్టగలరు కూడా.

వియత్‌నామ్ నుండి వైదొలగండి !

వియత్‌నామ్ ప్రజలన్యాయ ఆశయం విజయంపొందక తప్పదు !

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23 వ కాంగ్రెస్ ముగింపు సందర్భంలో 1966 ఏప్రియల్ 8 న

# లియోనిడ్ బ్రెజ్నేవ్ ప్రసంగం

కామ్రేడ్స్ ! సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ కాంగ్రెస్ తన పనిని ముగించుతూంది. మన పార్టీ చరిత్రలో, మన దేశచరిత్రలో ఇది సముచిత స్థానం అలంకరించు తుందనడంలో సందేహంలేదు. కాంగ్రెస్‌లో జరిగిన విధానం కృషి ఫలితాలను గురించి, మనమంతా సంతృప్తి చెందామని చెప్పితే, ప్రతినిధుల కాంగ్రెస్‌లో పాల్గొన్న వారి సాధారణ అభిప్రాయాన్ని నేను వ్యక్తం చేస్తున్నానని భావిస్తున్నాను. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ రిపోర్టు నూతన పంచవర్ష ప్రణాళిక ఆదేశాలలోని అన్ని ధోరణులను కాంగ్రెస్ ఖచ్చిత వ్యవహార సరళిలో చర్చించింది. వచ్చేకొద్ది సంవత్సరాలకు పార్టీ రాజకీయ పోకడను మనం సమిష్టిగా రూపొందించాం.

జీవిత అనుభవంలేవనెత్తిన, కమూనిస్టు నిర్మాణంలో అనుభవం తెలియచేసిన అత్యంత ముఖ్య సమస్యలు – విధానం, ఆర్థిక వ్యవస్థ, సిద్ధాంతం, పార్టీ సంఘాల కార్యకలాపాల సమస్యలు – మన దృష్టి కేంద్రంలో ఉన్నాయి.

వచ్చే ఐదేండ్ల కాలంలో మన దేశ ఆంతరంగిక విధానం, ఆర్థిక కార్య కలాపాలు ఏ ముఖ్య దిశలుగా నడవాలో కాంగ్రెస్ నిశ్చయించింది.

మనదేశంలో కమ్యూనిజం నిర్మించడంలో నూతన లక్ష్యాలను సాధించడం

యావత్ సామాజికోత్పత్తిలో సామర్థ్యాన్ని ఎక్కువగా పెంపొందించడం, శ్రామిక ప్రజల భౌతిక సంక్షేమం క్రమంగా అభివృద్ధి చేయడం, మన దేశరక్షణ స్తోమతను మరింత బలపర్చడం, – ఇవన్నీ ఖాయంగా జరిగేటట్లు చూడటం ఈ విధానం యొక్క సారాంశం. ఈ ఐదుసంవత్సరాల కాలంలో, వ్యవసాయ ఉత్పత్తిలో నిలకడ యైన అభివృద్ధిని సాధించాలి. పారిశ్రామిక అభివృద్ధి ఉన్నత వేగం మనం సాధించాలి. ఇదంతా మన ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థను నూతన స్థాయికి పెంపొందించుతుంది.

మన పార్టీయొక్క మనప్రభుత్వం యొక్క విదేశాంగ విధానాన్ని పోకడను నిర్ణయించడం ఈ కాంగ్రెస్ సాధించిన మరోముఖ్యఫలితం. కమ్యూనిజాన్నినిర్మించడానికి, సోషలిస్టు విధానాన్ని బలపరచడానికి, జాతీయ, సామాజిక విముక్తి కోసం ప్రజలు సాగించే పోరాటానికి సంపూర్ణసహాయం ఇచ్చేందుకూ,శాంతిని సుస్థిరపరచడానికి, నూతన ప్రపంచయుద్ధం రాకుండా అడ్డగించడానికి, విభిన్న సామాజిక విధానాలుగల రాజ్యాలు శాంతియుత సహజీవనం సాగించాలనే లెనినిస్టు సూత్రాలను ధృవపరచడానికి–అత్యంత అనుకూల పరిస్థితులను సృష్టించే లక్ష్యంగల విదేశాంగ విధానాన్ని కొనసాగించాలని కాంగ్రెస్ కేంద్ర కమిటీ సూచించింది.

కాంగ్రెస్ రూపొందించిన మూడవ ఫలితం చాలా ముఖ్యమైన నిర్ణయం. పార్టీ ఇక నిర్మాణ రంగంలోనూ సిద్ధాంత, రాజకీయ రంగల్లోకూడా మరింత పుష్టి చేకూర్చే నిర్ణయాలను మహాసభ ఆమోదించింది.

ఈ నిర్ణయాలు కమ్యూనిస్టుల అగ్రగామి పాత్రను, తమకు అప్పగించబడిన విధులపట్ల వారి బాధ్యతను యితోధికం చేస్తాయి. ఈ నిర్ణయాలు పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పెంపొందించేటందుకు, విశాల ప్రజానీకంలో పార్టీ సంస్థల సంబంధాలను విస్తరించి, ఆసంబంధాలకు పుష్టిచేకూర్చేటందుకు దోహదంచేస్తాయి. పార్టీ తన క్యాడర్లను మరింత మేలుగా పెంపుచేసుకునేటందుకు, కమ్యూనిస్టు నిర్మాణక్రమంలో యెదురయ్యే సంక్లిష్ట సమస్యలను మరింత విజయవంతంగా పరిష్కారం చేసుకొనేటందుకు తోడ్పడతాయి,

1964 అక్టోబర్ 1965 మార్చి, సెప్టెంబర్ లనాటి సి. పి. యస్. యు. కేంద్ర కమిటీ విస్తృత సమావేశాల ఫలితాలు యీ మహాసభ నిర్ణయాల్లో ప్రతిఫలించడంతోబాటు, మరింతగా అభివృద్ధి పరచబడ్డవి. మహాసభకు హాజరైన ప్రతినిధులు, పై విస్తృత సమావేశాల నిర్ణయాలను యేకగ్రీవంగా ఆమోదించారు.

పార్టీ జీవితంలో, పనివిధానం వ్యవహార సరళిలో వుండాలని ఆసమావేశాలు చేసిన నిర్ణయాలు సరైవనీ, యదార్థ దృష్టితో కూడినవనీ నిర్ధారణ చేశారు.

ప్రస్తుత మహాసభలోకూడా యీ పనివిధానమే అమలు జరిగిందని మనం నమ్మకంగా చెప్పుకోవచ్చు. మన మహాసభ వ్యవహార సరళిలో, సూత్రబద్ధమైన వైఖరిలో మన కృషిలో కలిగిన జయాపజయాలను రెంటిని ఆవేశరహితంగా అంచనాకట్టేటందుకు విశిష్టంగా పనిచేసింది. పార్టీజీవితానికీ, దేశానికీ సంబంధించిన క్లిష్ట సమస్యలను యోచనాశీలతతోనూ సృజనాత్మక దృష్టితోనూ పరిష్కరించు కోవడానికి తగిన మంచి వాతావరణంలో యీ మహాసభ జరిగింది

ఆంతరంగిక, విదేశాంగ విధానాలకు సంబంధించిన సర్వవిషయాల్లోనూ, యేకశిలా సదృశ్యమైన మనపార్టీ ఐక్యతను యీ 23వ కాంగ్రెస్ మహాసభ మరోసారి గట్టిగా ప్రదర్శించింది. ఈ ఐక్యత మహాసభలో పాల్గొన్న ఐదువేలమంది ప్రతినిధులు చేసిన యేకగ్రీవ నిర్ణయాలలో మాత్రమేగాక, మహాసభ కార్యకలపాలపట్ల అనుక్షణం యావత్తు పార్టీ, యావత్తు సోవియట్ దేశప్రజలు చూపిన ఆసక్తిలోను వ్యక్తమైంది. పార్టీ కాంగ్రెస్ కార్యకలాపాల్లో చర్చల్లో, మొత్తం పార్టీ, మొత్తం సోవియట్ దేశప్రజలు చురుకుగా పాల్గోనడంలోనూ, మహాసభ నిర్ణయాలను సమర్థించడంలోనూ యిది, వ్యక్తమైంది.

మహాసభకు అసంఖ్యాకంగా ప్రజలనుండి వచ్చిన లేఖలను బట్టి. ధారావాహినిగా వచ్చిన శుభకాంక్షల సందేశాలనుబట్టీ, ఫ్యాక్టరీలలో, వివిధ ప్రాజెక్టు నిర్మాణ స్థలాలలో, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో, విద్యా సంస్థల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో మహాసభ విషయాలపై జరిగిన ఆసక్తిదాయకమైన చర్చలద్వారానూ యిది నిర్ధారణ అయింది. దేశమంతటా శ్రామిక ప్రజల్లో సర్వత్రా వ్యక్తమైన ఉద్దీపన యీ విషయాన్నే రుజువుపరచింది. పారిశ్రామిక కార్మికులనుండి సమిష్టి క్షేత్రాల్లో పనిచేసే రైతాంగంనుండి, మేధావి వర్గం ప్రతినిధులనుండి శ్రామిక విజయాలకు సంబంధించిన వేలాది నివేదికలు మహాసభకు అందాయి. మన భవిష్యత్ విజయాలకు వైతాళికగీతంలా వినువీధినుండి మరో అసాధారణమైన నివేదిక మన మహాసభలో విన్పించింది. చంద్రోపరితలానికి చేరిన తొలి స్పుత్నిక్ కమ్యూనిస్టులందర్నీ ఐక్యతా సూత్రంలో బంధించే, అంతర్జాతీయ గేయం విప్లవ పదమాధుర్యాన్ని భూమిపైకి ప్రసారం చేసింది.

కామ్రేడ్ ప్రతినిధులారా! మహాసభకు శుభాకాంక్ష సందేశం లందచేసిన,

తమ శ్రామిక విజయాలద్వారా నూతన పంచవర్ష ప్రణాళికకు శుభారంభం పలికిన, సమష్టి వ్యవసాయ క్షేత్రాలన్నిటికి మీ అందరితరుపునా హృదయ పూర్వకమైన కృతజ్ఞత తెలియజేస్తున్నాను. వారికి యితోధిక విజయాలు చేకూరాలని మీ అందరి తరపునా ఆకాంక్షిస్తున్నాను.

కామ్రేడ్స్, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తాను అంతర్జాతీయకమ్యూనిస్టు, కార్మికోద్యమంలో అంతర్భాగమని మనం ఆ ఉద్యమానికి సంబంధించిన ఒక దళమనే అవగాహనలోనే వ్యవహరిస్తూ వచ్చింది. ముందుకూడా అదే గుర్తింపుతో పని చేస్తుంది. అందుకని, మన కార్యకలాపాలగురించి, మన దేశప్రజలను, మన పార్టీ సభ్యులనూ మాత్రమే గాక, మన సోదరపార్టీలకు, ప్రపంచ కార్మికవర్గానికీ నివేదించడం మన బాధ్యత అనే అవగాహనతోనే వ్యవహరిస్తూన్నాం. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ యీ 23 వ మహాసభకూడా యీ సాంప్రదాయాన్నే పాటించింది.

86 దేశాలనుండి వచ్చిన కమ్యూనిస్టు, వర్కర్ల పార్టీల ప్రతినిధులూ, పలు ప్రపంచ దేశాలకు చెందిన విప్లవ ప్రజాతంత్ర పార్టీల, సోషలిస్టు పార్టీల ప్రతినిధులు కూడా యీ మహాసభకు వచ్చారు. ఈ మహాసభలో పాల్గొనడం ద్వారా వారికి, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాల గురించి, మన పథకాల గురించి, మన సమస్యల గురించి, ఒక అవగాహన ఏర్పడి వుంటుందని మనం ఆశిస్తున్నాం,

మన సహయోధుల విదేశాలనుండి వచ్చిన మనమిత్రుల ప్రసంగాలను వినేటందుకు మనకీ మహాసభలో అవకాశం లభించింది. ప్రసంగాలు వింటూవుంటే ప్రపంచ సోషలిష్టు వ్యవస్థ విజయాలకు, విప్లవ, విముక్తి ఉద్యమాల పెంపుదల, అభివృద్ధి మనకు సునిశితంగా తెలియ వచ్చింది. ఈ ప్రసంగాలు విన్నప్పుడు మనకు మరో విషయం కూడా తిరిగి అవగతమైంది. ప్రపంచమంతటా మనవర్గసోదరులు, సోవియట్ దేశంలో కమ్యూనిజం నిర్మాణవిజయాన్ని తమ విప్లవోద్యమాలకి ప్రధాన అండగా, తమపోరాటాలకు ప్రధానమైన తోడ్పాటుగా భావిస్తున్నారనేది యీ ప్రసంగాల ద్వారా మరోసారి స్పష్టమైంది: ప్రియమైన కామ్రేడ్, మీ యీ అవగాహనపట్ల మాపార్టీ మొత్తంగా తనకృతజ్ఞత తెలియజేస్తున్నది. మీ యీఅవగాహన యితోధిక విజయాలు సాధించేటందుకు సోవియట్ కమ్యూనిసులకూ, యావత్తు సోవియట్ప్రజలకూ యెంతో ఉత్తేజమిస్తున్నది.

ఈ మహాసభలో పాల్గొన్న సోదరపార్టీల ప్రతినిధివర్గాలు సోదర ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్ యూనియన్ అనుసరిస్తున్న మార్క్సిస్టు–లెనినిస్టు సూత్రబద్ధమైన పంథాను యేకగ్రీవంగా ఆమోదిస్తున్నవనే విషయాన్ని కూడా మేము ఎంతో శ్రద్ధగా గమనించాం. ఈ మహాసభ వేదికనుండి ప్రసంగించిన సోదరపార్టీల ప్రతినిధులంతా, కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణులమధ్య ఐక్యతను పటిష్ఠం చేసే లక్ష్యంతో మా పార్టీ చేస్తున్న కృషిపట్ల పూర్తిపదవగాహన వ్యక్తం చేశారు; మా కృషిని సమర్థించారు. వర్గ శత్రువుకు ప్రతిగా, యావత్తు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం, ప్రపంచ విప్లవ శక్తుల సంఘీభావం సమైక్యతా సాధించాలనే కమ్యూనిస్టులందరి సమైక్యత దృఢదీక్ష వారి ప్రసంగాలలో అరమరిక లేకుండా ప్రతిధ్వనించింది.

ఐక్యతా సాధన లక్ష్యం తప్పక నెరవేరగలదనే విశ్వాసానికి యిది పుష్టి చేకూర్చుతున్నది. మాకుసంబంధించినంత వరకు మార్క్సిజం–లెనినిజం సిద్ధాంతం ఆధారంగా, సూత్రబద్ధమైన పద్ధతిలో కమ్యూనిస్టుశ్రేణుల్లో ఐక్యత సాధించేటందుకు యితోధిక కృషి కొనసాగించేటందుకు, మా పార్టీ తన తిరుగులేని దృఢ దీక్షను పునరుద్ఘాటిస్తూవుంది.

సామ్రాజ్య వాదాన్ని ఢీకొని పోరాడుతున్న వీరవియత్నాం ప్రజలపట్ల యీ మహాసభ సందర్భంలో అత్యంత శక్తివంతంగా వ్యక్తమైన సమరశీల సంఘీభావం, మన అందరిపైనా చెరగని ముద్రవేసింది.

కామ్రేడ్స్ ప్రతినిధులారా, ఈ మహాసభ కార్యక్రమానికి చాలాపెద్ద దోహదంచేసిన, విదేశ ప్రతినిధివర్గాలన్నింటికి మీఅందరి తరపున కృతజ్ఞత తెలియజేయగోరుతున్నాను. మన మహాసభలో యీసన్మిత్రులు పాల్గొనడం విప్లవశ్రామిక వర్గసంఘీభావంపాటవాన్ని మరోమారు రుజువుచేసింది. మనలో కొత్తఉత్తేజంకల్పించింది. ఆ సంఘీభావం మనకు స్ఫురింపజేసింది. దేశదేశ కమ్యూనిస్టుల, విప్లవకారులను యేకత్రితంచేసి, సోదర సంబంధాలు, పరస్పర విశ్వాసమూ, మైత్రీ అవిచ్ఛిన్నమూ, అనుల్లంఘనీయమూ అనేయదార్థాన్ని మరోసారి ధృవపరిచింది.

మన పార్టీ 23 వ కాంగ్రెస్‌కు దేశదేశాలలోని అసంఖ్యాక సంఘాలనుండి, పారిశ్రామిక సంస్థలనుండి వ్యక్తులనుండి లెక్కలేనన్ని సుహృద్భావ శుభాకాంక్షల సందేశాలు అందాయి. వారందరికి మన మహాసభ తరపున హార్దికమైన కృతజ్ఞత తెలియజేస్తున్నాను. దేశదేశాల కమ్యూనిస్టులకూ కమ్యూనిజం, సోషలిజం మహా

త్తర ఆశయాల సాధనకోసం పోరాడుతున్న వారందరికీ ఇతోధిక విజయాలు చేకూరాలని కోరుతూ మనం వారికి సమరశీల, సోదర భావపూరిత శుభాకాంక్షలను అందజేస్తున్నాము.

కామ్రేడ్ ప్రతినిధులరా, మీరంతా తమపట్ల వుంచిన విశ్వాసానికి కృతజ్ఞత తెలియజేయవలసిందిగా నూతనంగా మీరు ఎన్నుకొన్న కేంద్రకమిటీ నన్ను కోరింది. మీరు మాపట్ల వుంచిన యీవిశ్వాసం మాపై గురుతరమైన బాధ్యతలను మోపుతున్నదని, పార్టీకార్యక్రమాన్ని కాంగ్రెసు చేసిన నిర్ణయాల్ని అమలుజరిపేటందుకు మాశక్తియుక్తులన్నింటినీ వినియోగించవలసి వుంటుందని మేము ఎరుగుదుము.

కష్టసాధ్యమైన, గురుతర కార్యం మనముందున్నది. మహాసభ నిర్దేశించిన కర్తవ్యాల్ని సాధించేందుకు బ్రహ్మాండమైన కృషి, బోల్షివిక్, పట్టుదల ధైర్యమూ, మొత్తం పార్టీ యావత్తు ప్రజల సృజనాత్మక కృషి అవసరం.

భవిష్యత్తుపట్ల పూర్తి విశ్వాసంతోనూ. ఆశాభావంతోనూ మనం ముందుకు సాగుతున్నాం. ఈ ఆశాభావానికి గట్టి ఆధారమేవుంది. మన గొప్ప శక్తిసామర్థ్యాల గురించిన యదార్థదృష్టితో గూడిన అంచనా అజేయమైన మన పార్టీ, మన ప్రజల శక్తి — యివే మన ఆశాభావానికి ఆధారాలు.

అత్యున్నత ప్రమాణాలు కలిగిన ఉత్పత్తి శక్తులను మనం సృష్టించుకున్నాం. వీటి సక్రమ వినియోగం, వచ్చేకొలది సంవత్సరాల్లోనే కమ్యూనిజం దిశగా మన యితోధిక పురోగమనానికి హామీ అవగలదు.

అర్థ శతాబ్దంపాటు సోవియట్ రాజ్యాంగ అధికార నిర్వహణలోనూ, సోవియట్ సమాజాన్నికి నాయకత్వం వహించడం ద్వారానూ సోషలిస్టు — కమ్యూనిస్టు నిర్మాణ దశల్లో అపారమైన అనుభవ సంపద సమకూర్చుకున్న శక్తివంతమైన పార్టీ మనకున్నది.

అన్ని ఉత్పత్తి రంగాలలోనూ, శాస్త్ర సాంస్కృతిక రంగాలలో సహా మనం ఉత్తమమైన కార్యకర్తలను సృష్టించుకున్నాం. సోవియట్ కార్మిక వర్గమూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోని రైతాంగమూ, ప్రజా మేధావి వర్గమూ అందరూ, కమ్యూనిస్టు పార్టీ విధానాలను, దాని పథకాలను తమ స్వీయ లక్ష్యాలుగానే మెంచుకొంటూ హృదయ పూర్వకంగా బలపరుస్తున్నారు.

బయటగూడా మనకు నమ్మకమైన, నిజమైన మిత్రులు అనేకులు వున్నారు.

సోదర సోషలిస్టు దేశాలు నవ సమాజ నిర్మాణంలో గణించిన విలువైన అనుభవాల్ని మనం వినియోగించుకోగలం ; వినియోగించు కోవాలిగూడా. మన కృషికీ మన పోరాటానికీ యావత్తు ప్రపంచంలోని కమ్యూనిస్టుల విప్లవకర అభ్యుదయ శక్తుల తోడ్పాటు వుంది.

విప్లవ మహాయోధుడు వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ స్థాపించిన, పెంచి పెద్ద చేసిన మనపార్టీ అత్యంత ఉజ్వలమైనమూర్గాన పయనించి ఎంతో ముందుకుసాగింది. పార్టీ బలానికి ప్రధానమైన మూలం, పార్టీ విజయాలకు హామీ అవిచ్ఛిన్నమైన ప్రజా సంబంధాలనుండే, సాధారణ శ్రామిక ప్రజానీకాన్ని కమ్యూనిజం నిర్మాణ కృషికి సంఘటితపరచగల, ఉత్తేజపరచగల శక్తినుండే లభిస్తుంది అని ఆయన మనకు బోధించారు. సామాజిక పరిణామ సూత్రాలను, వర్గ పోరాట సూత్రాలను, నవ సమాజ నిర్మాణానికి సంబంధించిన సూత్రాలను, సమర్థతతో వంటపట్టించుకో గలిగితే, శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అనుసరిస్తూ తొట్రుపాటు లేకుండా లక్ష్యం దిశగా ముందుకు సాగితేనే పార్టీ విజయాన్ని సాధించగలుగుతుంది.

లెనిన్ ఆశయాలకు నిజమైన వారసులకూ, ఆయన మహత్కార్యాన్ని ముందుకు తీసుకొని వెళ్లవలసిన కమ్యూనిష్టులం, ఆయన ఆదేశాలను శిరసా వహిస్తాం. మనపార్టీ, కార్మికవర్గం, యావత్తు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క సమరశీల సాంప్రదాయాల్ని యెంతో అమూల్యమైనవిగా ఎంచుకుంటాం.

మన యావత్తు శక్తి సామర్థ్యాలను కూడాగట్టుకొని, కమ్యూనిజం లక్ష్య సాధనలో నూతన విజయాలను సాధిస్తూ ముందుకు సాగుతాం.

మన మహాసభకు చేస్తున్న యీ దశలో, యావత్తుపార్టీ మొత్తం దేశ ప్రజలందరి కృషిని యేకం చేసి 23 కాంగ్రెస్ నిర్దేశించి మహత్తర కర్తవ్యాలను సాధించగలమని నమ్మకంగా ప్రకటించు కోగలుగుతున్నాం.

లెనిన్ మహాశయుని, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ వర్థిల్లాలి !

కమ్యూనిస్టు నిర్మాతలైన వీర సోవియటు ప్రజలకు జే జేలు !

ప్రపంచ సోషలిస్టు శిబిరం అంతరాతీయ కమ్యూనిస్టు ఉద్యమం, వర్తమానయుగ విప్లవ శక్తులన్నింటి సమైక్యత, సంఘీభావం వర్ధిల్లాలి !

శాంతి, ప్రజాతంత్రం, జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజం వర్ధిల్లాలి ! విజయీభవ !

మార్క్సిజం, లెనినిజం పతాకచ్ఛాయన కమ్యూనిజం విజయానికి సాగిపోదాం !

# సోవియట్ యూనియన్ కేంద్రకమిటీ ప్లీనం సమావేశం

# ప్రకటన

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 23 వ కాంగ్రెస్‌చే ఎన్నుకోబడిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్లీనం సమావేశం 1966 ఏప్రిల్ 8 న సమావేశమయింది.

ప్లీనం సమావేశం ఎన్నుకొన్న సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ పొలిట్ బ్యూరోలో ఈ క్రిందివారున్నారు :

పొలిట్ బ్యూరో పూర్తిసభ్యులు : కామ్రేడ్స్ యస్. ఐ. బ్రెజ్నెవ్, జి. ఐ. వొరొనోవ్, ఎ. పి. కిరిలెంకో, ఎ. యన్. కొసిగిన్, కె. టి. మాజురోవ్, ఎ. వై. పెల్సె, యన్. వై. పొడ్గొర్నీ, డి. యస్. పొల్యాన్స్కి, యం. ఎ. సుస్లోవ్, ఎ. యన్. షెల్పిన్, పి. ఇ. షెలెస్ట్.

పొలిట్‌బ్యూరో ప్రత్యామ్నాయ సభ్యులు :

కామ్రేడ్స్, వి. వి. గ్రిషిన్, పి. ఎన్. డెమిషెవ్, డి. ఎ. కునయేవ్, పి. యం మాషెరోవ్, వి. పి. మఝావనాడ్జ, యస్. ఆర్. రాషిడోవ్ ; డి. యఫ్. ఉస్తినోవ్, వి. వి. షెర్బిట్స్కి,

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి ప్రధాన కార్యదర్శిగా కామ్రేడ్ యస్. ఐ. బ్రెజ్నెవ్‌ను ప్లీనం సమావేశం ఎన్నుకొంది. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ కార్యదర్శులుగా కామ్రేడ్స్

వై. వి. ఆండ్రోపోవ్, పి. యన్. డెమిచెవ్, ఐ. వి. కాపిటోనోవ్, ఎ. పి. కిరిలెంకో, యఫ్. డి. కులకొవ్. బి. యన్. పొనొమరెవ్, ఎ. పి. రుడకోవ్, యం. ఎ. సుస్లోవ్. ఎ. డి. యఫ్. ఉసినోవ్ యన్. షెల్పిన్‌లు ఎన్నుకోబడ్డారు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీలో పార్టీ కంట్రోల్ కమిటీకి అధ్యక్షుడుగా కామ్రేడ్ ఎ. వై. పెల్షెని ప్లీనం సమావేశం ఎన్నుకొంది.

## సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర ఆడిటింగ్ కమిషన్

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర ఆడిటింగ్ కమిషన్• ఏప్రిల్ 8న సమావేశమై కామ్రేడ్ జి. యఫ్. సిజూవ్‌ను దాని అధ్యక్షునిగా ఎన్నుకొంది.



ఎల్. ఐ. బ్రెజ్నెవ్



జి. ఐ. వొరోనొవ్



కె. టి. మజురోవ్



ఎ. యై. పెల్షే



ఎ. పి. కిరిలెంకో



ఎ. ఎన్. కొసిగిన్



ఎన్. వి. పొడ్గొర్నీ



డి. ఎస్. పొల్యాన్స్కీ



ఎమ్. ఎ. సుస్లోవ్



ఎ. ఎన్. షెలిపిన్



పి. ఇ. షెలెస్ట్